# ఎలక్షన్లు

(భారత, రాష్ట్ర శాసనసభల ఎన్నికలు, లోకల్‌బోర్డు ఎన్నికలు, మునిసిపాలిటీ ఎన్నికలు, ఎలక్షన్ నేరములు, విశ్వాసరాహిత్యతీర్మానములు)

అవసరాల వెంకటనర్సు

బి. ఏ బి. యల్., వకీలు

రాజమండ్రి.



1937

వెల రు 2-8-0

# విషయసూచిక

3-వ భాగము



4-వ భాగము

ఎలక్షన్ నేరములు



5-వ భాగము

విశ్వాసరాహిత్య తీర్మానములు

# విజ్ఞాపనము

ఎన్నికలకు సంబంధించిన న్యాయశాస్త్రవిధు లన్నియు ప్రజాబాహుళ్యమున కెరుకపడ్చుటకై నేనీపుస్తకము వ్రాయ నుద్యమించితిని. గ్రంథమందలి విషయము చదువరులకు సుగ్రాహ్యముగా నుండునట్లు వ్రాయవలె ననియే నా అభిలాష; అది నెరవేరినచో నేను కృతకృత్యుడననియే భావించు కొందును. నేనీపుస్తకము కొద్దిగడువులోపుననే వ్రాసిముగించియుండుటచే దీనిలో ననేకలోపములు, పొరపాట్లు వచ్చియుండవచ్చును. పాఠకులు వానిని మన్నింపవేడెదను.

న్యాయశాస్త్రపరిభాష ఆంధ్రములో సంకుచితమై యున్నది. కొన్నికొన్ని ఇంగ్లీషుమాటలే ఆ యర్థ మిచ్చు నాంధ్రపదములకంటె హెచ్చువాడుకలో నున్నవి. ఒక్క తెనుగుభాషాజ్ఞాన మున్నవారికి సహితము "మండలకరగ్రాహి కార్యస్థానము" అని వాడుటకుమారు "జిల్లాకలెక్టరు ఆఫీసు" అని వాడినచో సులువుగా నర్థమగును. "ప్రాడ్వివాకసభ" అనుటకుమారు "మునసబుకోర్టు" అని వాడుటయు, "ధూమ శకటాలయము" అనుటకుమారు "రైలుస్టేషను" అని వాడుటయు మేలైయుండును. ఈ కారణముచే జనులలో వాడుక పడియున్న ఇంగ్లీషుమాటలు వాడుటకు నేను శంకింపలేదు. కొన్ని సందర్భములలో శాస్త్రవిషయములో నెక్కువగా నుపయోగపడు నాంగ్లప్రయోగములతో తెనుగువారికి పరి

చితి కలిగింపవలెననియు ప్రయత్నించితిని. పెక్కుచోట్ల ఆయా ప్రయోగములలో నిమిడియున్న భావములుకూడ స్పష్టీకరింప యత్నించితిని.

ఈ పుస్తకరచనలో ఆదినుండి అంతమువరకు నాకు విశేషసాయ మొనర్చినవారు మ-రా-రా-శ్రీ బచ్చు జగన్నాథదాసు ఎం. ఏ. ఎం. యల్. అడ్వొకేటుగారు. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

ఈ పుస్తకము ఆంధ్రపత్రికా కార్యాలయములో ముద్రింపించి ప్రచురించుట కంగీకరించిన మ-రా-రా-శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతు లర్పించుచున్నాను.

నా మిత్రులు మ-రా-రా-శ్రీ ప్రయాగ వేంకటచలపతిరావు బి. ఏ. బి. యల్ గారున్ను, మ-రా-రా-శ్రీ కన్నేపల్లి సత్యనారాయణ బి. ఏ. గారున్ను, మ-రా-రా-శ్రీ సంబరాజు రామకృష్ణ రంగారావు బి. ఏ. గారున్ను, మ-రా-రా-శ్రీ గూడూరి శ్రీనివాసరావు బి. ఏ. బి. ఇ. డి. జి. డి. ఏ. గారున్ను, నా కీ సందర్భములో మిక్కిలి సాయ మొనర్చిరి. వారికి నా కృతజ్ఞత తెలుపుచున్నాను.

రాజమండ్రి,
30-11-36.

అ. వెంకటనర్సు.

# ఎన్నికల స్వభావము

ఎన్నికలనగా నేమి? వీనికింత ప్రాముఖ్యత నేల యీయవలెను? వీనికిన్ని రాజ్యపాలనకున్ను సంబంధమేమి? అను ప్రశ్నలు మనలో చాలమందికి స్ఫురించుచుండును.

వెనుకటి శతాబ్దములలో రాజ్యపాలనము సాగించువారు ప్రభువులు. వారి యాజ్ఞ కెల్లవారును లోబడితీరవలసినదే. 1, 2 శతాబ్దములనుండి అభిప్రాయములు మారుచు వచ్చినవి. రాజ్యపాలనకు కర్తలు ప్రభువులు కారనియు, ప్రజలే యనియు, ప్రజలక్షేమమే పరమావధి యనియు ననేకదేశములలో నూత్నభావములు మొలకలెత్తినవి. కొన్ని దేశములలో యీ భావములను పూర్తిగా గౌరవించినారు; కొన్ని దేశములలో కొంతవరకు గౌరవించినారు; కొన్ని దేశములవారీభావములమాటయే తలంచుటలేదు. ఈ నూత్నభావములే ఎన్నికలకు మూలకందము.

అనేకకోట్ల ప్రజలందరున్ను పరిపాలన సాగింపలేరు. వారితరఫున కొందరు ప్రతినిధులట్టిపరిపాలన సాగింపవలెను. అందునిమిత్తమై ప్రజలందరున్ను 3 సం॥ల కొకతూరి, లేదా 5 సం॥ల కొకతూరి, తమతరఫున రాజ్యపాలన నడుపుటకు ప్రతినిధుల నెన్నుకొనవలెనని నియమ మేర్పర్చినారు. ప్రజలకు గౌరవము, విశ్వాసము, అనురాగము ఏయే వ్యక్తులలో నుండునో వారిని తమతరఫు ప్రతినిధులుగా నెన్నుకొనుచుందురు. యునైటెడ్ స్టేట్సుదేశములోని ప్రజలకు రూజువెల్టు అనువానిలో నధిక విశ్వాసమున్నది కావున, ఈ నడుమ అతనిని రెండవమారు ప్రసిడెంటుగా నెన్నుకొనిరి. 3 సం॥లు, లేక 5 సం॥లు గడచినపిదప, వెనుక నెన్నుకొనిన ప్రతినిధులు ప్రజాక్షేమ మరయువారు కారని ప్రజలకు స్ఫురించినచో, లేక వెనుకటివారికంటె నధిక విశ్వాసపాత్రు లభ్యర్థులుగా నిల్చినచో, ఈ క్రొత్తవారినే ప్రజ లెన్నుకొనుచుందురు.

పురపాలనసంఘము మొదలు భారతశాసనసభవరకును అన్ని సభలలోను ప్రజల తరఫుప్రతినిధులే పరిపాలన సాగించుచుందురు. ఈ ప్రతినిధులకు ప్రజానురాగమే బలము. అది లేకున్నచో వారు రెండవసారి ఎన్నికలలో పదవిహీను లగుచుందురు. వీరికి ఏయే సంస్థలో నెట్టి యధికారము లున్నవను విషయ మీపుస్తకములో చర్చింపనగత్యములేదు.

ప్రజావిశ్వాసము, గౌరవము కొందరు వ్యక్తులయెడనైన, లేదా కొన్ని సంస్థలయెడనైన చూపవచ్చును. ఎన్నికలలో విజయము పొందినవారి చేతులలో ప్రజలసౌఖ్యమిమిడియున్నదను భావమే ఎన్నికలకు ప్రాముఖ్యత నిచ్చును.

రాజునకు లేక ప్రధానికి, యిష్టులగు బుద్ధిమంతులను రాజకార్యనిర్వహణములో సాయము చేయుటకై నియమించు నాచారము పూర్వమునుండియు వచ్చుచున్నది. కాని అట్టివారిలో ప్రజలకు విశ్వాసమున్నదియు లేకున్నయు కనబర్చుట కవకాశము లేకుండెను. కొన్ని దేశములలోను, కొన్ని సందర్భములలోను లాట్లు వేసి అందులో నెవరి పేర్లు పైకి వచ్చుట తటస్థించునో, అట్టివారిని మంత్రులుగాను, లేక మంత్రులకు సహాయులుగాను నియమించునధికార ముండెను. అదృష్టవశమున యీ పద్ధతు లవలంబించినప్పుడున్ను యోగ్యులే నియమింపబడవచ్చును; కాని, వారికిన్ని ప్రజలకున్ను ఎట్టి అనుబంధమున్ను ఏర్పడుట కవకాశము లేకుండెను. వారిని నియమించు రాజు, లేక ప్రధానిక్షేమము వారు చూడవలసినవారే యగుచుండిరి. కాని, ప్రజలక్షేమము చూడవలసిన బాధ్యత వారికి లేకుండెను. ఆ పద్ధతులకు భిన్నమగు పద్ధతి ఎన్నికల పద్ధతి. ఈ పద్ధతి పూర్తిగా నమలులోనున్న దేశములో ప్రతినిధు లెల్లరు ప్రజాభిప్రాయము శిరసావహించి నడుచుకొనవలెను.

ప్రజలక్షేమమే పరమావధిగా నెంచు ప్రతినిధుల నెన్నుకోవలెనన్నచో, అందుల కెట్టి ప్రతిబంధకములున్ను కలుగరాదు. ఓటర్లు తమ ఓటు నెవరికిచ్చుచున్నది పరులకు తెలియరాదు. పరులకు తెలిసినచో తనకు కీడు మూడునని ఓటరు భావించినచో (పరులకు తెలియుటకు వీలున్నచో) ఓటరు తన స్వబుద్ధి నుపయోగించి, ప్రజాసౌకర్యములు చూచు ప్రతినిధికి ఓటీయక, తా నెవరికి ఓటిచ్చెనో వెల్లడియైనను తనకు బాధలేని పద్ధతిని ఓటువేయును. అట్టి చిక్కు రాకుండ వలయునిబంధన నేర్పర్చినారు. మరియు, ఓటర్లు లంచము పుచ్చుకొన నవకాశ మున్నచో, ధనవంతుడు సొమ్ము విరివిగా ఖర్చు పెట్టి ఎన్నికలో నుత్తీర్ణుడగును. ఆ ధనవంతుడు కడునయోగ్యుడై యుండవచ్చును. రెండవ అభ్యర్థి ఉత్తముడైనను, ధనము వెచ్చింపలేని కారణముచే పరాజితుడగును. అందుచే లంచ మిచ్చుట, పుచ్చుకొనుట రెండున్ను నేరములుగా చేసినారు. ఓటర్ల స్వతంత్రబుద్ధి నక్రమముగా మార్చుటయు నేరముగా చేసినారు. లంచమిచ్చువాడున్ను పుచ్చుకొనువాడున్ను ఉభయులు నేరస్తులు కావున ఉభయులున్ను అంగీకరించి నేరము జరిపివేసి, ఎవరున్ను అది బైటపెట్టకుందురను నమ్మకచే, ప్రతి అభ్యర్థియు తాను ఎన్నికలో పెట్టిన ఖర్చులకు లెక్కలు వ్రాసి దాఖలుచేయవలెనను నియమ మేర్పర్చినారు. ఈ నియమము లన్నియు అమలులోనున్నను అనేకమంది లంచములు పుచ్చుకొనుట తటస్థించుచునే యుండును. పై దేశముల పరిస్థితులతో మన దేశపు పరిస్థితులు పోల్చి చూడగా, విద్య, విజ్ఞానము ప్రజలలో నెక్కువమంది కున్నప్పుడు అక్రమములు జరుగుటకు అవకాశము తక్కువగా నుండునని స్ఫురించుచున్నది.

ఎన్నికలలో కొన్ని సోపానము లున్నవి. ఒక మెట్టెక్కినపిమ్మట తర్వాతి మెట్టు నెక్కవలసియుండును. ఇంగ్లాండు దేశములో నములులోనున్న విధులనుబట్టియు, ఇతర దేశములోని విధులను బట్టియు, మన దేశములోని ఎలక్షన్ విధులున్ను సమకూర్చి గవర్నమెంటువారు ప్రచురించియున్నారు. ఎన్నికలు సక్రమముగా జరుగునట్లు సంరక్షించుటకై అనేకవిధు లేర్పరుపబడియున్నవి.

ఎలక్షన్లలో ప్రథమసోపానము ఓటరు జాబితా సమకూర్చుట. మనదేశములో బాల్యావస్థ దాటినవారెల్ల ఓటర్లను నియమము లేదు. సాధారణముగా కొన్ని పన్నులు చెల్లించువారున్ను, లేక ఆస్తిమంతులు మాత్రమే ఓటర్లుగా పరిగణింపబడుచున్నారు. రాష్ట్రమును, లేక జిల్లాను ఎన్నికలకై వేరువేరుఖండములుగా విభాగించి, ఏ ఖండమున కాఖండమునకు మెంబర్ల నెన్నుకొందురు. ఏ ఖండమున కాఖండమునకు వేర్వేరు ఓటరుజాబితాలు సమకూర్తురు. ఓటరు జాబితాలో పేరున్నవారి కందరకున్ను ఓటుండును. ఓటరుజాబితాలు సమకూర్చుచున్నప్పుడు ఆయాగడువులలో తమపేరు చేర్చమని కోరనివారిపేరు జాబితాలో నుండదు. వారికి ఓటున్నుండదు. ఈ జాబితాలు సమకూర్చుటలో కొన్ని పెద్దపొరపాట్లు జరుగుచుండుట తటస్థించును. వందలకొలది అనర్హులగు వ్యక్తులపేర్లు జాబితాలో చేరుటయు, వందలకొలది అర్హులగువారిపేర్లు జాబితాలో చేరకుండుటయు సంభవించుచుండును. కాని అలవాటుగా మన మన్ని పరిస్థితులలోను గవర్నమెంటువారిని నిందించుట ధర్మము కాదు. ప్రజలు మెలకువగా నుండనిచో గవర్నమెంటువారేమి చేతురు? ఎలక్షన్లలో పనిచేయు నుద్యోగులకు వచ్చిన భోగట్టానుబట్టి వారు నడచుకొందురు కాని, వారింకేమి చేతురు?

1935 సం॥ క్రొత్తఆక్టుప్రకారము చదువుకొన్నవారి కందరికిన్ని ఓటిచ్చినారు. కాని ఆ చదువుకొన్నవారు ఒకఉద్యోగివద్దకు వెళ్లి, ఒకదరఖాస్తు వ్రాసియిచ్చిననేకాని అతనికి ఓటీయరు. కొందరివిషయములో నీనిబంధన నములులో పెట్టవచ్చునుకాని, బి.ఏ. ప్యాసైనవారిపేర్లున్ను, లేదా స్కూలుఫైనలు ప్యాసయినవారి పేర్లున్ను జాబితాలు సమకూర్చునధికారులు తమంతట తామే చేర్చవలసినదని గవర్నమెంటువారేల శాసింపలేదో తెలియకున్నది. జగద్విఖ్యాతిగాంచిన సుప్రసిద్ధకవి రవీంద్రనాథ్ టాగూరుగారికి ఓటు లేదని ఆయన యీమధ్య వ్రాసినాడు.

అభ్యర్థిగా నిలువగోరువారిపేరు ఓటరుజాబితాలో చేరియుండవలెను. ఎన్నికకు ముందుగా నభ్యర్థిపేరు నామినేషన్ కాగితముపై వ్రాసియీయవలెను. ఒక ఓటరతని పేరుపపాదించుచు, మరియొక ఓటరు బలపర్చుచు ఆ నామినేషన్ కాగితముపై సం

తకములుచేసి దాఖలుచేయవలెను. అటుపిమ్మట నామినేషన్లు తనిఖీచూతురు. సక్రమములగు నామినేషన్లు దాఖలైనఅభ్యర్థులందరిలో నెవరి కెక్కువపలుకుబడి యున్నదో నిర్ణయించుటకు, ఆవెనుక ఓట్లు పుచ్చుకొందురు. సాధారణముగా ఓటర్లు ఓట్లఆఫీసుకు వెళ్లి ఓట్లు వేయవలెను. శాసనసభల ఓట్లుపుచ్చుకొను సందర్భములో క్రొత్తగా రంగు పెట్టె లేర్పరిచినారు. ఓటర్లు ఓటుకాగితములపై ఎట్టిగుర్తులున్ను వ్రాయనక్కరలేదు. కాగితము తీసికొనివెళ్లి వారి కిష్టుడగు నభ్యర్థి పెట్టెలో పడవేసిన చాలును. ఓట్లుపుచ్చుకొనునిమిత్తమై ఓట్ల ఆఫీసులో ప్రత్యేకముగా నొకగది ఏర్పరుతురు. గది ఏర్పరుచుటకు అవకాశము లేనప్పుడు, చాటుగా నొక ప్రదేశ మేర్పరుతురు.

అభ్యర్థులను, అభ్యర్థులతరఫు ఏజెంట్లను ఎన్నికలు జరుగు నన్నిచోట్లకున్ను, అన్నిసందర్భములలోను రానీయవలెనను నియమ మున్నది. ఓట్లుపుచ్చుకొనుటలోను, భద్రపర్చుటలోను, లెక్కపెట్టుటలోను ఆఫీసర్లు పాక్షికముగా సంచరించుట కవకాశము లేనట్లు వారు హాజరైయుండి సీళ్లువేసియు, ఆఫీసర్లు వ్రాసిన స్టేటుమెంటులకు నకళ్లు వ్రాసికొనియు, దాఖలైన కాగితములు చూచియు, వారివారి క్షేమము చూచుకొనుచుందురు. ఎన్నికలు ప్రజాబాహుళ్యమునకు సంబంధించిన విషయములు కాని, కొద్దిమందికిమాత్రమే సంబంధించినవి కావు. కాబట్టి వానివిషయమై జరుగుయావత్తుచర్యలున్ను వెల్లడిగా, రహస్యము లేకుండా జరిపినయెడల, నవి నిష్పాక్షికముగా జరుగును. పౌరులెల్లరకు వానిలో విశ్వాసము ప్రబలును.

ఇద్దరు ఓటర్లు సహాయులుగానున్న ప్రతివారున్ను అభ్యర్థులుగా బైలుదేరి, ఎలక్షన్ ఆఫీసర్లకు పనిపెంచకయుండుపద్ధతిని, ప్రతి అభ్యర్థియు (లేక అభ్యర్థితరఫున మరియొకరు) ధరావత్తుసొమ్ము కట్టిననేకాని అతని అభ్యర్థిత్వము సక్రమమైనది కాదను నియమ మేర్పర్చినారు. కనీససంఖ్యకు తక్కువ ఓట్లువచ్చిన అభ్యర్థులధరావత్తుసొమ్ము గవర్నమెంటుకు లేక జిల్లాబోర్డుకు సంక్రమించును. ప్రజల విశ్వాసములేని అభ్యర్థులు ఎన్నికలలో నిల్చి కొద్ది ఓట్లు మాత్రమే వచ్చి ఓడినను, వా రిచ్చు ధరావత్తుసొమ్ము మిగులుచున్నది కావున పని దండుగయైనదని భావింప నక్కరలేదు.

ఎన్నికలలో కొన్ని తరగతులకు ప్రత్యేకముగా సీట్లు కేటాయించుచు వచ్చిరి. లోకల్‌బోర్డు ఎన్నికలలో అట్టి సీట్ల కాయా తరగతుల సభ్యుల నెన్నుకొనవలెనను నియమ మున్నది. ఓటర్లాయా తరగతులకు చెందవలెనను నియమము లేదు. మహమ్మదీయులకు సీటు కేటాయించినచో సభ్యుడు మహమ్మదీయుడై యుండవలెను. కాని ఓటర్లు మహమ్మదీయులు కానక్కరలేదు. శాసనసభలకు సభ్యుడు మహమ్మదీయుడుండవలెను, ఓటర్లున్ను మహమ్మదీయులే యైయుండవలెను. వారికిని తక్కిన ఓటర్ల

కున్న సంబంధము లేదు. కొన్ని తరగతుల పౌరులు దేశములో నల్పసంఖ్యాకులే యున్నారనియు, వారికి ప్రతినిధు లుండనిచో వారిక్షేమ మరయువా రుండరనియు, తక్కినప్రజ లధికసంఖ్యాకు లగుటవల్ల అల్పసంఖ్యాకులనుండి ప్రతినిధి ఎన్నటికిని ఎన్నుకోబడకపోవచ్చుననియు, కావున వారికి వేరుప్రతినిధుల నేర్పాటుచేసితి మనియు గవర్నమెంటువారి వాదము. ఈ పద్ధతి ఎంతవరకు అమలులో పెట్టవలెనో, ఓటర్లను కూడ విభదీయుటకు బలవత్కారణము లున్నవో లేవో అనునది చర్చనీయాంశము.

ఎన్నికలలో అక్రమములు, లేక నేరములు జరిగినందువల్ల ఒక అభ్యర్థి విజయ మొందుటకును రింకొక అభ్యర్థి విజయము పొందుట తటస్థించినప్పుడు, ఆ ఎన్నిక రద్దుపర్చ నిమిత్తమై ఏ అభ్యర్థియైన, ఓటరైన ఎలక్షన్ పిటిషన్ దాఖలు చేయవచ్చును. జిల్లా జడ్జీలు, సబ్ జడ్జీలు ఆ పిటిషన్లు విచారింతురు. ఎదురుపార్టీ ఖర్చులకై ముందుగా కొంత సొమ్ము హామీగా పిటిషన్ విచారించునధికారులయెదుట కట్టవలెను. లేనిచో, ప్రతి వాదున్ను పిటిషన్ దాఖలుచేసి ఆయా ఆఫీసర్లకు రెట్టింపుపని కల్పించును. సాధారణ ముగా ఆయా అధికారుల తీర్పులపై అపీలులేదు. పెద్దనేరములు జరిగిన వని రుజువైన సందర్భములో ఆ అధికార్లు ఎన్నిక రద్దుపర్తురు. ఏనేరమైన అక్రమచర్యయైన జరిగి నందువల్ల ఎలక్షన్ ఫలితము తారుమారయ్యెనని ఆ అధికారుల యెదుట రుజువైనచో వారా ఎన్నిక రద్దుపర్తురు. అది జరుగకున్నను ఫలిత మీమాదిరిగానే యుండు నని వారికి తోచినచో వారు సాధారణముగా ఎన్నిక రద్దుచేయరు. ఎన్నికలు జరుపు నాఫీ సర్లు స్వల్పపాటి పొరపాట్లు చేసియున్నను వారు లెక్కింపరు.

ఎలక్షన్ పిటిషన్లు విచారించునధికార్లు శాస్త్రవిరుద్ధముగా తీర్పువ్రాసిన సంద ర్భములోను, అధికారము నతిక్రమించి నడుచుకొన్నప్పుడున్ను, హైకోర్టు వారాతప్పు తీర్పులను ఖండించుటకు సంకోచింపరు. హైకోర్టు జడ్జీలున్ను ముఖ్యముగా ఎన్నిక ఫలిత మే అక్రమచర్యవల్లనైన తారుమారైనదా అనువిషయము పరీక్షచేసి చూతురు. అట్లు జరిగినచో వారు కలుగజేసికొందురు; లేనిచో కలుగజేసికొనరు. ఓట్ల జాబి తాలు తయారుచేయుటలోను, ఆ పిమ్మట జరుగు ఎలక్షన్ క్రమములోను శాస్త్ర విరుద్ధమగు నడవడి యింకొకరిని బాధించుచున్నదని హైకోర్టుజడ్జీలకు తోచినచో, వారు వెంటనే ఆ నడవడిని ఖండించుచు తీర్పిత్తురు. పైసందర్భములలో వారు కలుగజేసి కొనుటకు వారికి పూర్తియగునధికార ముండియేయున్నది.

శాసనసభా ఎన్నికలలో ఎలెక్షన్ పిటిషన్ దాఖలుచేసి ఓడినవారిని ఆపిటిషన్ విచారించునధికారులు ఖర్చులెక్కువగా భరింపవలసినదని తీర్పు లిచ్చుచున్నా రనియు,

అందువల్ల నేరములు అక్రమములు జరిగినను యీ ఖర్చులకు పెరచి పిటిషనులు దాఖలు చేయుటలేవనియు, నీనడుము పార్లమెంటులో ఇండియా సహాయకార్యదర్శి బట్లరుగారితో చెప్పిరి. దీనికి సంబంధించినవిధులు మార్పు చేయించెద మని బట్లరుగారు నుడివిరి.

---

# 1935 సం. పు. ఇండియా పరిపాలనా చట్టములోని సూత్రములు

ఇటుపైని హిందూదేశపరిపాలనాక్రమ మంతయు నీ చట్టము ననుసరించి జరుగ వలెను. శాసనసభా ఎన్నికలలోను యీ చట్టమునందలి నిబంధనల ప్రకారమే నడుచు కొనవలెను. ఇది మద్రాసు రాష్ట్రములో 1-4-1937 తేదీని అమలులోనికి వచ్చెను. ఆ వెనుక 1, 2 సం॥లు గడచినపిమ్మట నియ్యది ఢిల్లీప్రభుత్వపద్ధతులలోను అమలు లోనికి వచ్చెను.

ఈ ఆక్టునకు మూలపురుషులు సర్ సామ్యుయల్ హోరుగారు. ఈ ఆక్టు సమకూర్చు సందర్భములో వీరు ఇండియాకార్యదర్శిగా వ్యవహరించుచుండిరి. హిందూదేశములో స్వరాజ్యసంస్థాపన కీ చట్టము పైమెట్టనియు వెనుకటి 1919 సం॥ పు ఇండియా పరిపాలనా చట్టములోని పద్ధతు లనేకము లీ ఆక్టు మార్చెనని సర్ హోరుగారి వాదము. వెనుకటి ఆక్టే క్రొత్త ఆక్టుకంటె పెక్కు విషయములలో మెరుగనియు, నీ ఆక్టు స్వరాజ్యసంస్థాపనకు పైమెట్టగుటకు మారు క్రిందిమెట్టే యనియు దేశములో ననేక నాయకుల అభిప్రాయము. ఉభయవాదములను విమర్శించి అందలి సత్యాసత్యములు నిరూపింపవలె నన్నచో మే మనేకపుటల గ్రంథము వ్రాయవలసివచ్చును. మన ఎన్ని కలకున్ను, ఆట్టి విమర్శకున్ను సన్నిహితబాంధవ్యము లేదు.

వెనుకటి ఆక్టు మరతుల ప్రకారము భారతశాసనసభలకు ప్రతినిధులను ప్రజలే నూటిగా ఎన్నుకొనుచుండిరి. వివిధరాష్ట్రములలో ఖండము లేర్పర్చి, ఆయా ఖండములలోని ఓటర్లు అసెంబ్లీమెంబర్ల నెన్నుకొని పంపుచుండిరి. ఈ ఆక్టు మరతుల ప్రకారము ప్రజల కీకష్టము తప్పినది. ఇంతకు పూర్వము ప్రజలు రాష్ట్ర శాసనసభాసభ్యుల నెన్నుకొనుచుండిరి. ఇప్పుడున్ను వారే ఎన్నుకొందురు. కాని అంతటితో వారిపని సరి. ఈ రాష్ట్ర శాసనసభల సభ్యులే భారతశాసనసభలలోని సభ్యుల నెన్నుకోవలసినదని క్రొత్త ఆక్టు శాసించినది. భారత అసెంబ్లీకి మెంబర్ల నెన్నుకొనువారు రాష్ట్ర అసెంబ్లీ మెంబర్లు. కౌన్సిల్ ఆఫ్ స్టేటుమెంబర్ల నెన్నుకొను వారు ఉభయరాష్ట్రశాసనసభలలోని సభ్యులు. ఈ క్రొత్త పద్ధతి నవలంబించుటకు రెండు కారణములున్న వని జాయింటుపార్లమెంటరీకమిటీవారు తమ రిపోర్టులో వ్రాసిరి. (1) హిందూదేశములో జనబాహుళ్య మెక్కువ. (2) హిందూదేశములోని పరిస్థితులు వేరు. కావున ఆదేశములో ప్రజలే భారతశాసనసభ్యుల నెన్నుకొను ధానము

పనిచేయదు. హిందూదేశమందలి జనాభా అధికమైనను అందులో పదవవంతు ప్రజలకు మాత్రమే యీ క్రొత్త ఆక్టు ఓట్లిచ్చినది. ఇంతకంటె ఓటరుబాహుళ్య మెక్కువగానున్న దేశములలో ప్రజలే తమ ప్రతినిధుల నెన్నుకొనుచున్నారని హోరుగారి ప్రతికక్షులు వాదింపవచ్చును. వారు రెండవ కారణము గమనింతురు గాక. తక్కిన దేశములలోని పరిస్థితులకును హిందూదేశములోని పరిస్థితులకును కొంతంత భేద మున్నదను విషయ మెవ్వరును కాదనుటకు వీలులేదు. కాని యీ ఎలక్షను పద్ధతి మార్చుటకు ప్రత్యేకముగానే పరిస్థితులు కారణభూతము లయ్యెనో, హోరుగారు స్పష్టముగా సెలవీయలేదు.

వెనుకటి ఆక్టుకంటె యీ ఆక్టు ప్రతినిధులసంఖ్య ననేకరెట్లు పెంచినది. వెనుకటి లెజిస్లేటివ్ అసెంబ్లీ (భారతశాసనసభ) లో మొత్తపు మెంబర్లు 145 గురు. ఇప్పటి ఫెడరల్ అసెంబ్లీలో (ఆసభ క్రొత్తపేరు) బ్రిటిష్ ఇండియా ప్రతినిధులసంఖ్య 250; స్వతంత్రప్రభు ప్రతినిధులసంఖ్య 125; మొత్తపు సంఖ్య 375. స్వతంత్రప్రభుప్రతినిధులు ఆయా సంస్థానాధిపతులు నియమించినవా రనియు, ఆయా సంస్థానములలోని ప్రజల కీ ప్రతినిధుల నెన్నుకొనుక్రమ లేదనియు, మనము గమనింపవలసి యున్నది. వెనుక కౌన్సిల్ ఆఫ్ స్టేటు సభ్యుల సంఖ్య 59. ప్రస్తుతములో వారిసంఖ్య బ్రిటిష్ ఇండియా ప్రతినిధులు 156; స్వతంత్రప్రభుప్రతినిధులు 104; మద్రాసురాష్ట్రములో నిదివర కొక్క శాసనసభయే కార్యముల నిర్వహించుచుండెను. ఇకముందు రెండు శాసనసభలు వ్యవహరించుచుండును. ఒక సభపేరు మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ. రెండవ సభపేరు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు. మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబర్ల సంఖ్య 215. లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబర్ల సంఖ్య 54 – 56 మధ్య నుండును. మంత్రివర్గముకూడా వృద్ధిచేసినారు.

ఓటర్ల సంఖ్య 70 లక్షలనుండి 280, 290 లక్షలవరకు వృద్ధియగునని పై రిపోర్టులో వ్రాసియున్నారు. స్త్రీవోటర్ల సంఖ్యయు వృద్ధి కాబడినది.

ఇది కాక వేరు వేరుతరగతుల ప్రజలకు వేరువేరు సీట్లేర్పర్చి హోరుగారు తమ న్యాయదృష్టి చూపియున్నారు. హిందువులకు మహమ్మదీయులకు సంబంధములేదు; మహమ్మదీయులకు క్రైస్తవులకు సంబంధములేదు; క్రైస్తవులకు సిక్కులకు సంబంధము లేదు. ఎవరిసీట్లు వారికి వేరే కేటాయించినారు. అట్లు కేటాయించినను ఆయా తరగతుల ప్రజలోని ప్రతినిధి, మొత్తపు వోటర్ల సానుభూతివల్ల విజయుడై, ఆతరగతి ప్రజల కెదురు తిరుగకుండ, ఆయా తరగతుల వోటర్లే ఆయాతరగతుల సభ్యుల నెన్ను

కొనవలసిన దని శాసించినారు. వేరువేరు తరగతులకు వేరువేరు సౌధములు కట్టించి యిచ్చినట్లు, హోరుగారు పై నియమము లేర్పర్చినారు.

పంచములకున్ను పై పద్ధతిని వేరుమేడ కట్టి యిచ్చుటకు హోరుగారు సంకల్పింపగా, గాంధిగా రది పంచములకే అనర్థదాయకమగుననియు, అట్లొనర్చినచో తాము నిరశనదీక్ష వహించి ప్రాణములు విడుతు మనియు పట్టుపట్టిరి. గాంధీగారిపై విశేష గౌరవమున్న హోరుగా రట్టిసంఘటన జరుగుచుండగా చూచుచు నెట్లూరకుండగలరు? ఆకారణముచే పంచముల ప్రతినిధుల ఎన్నికల నిమిత్తమై రెండు పద్ధతు లేర్పర్చినారు. మొదట పంచములే నలుగు రభ్యర్థుల నెన్నుకొందురు. ఈ సందర్భములో ఓట్లు వేయువారు పంచములేకాని పైవారు కారు. అటుపైని ఆ నలుగు రభ్యర్థులలో నొకరిని మెంబరుగా యావన్మంది జనరల్ వోటర్లున్ను ఎన్నుకొందురు

# 1935 వ సంవత్సరపు ఇండియా పరిపాలనా చట్టము

సెక్షను.

18. (i) భారతశాసనసభలు రెండు. కౌన్సిల్ ఆఫ్ స్టేటు ఒకటి; ఫెడరల్ అసెంబ్లి రెండవది.

(హిందూదేశములో నధికభాగ మాంగ్లపరిపాలనకు లోనైయున్నది. దానిని బ్రిటిషు ఇండియా అని పిలుతురు. మరికొంతభాగము స్వతంత్రరాజు లేలుచున్నారు. 1935 వ సంవత్సరపు చట్టమునకు పూర్వము బ్రిటిషు ఇండియానుండియే భారతశాసనసభా ప్రతినిధులు యెన్నుకొనబడుచుండిరి. క్రొత్తచట్టము ప్రకారము పై రెండుసభలలోను బ్రిటిషు ఇండియా ప్రతినిధులతోబాటు, స్వతంత్రరాజప్రతినిధులుకూడ సభ్యులుగ వ్యవహరింతురు. స్వతంత్రరాజు లనగా హైదరాబాదు, మైసూరు, బరోడా మున్నగురాజ్యముల నేలు ప్రభువులు. వారివారి రాజ్యప్రజాపాలనమందు వారికి సర్వాధికార మున్నది. నూతనచట్టము బ్రిటిషు ఇండియాకును స్వతంత్రరాజ్యములకును సమ్మేళన మొనర్చినది. స్వతంత్రరాజ్యముల ప్రతినిధులను నియమించువా రారాజ్యము నేలు ప్రభువులు.)

(ii) కౌన్సిల్ ఆఫ్ స్టేటులో బ్రిటిషు ఇండియా ప్రతినిధులు 156 గురు. స్వతంత్రరాజ్యప్రతినిధులసంఖ్య 104 మించరాదు.

ఫెడరల్ అసెంబ్లిలో బ్రిటిషు ఇండియా ప్రతినిధులు 250 మంది. స్వతంత్ర రాజప్రతినిధుల సంఖ్య 125 ను మించరాదు.

(iii) బ్రిటిషు ఇండియాప్రతినిధుల నెన్నుకొనువిధానము 1 వ అనుబంధములో విశదీకరింపబడినది.

(iv) కౌన్సిల్ ఆఫ్ స్టేటు శాశ్వతసభ. మూడేండ్లకొకతూరి సభలో మూడవవంతు మెంబర్లు తమపదవులు ఖాళీజేసి క్రొత్తవారికి తావిత్తురు. ఈ క్రమమంతయు ఒకటవ అనుబంధములో తెలుపబడినది.

(v) ఫెడరల్ అసెంబ్లి ఆయుర్దాయము ప్రథమసమావేశమునుండి అయిదు సంవత్సరములు. ఏ కారణముచేనైన యీ గడువులోపుననే యీ సభ ముగిసినను ముగియవచ్చును.

19. (i) ఈ రెండు సభలను సాలున కొకసారియైన సమావేశపరుపవలెను. ఏ రెండు సమావేశములకును మధ్య గడువు 12 మాసములకు మించియుండరాదు.

(ii) ... ... ... ... ... ...

20. ... ... ... ... ... ...

21. ... ... ... ... ... ...

22. (i) కౌన్సిల్ ఆఫ్ స్టేటు సభ్యులు తమలో నొకరిని అధ్యక్షునిగాను (ప్రెసిడెంటు) మరియొకరిని ఉపాధ్యక్షునిగాను (డిప్యూటి ప్రెసిడెంటు) యెన్నుకోవలెను.

(ii) ...........అధ్యక్షునిలోగాని ఉపాధ్యక్షునిలోగాని నమ్మకము చెడినట్లు సభలో నధికసంఖ్యాకులు తీర్మానించినచో, వా రాపదవులను గోల్పోవుదురు. అట్టి తీర్మానమునకు 14 రోజులు ముందుగా నోటీసు యీయవలెను.......

(iii) ... ... ... ...

(iv) .........ఫెడరల్ అసెంబ్లీలో అధ్యక్షుని పేరు స్పీకర్. ఉపాధ్యక్షుని పేరు డిప్యూటి స్పీకర్.

23. (i) ... ... ... ... ... ...

(ii) ... ... ... ... ... ...

(iii) ఈ రెండు సభలలో నేది సమావేశమైనను సభ్యులలో ఆరవవంతు మెంబర్లైనను హాజరుగా నుండవలెను. లేనిచో, ఆనాటికి సభ చాలించి మరియొక తేదీకి వాయిదా వేయవలెను.

24. ... ... ... ... ... ...

25. (i) ఎవరున్ను రెండుసభలలోను మెంబరుగా నుండరాదు. రెండుసభలలోను మెంబర్లుగా నెన్నుకోబడినవా రేసభలో సభ్యులై యుండవలసినది నిర్ణయించుక్రమము గవర్నరుజనరల్ గా రేర్పరతురు.

(ii) మెంబరులై యున్నవారు తమపదవుల గోల్పోవు పరిస్థితులు:—

(i) 26 వ సెక్షనులో సూచించిన యేకారణమును బట్టియైన అనర్హతసిద్ధించుట.

(ii) తమపదవులకు రాజీనామా లిచ్చుచు గవర్నరుజనరల్ గారికి వ్రాసిపంపుట.

(iii) వరుసను 60 రోజులు సమావేశములకు రానివారు పదచ్యుతులైనట్లు సభవారు నిర్ణయింప వచ్చును. ఈ 60 రోజులలోను, సమావేశము నాలుగు రోజులకు మించి వాయిదా పడినచో, ఆ వాయిదారోజులు మినహాయించి, 60 రోజులు గణన జేయుదురు.

26. (1) మెంబరుపదవులకు అభ్యర్థులుగా నుండుటకుగాని, సభ్యులుగానుండుటకుగాని యీ క్రిందివారనర్హులు:—

(i) గవర్నమెంటు ఉద్యోగులు:— గవర్నమెంటు ఉద్యోగము చేయుచు గవర్నమెంటువల్ల జీతము పొందుచున్నవారు. వీరిలో కొన్నితరగతులకు చెందినవారు అర్హులని ఉభయశాసనసభలు తీర్మానింపవచ్చును.

(ii) మతిభ్రష్టులు:— అట్టివారు మతిభ్రష్టులైనట్లు ఏకోర్టువారైనను నిర్ణయించియుండవలెను.

(iii) ఇన్‌సాల్వెంట్లు (దివాలాదార్లు):—ఇన్‌సాల్వెంటుగా ఖాయపడినప్పటికి కోర్టులో పూరా విడుదల (డిస్‌ఛార్జి) పొందినవారర్హులే.

(iv) ఎలక్షన్ నేరస్థులు:—ఎలక్షన్‌లకు సంబంధించిన యెట్టి నేరమైనను, యెట్టి అక్రమమైనను చేసినవారు. వీరట్టివారిని ఏ క్రిమినల్‌కోర్టులోనైన, లేదా ఎలక్షన్ విచారణలోనైన రుజువు గావచ్చును. ఆ నేరమును యీ చట్టమునకు పూర్వము చేసినను, తర్వాత చేసినను ఫలిత మొక్కటే. ఎన్ని సంవత్సరములు దాటినతర్వాత యీమచ్చ మాయునో, ఏయేనేరస్థులీకళంకమునకు పాత్రులగుదురో, అను విషయము లుభయ శాసనసభలు, లేదా బ్రిటిషు పాలకవర్గము (కౌన్సిల్) నిర్ణయింతురు.

(v) క్రిమినల్ నేరస్థులు:—బ్రిటిషు ఇండియాలోగాని, స్వతంత్ర రాజ్యములలోగాని, ఏ కోర్టులోనైన, ఎట్టి నేరమునకైన ద్వీపాంతరవాసశిక్ష పొందినవారును, లేదా రెండు సంవత్సరములు ఖైదుశిక్ష పొందినవారును, లేదా రెండు సంవత్సరములు మించి ఖైదుశిక్ష పొందినవారును. పై శిక్ష ఈ చట్టమునకు ముందైనను తర్వాతైనను ఫలిత మొక్కటియే. శిక్షానుభవము పూర్తియైన అయిదు సంవత్సరములపిదప యీ కళంకము తొలగిపోవును. శిక్షితుడై యున్నను ఫలాని అభ్యర్థి అర్హుడేయనియు, అయిదు సంవత్సరముల గడువు చెల్లకున్నను అర్హుడేయనియు గవర్నరు-జనరల్ గారు నిర్ణయింపవచ్చును.

(ఈకళంకమున్నవారు తమ్మభ్యర్థులుగా నిలువ నుత్తరువీయమని కోరుచు, గవర్నరు-జనరల్‌గారికి దరఖాస్తువ్రాసి పంపవలెను. ఆయన కిష్టమున్నచో అట్టివారిని అభ్యర్థులుగా నిలువనీయవచ్చును. రాజకీయనేరములు చేసి రెండు సంవత్సరములు, అంతకు మించిన శిక్ష పొందినవారు కూడ అనర్హులే.)

(vi) ఎలక్షనులెక్కలు దాఖలుచేయనివారు:—భారతశాసనసభాభ్యర్థియై, లేదా రాష్ట్రీయశాసనసభాభ్యర్థియై, లేదా ఏ అభ్యర్థితరఫుననైన ప్రతినిధియై వ్యవహారిం

చుచు, నియమితకాలములో, నిర్ణీతవిధానము ననుసరించి ఎలక్షన్‌లలో పెట్టినఖర్చు లెక్కలు దాఖలుచేయనివారు. దాఖలుచేయవలసిన తేదీనుండి 5 సంవత్సరములు దాటినచో యీ కళంకము బాధింపదు. గవర్నరు-జనరల్‌గా రనుగ్రహించినచో ఈలోపున తొలగినను తొలగవచ్చును. దాఖలుచేయవలసిన తేదీతర్వాత మాసము గడచిననేగాని యీ ఆక్షేపణ అమలులోనికి రాదు.

(2) ఎట్టి క్రిమినల్ నేరమునకైన ద్వీపాంతరవాసశిక్షగాని ఖైదుశిక్షగాని అనుభవించుచున్నవారిని భారతశాసనసభలలో దేనిలోను సభ్యునిగా నెన్నుకొనరాదు.

(3) మెంబరుగానున్నవాడు పై (iv) (v) నేరములకు శిక్షితుడైనపుడు, శిక్షపడిన మూడుమాసములవరకు తనపదవి కోల్పోడు. ఈ లోగా హైకోర్టులో అపీలు (లేక రివిజన్) దాఖలుచేసినచో అందులఫలితము తేలువరకు మెంబరుపదవికి భంగము రాదు.

ఈ లోపువీనతడు సమావేశములలో కూర్చుండరాదు, తీర్మానములపై ఓటివ్వరాదు.

(4) ఇండియా గవర్నమెంటు మంత్రులున్ను, రాష్ట్రీయ గవర్నమెంటు మంత్రులున్ను, స్వతంత్రప్రభువులవద్దను గవర్నమెంటువద్దను ఉద్యోగులై సంచరించుచున్నవారున్ను, పై (i) రూలులో తెలిపిన గవర్నమెంటు ఉద్యోగులుగా భావింపబడరు. అట్టివారు మెంబరుపదవి పడయుట కెట్టియాక్షేపణయు లేదు.

29. మెంబర్ల కొసంగు జీతములును, భత్యములును......నిర్ణయింతురు.

చుచు, నియమితకాలములో, నిర్ణీతవిధానము ననుసరించి ఎలక్షన్‌లలో పెట్టినఖర్చు లెక్కలు దాఖలుచేయనివారు. దాఖలుచేయవలసిన తేదీనుండి 5 సంవత్సరములు దాటిన చో యీ కళంకము బాధింపదు. గవర్నరు-జనరల్ గా రనుగ్రహించినచో ఈలోపున తొలగినను తొలగవచ్చును. దాఖలుచేయవలసిన తేదీతర్వాత మాసము గడచిననేగాని యీ ఆక్షేపణ అమలులోనికి రాదు.

(2) ఎట్టి క్రిమినల్ నేరమునకైన ద్వీపాంతరవాసశిక్షగాని ఖైదుశిక్షగాని అనుభవించుచున్నవారిని భారతశాసనసభలలో దేనిలోను సభ్యునిగా నెన్నుకొనరాదు.

(3) మెంబరుగానున్నవాడు పై (iv) (v) నేరములకు శిక్షితుడైనపుడు, శిక్షపడిన మూడుమాసములవరకు తనపదవి కోల్పోడు. ఈ లోగా హైకోర్టులో అపీలు (లేక రివిజన్) దాఖలుచేసినచో అందులఫలితము తేలువరకు మెంబరుపదవికి భంగము రాదు.

ఈ లోపున నతడు సమావేశములలో కూర్చుండరాదు, తీర్మానములపై ఓటివ్వ రాదు.

(4) ఇండియా గవర్నమెంటు మంత్రులున్ను, రాష్ట్రీయ గవర్నమెంటు మంత్రులున్ను, స్వతంత్రప్రభువులవద్దను గవర్నమెంటువద్దను ఉద్యోగులై సంచరించుచున్నవారున్ను, పై (i) రూలులో తెలిపిన గవర్నమెంటు ఉద్యోగులుగా భావింపబడరు. అట్టివారు మెంబరుపదవి పడయుట కెట్టియాక్షేపణయు లేదు.

29. మెంబర్ల కొసంగు జీతములను, భత్యములను......నిర్ణయింతురు.

68. (1) ఎవరున్ను రెండు సభలలోను మెంబరుగా నుండరాదు. రెండు సభల లోను మెంబర్లుగా ఎన్నుకోబడినవారేసభలో సభ్యులై యుండవలసినది నిర్ణయించు క్రమము గవర్నరుగారేర్పరతురు.

(2) రాష్ట్రీయ శాసనసభలోను, భారతశాసనసభలోను, రెండింటిలోను మెంబరుగా నెన్నుకోబడినవారు, రాష్ట్రశాసనసభలోని పదవి కోల్పోవలెను. ఈలోపుగా భారతశాసనసభలోని పదవికి రాజీ యిచ్చినచో రాష్ట్రసభలోనిపదవి నిలిచియుండును.

(3) మెంబర్లయియున్నవారు తమ పదవుల కోల్పోవు పరిస్థితులు :

(i) 69 వ సెక్షనులో సూచించిన యే కారణమును బట్టియైన అనర్హత సిద్ధించుట.

(ii) తమ పదవికి రాజీ నిచ్చుచు గవర్నరుగారికి వ్రాసి పంపుట.

(4) వరుసను 60 రోజులు సమావేశములకు రానివారు పదచ్యుతులైనట్లు సభవారు నిర్ణయింపవచ్చును. ఈ 60 రోజులలోను, సమావేశము 4 రోజులకు మించి వాయిదాపడినచో, ఆవాయిదారోజులు మినహాయించి, 60 రోజులు గణనచేయుదురు.

69. (i) మెంబరుపదవులకు అభ్యర్థులుగా నిల్చుటకుగాని సభ్యులుగా నుండుటకు గాని యీ క్రిందివారనర్హులు:—

(i) గవర్నమెంటు ఉద్యోగులు:—గవర్నమెంటు ఉద్యోగముచేయుచు గవర్నమెంటువల్ల జీతము పొందుచున్నవారు. వీరిలో కొన్నితరగతులకు చెందినవారు అర్హులని ఉభయశాసనసభలు తీర్మానింపవచ్చును.

(ii) మతిభ్రష్టులు:—అట్టివారు మతిభ్రష్టులైనట్లు ఏకోర్టువారైన నిర్ణయించి యుండవలెను.

(iii) ఇన్‌సాల్వెంట్లు:—(దివాలాదార్లు) ఇన్‌సాల్వెంటుగా ఖాయపడినప్పటికి కోర్టులో పూరావిడుదల (డిస్‌చార్జి) పొందినవారర్హులే.

(iv) ఎలక్షన్ నేరస్థులు:—ఎలక్షన్లకు సంబంధించిన ఎట్టినేరమైనను ఎట్టి అక్రమమైనను చేసినవారు. వీరట్టివారని ఏ క్రిమినల్ కోర్టులోనైన లేదా ఎలక్షన్ విచారణలోనైన రుజువుకావచ్చును. ఆనేరమును యీ చట్టమునకు పూర్వము చేసినను, తర్వాత జేసినను ఫలిత మొక్కటియే. ఎన్నిసంవత్సరములు దాటినతర్వాత ఈ మచ్చ మాయునో, ఏయే నేరస్థులు యీ కళంకమునకు పాత్రులగుదురో, అను విషయము లుభయశాసనసభలు, లేదా బ్రిటిషుపాలనవర్గము (కౌన్సిల్) నిర్ణయింతురు.

(v) క్రిమినల్ నేరస్థులు:—బ్రిటిషు ఇండియాలోగాని, స్వతంత్రరాజ్యములలోగాని, ఏ కోర్టులోనైన ఎట్టినేరమునకైన ద్వీపాంతరవాసశిక్ష పొందినవారును, లేదా రెండుసంవత్సరములు ఖైదుశిక్ష పొందినవారును, లేదా రెండుసంవత్సరములకు మించి ఖైదుశిక్ష పొందినవారును. పై శిక్ష యీచట్టమునకు ముందైనను తర్వాతైనను ఫలిత మొక్కటియే. శిక్షానుభవము పూర్తియైన 5 సంవత్సరముల పిదప యీ కళంకము తొలగిపోవును. శిక్షితుడైయున్నను ఫలాన యభ్యర్థి అర్హుడే యనియు, 5 సంవత్సరములగడువు చెల్లకున్నను అర్హుడేయనియు, గవర్నరుగారు నిర్ణయింపవచ్చును.

(ఈకళంకమున్నవారు తమ్మభ్యర్థులుగా నిలువ నుత్తరువిమ్మనికోరుచు గవర్నరుగారికి దరఖాస్తువ్రాసి పంపవలెను. ఆయన కిష్టమున్నచో వారిని నిలువనిచ్చును. రాజకీయనేరములుచేసి రెండుసంవత్సరములు, అంతకుమించినశిక్ష పొందినవారుకూడ ననర్హులే.)

(vi) ఎలక్షను లెఖలు దాఖలుచేయనివారు:—భారతశాసనసభాభ్యర్థియై, లేదా రాష్ట్రీయ శాసనసభాభ్యర్థియై లేదా ఏ అభ్యర్థి తరపునవైన ప్రతినిధియై వ్యవహరించుచు నియమితకాలములో, నిర్ణీతవిధానము ననుసరించి ఎలక్షనులలో పెట్టిన ఖర్చు లెక్కలు దాఖలుచేయనివారు, దాఖలుచేయవలసిన తేదీనుండి 5 సంవత్సరములు దాటినచో యీ కళంకము బాధింపదు. గవర్నరుగా రనుగ్రహించినచో యీ లోపున తొలగినను తొలగవచ్చును. దాఖలు చేయవలసిన తేదీతర్వాత మాసము గడచిననేగాని యీ ఆక్షేపణ అమలులోనికి రాదు.

(2) ఎట్టి క్రిమినల్ నేరమునకైనను ద్వీపాంతరవాసశిక్షగాని, ఖైదుశిక్ష గాని అనుభవించుచున్నవారిని భారతశాసనసభలలో దేనిలోను సభ్యునిగా నెన్నుకొనరాదు.

(3) మెంబరుగా నున్నవాడు పై (iv) (v) నేరములకు శిక్షితుడైనపుడు శిక్ష పడిన మూడు మాసములవరకు తన పదవి కోల్పోడు. ఈలోగా పైకోర్టులో అప్పీలు (లేక రివిజన్) దాఖలుచేసినచో అందుల ఫలితము తేలువరకు మెంబరుపదవికి భంగము రాదు.

ఈ లోపున నతడు సమావేశములో కూర్చుండరాదు. తీర్మానములపై ఓటివ్వరాదు.

(4) ఇండియా గవర్నమెంటు మంత్రులును రాష్ట్రీయ గవర్నమెంటు మంత్రులును పై (i) రూలులో తెలిపిన గవర్నమెం టుద్యోగులుగా ఎంచబడరు. వారు మెంబరుపదవి బడయుట కెట్టి యాక్షేపణయు లేదు.

72. మెంబర్ల కొసంగు జీతములును, భత్యములును.........నిర్ణయింతురు.

# 1935 వ సంవత్సరపు ఇండియా పరిపాలనాచట్టము

## 1–వ అనుబంధము

## భారతశాసనసభా ప్రతినిధుల నెన్నుకొను విధానము

### బ్రిటిషు ఇండియా ప్రతినిధులు.

నిబంధన.

1. ఫెడరల్ అసెంబ్లీలోగాని కౌన్సిలు ఆఫ్ స్టేట్‌లోగాని మెంబర్లు కాగోరువారు,

బ్రిటిషు సబ్జక్టు అయియుండవలెను. లేదా బ్రిటిషు ఇండియాకున్ను స్వతంత్ర రాష్ట్రములకున్ను జరిగిన సమ్మేళనలో చేరియున్న స్వతంత్ర ప్రభువు, లేదా ఆ ప్రభుపాలనమునకు లోబడినవాడై యుండవలెను.

(బ్రిటిషు సబ్జక్టు అనగా ఆంగ్ల పరిపాలనములోనున్న ఏదేశమునకైన చెందినవాడు.)

(ii) కౌన్సిల్ ఆఫ్ స్టేటు సభ్యులు కాగోరువారికి వయస్సు ముప్పదియేండ్లయిన నుండవలెను. ఫెడరల్ అసెంబ్లి అభ్యర్థుల వయస్సు 25 యేండ్లున్న చాలును.

(iii) అభ్యర్థిత్వమునకు అర్హత యుండవలయును.

(ఒక ఎలక్షన్ ఖండములో ఓటున్నవారు ఆ ఖండపు మెంబరుపదవికి అభ్యర్థిగా నిలువవచ్చును.)

పైసమ్మేళన కంగీకరింపని ప్రభువుగాని, అతని ప్రజలుగాని.

(i) రాష్ట్రీయశాసనసభలలో మెంబర్లుగా నుండుట కర్హులైనచో, భారతశాసన సభలోను మెంబర్లుగా నుండుట కర్హులే.

(ii) కమిషనర్ రాష్ట్రములనుండి భారతశాసనసభలకు ప్రతినిధులుగా నిలువ వచ్చును.

2. మెంబరుగా నున్నవారి పదవీకాలము తీరిన తిరిగి వారినే మెంబరుగా నెన్నుకొన వచ్చును.

3. బ్రిటిషు ఇండియానుండి యీ సభకు 156 గురు ప్రతినిధుల నెన్నుకొందురు. వీరిలో 6 గురిని గవర్నరు–జనరల్ గారు నియమింతురు. మిగతా 150 మందిని,

(i) గవర్నరురాష్ట్రములలోని ప్రజలు,

(ii) కమిషనర్ రాష్ట్రములలోని ప్రజలు,

(iii) ఆంగ్లో-యిండియనులు,

(iv) యూరోపియనులు,

(v) ఇండియన్ క్రిస్టియనులున్ను యిందుతో చేర్చిన పట్టీల ననుసరించి ఎన్నుకోవలెను.

(గవర్నర్లు పాలించు రాష్ట్రములను గవర్నరురాష్ట్రము లనియు, కమిషనర్లు పాలించు రాష్ట్రములను కమిషనర్ రాష్ట్రము లనియు పిల్తురు. మద్రాసు, బొంబాయి, బెంగాలు, పంజాబు, బీహార్, సింద్, ఒరిస్సా మొదలయినవి గవర్నరురాష్ట్రములు. బెలూచిస్థానము, ఢిల్లీ, అజిమీర్—మేర్వారా మొదలైనవి కమిషనర్ రాష్ట్రములు.)

(పై (iii), (iv), (v) మాటల కర్థము 26 వ నిబంధనలో తెలుపబడినది.)

4. ఏయే రాష్ట్రములలో, ఏయే తరగతివా రెందరు ప్రతినిధుల నెన్నుకోవలెనో పట్టీలలో తెలుపబడినది.

5. ఎలక్షన్ నిమిత్తమై ప్రతిరాష్ట్రము వివిధఖండములుగా విభజింతురు.

(కొన్ని గ్రామములుగాని, లేదా కొన్ని తాలూకాలుగాని, లేదా కొన్ని పట్టణములుగాని ఒకటిగా చేర్చి వానినుండి ఒకరిని, లేక యిద్దరు ముగ్గురు సభ్యుల నెన్నుకొనుచుందురు. అట్టి విభాగములను ఎలక్షన్ ఖండము లను పేరుతో వ్యవహరింతుము. ఉదా. రాజమండ్రి, భద్రాచలము డివిజన్లు రెండున్ను కలిపి ఒక ఎలక్షన్ ఖండముగా నేర్పర్చినారు. ఆ ఖండమునుండి మద్రాసు అసెంబ్లీకి యిద్దరు సభ్యుల నెన్నుకొని పంపుదురు. బెజవాడ, బందరు పట్టణముల రెండింటిని ఏకముజేసి ఒక ఖండముగా నేర్పరచినారు. ఆఖండమునుండి ఒకేసభ్యుని ఎన్నుకోవలసియున్నది. ఒకొక్క సందర్భములో కొన్ని జిల్లాలను ఏకము జేసి వానిని ఒకేఖండముగా నేర్పరతురు. మహమ్మదీయసభ్యుల యెన్నికకు విశాఖపట్టణము తూర్పుగోదావరి జిల్లాల రెండింటిని ఏకముజేసి, ఒకేఖండముగా నేర్పరచి, ఆ ఖండమునుండి ఒకసభ్యుని నెన్నుకోవలసిన దని శాసించినారు.)

ఆ ఖండము లనేకతరగతులకు చెందినవి.

(i) జనరల్‌సీట్ల ఎలక్షన్ నిమిత్త మేర్పరచినవి.

(ii) సిక్కుసీట్ల ఎలక్షన్‌నిమిత్త మేర్పరచినవి.

(iii) మహమ్మదీయసీట్ల ఎలక్షన్ నిమిత్త మేర్పరచినవి.

ఏ తరగతి ప్రతినిధుల ఎన్నికనిమిత్తమైన రాష్ట్ర మంతయు నేకఖండముగ నేర్పరుపవచ్చును.

ఈ ఖండము లొక్కొక్క మెంబరునుగాని, పలువురు మెంబర్లనుగాని, ఆయా నిబంధనల ననుసరించి యెన్నుకోవలెను.

(ప్రతిఖండమునుండి ఒక్క మెంబరునైన ఎన్నుకొని తీరవలెను. మెంబరు ఎన్నిక లేని ఎలక్షనుఖండ ముండదు.)

6. (i) సిక్కు సీట్ల యెన్నికకు సిక్కులే ఓటర్లుగా నుండ నర్హులు. మహమ్మదీయ సీట్ల ఎన్నికకు మహమ్మదీయులే ఓటర్లుగా నుండ నర్హులు.

(2) సిక్కు ఓటరు జాబితాలలోగాని లేదా మహమ్మదీయ ఓటరు జాబితాలలోగాని జేరినవారిని, జనరల్ సీట్ల ఓటరుజాబితాలలో జేర్పరాదు.

(జనరల్ సీట్లలో మెంబరుగా ఎవరినేని ఎన్నుకొనవచ్చును. హిందువు, మహమ్మదీయుడు, యూరపియను, పంచముడు, స్త్రీ, పురుషుడు అను వివక్ష లేకయే, ఓటర్లు కోరినవారి నెన్నుకొనవచ్చును. కాని ప్రత్యేకతరగతిసీట్లకు ఆయా తరగతులకు జెందిన వ్యక్తులనుమాత్రమే సభ్యులుగా నెన్నుకోవలెను. సిక్కుసీట్లకు సిక్కులనే సభ్యులుగా నెన్నుకోవలెను. యూరపియను సీట్లకు యూరపియనులను మాత్రమే సభ్యులుగా నెన్నుకోవలెను. అదిన్నిగాక ఆయాతరగతి సీట్లకు మెంబర్ల నెన్నుకొను ఓటర్లు ఆయాతరగతులకు చెందిన ఓటర్లయి యుండవలెను. సిక్కుసీట్లకు మెంబర్ల నెన్నుకొను ఓటర్లు సిక్కులే అయియుండవలెను. యూరపియను సీట్లకు మెంబర్ల నెన్నుకొను ఓటర్లు యూరపియనులే అయియుండవలెను. ప్రత్యేకతరగతులకు చెందిన ఓటర్లపేర్లు ఆయాతరగతి జాబితాలలోనే చేర్చవలెనుగాని, జనరల్ సీట్ల సంబంధించిన ఓటరు జాబితాలలో చేర్చరాదు. జనరల్ సీట్ల ఓటరు జాబితాలలో చేరి, వారిపేర్లు మరి యే తరగతి ఓటరుజాబితాలలోను చేర్చరాదు. ఏ తరగతి కాతరగతికి మెంబర్లు వేరు, ఓటర్లు వేరు.

లోకల్ బోర్డు ఎన్నికలలోను, మ్యునిసిపాలిటీలో ఎన్నికలలోను కొన్ని తరగతులకు మెంబరుపదవులు కేటాయించి ఉంచెదరు. ఆ పదవులకు ఆ తరగతికి చెందిన వారినిమాత్రమే మెంబర్లుగా ఎన్నుకోవలెను. కాని ఎన్నుకోవలసిన ఓటర్లు ఆ తరగతికి చెందినవారుమాత్రమేగాక ఆ వార్డులోను, లేదా ఆ సర్కిల్ లోను, చేరిన యావన్మంది ఓటర్లును అయియుందురు.)

(3) ఆంగ్లో-యిండియనులును, యూరపియనులును, ఇండియన్ క్రిస్టియనులును జనరల్ సీట్ల ఎన్నికలలో పాల్గొనరాదు.

(4) ఏయే తరగతి మెంబరు ఎన్నికలలో పాల్గొన నర్హులైన ఓటర్లు, ఆయా తరగతి ఓటరుజాబితాలలో చేర్చబడుదురు.

7. (బెలూచిస్థానమునకు సంబంధించినది.)............

8. కౌన్సిల్ ఆఫ్ స్టేటులో షెడ్యూలు తరగతుల మెంబర్ల నెన్నుకొనువారాయా రాష్ట్రశాసనసభలలో షెడ్యూలుతరగతి మెంబర్లయినవారు.

(షెడ్యూలు తరగతు లనగా ఆది ఆంధ్రులు, మాలలు, పంచములు, హరిజనులు అను మాటలతో మనము వ్యవహరించు జనులు.)

మద్రాసురాష్ట్రములో షెడ్యూలుతరగతుల జాబితా 1936 వ సంవత్సరపు షెడ్యూలుతరగతులు ఆర్డరుకు అనుబంధముగా నిచ్చియున్నాము. మద్రాసురాష్ట్రము నుండి కౌన్సిల్ ఆఫ్ స్టేటుకు షెడ్యూలు తరగతుల తరపున ప్రతినిధి నెన్నుకోవలసి యున్నదని భావింపుడు. అతని నెన్నుకొనువారు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్, లెజిస్లేటివ్ అసెంబ్లీలలో షెడ్యూలు తరగతులకు చెందియున్న సభ్యులు.

(1935 వ సంవత్సరపు చట్టము ననుసరించి భారతశాసనసభా ప్రతినిధుల నెన్నుకొనునధికారము రాష్ట్రీయసభా ప్రతినిధుల కీయబడినది. ఈ యాక్టుకు పూర్వము భారతశాసనసభలకు ఓటర్లే నూటిగా ప్రతినిధులను పంపుచుండిరి. ఇప్పు డట్లు గాదు. ఓటర్లు రాష్ట్రసభలలోని ప్రతినిధుల నెన్నుకొందురు. రాష్ట్రసభలలోని ప్రతినిధులు భారతసభలలోని ప్రతినిధుల నెన్నుకొందురు.)

9. కౌన్సిల్ ఆఫ్ స్టేటులో మహిళాప్రతినిధి నెన్నుకొనువా రాయా రాష్ట్రశాసనసభలలోని యావన్మంది స్త్రీపురుషప్రతినిధులు.

10. కౌన్సిల్ ఆఫ్ స్టేటులో ఆంగ్లో - యిండియన్, యూరపియన్, ఇండియన్ క్రిస్టియన్ సభ్యులయెన్నికకు కొన్ని ఎలెక్షన్ సంఘములు నియమింపబడినవి. ఏరాష్ట్రమునుండి అభ్యర్థుల ఎన్నుకోవలెనో, ఆ రాష్ట్ర శాసనసభలలో ఆ తరగతికి చెందిన యావన్మంది సభ్యులును యీ ఎలక్షన్ సంఘములో ఓటరులై యుందురు.

ఇద్దరు యూరపియన్ మెంబర్ల నెన్నుకోవలసినచో చెరియొక రాష్ట్రములోని ఎలక్షన్ సంఘమున్ను చెరియొకసభ్యుని ఎన్నుకొనును.

11. కౌన్సిల్ ఆఫ్ స్టేటులో మెంబరు కాగోరువాడు

(1) గవర్నరు రాష్ట్రమునకు లేక కమిషనర్ రాష్ట్రమునకు ప్రతినిధి కాగోరినచో, ఆయారాష్ట్రములలో ఓటుహక్కున్నవాడే యుండవలెను.

(2) ఆంగ్లోయిండియన్, యూరపియన్, ఇండియన్ క్రిస్టియన్ ప్రతినిధి కాగోరువాడు, ఆయాతరగతులకు సంబంధించిన నిబంధనలనుబట్టి అర్హుడై యుండవలెను.

12. కౌన్సిల్ ఆఫ్ స్టేటులో ప్రతి సభ్యుడును సాధారణముగా 9 సంవత్సరములు మెంబరై యుండును.

(దీనికి మార్పులున్నవి. 13, 14, 15, 16 నిబంధనలు చూ.)

ఆకస్మికముగా సంభవించిన ఖాళీలో మెంబరుగా నెన్నుకోబడినవారి వరకు, యెవరిస్థానే వారు మెంబరుగా నెన్నుకోబడిరో వారి వర తాఖరున అంతమొందును.

(మెంబరుగా పనిచేయుచున్నవాడు మృతుడౌటవలనగాని లేదా తన పదవికి రాజీ యిచ్చుటచేగాని, మరియే యితర కారణములచే గాని, తన పదవి వదిలివేసినపుడు వెంటనే మరియొకరిని వారిస్థానే ఎన్నుకొందురు. పై కారణములలో దేనికల్ల సంభవించిన ఖాళీలైనను ఆకస్మికపు ఖాళీ యని వ్యవహరింతుము. సభ అంతమొందినచో సంభవించు ఖాళీలు సాధారణపు ఖాళీలు. అప్పుడు సభలో యావన్మంది సభ్యులను తిరిగి ఎన్నుకొనవలసియుండును. ఫెడరల్ అసెంబ్లీ 5 ఏండ్లు గడిచి ముగియగానే అందులోని మెంబరుపదవు లన్నియు ఖాళీయగును. 5 ఏండ్లు గడువగుండనే 4 ఏండ్లు గడచినతర్వాత ఒక సభ్యుడు మృతుడయ్యెనని భావింపుడు. అతనిస్థానే ఎన్నుకోబడిన వాడు మిగతా ఒక సంవత్సరముమాత్రమే సభ్యుడై యుండును.)

13. కౌన్సిల్ ఆఫ్ స్టేటు సభ్యుల ప్రథమ యెన్నికలలో, అన్ని రాష్ట్రముల నుండియు, అన్ని తరగతులనుండియు ఎన్నుకోవలసిన యావన్మందిసభ్యులను ఎన్నుకొందురు. కాని వారిలో

1/3 వ వంతు మెంబర్లను 3 సం॥ల మెంబర్లుగాను,
1/3 వ వంతు మెంబర్లను 6 సం॥ల మెంబర్లుగాను,
1/3 వ వంతు మెంబర్లను 9 సం॥ల మెంబర్లగాను యెన్నుకొందురు.

మూడేండ్లుకాగానే 3 సంవత్సరముల మెంబర్లు యావన్మంది తమ సీట్లను గోల్పోవుదురు. వారిస్థానే క్రొత్తవారి నెన్నుకొందురు. మరి 3 ఏండ్లుకాగానే 6 సంవత్సరముల మెంబర్లు యావన్మంది తమసీట్లను గోల్పోయి క్రొత్తవారికి తావిత్తురు. ఇట్లే 3 ఏండ్లకొకతూరి 1/3 వ వంతు మెంబర్లు తమపదవులను విడిచి క్రొత్తమెంబర్లకు స్థాన మొసగుదురు.

రెండవపర్యాయపు ఎన్నికలనుండి మెంబర్లుగా వచ్చువారు 9 సంవత్సరముల సభ్యులై యుందురు.

14 పై క్రమమునకుపు విధానము రెండవపట్టీలో తెలుపబడినది.

15 ఈ క్రింద నుదాహరించిన మెంబర్ల కేర్పరచిన షరతులు.

| మెంబరు తరగతి | మెంబర్లసంఖ్య | వరతు |
|---|---|---|
| (1) ఆంగ్లో ఇండియన్లు | — | 9 సంలు |
| (2) యూరపియన్లు | 3 | 3 ,, |
| ,, | 1 | 6 ,, |
| ,, | 3 | 9 ,, |
| | 7 | |
| (3) ఇండియన్ క్రిస్టియన్లు | 1 | 3 ,, |
| ,, | 1 | 9 ,, |
| | 2 | |
| 16. గవర్నరు జనరల్ నియమించు ప్రతినిధులు. | 2 | 3 ,, |
| ,, | 2 | 6 ,, |
| ,, | 2 | 9 ,, |
| | 6 | |

## ఫెడరల్ అసెంబ్లి.

17. బ్రిటిషు ఇండియానుండి ఫెడరల్ అసెంబ్లికి మెంబర్ల నెన్నుకొనువిధానము మూడవపట్టీలో తెలుపబడినది.

18. ఏ తరగతివా రెందరు ప్రతినిధుల నెన్నుకొనవలెనో పట్టీలో తెలుపబడినది.

రాష్ట్రప్రతినిధులను గాక 4 గురు సభ్యుల నీక్రిందిసంస్థ లెన్నుకొనవలెను.

పారిశ్రామికసంఘములు, వర్తకసంఘములు, యంత్రశాలాధిపతుల సంఘములు మొదలైనవి. ఉదా. (మదరాసు చేంబర్ ఆఫ్ కామర్సు, బొంబాయి చేంబర్ ఆఫ్ కామర్సు) 3.

కార్మికసంఘములు (యంత్రశాలలలో, రైల్వేలలో యితరపరిశ్రమలలో పనిజేయు పాటకజనసంఘములు.) 1.

4

ఈ నలుగురిని ఫలాన రాష్ట్రములనుండి ఎన్నుకోవలెనను నియమములేదు.

19. ఫెడరల్ అసెంబ్లి జనరల్‌సీట్లకు మెంబర్ల నెన్నుకొనువారు ఆయారాష్ట్ర అసెంబ్లీలలోని జనరల్‌సీట్ల మెంబర్లు. సిక్కు మెంబర్ల నెన్నుకొనువారు రాష్ట్ర అసెంబ్లిలోని సిక్కు మెంబర్లు. మహమ్మదీయమెంబర్ల నెన్నుకొనువాయ రాష్ట్రఅసెంబ్లిలోని తురకమెంబర్లు.

ఆయాతరగతి మొత్తపు ఓట్లసంఖ్యలో నొక రాష్ట్రములోని ఆ తరగతి మెంబర్ల సంఖ్య యెన్నవవంతో, ఆ వంతునకు సమానమైన ఓట్లారాష్ట్రమున కీయబడును. ఒక ఓటరుతరపున మరియొకవోటరు ఓటువేయవచ్చును. అట్లు వేయుటకు ఒక ఓటరు మరియొక ఓటరున కధికార మీయవచ్చును. అధికార మిచ్చిన ఓటరుపుచ్చుకున్న ఓటరు ఒకేతరగతి ఓటరులై యుండవలెను. అధికారముపొందిన ఓటరు తన ఓటును, మరియొకని ఓటును, మొత్తము రెండుఓట్లు వేయును.

అజ్ఞానస్థితిలోని జాతులకు (కొండజాతులు మొదలగువారికి.) కేటాయించినసీట్లు జనరల్ సీట్లుగా ఎంచవలెను.

20. గవర్నరు రాష్ట్రములలో షెడ్యూలుతరగతులకు సంబంధించిన నిబంధనలు:—

(1) రాష్ట్ర అసెంబ్లి మెంబర్లుగా నెన్నబడుటకు హక్కున్నవారి కందరికిని, భారతఅసెంబ్లి మెంబరు ఎన్నికలలో ఓటిచ్చునధికార మున్నది. వీరందరును షెడ్యూలు తరగతులకు చెందినవారై యుండవలెను.

(2) వీరందరును కలిసి 4 అభ్యర్థుల నెన్నుకొందురు.

(3) ఈ 4 గురభ్యర్థులలో నొకరిని జనరల్ ఓటర్లందరును (షెడ్యూలు తరగతులకు చెందినవారు చెందనివారు) అసెంబ్లి సభ్యునిగా నెన్నుకొందురు.

ఆకస్మికఖాళీలు నింపుపద్ధతులు ప్రత్యేకముగా నేర్పరతురు.

21. మహిళాసభ్యులు:— గవర్నరు రాష్ట్రము లన్నింటిలోను రాష్ట్రఅసెంబ్లీలలో సభ్యులైయున్న స్త్రీ లందరును ఏకసంఘముగా నేర్పడి, ఏరాష్ట్రమునుండి స్త్రీ మెంబరు నెన్నుకొనవలసినను ఆరాష్ట్రమునుండి యొకవనిత నెన్నుకొని భారతఅసెంబ్లికి పంపుచుందురు.

రాష్ట్రములనుండి ఎన్నుకోవలసిన 9 గురు స్త్రీసభ్యురాండ్రలో నిద్దరైన మహమ్మదీయ వనితలును, ఒక్కతెయైన ఇండియన్ క్రిస్టియన్ వనితయు నుండవలెను.

22. ఆంగ్లోఇండియన్, ఇండియన్ క్రిస్టియన్, యూరపియను సభ్యులు: — ఆంగ్లో ఇండియన్ సీట్లకు మెంబర్లను రాష్ట్ర అసెంబ్లీలలోని ఆంగ్లో ఇండియన్ సభ్యుల ఎలక్షన్ సంఘ మెన్నుకొనును. ఇండియన్ క్రిస్టియన్ సీట్లకు మెంబర్లను రాష్ట్రఅసెంబ్లీలలోని ఇండియన్ క్రిస్టియన్ సభ్యులఎలక్షన్ సంఘ మెన్నుకొనును. యూరపియన్ సీట్లకు మెంబర్లను రాష్ట్రఅసెంబ్లీలోని యూరపియన్ సభ్యుల ఎలక్షన్ సంఘ మెన్నుకొనును.

ఆయాతరగతి మొత్తపు ఓట్లసంఖ్యలో నొకరాష్ట్రములోని ఆతరగతి మెంబర్ల సంఖ్య యెన్నవవంతో, ఆవంతునకు సమానమైన ఓట్లారాష్ట్రమున కీయబడును. ఒక

ఓటరుతరఫున మరియొక ఓటరు ఓటువేయవచ్చును. అట్లు వేయుటకు ఒక ఓటరు మరియొక ఓటరున కధికార మీయవచ్చును. అధికారమిచ్చిన ఓటరు పుచ్చుకున్న ఓటరు ఒకేతరగతి ఓటరులై యుండవలెను. అధికారముపొందిన ఓటరు తన ఓటు, మరియొకని ఓటును, మొత్తము రెండు ఓట్లు వేయును.

23. పారిశ్రామికసంఘములున్ను, కార్మికసంఘములున్ను, భూస్వాములున్ను ప్రతినిధుల నెన్నుకొనువిధానము ప్రత్యేకముగా నేర్పరుతురు.........

24. కమిషనర్ రాష్ట్రములకు సంబంధించినది............

25. ఫెడరల్ అసెంబ్లీలో జనరల్ సీటునకు మెంబరుకాగోరువాడు వానిరాష్ట్రిఅసెంబ్లీలో జనరల్ సీటుకు మెంబరుకా నర్హుడై యుండవలెను. సిక్కు, మహమ్మదీయ, యూరపియన్, ఆంగ్లోఇండియన్, ఇండియన్ క్రిస్టియన్, మహిళాసభ్యుల పదవులకు మెంబరుకాగోరువారు వారివారిరాష్ట్రి అసెంబ్లీలలో ఆయాతరగతిసీట్లకు మెంబర్లుకా నర్హులై యుండవలెను. కూర్గురాష్ట్రమునుంచి ప్రతినిధులు కాగోరువారు కూర్గరాష్ట్రి కౌన్సిల్‌లో ఆయాతరగతి సీట్లకు మెంబర్లుకా నర్హులై యుండవలెను.

26. (1) ఈనిబంధనలలో వాడిన ఈక్రిందిమాటల కర్థములు సూచించుచున్నాను.

(i) యూరపియన్:— వీని తండ్రిగాని, తాతగాని, లేదా యింకొకమూల పురుషుడుగాని, యూరపియన్ జాతికి జెందియుండవలెను. ఇతడు భారతదేశీయుడు గాడు.

(ii) ఆంగ్లో ఇండియన్:—ఇతడు భారతదేశీయుడు. వీనికిని యూరపియన్ కును ఇతరభేద మేదియు లేదు.

(iii) ఇండియన్ క్రిస్టియన్:—పై రెండుతరగతులకు చేరని క్రైస్తవమతావలంబకుడు.

(iv) షెడ్యూలు తరగతులు:—షెడ్యూలులో చేర్చిన తరగతులు.

(v) శాసించిన:—అను మాట కర్థము. చక్రవర్తిగారు వారి కౌన్సిలుతో సంప్రతించి శాసించిన, లేక గవర్నరుజనరల్ గారు శాసనసభలతో సంప్రతించి శాసించిన.

(Vi) భారతదేశీయుడు:— అనుమాట కర్థము బ్రిటిషు ఇండియాలో గాని బర్మాలోగాని స్థిరనివాస మేర్పరచుకొన్న జననీజనకులకు పుట్టినవాడు.

27. ఈచట్టమునందున్ను, చక్రవర్తిగారిశాసనములలోను ఏవిమయమునకు సంబంధించిన విధులు లేకున్నను, వానిని నిర్ణయించునధికారము గవర్నరుజనరల్ గారి కున్నది. అట్టివిమయములు మచ్చునకుమాత్రము కొన్ని తెలుపుచున్నాము:—

(1) మెంబరుపదవులలో ఖాళీలువచ్చినపుడు జరుపవలసిన ప్రకటన, ఆకస్మికపు ఖాళీలు నింపుపద్ధతులు.

(2) అభ్యర్థులను నామినేషన్ చేయుపద్ధతులు.

(3) వేరువేరువరతులకు మెంబర్ల నెన్నుకొనుపద్ధతులు, షెడ్యూలుతరగతి మెంబర్ల నెన్నుకొనుపద్ధతులు, వేరువేరురాష్ట్రములకు నెన్నవలంతు ఓట్లిచ్చునధికార మున్నదో నిర్ణయించుక్రమము.

(4) ఎన్నికలలో అభ్యర్థుల ఖర్చులు.

(5) ఎలక్షన్ నేరములు, అక్రమచర్యలు.

(6) ఫెడరల్ అసెంబ్లీ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్ మెంబర్లఎన్నికలలో వివాదముల పరిష్కరించువిధానము.

(7) నిబంధనల నములలో జెట్టు పద్ధతులు.

## 1—వ అనుబంధము

### 1-వ పట్టీ

### కౌన్సిల్ ఆఫ్ స్టేట్

ఏ ఏ రాష్ట్రమున కెందరెందరు ప్రతినిధుల నెన్నుకొను నధికారమున్నది తెలుపు పట్టీ.

| రాష్ట్రము పేరు (1) | మొత్తపు ఓట్లు (2) | జనరల్ ఓట్లు (3) | షెడ్యూలు తరగతుల వారి సీట్లు (4) | సిక్కుల సీట్లు (5) | మహమ్మదీయుల సీట్లు (6) | స్త్రీల సీట్లు (7) |
|---|---|---|---|---|---|---|
| మద్రాసు. | 20 | 14 | 1 | — | 4 | 1 |
| | | | | | ... | |
| ... | ... | ... | ... | ... | | ... |
| | | | | | ... | |
| ... | ... | ... | ... | ... | | ... |
| అన్ని రాష్ట్రముల మొత్తం | 150 | 75 | 6 | 4 | 49 | 6 |

## 2-వ పట్టీ

## కౌన్సిల్ ఆఫ్ స్టేటులో మూడేండ్లకొకతూరి 1/3 వంతు మెంబర్ల నెన్నుకొను విధానము

3 సం॥ల పక్ష్యాలు

| (1) రాష్ట్రము పేరు | (2) జనరల్ సీట్లు | (3) షెడ్యూల్డు తరగతుల సీట్లు | (4) సిక్కు సీట్లు | (5) మహమ్మదీయుల సీట్లు | (6) స్త్రీల సీట్లు |
|---|---|---|---|---|---|
| మదరాసు | ... | ... | ... | ... | ... |
| ... | ... | ... | ... | ... | ... |
| | | | | ... | |
| ... | ... | ... | ... | | ... |
| అన్ని రాష్ట్రముల మొత్తము | 22 | 2 | 2 | 18 | 2 |

6-సం॥ల పక్ష్యాలు

| రాష్ట్రము పేరు | (7) జనరల్ సీట్లు | (8) షెడ్యూల్డు తరగతుల సీట్లు | (9) సిక్కు సీట్లు | (10) మహమ్మదీయుల సీట్లు | (11) స్త్రీల సీట్లు |
|---|---|---|---|---|---|
| మదరాసు | 7 | ... | ... | 2 | ... |
| ... | ... | ... | ... | ... | ... |
| ... | ... | ... | ... | ... | ... |
| అన్ని రాష్ట్రముల మొత్తము | 28 | 2 | 2 | 15 | 2 |

9 సంll సభ్యులు

| రాష్ట్రము పేరు | (12) జనరల్ సీట్లు | (13) షెడ్యూలు తరగతుల సీట్లు | (14) సిక్కు సీట్లు | (15) మహమ్మదీయుల సీట్లు | (16) స్త్రీల సీట్లు |
|---|---|---|---|---|---|
| మదరాసు | 7 | 1 | ... | 2 | ... |
| ... | ... | ... | ... | ... | ... |
| ... | ... | ... | ... | ... | ... |
| అన్ని రాష్ట్రముల మొత్తము | 25 | 2 | ... | 16 | 2 |

3 వ పట్టీ

ఫెడరల్ అసెంబ్లికి బ్రిటిషు ఇండియా ప్రతినిధులు

| రాష్ట్రము (1) | మొత్తపు సీట్లు. (2) | జనరల్ సీట్లు. మొత్తం (3) | షెడ్యూల్ తరగతులకు కేటాయించిన (4) | సిక్కు సీట్లు. (5) | మహమ్మదీయుల సీట్లు (6) | ఆంగ్లో ఇండియన్ సీట్లు. (7) |
|---|---|---|---|---|---|---|
| మదరాసు | 37 | 19 | 4 | — | 8 | 1 |
| ... | ... | ... | ... | ... | ... | ... |
| ... | ... | ... | ... | ... | ... | ... |
| అన్ని రాష్ట్రముల మొత్తము. | 250 | 105 | 19 | 6 | 82 | 4 |

| యూరపియన్ల సీట్లు (8) | ఇండియన్ క్రిస్టియన్ సీట్లు. (9) | పారిశ్రామిక ప్రతినిధుల సీట్లు. (10) | భూస్వాముల సీట్లు. (11) | కార్మిక ప్రతినిధుల సీట్లు. (12) | స్త్రీల సీట్లు (13) |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 2 | 1 | 1 | 2 |
| ... | ... | ... | ... | ... | ... |
| ... | ... | ... | ... | ... | ... |
| 8 | 8 | 11 | 1 | 10 | 9 |

# 1935 సం. పు ఇండియాపరిపాలనా చట్టము

---

## ౫ - వ అనుబంధము

## రాష్ట్రీయశాసనసభలో ప్రతినిధుల నెన్నుకొను విధానము

విధి

1. (1) రాష్ట్రీయ లెజిస్లేటివ్ అసెంబ్లీలోకాని లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో కాని మెంబరు కాగోరువారు, బ్రిటిషు సబ్జెక్టు, లేక స్వతంత్ర ప్రభువు, (బ్రిటిషు ఇండియా స్వతంత్రరాజ్యముల సమ్మేళన కంగీకరించిన ప్రభువు) లేక ఆప్రభు దేశమందలి ప్రజల లోనివారై యుండవలెను.

ఏ రాష్ట్రసభలలోనైన ఫలానదేశపు ప్రభువున్ను, అతనిప్రజలు మాత్రమే సభ్యులై యుండనర్హులని నిరూపణ జరుగవచ్చును.

(2) అసెంబ్లీసభ్యుల వయస్సు కనీసము పాతికేండ్లుండవలెను. కౌన్సిలు సభ్యులవయస్సు కనీసము ముప్పదియేండ్లుండవలెను.

(3) అభ్యర్థులైనిల్చుట కధికార ముండవలెను.

(సాధారణముగా నొక ఎలక్షన్ ఖండములో ఓటున్నవారు ఆఖండపు ఎన్నికలలో సభ్యర్థులై నిలువవచ్చును.)

2. మెంబరుపదవిలో నున్నవారి పదవీ తాఖురున తిరిగి వారినే సభ్యునిగా నెన్నుకొనవచ్చును.

లెజిస్లేటివ్ అసెంబ్లీ

3. ఏయేతరగతివా రెందరు సభ్యుల నెన్నుకోవలెనో యీ అనుబంధము చివర నిచ్చిన 1 వ పట్టీలో తెలుపబడినది.

4. వివరము లన్నియు పట్టీలో చూడనగును.

5. ప్రతిరాష్ట్రమును పెక్కు ఎలక్షన్‌ఖండములుగా విభాగింతురు. జనరల్ సీట్లకు మెంబర్ల నెన్నుకొనుటకై ప్రత్యేకఖండము లేర్పరుతురు. అట్లే సిక్కు, మహమ్మదీయ, ఆంగ్లో ఇండియన్, యూరపియన్, ఇండియన్ క్రిస్టియన్ సభ్యుల ఎన్నికలకై, ఏతరగతి కాతరగతికి ప్రత్యేకముగా ఎలక్షన్ ఖండము లేర్పరుతురు.

ఏ తరగతి మెంబర్ల యెన్నికకైన రాష్ట్రి మంతయు నేకఖండముగా నియమింప వచ్చును. అజ్ఞానస్థితిలోని కొన్నిభాగముల నే ఖండములోను చేర్చరాదని ఆంగ్ల ప్రభుత్వము శాసింపవచ్చును. ఆయాతరగతి మొత్తపుసీట్ల సంఖ్యను ఆతరగతి ఖండముల సంఖ్యచే విభాగించి, ప్రతిఖండమునకు ఒకరినికాని పలువురను కాని సభ్యుల నెన్నుకొను నధికార మీయవలెను.

6. వీలైనంతవరకు ప్రతి జనరల్ సీటు ఖండములోను షెడ్యూలు తరగతులకు కేటాయించిన సీటు ఒక్కటియైన నుంచవలెను. కాని ప్రతి జనరల్ సీటు ఖండములలోను అట్లు కేటాయించరని సీటు ఒక్కటియైన నుండితీరవలెను.

7. జనరల్ సీట్లలో కొన్ని షెడ్యూలుతరగతుల మెంబర్లకు కేటాయించినచో, ఒక్కొక్క మెంబరు ఖాళీకి నలుగురేసి అభ్యర్థుల చొప్పున షెడ్యూలు తరగతి ఓటర్లెన్ను కొనవలెను. ఈ నలుగురిలో నొకరిని మెంబరుపదవి కెన్నుకొందురు. ఈ నలుగురిలో నొకరినిగాక పైవారిని మెంబరుపదవి కెన్నుకోరాదు

ఈ నలుగురిలోను ఒకరుగా ఎన్నుకోబడనివారా ఎలక్షన్ ఖండములో మరి యొక జనరల్ సీటుకు కూడ (షెడ్యూలు తరగతులకు కేటాయింపని జనరల్ సీటుకు) అభ్యర్థులై నిలువరాదని శాసన మేర్పరుపవచ్చును.

ఆకస్మికపుఖాళీలునింపు సందర్భములలో కూడ పై విధులు గమనింపవలెను.

8. మహిళాసభ్యుల ఎన్నికలలో

(1) పై 5 వ విధిప్రకార మేర్పర్చిన ఖండములు, లేదా

(2) ప్రత్యేకముగా మహిళల ఎన్నికలకై ఏర్పర్చిన ఖండములును, పాల్గొన వలెను.

9. 6 వ అనుబంధమునను సరించి ఓటున్నవాడు వానికి ఓటున్న ఎలక్షన్ ఖండపు ఎన్నికలలో పాల్గొన నర్హుడు.

10. (1) అజ్ఞానస్థితిలోని జాతులతరపు ప్రతినిధుల నెన్నుకొనుపద్ధతులు.

(2) కార్మికులు, వర్తకులు, పారిశ్రామికులు, భూస్వాములు, విశ్వవిద్యాలయములు మున్నగు సంస్థలతరపు ప్రతినిధుల నెన్నుకొనువిధానము,

(3) ............(బీహారునకు సంబంధించినది.) చట్టమునను సరించి నిర్ణయింపబడును.

ఏ రాష్ట్రములోనైన పై (1) వ తరగతికి సీట్లు జనరల్ సీట్లుగా నెన్నబడ వచ్చును.

11. (పంజాబునకు సంబంధించినది.)...............

12. (1) మహిళలు, యూరపియన్లు, ఇండియన్ క్రిష్టియనులు అజ్ఞానస్థితిలోని జాతులు, వర్తకులు, పారిశ్రామికులు, కార్మికులు, యూనివర్సిటీలు వీరి తరఫు ప్రతినిధుల కుండవలసిన అర్హతలు ప్రత్యేకముగా నిరూపింపబడినవి. (1936 సం॥పు ఇండియా గవర్నమెంటు ఆర్డరు చూ.)

(2) తక్కిన సీట్లకు ఆయా ఎలక్షన్ ఖండములలో వోట్లున్నవా రెల్లరు అభ్యర్థులై నిలువవచ్చును. లేదా, ఆతరగతికి చెందిన ఆ రాష్ట్రములోని మరియొక ఖండములో వోటున్నవారు అభ్యర్థులై నిలువవచ్చును.

[ఉదా. మద్రాసురాష్ట్రములో అమలాపురము జనరల్ సీటుకు అభ్యర్థిగా నిలువ నర్హులైనవారు అమలాపురము ఎలక్షన్ ఖండములోని వోటర్లున్ను, ఆ రాష్ట్రములో యింకేజనరల్ ఎలక్షన్ ఖండములోనైన వోటు హక్కున్నవారున్ను]

పై అధికారములేనివా రభ్యర్థులై నిలువరాదు.

లెజిస్లేటివు కౌన్సిలు.

13. లెజిస్లేటివు కౌన్సిలుసభ్యుల నేయేతరగతివా రెంతర నెన్నుకోవలెనో యీఅనుబంధమునకు చేర్చిన 2 వ పట్టీలో తెలుపబడినది.

14. వివరములు తెలియగోరువారు పట్టీచూడనగును.

15. ప్రతిరాష్ట్రమును పెక్కు ఎలక్షన్ ఖండములుగా విభాగింతురు. జనరల్ సీట్ల మెంబర్ల నెన్నుకొనుటకై ప్రత్యేక ఖండము లేర్పరతురు. అట్లే మహమ్మదీయ, యూరపియన్, ఇండియన్ క్రిస్టియన్ సభ్యుల ఎన్నికలకై, ఏ తరగతి కాతరగతికి ప్రత్యేకముగా ఎలక్షన్ ఖండముల నేర్పరతురు. ఏ తరగతి మెంబర్ల ఎన్నికకైన రాష్ట్రమంతయు నేకఖండముగా నియమింపవచ్చును. అజ్ఞానస్థితిలోని కొన్ని భాగము లే ఖండములోను చేర్చరాదని ఆంగ్లప్రభుత్వము శాసింపవచ్చును. ఆయాతరగతి మొత్తపుసీట్ల సంఖ్యను ఆ తరగతి ఖండములసంఖ్యచే విభాగించి, ప్రతి ఖండమునకు ఒకరినికాని పలువురనుకాని సభ్యుల నెన్నుకొనునధికార మీయవలెను.

16. మహమ్మదీయ ఖండములలో ఓట్లున్నవారున్ను, యూరపియన్ ఖండములలో ఓట్లున్నవారున్ను, ఇండియన్ క్రిస్టియన్ ఖండములలో ఓట్లున్నవారున్ను, జనరల్ సీట్ల ఎన్నికలలో పాల్గొన నర్హులుకారు.

*మహమ్మదీయమెంబర్ల నెన్నుకొనుటకు హక్కున్నవారు మహమ్మదీయ ఓటర్లు మాత్రమే. ఇండియన్ క్రిస్టియన్ మెంబర్ల నెన్నుకొనుటకు హక్కున్నవారు ఇండి

యన్ క్రిస్టియన్ ఓటర్లుమాత్రమే. యూరపియన్ మెంబర్ల నెన్నుకొనుటకు హక్కున్నవారు యూరపియన్ ఓటర్లుమాత్రమే.

17. లెజిస్లేటివు కౌన్సిలు మెంబర్ల నెన్నుకొను ఓటర్ల కుండవలసిన అర్హతలు, మెంబర్ల కుండవలసిన అర్హతలు నిరూపింపబడినవి.

18. సాధారణముగా లెజిస్లేటివ్ కౌన్సిలులోని ప్రతి సభ్యుడున్ను 9 సం॥వరకు మెంబరై యుండును. కాని మూడేండ్ల కొకతూరి సభ్యులలో మూడవవంతు తమ పదవులవిడిచి క్రొత్తవారికి స్థాన మిత్తురు. ఈ క్రమమంతయు గవర్నరుగారు నిర్ణయింతురు.

ఆకస్మికముగా సంభవించిన ఖాళీలలో మెంబరుగా నెన్నుకోబడినవారి వరతు, ఎవరిస్థానే వీరు మెంబరుగా నెన్నుకోబడిరో వారి వర తాఖుగన అంతమొందును.

19. ఈ అనుబంధములో వాడిన యూరపియన్, ఇండియన్ క్రిస్టియన్, మహమ్మాలు తరగతులు అను మాటల కర్థము 1 వ అనుబంధములో తెల్పినదే.

అజ్ఞానస్థితిలోని ప్రదేశములు, జాతులు ఆంగ్లప్రభుత్వము నిర్ణయించును.

శాసించిన అనుమాట కర్థము చక్రవర్తిగారు కౌన్సిలుతో సంప్రతించి శాసించిన లేదా ఉభయరాష్ట్రి శాసనసభలున్ను శాసించిన.

20. ఈ చట్టములోను, చక్రవర్తిగారి శాసనములలోను, ఉభయరాష్ట్రిసభా శాసనములలోను, ఏ విషయమునకు సంబంధించిన విధులు లేకున్నను, వాని నేర్పర్చు నధికారము గవర్నరుగారి కున్నది.

పై విధుల నాచరణలో పెట్టుటకు వలయు నియమములు గవర్నరుగారు నిర్ణయింపవలెను.

## 5–వ అనుబంధము

## 1935 సం. పు ఇండియా పరిపాలనాచట్టము

### 1-వ పట్టి

### రాష్ట్ర లెజిస్లేటివ్ అసెంబ్లీలోని మెంబర్ల నెన్నుకొను విధానము

| రాష్ట్రము | మొత్తపు సీట్లు | జనరల్ సీట్లు: మొత్తపు జనరల్ సీట్లు | జనరల్ సీట్లు: షెడ్యూలు తరగతులకు కేటాయించిన జనరల్ సీట్లు | అజ్ఞానస్థితిలోని జాతులకు కేటాయించిన సీట్లు | సిక్కు సీట్లు | మహమ్మదీయుల సీట్లు | ఆంగ్లో యిండియన్ సీట్లు | యూరపియన్ సీట్లు | ఇండియన్ క్రిస్టియన్ సీట్లు |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
| మద్రాసు | 215 | 146 | 30 | 1 | — | 28 | 2 | 3 | 8 |

| రాష్ట్రము | వర్తకుల, పారిశ్రామికుల తరఫు సీట్లు | భూస్వాముల సీట్లు | యూనివర్సిటీల సీట్లు | కార్మికుల సీట్లు | స్త్రీల సీట్లు: జనరల్ సీట్లు | స్త్రీల సీట్లు: సిక్కు సీట్లు | స్త్రీల సీట్లు: మహమ్మదీయుల సీట్లు | స్త్రీల సీట్లు: ఆంగ్లో యిండియన్ల సీట్లు | స్త్రీల సీట్లు: ఇండియన్ క్రిస్టియన్ల సీట్లు |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |
|  | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) |
|  | 6 | 6 | 1 | 6 | 6 | — | 1 | — | 1 |

## 1935 సం.పు ఇండియా పరిపాలనా చట్టము

### 2 వ పట్టీ

### రాష్ట్ర లెజిస్లేటివు కౌన్సిలులోని మెంబర్ల నెన్నుకొను విధానము

| రాష్ట్రము (1) | మొత్తపు సీట్ల సంఖ్య (2) | జనరల్ సీట్లు (3) | మహమ్మదీయ సీట్లు (4) | యూరపియన్ సీట్లు (5) | ఇండియన్ క్రిస్టియన్ సీట్లు (6) | అసెంబ్లీ వారెన్నుకొను మెంబర్ల సంఖ్య (7) | గవర్నరు నియమించు మెంబర్ల సంఖ్య (8) |
|---|---|---|---|---|---|---|---|
| మద్రాసు | 54 నకు లోపించరాదు. 56కు మించరాదు | 35 | 7 | 1 | 3 | — | 8 గురికి లోపించరాదు. 10 మందికి మించరాదు |

# 1935 వ సంవత్సరపు ఇండియా పరిపాలనా చట్టము.

---

## 6–వ అనుబంధము 1–వ భాగము.

నిబంధన.

1. ఏ ఎలక్షన్‌ఖండమున కాఖండము వేరుగా నొక ఓటరుజాబితా యుండవలెను. ఆ ఓటరుజాబితాలో పేరున్నవారు ఆఖండమునకు సంబంధించిన ఎలక్షన్‌లో పాల్గొన నర్హులు. జాబితాలో పేరులేనివారు ఎలక్షనులో పాల్గొన నర్హులుకారు.

2. ఫలానితేదీని ఓటుహక్కున్నవారి పేర్లన్ని జాబితాలలో చేర్చవలసినదని గవర్నరుగారు నిర్ణయింతురు. అట్టి నిర్ణయమునుబట్టి క్రొత్తగా తయారుచేయు జాబితాలు సమకూర్చవలెను; ప్రాతవి సవరింపవలెను.

(2-7-1936 వ తేదీని ఓటు హక్కున్నవారిపేర్లు జాబితాలలో చేర్చవలసినదని గవర్నరుగారు నిర్ణయించినారు.)

3. 21 సంవత్సరములవయస్సు పూర్తిగానివాడు ఓటరుగానుండ నర్హుడుకాడు. ప్రతిఓటరును బ్రిటిషుసబ్జక్టు అయియుండవలెను; లేదా స్వతంత్రప్రభువైన అతనిప్రజల లోనివాడైన కావలెను;

(ఆ స్వతంత్రప్రభువు బ్రిటిషుఇండియా స్వతంత్రరాజ్యముల సమ్మేళన కంగీకరించినవాడై యుండవలెను.) లేదా మరి యేయితర స్వతంత్రప్రభువైన, అతనిప్రజల లోనివాడైన కావలెను. ఈ కడపటితరగతికి చెందినవానికి ఓటుహక్కున్నట్లు క్రమమైన శాసన ముండవలెను.

4. ఏ కోర్టులోనైన మతిహీనులుగా నిర్ణయింపబడినవారు ఓటర్లుగానుండ నర్హులుగారు.

5. సిక్కుఖండములో సిక్కులుకానివా రెవరును ఓటరులై యుండరాదు. మహమ్మదీయఖండములో మహమ్మదీయులు కానివా రెవరును ఓటరులై యుండరాదు. అట్లే ఆంగ్లోఇండియను, యూరపియను, ఇండియన్‌క్రిస్టియన్ ఖండములలో ఆతరగతులకు చెందనివా రెవరును ఓటరులై యుండరాదు.

6. ఈ పైతరగతుల ఖండములలో దేనిలోనైన ఓటరుగా నున్నవారు జనరల్ సీట్ల ఖండములలో ఓటరుగా నుండరాదు.

7. ఒక ఖండములోని ఓటరు మరియొక ఖండములో ఓటరుగా నుండరాదు. ఈ విధి నమలులో పెట్టు నేర్పాట్లు ప్రతిరాష్ట్రములోను జరుపవలెను. ఏ ఓటరైన యిందులకు వ్యతిరేకముగా పెక్కు ఖండములలో ఓట్లు వేసినచో నతడు వేసిన ఓట్లన్నియు నిరర్థకములగును. స్త్రీ సభ్యురాండ్ర యెన్నికల నిమిత్త మేర్పరచిన ఖండములలో ఓటర్లైయున్నవారు వేరుఖండమందు కూడ ఓటర్లయి యుండవచ్చును.

8. ఎలక్షన్ నేరములు లేక అక్రమచర్యలు చేసినవారు ఓటర్లుగా నుండరాదు. అట్టివారిపేర్లు వెంటనే జాబితాలలో కొట్టివేయవలెను. ఈ కళంకము నాపాదించు నేరము లేవియో నిరూపణ చేయబడును.

9. ద్వీపాంతరవాసశిక్ష లేక ఖైదుశిక్ష ననుభవించుచున్నవారు ఓటర్లుగా నుండరాదు.

10. భర్తల హక్కులననుసరించి ఓట్లు పొందిన స్త్రీలు:

(1) భర్తహక్కునుబట్టి ఒక స్త్రీ పేరు జాబితాలో చేర్చిన పిదప, ఆమె భర్త మరణించినను ఆమె ఓటుకు భంగము రాదు. కాని ఆమె పునర్వివాహము చేసుకొన్నచో ఓటు నశించును. ఓటుహక్కునకు భంగకరములగు పరిస్థితు లేర్పడినచో, (ఉదా. ఆమెకు ఖైదుశిక్ష పడినచో) ఆమె ఓటు పోవును.

(2) ఏ పురుషునికైన పలువురు భార్యలున్నను ఒకరి పేరు మాత్రమే జాబితాలో చేర్తురు. ఏ భార్యపేరు చేర్పవలసినదో నిర్ణయించుక్రమ మేర్పరతురు.

ఓట్లజాబితాలో చేరిన స్త్రీ భర్తమరణానంతరము నివాసము మార్చినచో ఆమె క్రొత్తనివాసమునకు చెందిన జాబితాలో నామె పేరు చేర్చి వెనుకటి నివాసపు జాబితాలో నామెపేరు తొలగింపవలెను.

11. మరియొకరి తరపున గార్డియన్‌గా లేక మేనేజరుగా లేక ట్రస్టీగా పన్నులు చెల్లించినవాడును ఆస్తులు భుక్తపరచుకొనువాడును ఓటరుగానుండ నర్హుడుగాడు.

12. ఈ అనుబంధములో బ్రిటిషుసైనికులకు సంబంధించిన నిబంధనలు పోలీసు వారికిని అనువర్తించును.

ఈ అనుబంధములో వాడిన ప్రయోగములు.

13. (1) "ఎలెక్షన్ ఖండము" అనగా 5వ అనుబంధములో 5, 8 నిబంధనలందు తెలిపిన ఖండములలో నొకటి. "యూరపియన్", 'ఆంగ్లోఇండియన్' 'ఇండియన్ క్రిస్టియన్' "షెడ్యూల్ తరగతులు" అనుప్రయోగముల కర్థము ఒకటవ అనుబంధములో తెలిపినదే.........(బీహారునకు సంబంధించినది) "వ్యక్తి" అనుమాట వ్యక్తి

సమూహములకు వర్తింపదు. "శాసించిన" అను మాట కర్థము 5వ అనుబంధములో తెలిపినదే. "వెనుకటియార్థికసంవత్సరము" "వెనుకటిఫసలీ" అనగా పై 2 వ రూలు ననుసరించి నిర్ణయించిన తేదీకి వెనుకటిసంవత్సరము ఫసలీ యని గ్రహింపవలెను. (ఆర్థికసంవత్సరమనగా ఏప్రిల్ 1 వ తారీఖున ప్రారంభమై మరుసటి సంవత్సరము మార్చి 31వ తేదీతో నంతమయ్యే సంవత్సరము. 2 వ రూలుననుసరించి గవర్నరుగారు నిర్ణయించిన తేదీ 2-7-1936 ఆ తేదీకి వెనుకటి ఆర్థికసంవత్సరమనగా 1-4-1935వ తేదీని ఆరంభమై 31-3-1936 తేదీతో అంతమయ్యే సంవత్సరము. ఫసలీ జూలై 1వ తేదీని ప్రారంభమై మరుసటి సంవత్సరము జూన్ 30వ తేదీతో నంతమొందును. 2-7-1936 వ తేదీకి వెనుకటి ఫసలీ అనగా 1-7-1935 వ తేదీని ప్రారంభమై 30-6-1936 తేదీతో అంతమయ్యే ఫసలీ అన్నమాట) "ఇల్లు" అని వాడినచోట యింటిలోని వాటాలనుగూర్చి ప్రసంగించినట్లే భావింపవలెను. ఇంటిలోగాని లేక యింటి వాటాలోగాని కాపురమున్నను, యెట్టివ్యాపారము సాగించినను, ఓటుహక్కు నిర్ణయమునకు సమానమే. "చదువుకొన్నవాడు" అనగా యేభాషలోనైన చదువను, వ్రాయను నేర్చినవాడు. ఆభాష ఇండియాదేశములో యేప్రాంతమందైన వాడుకలో నుండవలెను "కాంటన్మెంటు" అనుమాటకర్థము 1924వ సంవత్సరపు కాంటన్మెంట్ల చట్టములో. నిరూపించినది. (కాంటన్మెంటనగా సేనలుంచు ప్రదేశము. ఉదా. బెంగుళూరు)

(2) ఎలెక్షన్ఖండములలో ఏ ఖండములు నగర ఖండములో ఏ ఖండములు గ్రామఖండములో ఇండియా కౌన్సిల్ వారు నిర్ణయింతురు. (కొన్ని కొన్ని పట్టణముల ప్రాముఖ్యమునుబట్టి పట్టణ మొక్కొక్క ఖండముగాగాని, లేక రెండు పట్టణములుచేర్చి యొక ఖండముగాగాని యేర్పరచినారు. మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీకి కాకినాడ ప్రత్యేకముగా నొక ఖండము. ఆ ఖండమునకు ఓటర్లు ఆ పట్టణములోని ఓటర్లే. బెజవాడ, బందరు పట్టణములు రెండునుజేరి యొకఖండము. వీనిని నగరఖండము లని వ్యవహరింతురు. కొన్ని తాలూకాలు లేక కొన్ని డివిజన్లు చేరి యేకఖండముగా నియమింపవచ్చును. ఆ డివిజన్లు లేక ఆ తాలూకాలు చేరియున్న గ్రామములన్నింటిలోను నివసించు ఆ ఓటర్లకు ఆఖండపు యెన్నికలలో పాల్గొను నధికారమున్నది. అట్టి ఖండములను గ్రామఖండము లని వ్యవహరింతురు.)

ఏ యూరపియన్ ఖండమైన, లేక ఏ ఆంగ్లో ఇండియన్ ఖండమైన, లేక ఏఇండియన్ క్రిస్టియన్ ఖండమైన ఒకేఖండము కొన్ని సందర్భములలో నగరఖండముగాను, కొన్ని సందర్భములలో గ్రామఖండముగాను పరిగణింపవలసిన దని ఇండియాకౌన్సిలు శాసింపవచ్చును.

(3) ఆదాయపుపన్ను చెల్లించు కంపెనీలలో భాగస్వాములై యున్నవారు ప్రత్యేకముగా ఓటుహక్కు పొందవచ్చును. ఆ భాగస్వామి వంతునకు వచ్చు నాదాయము ఆదాయపుపన్ను చట్టములో నేర్పరచిన కనీసపు మొత్తమునకు మించియుండవలెను (ప్రస్తుతము రు 2,000 లకు లోపుగా ఆదాయము వచ్చువారిపై పన్ను విధింపరాదని నియమ మున్నది. ఓటరు కాగోరు భాగస్వామి వాటా రాబడి రు. 2,000 లకు తగ్గియుండరాదు.)

(4) ఏ వ్యక్తియైన సిక్కు అవునా కాదా అను వివాద వచ్చినచో, అతడు సిక్కు నని తెలుపుకొనినయెడల యింక నా విషయము సంశయింపరాదు.

(5) పింఛను పుచ్చుకొన్న లేక పని చాలించిన సైనికులకు సంబంధించిన విధులు పనిలోనుండి తప్పింపబడినవారికి అనువర్తింపవు. ఇండియాచట్టము మారి ఆ స్థానే క్రొత్తచట్ట మేర్పడినచో, యీ విధులలో యిండియాచట్టమును గూర్చి చేసిన ప్రసంగ మా క్రొత్తచట్టమును గూర్చి చేసినట్లే యోచింపవలెను.

---

## 1935 వ సంవత్సరపు ఇండియా పరిపాలనాచట్టము.

### 6–వ అనుబంధము 2–వ భాగము.

### మదరాసురాష్ట్రములో ఓటర్ల కుండవలసిన యోగ్యతలు.

**నిబంధన.**

1. ఏ ఖండములోనైన ఓటరుగా చేరగోరువా డాఖండములోని ఒక యింటియందు వెనుకటి ఆర్థికసంవత్సరములో 120 రోజులైన వసించియుండవలెను. (గవర్నరుగారు ఓటుహక్కు నిరూపణకై యేర్పాటుచేసిన తేదీ 2-7-1936. ఆ తేదీకి వెనుకటి ఆర్థిక సంవత్సరము 1-4-35—31-3-36 తేదీలనడుమ నున్నది. ఆ సంవత్సరములో 120 రోజులైన ఓటరు ఎలక్షన్ ఖండములో నివసించియుండవలెను. ఒకడు విశాఖపట్టణపు ఖండములో ఓటరుగా చేరగోరుచున్నట్లు భావింపుడు. అతడు విశాఖపట్టణపు మునిసిపాలిటీలోని ఒక గృహమందు 1-4-35—31-3-36 తేదీలనడుమ 120 రోజులైన నివసించియుండవలెను. అట్లు నివసింపనివాడు ఓటరుగా చేరరాదు.)

పగలు గృహమునసుండక రాత్రి అట్టిగృహములో నిద్రించువాడు దానిలో నివసించుచున్నట్లే. అత డింటికి తాళమువేసి బయటకు వెళ్లుటచేగాని, మరియొకయింటిలో వసించుచున్నయెడలగాని, మొదటియింట్లో వసించుటలేదని భావింపరాదు. తాను

కోరినపుడు తాళముతీసి యింటిలోనికివచ్చి నివసించుట కధికార మున్నచో, ఆగృహ మాతని నివాసస్థాన మనియే పరిగణింపవలెను.

2. వెనుకటి ఆర్థికసంవత్సరములో యీ క్రిందిపన్నుల చెల్లించినవారికి ఓటు హక్కున్నది.

(1) మోటారుచట్టమునను సరించి వెనుకటి సంవత్సరములో పూర్తిగా మోటారు పన్ను చెల్లించినవారు.

(2) ఏ మునిసిపాలిటీలోనైన, యే లోకల్ బోర్డులోనైన, యే కాంటన్ మెంటులోనైన వెనుకటి ఆర్థికసంవత్సరములో రెండు అర్ధసంవత్సరములకును వృత్తి పన్ను చెల్లించినవారు.

(3) ఏ మునిసిపాలిటీలోనైన, ఏ కాంటన్ మెంటులోనైన వెనుకటి ఆర్థిక సంవత్సరములో రెండర్ధసంవత్సరములకు ఆస్తిపై పన్ను చెల్లించినవారు.

ఉదా:—ఇంటిపన్ను.

(4) ఏ లోకల్ బోర్డులోనైన వెనుకటి ఆర్థికసంవత్సరములో రెండర్ధసంవత్సరములకు యింటిపన్ను చెల్లించినవారు.

(5) పన్నులు సక్రమముగా చెల్లింపబడిన యింటి నద్దెకు పుచ్చుకొని ఒక్కడే సంవత్సర మంతయును నివసించినవాడు.

(6) ఆదాయపుపన్ను చెల్లించువారు.

(పై పన్నులు యింత మొత్తమునకు మించియుండవలెనని నియమములేదు. ఎంత తక్కువ మొత్తమైన పై పన్నులలో నేదియో యొకటి చెల్లించుచున్న ప్రతివారును ఓటు హక్కున్నవారే. ఇల్లు అద్దెకు పుచ్చుకొన్నవాడు మాసమున కింత అద్దె యిచ్చువాడే ఓటరుగా నుండ నర్హుడనికాని అంతకు తక్కువ నద్దెనిచ్చువాడు ఓటరుగానుండ నర్హుడు కాడనికాని నియమములేదు. ఇంటిపన్నును చెల్లించువాడు తానా యింటిలో నివసింపక ఇతరుల కద్దెకిచ్చినచో పన్నులు చెల్లించువాడును, అద్దెకు పుచ్చుకొన్నవాడును ఉభయులున్ను ఓటర్లజాబితాలో చేరుటకు పాత్రు లగుదురు.)

3. ఈ క్రిందివారికి గూడ ఓటు హక్కున్నది.

(1) 1908 వ సంవత్సరపు మద్రాసు ఎస్టేట్సు ల్యాండ్ ఆక్టు ననుసరించి భూస్వామి, లేక యీనాందారు, లేక జిరాయితీపట్టాదారు, లేక సాగు హక్కున్న రహితుగా నమోదై యున్నవారు. వెనుకటి ఫసలీ ఆఖరు రోజున వారిపేరు నమోజులో చేరియుండవలెను. (వెనుకటి ఫసలీ ఆఖరురోజు 30-6-36. ఆ తేదీని వారిపేరు నమోజులోనున్నచో వారికి ఓటు హక్కుండును).

(2) వెనుకటి ఫసలీలో గవర్నమెంటుకు నివేశనస్థలమునుగూర్చి పన్నుగట్టిన వారు. (పన్నుమొత్త మింత యుండవలెనని నిర్ణయము లేదు.)

(3) ............మలబారునకు సంబంధించినది.

(4) వెనుకటిఫసలీలో ఖండగుత్త కవులునుబట్టి, లేదా రిజిస్ట్రీ కవులునుబట్టి, యితరులభూమి భుక్తమం దుంచుకొన్నవారు. సాలీనా సిస్తు నగరఖండములలో రు. 100 లకు, గ్రామఖండములలో రు. 50 లకు లోపుగా నుండరాదు.

4. (1) పై 3 (1) రూలు జాయింటు నమోజున్నవారికి అనువర్తింపదు. అట్టి వారికి అనువర్తించువిధుల నీ దిగువ తెలుపుచున్నాము.

(2) అగ్రహారము యీనాములు (గ్రామమంతయు నొక్క పర్యాయము యీనాముగా నొసగబడినవి) పలువురిపేర జాయింటుగా నమోదైయున్నచో, వారివల్ల వచ్చు రు. 500 రాబడి కొక్కొక ఓటరుచొప్పున జాబితాలో చేర్చవలెను.

(3) మైనరు యీనాములు, రైతువారీపట్టాలు, ఎస్టేటుపట్టాలు పలువురిపేర జాయింటుగా నమోదైయున్నచో ఒకపట్టావల్ల చెల్లవలసిన ప్రతి రు. 50 పన్నునకు, ఒకొక్క ఓటరుచొప్పున జాబితాలో చేర్చవలెను.

(4) తక్కినసందర్భములలో జాయింటు నమోజుదార్ల పేర్లలో నొక్కరిపేరైనను జాబితాలో చేర్చవలెను.

(5) జాయింటునమోజుదారులలో నధికసంఖ్యాకు లెవరిపేరు చేర్చమని కోరుదురో అట్టివారిపేరు జాబితాలో చేర్చవలెను.

5. పైవిధుల-ననుసరించి మైనర్లకు ఓటుహక్కు లుండియున్న వారికి యుక్తవయస్సు లేనికారణముచే ఓట్లజాబితాలో చేర్చుటకు వీలులేనపుడు, ఆమైనరుతరపున వ్యవహరించు గార్డియనును ఓటరుగా చేర్చవలెను. (17 సంవత్సరములు వయస్సున్నవాడు మోటారుపన్నును చెల్లించుచున్నాడని భావింపుము, అతనికి ఓటుహక్కున్నదిగాని 21 సంవత్సరములు పూర్తిగాని కారణముచే అతనిపేరు జాబితాలో చేర్చుటకు పై 3వ నిబంధన అంగీకరింపదు. అట్టిసందర్భములలో నతని వ్యవహారమును చక్కబెట్టు గార్డియనును అతనిస్థానే ఓటరుగా చేర్చవలెను. కొన్ని సందర్భములలో తప్ప సాధారణముగా 18 సంవత్సరములు నిండినతోడనే మైనారిటీ తీరిపోయి స్వంతవ్యవహారములు చక్కబెట్టుకొనుటకు ప్రతివాడును స్వతంత్రు డగును. 18 సంవత్సరములు దాటినపిమ్మట అతనికి గార్డియను యెవరున్ను ఉండరు. కాని 3వ నిబంధననుబట్టి అతనికి 21 సంవత్సరములు వయస్సు నిండిననేగాని అతడు ఓటరుగా జేరు

టకు నధికారము లేదు. ఓటుహక్కున్న మైనరుకు 18 సంవత్సరములు దాటినపిమ్మట 21 సంవత్సరములు నిండువరకు యీ 3 ఏండ్లగడువులో నతని ఓటుహక్కు ఏమికా వలసినది అనునది చర్చనీయాంశము.)

6. చదువుకొన్నవారు ప్రతివాడును ఓటరుగా చేర నర్హుడు. (ఓటర్లకు ముఖ్యముగా నుండవలసిన అర్హతలు, 21 సంవత్సరముల వయస్సు, విధ్యుక్తకాలము, ఎలక్షన్ ఖండములో నివాసము, బ్రిటిషు రాజ్యములో లేక స్వతంత్రరాజ్యములలో పౌరులలోగాని ప్రభువులలోగాని చేరియుండుట. ప్రతి ఓటరుకును పైమూడు అధికారములున్ను ఉండియే తీరవలెను. కొన్నికొన్ని తరగతుల ఎలక్షన్ ఖండములలో ప్రతి ఓటరును ఆ తరగతులకు జెందియుండవలెను. దీనితోబాటు ప్రతి ఓటరును విద్య, లేక భూవసతి, లేక కొన్ని పన్నులుచెల్లించుట, లేక స్త్రీల సందర్భములో కొన్ని తరగతుల పురుషుల భార్యలై యుండుట, మొదలగు యోగ్యతలలో నేదియో యొక యోగ్యత యుండవలెను.)

7. గవర్నమెంటు సేనలో సిపాయి లేక ఆఫీసరుపదవిలో పనిచేసి పని చాలించిన వారును, పింఛను పుచ్చుకొన్నవారును ఓటర్లుగా చేరనర్హులు.

8. స్త్రీ ఓటర్లు :—

(1) గవర్నమెంటు సేనలో సిపాయిల (లేక ఆఫీసరుల) తల్లులకుగాని భార్యలకుగాని గవర్నమెంటువారు భరణ మిచ్చుచున్నచో, అట్లు భరణము పొందుచున్న స్త్రీలపేర్లు జాబితాలో చేర్చవలెను.

(2) 9 వ రూలులో తెలిపిన పురుషులభార్యల పేర్లు జాబితాలో జేర్చవలెను.

9. అట్టి పురుషు లెవరో తెలుపుచున్నాము—

(1) వెనుకటి ఆర్థికసంవత్సరములో నాదాయపుపన్ను చెల్లించినవారు.

(2) గవర్నమెంటు సేనలో పనిచేసి పింఛను పుచ్చుకొన్నవారు.

(3) చెన్నపట్టణములో వెనుకటి ఆర్థికసంవత్సరములో 6 మాసములు తక్కువ గాకుండ ఒక యింటియందు నివసించినవారు. ఆ యింటి యజమానికి యింటివల్ల రు. 60 లకు తక్కువగాకుండ సాలీనా ఆదాయము వచ్చుచుండవలెను.

(4) వెనుకటి ఆర్థికసంవత్సరములో కంపెనీపన్ను చెల్లించినవారు.

(5) వెనుకటి ఆర్థికసంవత్సరములో రు. 3 లకు తక్కువకాని వృత్తిపన్ను, లేక ఆస్తిపన్ను, లేక రెండుపన్నులును చెల్లించినవారు.

(6) రు. 10 లకు తక్కువకాకుండ సాలీనా ఆదాయమువచ్చు భూమికి రైతు వారీపట్టాదారు (కాని యీనాందారు).

(7) ఈనాందారువల్ల (లేక రైతువారీ పట్టాదారువల్ల) సాలీనా రు. 10 లకు తక్కువగాకుండ సిస్తుకు రిజిస్ట్రీకవులు పొందియున్నవాడు.

(8) ............మలబారునకు సంబంధించినది.

(9) సాలీనా రు. 10 లకు తక్కువగాకుండా ఆదాయము వచ్చు ఎస్టేటునకు యజమాని.

(10) సాలీనా రు. 10 లకు తక్కువగాని ఆదాయమువచ్చు భూమిని సాగు చేయు రహితు.

9-ఎ. సాలీనా రు. 18 లు అద్దె యేర్పాటైయున్న యింటిలో వెనుకటి ఫసలీ అంతయు నివసించిన పెద్యూలుతరగతి పౌరుడు ఓటరుజాబితాలో చేర నర్హుడు. ఆయిల్లు మునిసిపాలిటీలో, లేక కాంటన్మెంటులో, లేక లోకల్‌బోర్డులో చేరి యుండవలెను. అట్లు చేరకున్నను ఆ ఖండములో మరియొకయింటిలో వెనుకటి ఫసలీలో నివసించినవాడు జాబితాలో చేర నర్హుడు. రెండవసందర్భములో నద్దె సాలీనా రు. 12 లుండిన చాలును.

10. 2 (5) రూలు, 3 (3), (4), 5, 6 విధులప్రకారము ఓటు హక్కున్న వారును, సైనికుని భార్యగా ఓటు హక్కున్న స్త్రీయును, తమ్ములను జాబితాలో చేర్చుమని కోరుచు దరఖాస్తులు పెట్టుకొన్ననేగాని వారిని జాబితాలో చేర్చరాదు.

[2 (5) రూలులో సక్రమముగా పన్నులు చెల్లించియున్న యింటినద్దెకు పుచ్చుకొని నివసించువాడు ఓటరుగా చేర నర్హుడని తెలుపబడినది. 3 (3) మలబారు నకు సంబంధించినది. 3 (4) ననుసరించి కౌలుదారులకు ఓటుహక్కు నిచ్చినారు. (5) రూలులో మైనరుతరఫున గార్డియన్‌కు ఓటుహక్కు నిచ్చినారు. (6) రూలు నను సరించి చదువుకొన్న ప్రతివానికిని ఓటుహక్కునిచ్చినారు. ఈ హక్కులున్నవారు తమకు హక్కు లున్నవనియు తమపేర్లు జాబితాలో చేర్చవలసినదనియు జాబితాలు తయారుచేయునధికారికి (రిజిస్ట్రేషన్ ఆఫీసరు) దరఖాస్తులు వ్రాసిపంపవలెను. వారిపేర్లు తనంతటతానే జాబితాలో చేర్చవలసినవిధి ఆ అధికారికి లేదు. దరఖాస్తు లేనిదే వారిపేర్లు అధికారి జాబితాలో చేర్చరాదు. తక్కిన ఓటుహక్కున్న వారిపేర్లు (జాబితాలు తయారుచేయు) అధికారులు తమంతటతామే చేర్చవలసి యున్నది. ఆదాయపుపన్ను చెల్లించువారిపేర్లు లేక కంపెనీపన్ను చెల్లించువారిపేర్లు లేక వారి భార్యలపేర్లు, అట్టివారు కోరకనే జాబితాలో చేర్చవలసినపూచీ రిజిస్ట్రేషన్

ఆఫీసరుది. అట్టివారు తమపేరు చేర్చుమని యేవిధమైన దరఖాస్తును పెట్టుకోవలసిన అగత్యములేదు.]

11. (1) జాయింటుగా పన్నులు చెల్లించువారిలోను, జాయింటుగా ఆస్తులు భుక్త పరుచుకొనువారిలోను యీ క్రిందివారుమాత్రమే ఓటర్లుగా నుండ నర్హులు.

(2) ఆ ఆస్తి లేక పన్ను ఓటుహక్కు నిచ్చుటకు చాలియుండవలెను. (జాయింటు కవులుందార్లు గ్రామఖండములలో రు 50 లకు తక్కువ లేకుండ సాలీనా శిస్తుచెల్లించు చుండవలెను.) అట్టివారిలో

(i) ఆ ఆస్తిగాని పన్నుగాని హిందూ సమష్టికుటుంబమునకు చెందినచో, కుటుంబ యజమానిగా వ్యవహరించువతడు, ఓటరుగా చేర నర్హుడు.

(ii) ఆ ఆస్తిగాని పన్నుగాని యితరకుటుంబములకు చెందినచో ఆకుటుంబము లోనివా రెవరి నెన్నుకొందురో, వారిని ఓటరుగా చేర్చవలెను.

(iii) ఇతరసందర్భములలో జాయింటుదారులలో నధికసంఖ్యాకులు ఓట రుగా నెవరి నెన్నుకొందురో అతనిని జాబితాలో చేర్చవలెను.

ఈ షరతులు ఆదాయపుపన్ను చెల్లించు కంపెనీలలోని భాగస్వాములకు అను వర్తింపవు. వారికి సంబంధించిన ప్రత్యేకవిధులు పైని తెలుపబడినవి.

12. (1) "ఎస్టేటు" అనుమాట కర్థము 1908 వ సంవత్సరపు మద్రాసు ఎస్టేట్సు ల్యాండ్ ఆక్టులోనిదే.

(ఆ ఆక్టు షరతులననుసరించి జమీందారీలును, కలెక్టరు ఆఫీసులో ప్రత్యేక ముగా నమోజుకాబడిన జమీందారీఖండములున్ను, సాగు హక్కులకు మినహా పన్ను హక్కుమాత్రమే యీనాముగా నీయబడిన గ్రామములును, జాగీరులును, పాళెము లున్ను, పైవానిలో దేనిలోనైన నొకభాగము శాశ్వతకవులు పుచ్చుకొన్నచో అట్టి భాగమున్ను, ఎస్టేట్లని భావింపవలెను.)

"ఫసలీ" అనగా 30 జూన్ తేదీతో అంతమగు సంవత్సరము. "భూస్వామి" అనగా ఎస్టేటులోగాని, ఎస్టేటులో కొంతభాగములోగాని స్వామ్యహక్కున్నవాడు. ఎస్టేటులోగాని ఎస్టేటుభాగములోగాని పన్ను వసూలుచేసుకొనుట కధికారమున్న వాడుసహితము భూస్వామియే. ఈ పన్నులు వసూలుచేసుకొను హక్కు వెనుకటి భూస్వామి కల్పించియుండవచ్చును, లేదా ఏ కోర్టు డిక్రీనిబట్టిగాని వచ్చియుండ వచ్చును. "భూమినుండి వచ్చే రాబడి" అనగా 1920 సంవత్సరపు మద్రాసు లోకల్

బోర్డుల ఆక్టు 79 వ సెక్షన్ ప్రకారము నిర్ణయించిన రాబడి. అట్టినిర్ణయ మిపవరలో జరుగకున్నచో రిజిస్ట్రేషన్ ఆఫీసగు రాబడిమొత్త మింతయని నిర్ణయింపవచ్చును.

(2) ఇంటిఅద్దె నిచ్చుచున్నవాడును నివ్వ బాధ్యుడైయున్నవాడును, యింటిలో నివసింపకున్నను నివసించినట్లే తలంతురు.

(3) ఈఅనుబంధములో వాడిన "గృహములు" "భూములు" అను మాటలు మద్రాసురాష్ట్రములో చేరిన భూములకున్ను యిండ్లకును చెందినవేగాని, తక్కిన రాష్ట్రములలోని భూములకు యిండ్లకు సంబంధించినవి గావు.

---

# ఇండియా పరిపాలనకు సంబంధించిన 1936 వ సంవత్సరపు ఆర్డరు.

---

## రాష్ట్రీయ అసెంబ్లీలకు సంబంధించినది.

30-4-1936 వ తేదీని చక్రవర్తిగారున్ను వారికౌన్సిలున్ను సంప్రతించి సమకూర్చినది.

(16-6-1936 వ తేదీ ఫోర్టుసెంట్‌జార్జిగెజెట్ చూ.)

నిబంధన.

1. ఈ ఆర్డరుపేరు 1936 వ సంవత్సరపు రాష్ట్రీయఅసెంబ్లీల ఆర్డరు.

2. (1) ఈ క్రిందిమాటలకు అర్థమును తెలుపుచున్నాను—

(i) "ఎలక్షన్ ఖండము" అనగా 5 వ అనుబంధములో 5, 8 నిబంధనలలో తెల్పినఖండము.

(ii) "ప్రత్యేకఖండ" మనగా దేశవిభాగముల ననుసరించి నిర్ణయించినదిగాక, ప్రత్యేకముగా కొన్నిసంస్థలనుండి మెంబర్ల నెన్నుకొనుటకై యేర్పరచినది.

ఉదా.—యూనివర్సిటిఖండము.

(iii) "సీటు", "ఎలక్షను", "శాసించిన", "నిబంధనలు" అనుమాటలకర్థము 5వ అనుబంధములో తెలిపినదే.

(iV) "వాణిజ్యము" అనుమాటలో బ్యాంకువ్యాపారము, ఇన్షూరెన్సువ్యాపారము, రైల్వేపరిశ్రమయు నిమిడియున్నవి.

(V) గనులపరిశ్రమలలో, గనులనుండి నూనెతీయుపరిశ్రమయు చేరియున్నది.

(Vi) "ఫేక్టరీ" అనుమాటకర్థము 1934 వ సంవత్సరపు ఫేక్టరీలఆక్టులో నిచ్చినది. శాశ్వతఫేక్టరీ అనగా ఎల్లప్పుడు పనిచేయుఫేక్టరీ.

(Vii) "గని" అనగా 1923 వ సంవత్సరపు గనులఆక్టులో తెలిపినది.

(Viii) "గెజెట్" అనగా ఆరాష్ట్రగవర్నమెంటుగెజెట్. (మనరాష్ట్రములో ఫోర్టుసెంట్ జార్జిగెజెట్.)............

తక్కినమాటల కన్నింటికిని 6 వ అనుబంధములోని యర్థముతే రూఢి యని భావింపవలెను.

(2) రెండుఖండములు జనరల్ సీట్లకు సంబంధించిన గాని, రెండున్నూ యేక తరగతి సీట్లకు సంబంధించిన గాని, వానిలో నొకటి గ్రామఖండము ఒకటినగర ఖండమై యున్నను నవి రెండున్నూ ఒకేమాదిరి సీట్లని భావింపవలెను. రెండుసీట్లలో నొకటి స్త్రీలకుగాని షెడ్యూలుతరగతులకు గాని కేటాయించియున్నను నవి రెండున్నూ ఒకేమాదిరి సీట్లయియున్నవి.

(3) ఇన్నిరూపాయిల మూలధన ముండవలెనని నిర్ణయ మున్నచో దానికి మారుగా నదేవిలువ చేయుపౌనుల మూలధన మున్నను సరిపోవును.

(4) ఈ ఆర్డరులో ఇండియా పరిపాలనాచట్టములోని సెక్షనులగూర్చి చేసిన ప్రసంగము, ఆసెక్షన్‌లుమారి వానిస్థానే క్రొత్తవి సమకూర్పబడినచో, క్రొత్తవానిని గూర్చి చేసినట్లే యూహింపవలెను.

## ప్రత్యేకఖండములు

3. ప్రత్యేకఖండములకు వేరువేరు ఓటరుజాబితా లుండవలెను. ఏఖండములో పేరున్నవారికి ఆఖండములో ఓటిచ్చునధికార మున్నది; పేరులేనివారికి ఆఖండములో ఓటులేదు.

4. ఫలానితేదీని ఓటుహక్కున్నవారి పేర్లన్నియు జాబితాలలో చేర్చవలసిన దని గవర్నరుగారు నిర్ణయింతురు. తొలిసారి జాబితాలు తయారు చేయునపుడు ఆతేదీని ఓటర్లయినవారి పేర్లన్నియు జాబితాలో చేర్చవలెను. జాబితా యిదివరలోనే తయారైయున్నచో, ఆతేదీని ఓటుహ క్కున్నవారిపేర్లు చేర్చియు, ఆతేదీని ఓటు హక్కు లేనివారిపేర్లు తీసివేసియు (2-7-36వ తేదీని ఓటుహ క్కున్నవారిపేర్లు జాబితాలలో చేర్చవలసిన దని గవర్నరుగారు నిర్ణయించినారు. 16-6-36 వ తేదీ ఫోర్టుసెంట్ జార్జిగెజెట్ 856 వ పుట చూ.) జాబితా సవరింపవలెను.

5. సర్వసాధారణముగా యీ క్రింద వివరించినవారుమాత్రమే ఓటరుగా నుండ నర్హులు.

(1) 21 సంవత్సరములు నిండినవారు.

(2) (i) బ్రిటిషు సబ్జక్టు లేక

(ii) స్వతంత్రప్రభువు, అతని ప్రజలలోనివాడు, లేక

(iii) బ్రిటిషు ఇండియా స్వతంత్రరాజ్య సమ్మేళనలో చేరని ప్రభువు గాని అతనిప్రజలుగాని అర్హు లని శాసన మున్నచో, అట్టివాడు.

6. ఏ కోర్టులోనైన మతిహీనుడుగా నిరూపణయైన వ్యక్తి ఓటరుగా చేర నర్హుడు కాడు.

7. ఎలక్షన్ నేరము లేక అక్రమచర్య చేసినవాడు ఓటరుగా నుండరాదు. జాబితాలో వానిపేరు వెంటనే తుడుపుపెట్టవలెను.

8. ద్వీపాంతరవాసశిక్షగాని ఖైదుశిక్షగాని అనుభవించుచున్నవాడు ఓటరుగా నుండరాదు.

9 ఇంకొకరితరఫున గార్డియనుగా లేక ట్రస్టీగా లేక రిసీవర్‌గా లేక మేనేజరుగా పన్నులను, చెల్లించువారును ఆస్తులు చక్కబెట్టువారును ఓటర్లు కారాదు. కాని యీ క్రిందివారు భూస్వాములఖండములలో ఓటర్లుగా చేరవచ్చును.

(1) ఆస్తి లేక పన్నును బట్టి ఓటుండవలసిన మైనరుకు గార్డియనుగా వ్యవహరించువారు.

(2) తక్కిన అర్హతలన్నియు నున్నవారు. (ఉదా. ఎలక్షన్ ఖండములో నియమితకాలము నివసించినవారు. మరిన్ని అనర్హతలేవియు లేనివారు అనగా మతిహీనత, ఖైదుశిక్ష మొదలైనవి.)

10. ఆస్తి జాయింటుగా ననేకులపేర నమోదైయున్నచో, లేదా అనేకులు జాయింటుగా పన్ను చెల్లించుచున్నచో, ఓటు హక్కున్నవారు.

(1) జాయింటుకుటుంబమునకు ఓటుహక్కున్నచో, (ఆకుటుంబము తరఫున ఓటుచేయవలసినవారు) ఆ కుటుంబ మేనేజరు;

(2) మరి యేకుటుంబమునకైన ఓటున్నచో, ఆకుటుంబమెంబర్లెన్నుకొనిన వ్యక్తి................(బెంగాలుకు సంబంధించినది.)

11. (కుటుంబములలోగాక) ఆస్తి పలువురిపేర నమోదైయున్నచో, లేదా పలువురు ఏకస్థులై పన్నుచెల్లించుచున్నచో, వారిలో ప్రతివారున్ను అతని వాటా ఆస్తికి హక్కుదారుడైయున్నట్లున్ను, అతని వాటాపన్ను చెల్లించుచున్నట్లున్ను భావింపవలెను.

12. ఒకే ఖండములో రెండుమూడు వేరువేరు ఆస్తులుండినను, రెండుమూడు వేరువేరు పన్నులు చెల్లించుచున్నను, అవన్నియు మొత్తముచేసి అతనికి ఓటుహక్కున్నదా లేదా యనువిషయము నిశ్చయింపవలెను.

13. మిలిటరీ (సైన్యసంబంధమైన) చట్టములకు లోబడియున్నవారు కార్మికఖండములలో ఓటరుగా చేర నర్హుడుకాడు.

14. (1) షెడ్యూలు తరగతుల సీట్లకు మొదట ఆ తరగతి ఓటర్లు నలుగు రభ్యర్థుల నెన్నుకొనవలెననియు, ఆ తర్వాత ఆనలుగురిలో నొకనిని యావన్మంది జనరల్ ఓటర్లు

ఎన్నుకొందురనియు పైన తెలిపియున్నాము. ఈ మొదటి ఎలక్షన్‌లో అభ్యర్థులు నలుగురు నిలువబడున్నను, (ముగ్గురే నిలువవచ్చును.) నలుగురు మొదట సెన్నుకోబడినను, రెండవ ఎలక్షన్ జరుగునప్పటికి వారిలో కొంద రేకారణముచే కాని తగ్గిపోయినను, ఎలక్షన్ ఆపివేయక మెంబరు ఎన్నిక జరిగేపర్యంతము కొనసాగింపవలెను.

(2) పై ప్రథమ యెన్నికలో ఒక్కొక్క ఓటరుకు ఒక్కొక ఓటే యుండును.

(3) బెంగాలులో తప్ప తక్కినరాష్ట్రములలో, షెడ్యూలు తరగతిసీట్ల ప్రథమ ఎలక్షన్‌లో అభ్యర్థిగా సెన్నుకోబడనివారు సహితము, జనరల్ సీట్లకు అభ్యర్థిగా నిలువవచ్చును.

15. ఒక ఖండములో మెంబర్ల సెందరి సెన్నుకోవలసియున్నదో, ఆఖండములోని ఓటర్ల కన్ని ఓట్లుండును. వారు వానిని వేరువేరు అభ్యర్థుల కీయవచ్చును, లేదా ఒకరికే యిన్నిన నీయవచ్చును.

(రాజమండ్రి, భద్రాచలము డివిజనులు రెండింటిని చేర్చి ఏకఖండముగా నేర్పరచి, యిద్దరు మెంబర్ల సెన్నుకొనునధికార మిచ్చినారు. ఈ ఖండములోని ఓటర్లకు రెండు ఓట్లు వేయునధికార మున్నది. అభ్యర్థులలో నిద్దరికి ఓటర్లు చెరియొక ఓటున్ను వేయవచ్చును, లేదా ఒక్కరికే రెండు ఓట్లున్ను వేయవచ్చును. రెండు ఓట్లకు మించి యెక్కువ ఓట్లు వేయరాదు. వేసినచో ఓట్లన్నియు వ్యర్థమగును.)

16. (1) షెడ్యూలు తరగతులకుగాని, అజ్ఞానస్థితిలోని ప్రజలకుగాని కేటాయించిన సీట్ల ఎలక్షనులలోకూడ యిందులోని నిబంధనలములలోనికి వచ్చును. ......

(2) ఆయా తరగతులలో నభ్యర్థుల సంఖ్య ఆ తరగతిసీట్ల సంఖ్యకు సరిపోవుచో అభ్యర్థు లందరు మెంబర్లుగా సెన్నుకోబడి రని నిర్ణయింపవలెను. అభ్యర్థులసంఖ్య సీట్లసంఖ్యను మించినపుడే ఓట్లు పుచ్చుకొనవలెను.

(అజ్ఞానస్థితిలోని ప్రజాప్రతినిధులసంఖ్య 2 అని భావింపుడు. ఆ ఎలక్షన్‌లో అభ్యర్థులై నిల్చినవారున్ను యిరువురే యైనచో వారిరువురు సెన్నుకోబడినట్లు భావింపవలెను.)

(3) సీట్లసంఖ్యను మించి అభ్యర్థులసంఖ్య యున్నచో, రిటర్నింగు ఆఫీసరు ఓట్లు పుచ్చుకొని ఎక్కువ ఓట్లు వచ్చినవారు వరుసవారీగా ఆయా మెంబరు పదవులకు ఎన్నుకొనబడినట్లు నిశ్చయింపవలెను.

(4) సీట్లసంఖ్యకు లోపించియే అభ్యర్థులసంఖ్య యున్నచో, అభ్యర్థు లందరును మెంబర్లుగా ఎన్నుకోబడినట్లు నిర్ణయించి, మిగతా ఖాళీలకు తిరిగి సభ్యుల

ఎన్నుకోవలసినదని గవర్నరుగారా ఎలక్షన్ ఖండములోని ఓటర్లకు హెచ్చరిక చేయవలెను.

ఒకసారి గవర్నరుగారు పై విధముగా హెచ్చరించినను ఖాళీలకు సభ్యుల నెన్నుకోని ఎలక్షన్ ఖండపు ఓటర్లకు, తిరిగి అట్టి హెచ్చరిక ఎంతకాలము గడచినపిదప నీయవలెనో గవర్నరుగారు నిర్ణయింతురు.

17 ఇరువురభ్యర్థులకు సమానముగా ఓట్లు వచ్చినచో, రిటర్నింగు ఆఫీసరు లాట్లు వేసి లాట్లలో గెల్చినవారి ఓట్లసంఖ్యకు ఒక ఓటు చేర్చి, వారిని ఎలక్షన్‌లో విజయులైనట్లు నిర్ణయింపవలెను.

(రెండుచీట్లు సమానముగా చింపి వానిపై వేరువేరుగా నభ్యర్థులపేర్లు వ్రాసి పేర్లు పైకి కనబడకుండునట్లు రెండును ఒకేమాదిరిగా మడిచి, సాధారణముగా నొక బాలునిచేగాని, బాలికచేగాని ఒక చీటి పైకితీయింతురు. ఆ చీటిపై నెవరిపేరున్నదో వారికి లాటువచ్చినట్లు భావింతురు. అట్లు లాట్లు వచ్చినవారి ఓట్ల కధికముగా నొక ఓటును రిటర్నింగుఆఫీసరు కలుపును.)

18. (1) ఒక వ్యక్తికిగాని, సంస్థకుగాని రెండుమూడు బాపతుల ఓటుహక్కులున్నను, వారికి ఒకమాదిరి ఓటుహక్కున్నవారి కుండు నధికారముమాత్రమే యున్నదిగాని అంతకుమించిన అధికారము లేదు.

(ఒక ఓటరు ఆదాయపుపన్నున్ను, మోటారుపన్నున్ను చెల్లించుచున్నాడని భావింపుడు. అతనికి రెండుతరగతుల ఓటు హక్కున్నకారణముచే అతనికి సామాన్యమైన ఓటుహక్కుండును కాని అంతకుమించి యుండదు. అతనికి రెండుబాపతుల హక్కులకు మారు ఒకేమాదిరి హక్కున్నను, అంతే అధికార ముండును.

(2) ఎవరిపేరున్ను ఓటరుజాబితాలో రెండుసార్లు వ్రాయరాదు. పొరబాటున అట్లు వ్రాసినను వారి కుండు ఓటొక్కటియే.

19. ఎవరైన అసెంబ్లీలో పెక్కుసీట్లకు మెంబరుగా నెన్నుకోబడినచో, అతడు విధ్యుక్తవ్యవధిలో నొక్కటిమాత్ర ముంచుకొని మిగతాసీట్లకు రాజీయివ్వవలెను. అట్లీయనిచో నత డన్నిసీట్లున్ను కోల్పోవును.

20. (1) నామినేషన్లు దాఖలుచేయవలసిన తేదీలు, వానిని తనిఖీచేయు తేదీలు, ఓట్లు పుచ్చుకొను తేదీలు గవర్నరుగా రేర్పరతురు.

(2) నామినేషన్లకు ఓటింగుకు మధ్య ఫలానిరోజులు గడువుండవలెననిగాని, దాఖలు తేదీలకు తనిఖీతేదీలకు మధ్య కొన్నిరోజులు గడువుండవలెననిగాని, ఉభయ శాసనసభలున్ను నిరూపింపవచ్చును. అట్టినిరూపణ గవర్నరుగారు గౌరవింపవలెను.

21. (1) గవర్నరుగారు నియమించిన అధికారి ఎలక్షన్ ఖండములలో ఓటరుజాబితాలు తయారుచేయును. ఆ అధికారి తనసహాయార్థమితర ఉద్యోగుల నియమింపవచ్చును.

(2) రిటర్నింగుఆఫీసరు గవర్నమెంటు ఉద్యోగస్థుడై యుండవలెను.

22. (1) ప్రస్తుతము అమలులోనున్న జిల్లాలకు సంబంధించిన విధులు, ముందా జిల్లాలుమారి వానిస్థానే క్రొత్తజిల్లాలు సృష్టింపబడినచో, అట్లు క్రొత్తగాపుట్టిన జిల్లాలకు సంబంధించినట్లే యోచింపవలెను.

(2) 6 వ అనుబంధము 13 (7) రూలు రద్దుచేయబడినది.

23. ........................................

24. గవర్నరుగారు ఏ ఎలక్షన్ ఖండపు పేరైనను మార్చవచ్చును.

25. ఓటరుజాబితాలు తయారుచేయవలసిన ఉద్యోగులకు ఇన్కమ్‌టాక్సు ఆఫీసర్లు (ఆదాయపుపన్ను విధించు ఆఫీసర్లు) వలసిన యావత్తుభోగట్టా యీయవలెను.

26. 1935 వ సంవత్సరపు ఆక్టువిధుల ననుసరించి గవర్నరుగారు నిర్వహింపవలసినవిధులు, ప్రస్తుతములో (అనగా ఆ ఆక్టు యింకను అమలులోనికి రాకపూర్వము) గవర్నరుగారున్ను వారి మంత్రులును సంప్రతించి నిర్వహింతురు.

---

## 2-వ భాగము-మదరాసు ఎలక్షన్ ఖండములు

1. (1) ఈ ఆర్డరుకు రెండవ అనుబంధములో ఎలక్షన్ ఖండముల పేర్లు, వాని పరిమితులు, ఏ ఏ ఖండమున కెందరు మెంబర్ల నెన్నుకొను నధికారమున్నదో తెలుపబడినది.

(2) 5 వ అనుబంధము 8 (6) రూలులో తెలిపిన స్త్రీ సీట్లున్ను ఆ అనుబంధములోనే ఉదాహరింపబడినవి.

(3) మొత్తపు జనరల్ సీట్లలో మెహమ్మదీయేతరగతి మెంబర్లకున్ను స్త్రీలకున్ను కేటాయించిన సీట్లు తెలుపబడినవి.

(4) నగరఖండము లని ప్రత్యేకముగా తెలుపబడనివన్నియూ గ్రామఖండము లనే భావింపవలెను.

2. స్త్రీమెంబరు కాగోరునామె ఆ ఎలక్షన్ ఖండములో ఓటరై యుండవలెను. లేదా మరియొక స్త్రీఖండములో ఓటరై యుండవలెను.

3. రెండుమూడు ఆంగ్లోఇండియన్ సీట్లకు మెంబర్ల నెన్నుచో ఓటరునకు ఖాళీల సంఖ్యతో సమానమైనన్ని ఓట్లున్నను, అభ్యర్థి కొకటిచొప్పున వేరువేరు అభ్యర్థుల కీయవలసినదేగాని ఒకనికే పెక్కుఓట్ల నీయరాదు.

4. యూరపియన్ సీటుకు మెంబరు కాగోరువాడా ఖండములో ఓటరైయుండవలెను, లేదా మరియొక యూరపియన్ ఖండములో ఓటరై యుండవలెను.

5. రెండుమూడు యూరపియన్ సీట్లకు మెంబర్ల నెన్నుచో ఓటరునకు ఖాళీల సంఖ్యతో సమానమైనన్ని ఓట్లున్నను, ఆఓట్లు అభ్యర్థి కొకటిచొప్పున వేరువేరభ్యర్థుల కీయవలసినదే గాని, ఏ అభ్యర్థికిన్ని పెక్కుఓట్ల నీయరాదు.

6. ఇండియన్ క్రిస్టియన్ సీటుకు మెంబరు కాగోరువారాఖండములో ఓటరై యుండవలెను, లేదా మరియొక ఇండియన్ క్రిస్టియన్ సంఘములో ఓటరై యుండవలెను.

7. ... ... ... ... ...

8. ... ... ... ... ...

9. ... ... ... ... ...

10. (1) ఈయార్డరు 2 వ అనుబంధము 7 వ భాగములో దెలిపిన ప్రత్యేకఖండములో ఎలక్షను జరిపి అజ్ఞానస్థితిలోని ప్రజాప్రతినిధి నెన్నుకొనవలెను.

(2) అట్టి ప్రతినిధి అజ్ఞానస్థితిలోని ప్రజలకు చెందినవాడై యుండవలెను. తక్కినప్రతినిధుల కుండవలసిన అర్హత లాతనికి కూడ నుండవలెను. (ఉదా. 21 సంవత్సరముల వయస్సు, నియమితకాలము ఎలక్షన్ ఖండములో కాపురము, ఓటుహక్కు.)

(3) అట్టి ప్రతినిధికి వానితరగతి ఎలక్షన్ ఖండములో ఓటుండవలెను.

(4) అజ్ఞానస్థితిలోని ప్రజ లెవరో యీ ఆర్డరుకు 13వ అనుబంధములో తెలుపబడినది.

11. (1) వర్తకులు, పారిశ్రామికులు, మెంబర్ల నెన్నుకొను విధానము ఈ ఆర్డరు 2వ యనుబంధము 8వ భాగములో తెలుపబడినది.

(2) ఏసంఘముల సభ్యులనుండి ఓటరుజాబితాలు తయారు చేయవలెనో ఆభాగములో తెలుపబడినది.

(3) మెంబర్ల సంఖ్యయు తెలుపబడినది.

12. (1) వర్తక పారిశ్రామిక తరగతులకు ఓటర్లు కొన్ని సంఘములలో సభ్యులై యుండవలెను. ఆసంఘములలో సభ్యులుకానివారి కా ఖండములో ఓటుండదు.(ఉదా. చెన్నరాష్ట్రములో ఇండియన్ పారిశ్రామికుల, వర్తకుల ఖండమందు ఓటర్లుగా చేరగోరువారు సౌత్-ఇండియన్ ఛాంబర్ ఆఫ్ కామర్సు అను సంఘమునందు సభ్యులై యుండవలెను.) ఆసంఘములో కొందరు వ్యక్తులున్ను, లేక కొన్ని కంపెనీలున్ను సభ్యులై యుండవచ్చును. కంపెనీలు, లేక యితర జాయింటుసంస్థలు సభ్యులై యున్నచో, ఆసంస్థకుండే ఓటు ఆసంస్థ ఎన్నుకొనినవారి కిచ్చి వారిపేరు ఓటరు జాబితాలో చేర్తురు.(సౌత్-ఇండియన్ ఛాంబర్ ఆఫ్‌కామర్సులో హో అండ్ కంపెనీ మెంబరై యున్నదని భావింపుడు. ఆసంఘములోని మెంబర్లందరికిన్ని ఓట్లున్నవి కావున పైకంపెనీకి ఓటుండును. కాని కంపెనీ ఓటువేయలేదు. కంపెనీతరఫున నొకవ్యక్తి ఓటువేయవలెను. ఆకంపెనీతరఫున ఓటరుగా నెవరిని చేర్చమని కంపెనీవా రభిలషింతురో అడిగి తెలుసుకొందురు. అట్టివారిపేరు ఓటరుజాబితాలో చేర్తురు.)

(2) సంఘసభ్యులుగా ఓటరుజాబితాలో చేరగోరువారీక్రిందివరతులకు లోబడవలెను:

(i) ఆసంఘమునకు క్రిత సాలాఖరువరకు చందాలు క్రమముగా చెల్లించుట; మరియు,

(ii) వ్యాపారమందు లేక పరిశ్రమలలో పాటుబడుచున్న వారున్ను, ఆరాష్ట్రములో వాణిజ్యము లేక పరిశ్రమనిమిత్తమై ఆఫీసుపెట్టి యున్నవారున్ను అయి యుండుట.

(iii) సంఘములో మెంబరు కంపెనీ లేక జాయింటుకుటుంబ మైనచో, అంతకు పూర్వము 5 సంవత్సరములలో ఏసాలుకైన రు 10,000/- రాబడిపై ఆదాయ పుపన్ను చెల్లించినవారున్ను, అయియుండుట.

(iv) సంఘములో మెంబరు బాహుళ్యముగా వ్యాపారము సాగించు కంపెనీ (కార్పొరేషన్) అయినచో, ఒక లక్షరూపాయిలకు తక్కువగాకుండ మూలధనము చెల్లింపవలసియుండును.

(3) (i) కంపెనీతాలూకు భాగస్వాములు కంపెనీలో పొందిన ఆదాయముపై, ఏ భాగస్వామివాటా కా భాగస్వామికి ప్రత్యేకపుపన్ను విధింపబడినచో భాగస్వాములందరున్ను కలిసి చెల్లించిన మొత్తపుపన్ను కంపెనీ చెల్లించినట్లే పరిగణింతురు.

(ii) కంపెనీలో కొందరు భాగస్వాములు విడిపోయి వారిస్థానే క్రొత్తవారు వచ్చినను, ఆ మొదటికంపెనీయే వ్యాపారము సాగించుచున్నట్లు భావింతురు.

(4) తేయాకు, లేక రబ్బరు, లేక పొగాకుతోటల యజమానులున్ను యీ తరగతికి చెందినవారే.

13. (1) పై సంఘములో మెంబరు ఒక కంపెనీ లేక జాయింటు కుటుంబమై యున్నచో, ఆ కంపెనీ (లేక కుటుంబము) తరపున ఓట్లు వేయుటకు ముగ్గురిపేర్లు వ్రాసి పంపవలెను. ఆ ముగ్గురిపేర్లున్ను ఓటరుజాబితాలో చేర్తురుగాని, వారిలో నొక్కరికి మాత్రమే ఓటువేయు నధికార మిత్తురు.

(2) ఆ ముగ్గురున్ను ఆ కంపెనీలో (లేక ఆ కుటుంబములో) మెంబర్లయి యుండవలెను; లేదా (ఆ కుటుంబము లేక) ఆ కంపెనీతరపున 6 మాసముల నుండియైన వ్యవహరించుచున్న ఏజంట్లయి యుండవలెను.

(3) ఆ ముగ్గురున్ను కంపెనీ డైరెక్టర్లు, మేనేజర్లు, లేక మేనేజింగు ఏజంట్లు అయి యుండవలెను; లేదా జాయింటుకుటుంబమునకు మేనేజర్లయి యుండవలెను, లేదా 6 మాసములైనను కంపెనీ లేక కుటుంబముతరపున వ్యవహరించుచున్న ఏజంట్లయిన కావలెను. (డైరెక్టర్లనగా కంపెనీవ్యవహారములు చక్కబెట్టునధికారులు. వారిలో పెద్ద మేనేజింగు డైరెక్టరు. ఏజంటు అనగా యింకొకరితరపున పనిజూచే ప్రతినిధి. కుటుంబమేనేజరనగా కుటుంబయజమాని.).

14. (1) ఏదియో యొక పారిశ్రామికఖండమునకు చేరుటకుమాత్రమే ఒక ఓటరున కధికార మున్నది. ఏదియో ఒక పారిశ్రామికఖండములోని ఓటర్ల నెన్ను కొనుటకుమాత్రమే ఒక కంపెనీ లేక కుటుంబమునకు హక్కున్నది.

(2) ఏ ఓటరైన రెండుమూడు పారిశ్రామిక ఎలక్షన్ఖండములలో ఓట్లు వేసినచో, అతడు వేసిన ఓట్లన్నియు రద్దగును.

15. పారిశ్రామిక ఎలక్షన్ఖండములో ఓటులేనివారిని పారిశ్రామిక ప్రతినిధిగా నెన్నుకోరాదు.

16. ... ... ... ... ... ...

## భూస్వాముల సీట్లు

17. (1) 2వ షెడ్యూలు 9వ భాగములో తెలిపిన పద్ధతులనుబట్టి భూస్వాముల ప్రతినిధుల నెన్నుకోవలెను.

(2) ఎలక్షన్ ఖండముల పరిమితము లా భాగములో తెలుపబడినవి.

(3) ఒక్కొక్క సంఘమున కొక్కొక్క సభ్యు నెన్నుకోవలెను.

18. క్రిత ఆర్థికసంవత్సరములో 120 రోజులకు తక్కువగాకుండా, ఆయా ఎలక్షన్ ఖండములో నొక యింట్లో నివసించినవాడు మాత్రమే ఆ ఖండములో ఓటరు కా నర్హుడు (అనగా 1-4-1935 - 31-3-1936 తేదీల నడుమ)

19. (1) భూస్వాముల ఓటరుజాబితాలలో చేర నర్హులైనవారు:

(i) ఎస్టేటువల్ల రు 3000/- కు తక్కువకాని సాలీనా ఆదాయము వచ్చుచున్న జమీందారు, లేదా రు 3000/- గవర్నమెంటువల్ల మాలిఖానాభరణము పొందుచున్న జమీందారు, లేదా రెండు బాపతులనుబట్టి మొత్తపు ఆదాయము రు 3000/- కు తక్కువ కాకుండ వచ్చేవారు.

(ii) జనిమిగా నమోదుకాబడి సాలీనా రు 1500/- తక్కువగాని పన్ను చెల్లించువారు.

(2) (a) "జమీందారు" అనగా ఎస్టేటు అధిపతి.

(b) "సాలీనా ఆదాయ" మనగా ఏ ఆదాయముపై 1920 వ సంవత్సరపు మదరాసు లోకల్ బోర్డు ఆక్టు ననుసరించి లేండ్ సెస్సు వసూలు చేయబడుచున్నదో అట్టి ఆదాయము.

(c) ఎస్టేటులో నొకభాగము వల్ల రాబడివచ్చుచున్నచో ఆ రాబడి లెక్కలోనికి తీసికొనరు. అట్టిభాగము ప్రత్యేకముగా నమోదైయున్నచో ఆ ఆదాయము లెక్కలోనికి తీసికొందురు.

(d) రెండు మూడు భూ ఖండములపై చెల్లించుపన్ను మొత్తముచేసి పై మొత్తమునకు సరిపోయినచో, అట్టివారిని ఓటరుగా చేర్చవచ్చును.

20. భూస్వాముల ఖండములలో ఓటర్లుగా చేరగోరువారిపేరు గవర్నమెంటు రిజస్టర్లలో నమోదై యుండవలెను.

21. (1) అట్టినమోజు . పలువురిపేర జాయింటుగానున్నచో ఆ నమోజుదార్లు తమలో నొకరిని ఓటరుగా నుండుట కెన్నుకొని, తమ తరఫున ఓటువేయుట కతనికి లిఖితరూపకమగు నధికార మీయవలెను. అతనిపేరుమాత్రమే ఓటరుజాబితాలో చేర్చవలెను. వా రెవ్వరిని ఎన్నుకోనిచో ఎవ్వరిపేరున్ను జాబితాలో జేర్పరు.

(2) మలబారునకు సంబంధించినది.

(3) అన్లైన్నుకోబడిన వ్యక్తికి ప్రత్యేకపు ఓటుహక్కున్నచో, రెండుహక్కులలో నే హక్కునుబట్టి అతడు ఓటరుగా చేరగోరునో, అతడే నిశ్చయింపవలెను. అతనికి రెండు హక్కుల ననుసరించి రెండు ఓట్లీయరు.

22. (1) ఏ ఓటరుపేరైన ఒకే ఖండములో జేర్పవచ్చును, కాని రెండుమూడు ఖండములలో జేర్పరాదు. రెండుమూడుఖండములలో ఓటు హక్కున్నవారు ఏఖండములో చేరగోరునది తెలుపవలెను.

(2) రెండుమూడు ఖండములలో ఓట్లు వేసినవారి ఓట్లన్నియు వ్యర్థమగును.

## కార్మికుల సీట్లు

23. (1) కార్మికులసీట్ల ఎలక్షన్ఖండములు 2 వ షెడ్యూలు 10 వ భాగమున తెలుపబడినవి.

(2) ఖండమున కొక్కొక మెంబరుచొప్పున ఎన్నుకొనవలెను.

(3) రైల్వేకార్మికుల ఖండములోను, తేతపరిశ్రమలో పనివారంన్ర ఖండములలోను ఓటర్లుగా చేరగోరువారు ఆయా కార్మికసంఘములలో (ట్రేడ్ యూనియన్సు) సభ్యులై యుండవలెను.

(4) తక్కిన కార్మికులు ఏదోయొకపరిశ్రమలో పనిచేయుచుండవలెను. అట్టి పరిశ్రమ లేవియో 20 వ భాగమున చూడనగును.

24. (1) పైమూడవ పేరాలో నుదాహరించిన సంఘము లేవియో (ట్రేడ్ యూనియన్సు) గవర్నరుగారు నిర్ణయింతురు.

(2) గవర్నరుగారీక్రిందనుదాహరించిన సంఘములనుమాత్రమే అంగీకరింపవలెను:

(i) కార్మికుల క్షేమమునకై స్థాపించినవి.

(ii) గత 2 సంవత్సరములనుండి పనిచేయుచు, ఏడాదికి పూర్వమైనను రిజిస్టరు కాబడినవి.

(iii) గత ఆర్థికసంవత్సరములో పూర్తిగా చందాలిచ్చిన 250 మంది మెంబరులైనను చేరియున్నవి.

(iV) 1926 వ సంవత్సరపు ట్రేడ్ యూనియన్ సంఘముల ఆక్టుననుసరించి రిజిస్ట్రారువల్ల లెక్కలు, పుస్తకములు తనిఖీకాబడినవి.

(3) ఒకసారి సక్రమమైనవని అంగీకరించిన సంఘములు తర్వాత సక్రమములు కావని, లేక అందలి సభ్యులకు ఓటుహక్కు నీయరాదనియు, గవర్నరుగారు నిర్ణయింపవచ్చును.

(4) గవర్నరుగారిస్థానే యీ పైవిధులు నిర్వహించుటకొక సంఘము గవర్నరుగా ఏర్పరుపవచ్చును.

25. (1) క్రితసంవత్సరము ఆయారాష్ట్రములలో 6 మాసములకు తక్కువగాకుండ వసించినవారే ఆ రాష్ట్రి కార్మికఖండములలో ఓటర్లుగా చేరనర్హులు.

(2) గుమాస్తాలు, ఫ్యాక్టరీయజమానుల ఏజంట్లు మొదలగువారేకార్మికఖండములోను ఓటర్లుగా చేర నర్హులుకారు.

(3) రైల్వేఖండములో ఓటరుగా చేరగోరువాడారాష్ట్రములో పనిచేయుచుండవలెను.

(4) (i) పైసంఘములో గత 12 మాసములు సభ్యుడు, లేక గౌరవసభ్యుడు (చందా చెల్లించనక్కరలేకయే సభ్యునిగా నెంచబడువాడు.) లేక ఉద్యోగి ఓటరుగా చేరవచ్చును.

(ii) సాధారణసభ్యుడు చందా బాకీపడియున్నచో నతడు ఓటరుగా నుండరాదు.

సంఘములలో చేరనివాడు సహితము గతసాలులో 180 రోజులకు తక్కువగాకుండ ఏదేని కర్మాగారములో నెలకు రు 300/-లకు మించని వేతనముకు పనిచేసినచో, నట్టివాడు ఓటరుగా జేర నర్హుడు.

అట్లు 180 రోజులు పనిచేయని కార్మికులు దరఖాస్తుపై ఓటర్లుగా జేరవచ్చునని, ఓటర్లుగా చేర్చుకొనుటకుముందు వారి కుండవలసిన యోగ్యతలు ప్రత్యేకముగా నిర్ణయింతురు.

26. (1) ఏ కార్మికుని పేరున్ను ఒక్కొక్క ఎలక్షన్ ఖండములోనే చేర్చవలెనుగాని రెండు మూడు ఖండములలో చేర్చరాదు. రెండుమూడు ఖండములలో ఓటుహక్కున్నవారు ఏ ఖండములో జేరగోరునది తెలుపవలెను.

(2) రెండు మూడు ఖండములలో ఏ ఓటరైనను ఓట్లు వేసినచో నతడు వేసిన ఓట్లన్నియు నిరర్థకము లగును.

27. (1) ఏ కార్మికఖండములోనైన ఓటున్నవాడాకార్మికఖండములోగాని మరియొకకార్మికఖండములోగాని అభ్యర్థియై నిలువవచ్చును.

(2) లేదా ఆ రాష్ట్రములో పనిచేయు కార్మికసంఘము (ట్రేడ్ యూనియన్) నకో సభ్యుడు, లేక గౌరవసభ్యుడు, లేక యుద్యోగియై యున్నవాడున్ను అభ్యర్థియై నిలువవచ్చును.

## విశ్వవిద్యాలయపు సీట్లు

28. (1) విశ్వవిద్యాలయపు ఖండమువారు విశ్వవిద్యాలయ ప్రతినిధి నెన్నుకొందురు.

(2) ఇండియాదేశములో నెచటనైన కాపురముండి

(i) మద్రాసు లేక ఆంధ్ర లేక అన్నామలై విశ్వవిద్యాలయము సెనేటుసభ్యులుగా నున్నవారు లేక

(ii) ఈ విశ్వవిద్యాలయములలో దేనిలోనైనను 7 సంవత్సరములకు పూర్వమే పట్టభద్రుడైయుండి, గత 2 సంవత్సరములనుండియు ఆ విశ్వవిద్యాలయపు పట్టభద్రుల జాబితాలో నమోదై యున్నవారున్ను విశ్వవిద్యాలయపుఖండములో ఓటర్లుగా చేరనర్హులు.

3. అభ్యర్థిగా నిలువగోరువాడు విశ్వవిద్యాలయపు ఖండములో ఓటరై యుండవలెను.

29. నివాస మేర్పరచుకొనుట:—

ఒక యింటిలో నప్పుడప్పుడు నిద్రించువాడా యింటిలో నివసించినట్లే పరిగణింతురు.

ఒక ఓటరుకు రెండు మూడు గృహములుండి ఒకగృహము తాళమువేసియుంచి రెండవగృహమునందే అతడు నివసించుచున్నను, తాళమువేసినయింటి కాతడిచ్చవచ్చినప్పుడు నెళ్లుట కధికార ముండి అతడు తాళమువేసినయింటిలో నివసించు నుద్దేశము పూర్తిగా విడువకున్నచో అతడాయింటిలోనున్న నివసించుచున్నట్లే భావింపవలెను.

# 1936వ సంవత్సరపు ఇండియాగవర్నమెంటుకు సంబంధించిన ఆర్డరు

## రాష్ట్ర అసెంబ్లీలు

## 2 – వ అనుబంధము

### 1. జనరలు సీట్లు

| ఎలక్షన్ ఖండము పేరు | ఎలక్షన్ ఖండము పరిమితి | సీట్ల సంఖ్య | షెడ్యూల్డు కులములకై ప్రత్యేకించినవి |
|---|---|---|---|
| | **(i) నగర ఖండములు** | | |
| మద్రాసు పట్టణపు ఉత్తర భాగము. | మద్రాసు పట్టణములోని 1, 2, 3, 4, 9, 10, 12 డివిజన్లు. | 1 | — |
| మద్రాసు పట్టణపు ఉత్తర మధ్య భాగములు. | మద్రాసు పట్టణములోని 5, 6, 7, 8, 11, 13, 14, 15, 16 డివిజన్లు. | 1 | — |
| మద్రాసు పట్టణపు దక్షిణ మధ్య భాగములు. | మద్రాసు పట్టణములోని 17, 18, 19, 20, 21, 22, 23 డివిజన్లు. | 2 | 1 |
| మద్రాసు పట్టణపు దక్షిణ భాగము. | మద్రాసు పట్టణములోని 24, 25, 26, 27, 28, 29, 30 డివిజన్లు. | 1 | — |
| విశాఖ పట్టణము. | విశాఖపట్టణపు మునిసిపాలిటి. | 1 | — |
| కాకినాడ. | కాకినాడ మునిసిపాలిటి. | 1 | — |
| బెజవాడ, మచిలీ పట్టణము. | బెజవాడ మునిసిపాలిటి, మచిలీపట్టణపు మునిసిపాలిటి. | 1 | — |
| గుంటూరు, తెనాలి. | గుంటూరు మునిసిపాలిటి, తెనాలి మునిసిపాలిటి. | 1 | — |
| తంజావూరు, కుంభకోణం. | తంజావూరు మునిసిపాలిటి, కుంభకోణం మునిసిపాలిటి. | 1 | — |
| తిరుచునాపల్లి, శ్రీరంగము. | తిరుచునాపల్లి మునిసిపాలిటి, శ్రీరంగము మునిసిపాలిటి. | 1 | — |
| మధుర. | మధుర మునిసిపాలిటి. | 1 | — |
| తిన్నవేలి, పలంకోట. | తిన్నవేలి, పలంకోట మునిసిపాలిటీలు. | 1 | — |
| కోయంబత్తూరు. | కోయంబత్తూరు మునిసిపాలిటి. | 1 | — |
| సేలం. | సేలం మునిసిపాలిటి. | 1 | — |

(ii) గ్రామ ఖండములు

| | | | |
|---|---|---|---|
| టెక్కలి | టెక్కలి, ఇచ్ఛాపురం తాలూకాలు | 1 | — |
| శ్రీకాకుళము | శ్రీకాకుళము, నర్సారావుపేట, పాతపట్నం తాలూకాలు | 2 | 1 |
| బొబ్బిలి | సాలూరు, బొబ్బిలి, పార్వతీపురం తాలూకాలు | 1 | — |
| పాలకొండ | పాలకొండ తాలూకా | 1 | — |
| విజయనగరం | విజయనగరం డివిజన్ | 2 | — |
| సర్వసిద్ధి | సర్వసిద్ధి, గొలుగొండ, గూడెము తాలూకాలు. | 1 | — |
| వీరవల్లి | వీరవల్లి తాలూకా | 1 | — |
| విశాఖపట్టణము | విశాఖపట్టణము మునిసిపాలిటీ మినహా విశాఖపట్టణపు డివిజన్. | 1 | — |
| రాజమండ్రి | రాజమండ్రి, భద్రాచలం డివిజన్లు | 2 | — |
| అమలాపురం | అమలాపురం డివిజన్ | 2 | 1 |
| కాకినాడ | కాకినాడ మ్యునిసిపాలిటి మినహా కాకినాడ, పెద్దాపురం డివిజన్లు | 2 | 1 |
| ఏలూరు | ఏలూరు, కొవ్వూరు డివిజన్లు | 2 | 1 |
| భీమవరం | భీమవరం డివిజన్ | 1 | — |
| నర్సాపురం | నర్సాపురం డివిజన్ | 1 | — |
| బందరు | మచిలీపట్టణము మునిసిపాలిటీ మినహా బందరు, గుడివాడ డివిజన్లు | 2 | 1 |
| బెజవాడ | బెజవాడ మునిసిపాలిటి మినహా బెజవాడ నూజివీడు డివిజన్లు | 2 | — |
| గుంటూరు | గుంటూరు మునిసిపాలిటి మినహా గుంటూరు డివిజన్. | 1 | — |
| నర్సారావుపేట | నర్సారావుపేట డివిజన్. | 1 | — |
| తెనాలి | తెనాలి మునిసిపాలిటి మినహా తెనాలి డివిజన్. | 1 | — |
| మాయవరం | మాయవరం డివిజన్ | 1 | — |
| మన్నారుగుడి | మన్నారుగుడి డివిజన్ | 2 | — |
| నాగపట్నం | నాగపట్నం డివిజన్ | 1 | — |
| తిరుచునాపల్లి | శ్రీరంగం, తిరుచునాపల్లి మునిసిపాలిటీలు మినహా తిరుచునాపల్లి, కారూరు డివిజన్లు | 2 | — |
| ముసిరి | ముసిరి డివిజన్ | 1 | — |
| అరియాలూరు | అరియాలూరు డివిజన్ | 2 | 1 |
| దిండిగల్ | దిండిగల్ తాలూకా | 1 | — |
| పలిని | కొడయికెనాలు, పలిని, నీలకొట్టాయి తాలూకాలు | 2 | 1 |
| పెరియాకుళం | పెరియాకుళం తాలూకా | 1 | — |

| | | | |
|---|---|---|---|
| తిరుమంగళం | తిరుమంగళం తాలూకా | 1 | — |
| మేలూరు | మధుర మునిసిపాలిటి మినహా మేలూరు డివిజన్ | 1 | — |
| శ్రీవిల్లి పుత్తూరు | శ్రీవిల్లిపుత్తూరు తాలూకా | 1 | — |
| సత్తూరు | సత్తూరు, అరుప్పుకోట తాలూకాలు | 2 | 1 |
| రామ్నాడు | రామ్నాడు డివిజన్ | 1 | — |
| తిరుపత్తూరు (రామ్నాడుజిల్లా) | తిరుపత్తూరు తాలూకా | 1 | — |
| శివగంగ | శివగంగ, తిరువదానాయి తాలూకాలు | 1 | — |
| ట్యూటికోరన్ | ట్యూటికోరన్ డివిజన్ | 1 | — |
| కోయిల్ పట్టి | కోయిల్ పట్టి డివిజన్ | 2 | 1 |
| షెర్మదేవి | షెర్మదేవి డివిజన్ | 1 | — |
| తిన్నవేలి | తిన్నవేలి, పాలంకోట మునిసిపాలిటీలు మినహా తిన్నవేలి డివిజన్ | 1 | — |
| పొల్లాచి | పొల్లాచి, ఉడమలపేట తాలూకాలు | 2 | 1 |
| పల్లడం | పల్లడం తాలూకా | 1 | — |
| ఈరోడు | ఈరోడు తాలూకా | 1 | — |
| ఒంగోలు | ఒంగోలు డివిజన్ | 2 | 1 |
| గూడూరు | గూడూరు డివిజన్ | 2 | 1 |
| నెల్లూరు | నెల్లూరు డివిజన్ | 1 | — |
| కావలి | కావలి డివిజన్ | 1 | — |
| కందుకూరు | కందుకూరు డివిజన్ | 1 | — |
| రాజంపేట | రాజంపేట డివిజన్ | 1 | — |
| కడప | కడప, జమ్మలమడుగు డివిజన్లు | 2 | 1 |
| పెనుగొండ | పెనుగొండ డివిజన్ | 2 | 1 |
| గుత్తి | గుత్తి డివిజన్ | 1 | — |
| అనంతపురం | అనంతపురం డివిజన్ | 1 | — |
| కర్నూలు | కర్నూలు, ధోన్ డివిజన్లు | 2 | 1 |
| నంద్యాల | నంద్యాల, మార్కాపురం డివిజన్లు | 1 | — |
| చంద్రగిరి | చంద్రగిరి, కాళహస్తి తాలూకాలు | 1 | — |
| తిరుత్తని | తిరుత్తని, పుట్టూరు తాలూకాలు | 2 | 1 |
| తిరువళ్లూరు | తిరువళ్లూరు డివిజన్ | 2 | 1 |
| తిరుపత్తూరు (ఉత్తర ఆర్కాటు జిల్లా) | తిరుపత్తూరు తాలూకా | 1 | — |
| గుడియాట్టం | గుడియాట్టం తాలూకా | 1 | — |
| రాణిపేట | రాణిపేట డివిజన్ | 2 | 1 |
| చెయ్యూరు | చెయ్యూరు డివిజన్ | 1 | — |

| | | | |
|---|---|---|---|
| తిరువణ్ణామలై | తిరువణ్ణామలై డివిజన్ | 2 | 1 |
| తిండివనం | తిండివనం, గింగి తాలూకాలు | 2 | 1 |
| విల్లుపురం | విలుపురం తాలూకా | 1 | — |
| చిదంబరం | చిదంబరం డివిజన్ | 2 | 1 |
| కడలూరు | కడలూరు డివిజన్ | 1 | — |
| తిరుక్కోయిలూరు | తిరుక్కోయిలూరు డివిజన్ | 2 | 1 |
| తంజావూరు | తంజావూరు మునిసిపాలిటీ మినహా తంజావూరు, పట్టుకోట డివిజన్లు | 2 | 1 |
| కుంభకోణం | కుంభకోణం మునిసిపాలిటిమినహా కుంభకోణం డివిజన్ | 1 | — |
| ధర్మపురం | ధర్మపురం తాలూకా | 1 | — |
| గోబిచెట్టిపాలెం | గోబిచెట్టిపాలెం, కొల్లేగాల్ డివిజన్లు. | 2 | — |
| కోయంబత్తూరు | కోయంబత్తూరు మునిసిపాలిటీ మినహా కోయంబత్తూరు డివిజన్ | 1 | — |
| నీలగిరి | నీలగిరి జిల్లా | 1 | — |
| హోసూరు | హోసూరు డివిజన్ | 1 | — |
| ధర్మపురి | ధర్మపురి డివిజన్. | 1 | — |
| తిరుచంగోడు | తిరుచంగోడు తాలూకా | 1 | — |
| ఒమలూరు | ఒమలూరు తాలూకా | 1 | 1 |
| నమక్కల్ | నమక్కల్ డివిజన్ | 2 | — |
| సేలం | సేలం మునిసిపాలిటీ మినహా సేలం డివిజన్ | 2 | 1 |
| మందపూరు | మందపూరు డివిజన్ | 1 | — |
| పట్టూరు | పట్టూరు డివిజన్ | 1 | — |
| మంగుళూరు | మంగుళూరు డివిజన్ | 1 | — |
| చిరక్కల్ | చిరక్కల్ తాలూకా | 1 | — |
| కొట్టాయం | కొట్టాయం, వైనాడు తాలూకాలు | 1 | 1 |
| మలప్పురం | మలప్పురం డివిజన్ | 2 | — |
| కాలికట్ | కాలికట్ తాలూకా | 1 | — |
| మరుంబనాడ్ | మరుంబెనాడ్ తాలూకా | 1 | — |
| పాల్ఘాట్ | పాల్ఘాట్ తాలూకా | 1 | — |
| పొన్నాని | పొన్నాని తాలూకా, కొచ్చిన్ డివిజన్ | 1 | — |

## 2 మహమ్మదీయుల ఖండములు

### (i) నగర ఖండములు

| | | |
|---|---|---|
| మద్రాసు నగరము | మద్రాసు నగరము | 1 |
| కాలికట్, కన్ననూరు తెల్లిచెర్రిపట్టణములు | కాలికట్, కన్ననూరు, తెల్లిచెర్రి మునిసిపాలిటీలు | 1 |

### (ii) గ్రామ ఖండములు

| | | |
|---|---|---|
| విశాఖపట్టణము, తూర్పు గోదావరి | విశాఖపట్టణము, తూర్పు గోదావరిజిల్లాలు | 1 |
| పశ్చిమ గోదావరి కృష్ణ | పశ్చిమ గోదావరి, కృష్ణాజిల్లాలు | 1 |
| గుంటూరు | గుంటూరుజిల్లా | 1 |
| నెల్లూరు | నెల్లూరుజిల్లా | 1 |
| కడప | కడపజిల్లా | 1 |
| కర్నూలు | కర్నూలుజిల్లా | 1 |
| బళ్లారి | బళ్లారిజిల్లా | 1 |
| అనంతపురం | అనంతపురంజిల్లా | 1 |
| చిత్తూరు | చిత్తూరుజిల్లా | 1 |
| చెంగల్పట్టు, దక్షిణ ఆర్కాటు | చెంగల్పట్టు, దక్షిణ ఆర్కాటుజిల్లా | 1 |
| ఉత్తర ఆర్కాటు | ఉత్తర ఆర్కాటుజిల్లా | 1 |
| తంజావూరు | తంజావూరుజిల్లా | 1 |
| తిరుచునాపల్లి | తిరుచునాపల్లిజిల్లా | 1 |
| మధుర | మధురజిల్లా | 1 |
| రామనాడు | రామనాడుజిల్లా | 1 |
| తిన్నవెల్లి | తిన్నవెల్లిజిల్లా | 1 |
| సేలం, కోయంబత్తూరు, నీలగిరి | సేలం, కోయంబత్తూరు, నీలగిరి జిల్లాలు | 1 |
| చిరకాల్ | కన్ననూరు తా. మినహా చిరకాల్ తాలూకా | 1 |
| కొట్టాయం | తెల్లిచేరి మునిసిపాలిటీ మినహా కొట్టాయం, వైనాడు తాలూకాలు | 1 |
| మలప్పురం | మలప్పురం డివిజన్ | 2 |
| పాల్ఘాట్ | పాల్ఘాట్, కొచ్చిన్ డివిజన్లు | 2 |
| పుత్తూరు | పుత్తూరు డివిజన్ | 1 |
| మంగళూరు | మంగళూరు డివిజన్ | 1 |

| | 3 స్త్రీల ఖండములు | |
|---|---|---|
| | (i) నగరఖండములు; జనరల్ సీట్లు | |
| మదరాసు నగరము | మదరాసునగరము | 1 |
| ఏలూరుపట్టణము | ఏలూరు మునిసిపాలిటి | 1 |
| తెల్లిచేరి, కాలికట్ | తెల్లిచేరి, కాలికట్ మునిసిపాలిటీలు | 1 |
| | (ii) గ్రామ ఖండములు; జనరలుసీట్లు | |
| కడలూరు | మునిసిపాలిటితో సహా కడలూరు డివిజన్ | 1 |
| బళ్లారి | మునిసిపాలిటితో సహా బళ్లారితాలూకా | 1 |
| డిండిగల్ | మునిసిపాలిటితో సహా డిండిగల్ తాలూకా | 1 |
| | (iii) మహమ్మదీయ నగరఖండములు | |
| మద్రాసునగరము | మద్రాసు నగరము | 1 |
| | (iv) ఇండియన్ క్రిస్టియన్ నగర ఖండములు | |
| తిన్నవేలి, పాలంకోటు, ట్యూటికోరన్ పట్టణములు | తిన్నవేలి, పాలంకోటు, ట్యూటికోరన్ మునిసిపాలిటీలు | 1 |
| | 4 ఆంగ్లో ఇండియను ఖండములు | |
| ఆంగ్లో ఇండియన్ | రాజధాని అంతయు | 2 |
| | 5 యూరపియన్ ఖండములు | |
| యూరపియన్ | రాజధాని అంతయు. | 3 |
| | 6 ఇండియన్ క్రిస్టియన్ ఖండములు | |
| ఉత్తర సర్కారులు | విశాఖపట్టణము, తూర్పు గోదావరిజిల్లాలు, ఆజిల్లాలలోని ఏజన్సీలు, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలును. | 1 |
| గుంటూరు, నెల్లూరు | గుంటూరు, నెల్లూరు జిల్లాలు | 1 |
| మధ్యజిల్లాలు | కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం, చిత్తూరు, ఉత్తర ఆర్కాటుజిల్లాలు. | 1 |
| దక్షిణఆర్కాటు, తిరుచునాపల్లి, కోయంబత్తూరు, సేలం | దక్షిణ ఆర్కాటు, తిరుచినాపల్లి, సేలం, కోయంబత్తూరు జిల్లాలు | 1 |

## ఇండియన్ క్రిస్టియన్ ఖండములు

| | | |
|---|---|---|
| తిన్నవెల్లి | తిన్నవెల్లి జిల్లా | 1 |
| పశ్చిమతీరము | నీలగిరి, మలబారు, దక్షిణ కన్నడజిల్లాలు | 1 |
| | 7 అజ్ఞానస్థితిలోనున్న స్థలముల జాతుల ఖండములు | |
| అజ్ఞానస్థితిలోని జాతుల ఖండము | గోలుగొండ, గూడెం, శృంగవరపుకోట, యెల్లవరం తాలూకాలు | 1 |
| | 8 వర్తక, పారిశ్రామిక, ప్లేంటర్ల ఖండములు | |
| యూరపియను వర్తక ఖండం | మద్రాసు ఛాంబర్ ఆఫ్ కామర్సు, మద్రాసు వర్తక సంఘము | 1 |
| మద్రాసు ప్లేంటర్సు | ది యునైటెడ్ ప్లేంటర్సు అసోసియేషన్ | 1 |
| దక్షిణఇండియా ఛాంబర్ ఆఫ్ కామర్సు | దక్షిణ ఇండియా ఛాంబర్ ఆఫ్ కామర్సు | 1 |
| నాటుకోటు చెట్ల సంఘము | నాటుకోటు చెట్ల సంఘము | 1 |
| | 9 భూస్వాముల ఖండములు | |
| ఉత్తరభాగపు భూస్వాములు i | విశాఖపట్టణము, తూర్పు గోదావరిజిల్లాలు | 1 |
| ఉత్తరభాగపు భూస్వాములు ii | పశ్చిమ గోదావరి, కృష్ణాజిల్లాలు | 1 |
| ఉత్తర, మధ్యభాగ ములభూస్వాములు | నెల్లూరు, చెంగల్పట్టు, చిత్తూరు, కడప, మద్రాసు, అనంతపురం జిల్లాలు | 1 |
| దక్షిణ, మధ్యభాగ ములభూస్వాములు | ఉత్తర ఆర్కాటు, దక్షిణ ఆర్కాడు, కోయంబత్తూరు, సేలం, తిరుచునాపల్లిజిల్లాలు | 1 |
| దక్షిణభాగపు భూస్వాములు | తంజావూరు, మధుర, రామనాడు, తిన్నవేలి జిల్లాలు | 1 |
| పశ్చిమతీరపు భూస్వాములు | మలబారు, నీలగిరి, దక్షిణ కన్నడజిల్లాలు | 1 |
| | 10 కార్మిక ఖండములు | |
| | (i) వర్తక యూనియన్ | |
| రైల్వేవర్తక యూనియన్ | రాజధానిలో పనిచేయుచున్న రిజిస్టర్డు వర్తక యూనియన్లు | 1 |
| నేతపనివాండ్ర వర్తక యూనియన్ | మద్రాసు నగరములో పనిచేయుచున్న నేతపనివాండ్ర రిజిస్టర్డు వర్తక యూనియన్లు | 1 |

| | | |
|---|---|---|
| | (ii) యూనియన్ కాని కార్మికవర్గము | |
| నేతపనివాండ్రు | కోయంబత్తూరు, మలబారుజిల్లాలలోని నేత మిల్లులు | 1 |
| మద్రాసు సిటీ డాక్ అండ్ ఫేక్టరీలేబరు (నేత, రైల్వే లేబరు మినహా) | మద్రాసు హార్బరు, మద్రాసు, చెంగల్పట్టు జిల్లాలలోనున్న (నేతమిల్లులు, రైల్వే కర్మాగారములు మినహా) నిత్యము పనిజేయు ఫేక్టరీలు | 1 |
| విశాఖపట్టణము, తూర్పుగోదావరిచేరిన డాక్ అండ్ ఫేక్టరీ లేబరు | విశాఖపట్టణపు హార్బరు, విశాఖపట్టణము, తూర్పుగోదావరిజిల్లాలలోనున్న (నేతమిల్లులు, రైల్వే కర్మాగారములు మినహా) యెల్లపుడు పనిజేయు ఫేక్టరీలు | 1 |
| పశ్చిమగోదావరి, కృష్ణా గుంటూరులకు చెందిన ఫేక్టరీ లేబరు | నిత్యము పనిచేయు (రైల్వే కర్మాగారములు మినహా) పశ్చిమగోదావరి, గుంటూరుజిల్లాలలోనున్న ఫేక్టరీలు | 1 |
| | 11 విశ్వవిద్యాలయ ఖండము | |
| విశ్వవిద్యాలయము | మద్రాసు, ఆంధ్ర, అన్నామలై విశ్వవిద్యాలయములు | 1 |

## 13-వ షెడ్యూలు
## అజ్ఞానస్థితిలో నున్న జాతులు
## 1-వ భాగము-మద్రాసు.

1. బగత, 2. భొట్టడ, 3. భూమియాలు, 4. రిస్సాయి, 5. ధక్కడ, 6. డాంబులు, 7. గడబలు, 8. ఘసిలు, 9. గొండి, 10. గాడులు, 11. కోసల్య గాడులు, 12. మగతగాడులు, 13. సీరితిగాడులు, 14. హోల్వ, 15. జడపులు, 16. జటపులు, 17. కమ్మరలు, 18. ఖట్టిలు, 19. కోదు, 20. కొమ్మరను, 21. కొండ ధొరలు, 22. కొండకాపులు, 23. కొండరెడ్లు, 24. కొండులు, 25 కోటియ, 26. కోయలేక గౌడ్, 27. మాదియలు, 28. మాలలు, లేక మాలిలు, లేక వాల్మీకులు, 29. మాలిలు, 30. మౌని, 31. మన్నధొర, 32. ముఖధొర, 33. ములి లేక ములియ, 34. మురియ, 35. ఓజులు లేక మెట్ట కమసాలులు, 36. ఓమనైతొ, 37. పైగరపూరు, 38. పలాసి, 39. పల్లి, 30. పెంటియాలు, 41. పొర్జలు, 42. రెడ్డిధొరలు, 43. రెల్లి లేక సచంది, 44. రోనలు, 45. సవరలు.

## తూర్పు గోదావరిజిల్లాలోని అజ్ఞానస్థితియందున్న జాతులు

1. కోయలు, 2. కొండరెడ్లు, 3. కొండధొరలు, 4. కొండకాపులు, 5. మాలలు, 6. కమ్మరులు, 7. మాదిగలు, 8. గడబాలు.

## మద్రాసు రాష్ట్రములోని షెడ్యూలు తరగతులు

(1) ఆది ఆంధ్రులు, (2) ఆదిద్రావిడులు, (3) ఆది కర్నాటకులు, (4) అజిలలు, (5) అరుంధతియార్లు, (6) బైరలు, (7) బకుడలు, (8) బండీలు, (9) బారికిలు, (10) బట్టాడాలు, (11) బావురీలు, (12) బెల్లారాలు, (13) బయగారీలు, (14) చచ్చటివారు, (15) చక్కిలియాన్లు, (16) చలవాదులు, (17) చమారీలు, (18) ఛండాలురు, (19) చెరుమన్లు, (20) దండాసీలు, (21) దేవేంద్రకులతన్లు, (22) ఘాసీలు, (23) గొడగాలీలు, (24) గొడారీలు, (25) గొడ్డాలు, (26) గోసంగీలు, (27) అడ్డీలు, (28) హసలాలు, (29) హాలేయాలు, (30) జగ్గాలీలు, (31) జంబువులు, (32) కల్లాడీలు, (33) కనకన్లు, (34) కొడలూవారు, (35) కూసలు, (36) కొరగాలు, (37) కవంబన్లు, (38) కురవన్లు, (39) మే రీలు, (40) మాదిగలు, (41) మైలలు, (42) మాలలు, (43) మాలదాసులు, (44) మాతంగులు, (45) మోగర్లు, (46) ముచ్చీలు, (47) ముండలాలు, (48) నలకేయవాలు, (49) నాయాడులు, (50) పగడాయీలు, (51) పైడీలు, (52) పైండాలు, (53) పాకీలు, (54) పల్లన్లు, (55) పంచాడాలు, (56) పమిడీలు, (57) పంచములు, (58) పనియాన్లు, (59) పన్నియండీలు, (60) పరాయాన్లు, (61) పరవాన్లు, (62) పులయాన్లు, (63) పుత్తురాయి వనన్లు, (64) రానేయార్లు, (65) రెల్లీలు, (66) సమగరాలు, (67) సంబన్లు, (68) సపారీలు, (69) సెమ్మన్లు, (70) తోటీలు, (71) తిరువళ్లువార్లు, (72) వల్లువన్లు, (73) వాల్మీకులు, (74) వెట్టువన్లు.

## 1936 వ సంవత్సరపు రాష్ట్ర కౌన్సిళ్లకు సంబంధించిన ఆర్డరు.

---

30-4-1936 తేదీని

చక్రవర్తిగారున్ను వారి కౌన్సిలున్ను సంప్రతించి సమకూర్చినది

(16-6-36 తేదీ పోర్టుసెంటుజార్జిగజెటు చూ.)

నిబంధన.

1. ఈ ఆర్డరుపేరు 1936 వ సంవత్సరపు రాష్ట్రికౌన్సిళ్ల ఆర్డరు.

2 (1) ఈ క్రిందిమాటల కర్థము తెలుపుచున్నాము:—

(i) "ఎగ్జిక్యూటివ్ కౌన్సి" లనగా గవర్నరుజనరలుగారి ఎగ్జిక్యూటివుకౌన్సిలు లేక గవర్నరుగారి ఎగ్జిక్యూటివు కౌన్సిలు. (ఎగ్జిక్యూటివుకౌన్సి లనగా గవర్నరుగారికి లేక గవర్నరుజనరల్ గారికి తోడ్పడుసంఘము. ప్రస్తుతము మద్రాసు రాష్ట్రి ములో 4 గురు చేరి అట్టి ఎగ్జిక్యూటివు కౌన్సిలుగా నేర్పడియున్నారు. వారు హోంమెంబరు, రెవిన్యూమెంబరు, లా మెంబరు, ఫైనాన్సుమెంబరు.)

(ii) "శాసనసభ" యనగా 1935 వ సంవత్సరపు ఆక్టునుబట్టికాని 1919 వ సంవత్సరపు ఆక్టునుబట్టికాని శాసనసభగా వ్యవహరించుసంస్థ.

(iii) "మంత్రి"యనగా 1935 వ సంవత్సరపు ఆక్టునుబట్టికాని 1919 వ సంవత్సరపు ఆక్టునుబట్టికాని మంత్రిగా గవర్నరువల్లగాని గవర్నరు - జనరల్ వల్లగాని నియమింపబడినయతడు.

(iv) "శాసించిన" యనగా రాష్ట్రిశాసనసభాచట్టములచే, లేదా ఆ చట్టముల ప్రకారము సమకూర్చిన నిబంధనలచే శాసించిన.

(v) "విధులు" అనగా గవర్నరుగారు 5వ అనుబంధము 20వ నిబంధన ననుసరించి సమకూర్చినవిధులు.

(vi) "మొత్తపురాబడి" అనగా ఆదాయపుచట్టము ననుసరించి నిర్ణయించిన రాబడి.

తక్కినమాటల కన్నింటికిని 6వ అనుబంధములోని అర్థములే రూఢియని తలంపవలెను.

(2) రెండుఖండములు జనరల్ సీట్లకు సంబంధించినగాని, రెండున్ను ఏక తరగతిసీట్లకు సంబంధించినగాని, వానిలో నొకటి గ్రామఖండము, ఒకటి నగరఖండమై యున్నను, నవి రెండున్ను ఒకేమాదిరి సీట్లని భావింపవలెను.

(3) ఆదాయపు పన్ను చెల్లించు నొకవ్యక్తి మొత్తపురాబడి నిర్ణయించునపుడు ఆవ్యక్తి యేకంపెనీలోనైన భాగస్వామిగా నున్నచో, ఆకంపెనీలో నతని వాటారాబడి, తక్కిన ఆదాయములు కలిపి, మొత్తపురాబడి నిర్ణయింపవలెను.

(4) 1935 వ సంవత్సరపు ఇండియాచట్టమును గూర్చి యీవిధులలో జేసిన ప్రసంగము, ఆచట్టముమారి ఆస్థానే క్రొత్తచట్ట మేర్పడినచో, క్రొత్తచట్టమును గూర్చి చేసినట్లే భావింపవలెను.

(5) ప్రస్తుత మమలులోనున్న జిల్లాలకు సంబంధించినవిధులు, ముందాజిల్లాలు మారి వానిస్థానే క్రొత్తజిల్లాలు నెలకొల్పినచో, ఆ క్రొత్తజిల్లాలకు సంబంధించినట్లే యోచింపవలెను. ఏఏ తేదీలనుండి యట్టి నిర్వచనము జరుగవలెనో గవర్నరుగారు నిరూపింపవలెను.

(6) ఫలాని బిరుదున్నవారికి ఓటున్నదా లేదా యనుసంశయము కలిగినచో, ఆసంశయముపై గవర్నరుజనరల్ గారి యభిప్రాయ మడిగి తెలిసికొని నివారించుకొనవలెను.

(7) ... ... ... ...

## ఎలక్షన్ ఖండముల విభజన

3. (1) ఎలక్షన్‌ఖండ విభాగక్రమము ఈ ఆర్డరుకు చేర్చిన అనుబంధములో తెలుపబడినది.

(2) ఆ అనుబంధములో తెలిపిన ఖండములనుండి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యుల నెన్నుకొనవలెను.

(3) ఏ ఖండమునుండి ఎందరు మెంబర్ల నెన్నుకొనవలెనో అందులోనే తెలిపియున్నాము.

4. ఏఖండమున కాఖండమునకు ప్రత్యేక ఓటరు జాబితా యుండును. ఆ జాబితాలో పేర్లున్నవారు మాత్రమే ఎలక్షన్‌లో పాల్గొన నర్హులు.

5. గవర్నరుగారు నిరూపించిన తేదీని ఓటున్నవారి పేర్లు ఓటరుజాబితాలో చేర్చవలెను.

(గవర్నరుగారు నిరూపించిన తేదీ 2-7-1936)

6. ఈ క్రింద వివరించినవారుమాత్రమే ఓటరుగా నుండ నర్హులు.

(1) 21 సంవత్సరములు నిండినవారు.

(2) (i) బ్రిటిషు సబ్జక్టు, లేక

(ii) స్వతంత్రప్రభువు, అతని ప్రజలలోనివాడు, లేక

(iii) బ్రిటిషు ఇండియా స్వతంత్రరాజ్య సమ్మేళనలో చేరని ప్రభువుగాని, అతని ప్రజలుగాని అర్హులని శాసన మున్నచో, నట్టివాడు.

7. ఏ కోర్టులోనైన మతిహీనుడుగా నిరూపింపబడిన వ్యక్తి ఓటరుగా చేర నర్హుడు గాడు.

8. మహమ్మదీయ ఓటరు జాబితాలలో మహమ్మదీయ ఓటర్ల పేర్లు మాత్రమే చేర్చవలెను. యూరపియనుజాబితాలలో యూరపియను ఓటర్ల పేర్లు మాత్రమే చేర్చవలెను ఇండియన్ క్రిస్టియన్ ఓటరు జాబితాలలో ఇండియన్ క్రిస్టియన్ ఓటర్ల పేర్లు మాత్రమే చేర్చవలెను.

9. పై 3 తరగతులలో నే ఓటరు జాబితాలోనైన పేరున్నవారిని జనరల్ ఓటరు జాబితాలో చేర్చరాదు.

10. జాబితాలు తయారుచేయునధికారులకు వలయు సంజాయిషీ ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసర్లు (ఆదాయపుపన్ను విధించునధికారులు) యీయవలెను.

11. (1) ప్రతి ఓటరున్ను ప్రథమ ఎన్నికలలోగాని, 3 సంవత్సరముల పిదప జరుగు ఎన్నికలలోగాని, ఒక్క ఎలక్షన్‌ఖండములోమాత్రమే ఓటు వేయవలెను. పెక్కుఖండములలో నతడు ఓటువేసినచో నతడు వేసిన ఓట్లన్నియు రద్దగును.

(2) ప్రతిరాష్ట్రములోను ఓటర్ల పేర్లు ఒక్కఖండపు జాబితాలలో మాత్రమే చేరునట్లు నిబంధన లేర్పరుపవలెను.

(3) ఏ ఓటరైనను ఒక్కసారిమాత్రమే ఓటు వేయవచ్చునుగాని పెక్కు సార్లు వేసినచో నతడు వేసిన ఓట్లన్నియు నిరర్థకము లగును.

12. ఏ ఓటరైనను ఎలక్షన్ నేరములుగాని, అక్రమచర్యలుగాని చేసినట్లయిన, ఆ పిమ్మట నతడు ఓటువేయ నర్హుడు గాడు. అట్టివారి పేరు వెంటనే ఓటరుజాబితా నుండి తొలగింపవలెను.

13. ద్వీపాంతరవాస శిక్షగాని, ఖైదుశిక్షగాని అనుభవించుచున్నవాడు ఓటు వేయరాదు.

## భర్తల హక్కులనుబట్టి ఓట్లుపొందిన స్త్రీలు

14. (1) భర్తహక్కునుబట్టి ఒకస్త్రీపేరు జాబితాలో చేర్చినపిదప, ఆమెభర్త మరణించినను, ఆమె ఓటునకు భంగమురాదు. కాని ఆమె పునర్వివాహము చేసికొన్నచో ఓటు నశించును. ఓటుహక్కునకు భంగకరములగు పరిస్థితు లేర్పడినచో (ఉదా. ఆమెకు ఖైదుశిక్ష పడినచో) ఆమెఓటు పోవును.

(2) ఏ పురుషునికైన పలువురుభార్య లున్నను, ఒకరిపేరుమాత్రమే జాబితాలో చేర్తురు. ఏభార్యపేరు చేర్చవలసినదో నిర్ణయించుక్రమ మేర్పరతురు.

ఓట్లజాబితాలో చేరినస్త్రీ భర్తమరణానంతరము నివాసము మార్చినచో, ఆమె క్రొత్తనివాసమునకు చెందినజాబితాలో నామెపేరు చేర్చి వెనుకటిజాబితాలో నామెపేరు తొలగింపవలెను.

15 మరియొకరి తరపున గార్డియన్‌గా లేక మేనేజరుగా లేక ట్రస్టీగా పన్నులు చెల్లించినవారున్ను ఆస్తులు భుక్తపరుచుకొనువారున్ను ఓటర్లుగా నుండ నర్హులుకారు.

## అభ్యర్థుల కుండవలసిన యోగ్యతలు

16. (1) ఈ నిబంధనలో అభ్యర్థుల కుండవలసిన యోగ్యతలు తెలుపుచున్నాము.

(2) ఏ ఎలక్షన్‌ఖండములోనైన అభ్యర్థిగా నిలువ నర్హుడైనవాడు ఆ ఖండములో ఓటు హక్కున్నవాడు, లేదా ఆ తరగతికి చెందిన మరియొకఖండములో ఓటు హక్కున్నవాడు.

(3) లెజిస్లేటివ్ అసెంబ్లీలోని సభ్యులు కౌన్సిల్ ఆఫ్ స్టేటు మెంబర్ల నెన్నుకొనువిధాన ముండవచ్చును.

(ఆ విధానము చెన్నరాష్ట్రములో నమలులో లేదు.) ... ...

(4) రాష్ట్రములో నివసించు నెవరినైన (అనర్హతలకు లోనుకానివారిని ఉదా. ఖైదుశిక్ష, లేక మతిహీనత) గవర్నరు కౌన్సిలు సభ్యునిగా నియమింపవచ్చును.

17. (1) నామినేషన్లు దాఖలు చేయవలసిన తేదీలు, వానిని తనిఖీచేయు తేదీలు, ఓట్లు పుచ్చుకొను తేదీలు గవర్నరుగా రేర్పరతురు.

(2) నామినేషన్లకు ఓటింగుకు మధ్య ఫలాని రోజులు గడువుండవలెననిగాని, దాఖలు తేదీలకు తనిఖీలకు మధ్య కొన్నిరోజులు గడువుండవలెననిగాని, ఉభయ శాసనసభలున్ను నిరూపింపవచ్చును. అట్టి నిరూపణ గవర్నరుగారు గౌరవింపవలెను.

18 ఒక ఖండములో మెంబర్ల నెందర నెన్నుకోవలసి యున్నదో ఆ ఖండము లోని ఓటర్ల కన్ని ఓట్లుండును. వారు వానిని వేరువేరు అభ్యర్థుల కీయవచ్చును, లేదా ఒకరికే యిచ్చిన నీయవచ్చును. ... ... ... ...

... ... (బెంగాలునకు సంబంధించినది.)

19. ఇరువు రభ్యర్థులకు సమానముగా ఓట్లువచ్చినచో రిటర్నింగుఆఫీసరు లాట్లువేసి లాట్లలో గెల్చినవారి ఓట్లసంఖ్యకు ఒక ఓటుచేర్చి వారిని ఎలక్షన్‌లో విజయులైనట్లు నిర్ణయించును.

20. లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబర్లు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుల నెన్నుకొనువిధానము ......(మద్రాసు రాష్ట్రములో నమలులో లేదు)

21. ఒకేవ్యక్తి పెక్కుసీట్లు కెన్నుకోబడినచో నతను విధ్యుక్తకాలములోపుననే ఒక్కసీటు మినహా తక్కిన సీట్లన్నింటికిని రాజీయియ్యవలెను. అట్లు రాజీయీయని చో నతడు సీట్లన్నియు గోల్పోవును.

22. గవర్నరుగారికి యుక్తమని తోచినచో నేఖండపుపేరైనను మార్చవచ్చును.

23. 1935 వ సంవత్సరపు ఆక్టువిధుల ననుసరించి గవర్నరుగారు నిర్వహింపవలసిన విధులు ప్రస్తుతములో (అనగా ఆ ఆక్టు యింకను అమలులోనికి రాకపూర్వము)గవర్నరు గారున్నూ వారి మంత్రులున్నూ సంప్రతించి నిర్వహింతురు.

---

## 2-వ భాగము-మద్రాసునకు సంబంధించినవిధులు.

1. చదువుకొన్నవాడు ప్రతివాడున్నూ ఓటరుగా చేర నర్హుడు.

2. ఈ క్రిందివారికి ఓటుహక్కున్నది:—

వెనుకటి ఆర్థికసంవత్సరమునందు రు 7,500/-లకు తక్కువగాని సాలీనారాబడిపై ఆదాయపుపన్ను చెల్లించినవారు.

(ii) సాలీనా రు 1,500/-లకు తక్కువగాని ఆదాయమువచ్చు మద్రాసురాష్ట్రములోని ఎస్టేటున కధిపతియై యున్నవాడు.

(iii) సాలీనా రు 300/-లకు తక్కువగాని ఆదాయమువచ్చు భూమికి యీనాందారు, లేక జిరాయితీపట్టాదారు, లేక సాగుహక్కున్న రహితై యున్నవాడు;

(iv) సాలీనా రు 500/-లకు తక్కువగాకుండ గవర్నమెంటువల్ల భరణము పొందుచున్నవాడు.

(v) దివానుబహదూరు, సర్దారు బహదూరు, ఖాన్ బహదూరు, రాయిబహదూరు లేక రావుబహదూరు బిరుదులు కాని, ఆపై బిరుదులుగాని గవర్నమెంటువల్ల పొందిన వారు.

(vi) గవర్నమెంటువల్ల నెలకు రు 250/-లకు తక్కువకాని పింఛను పుచ్చుకొనుచున్నవారు

(vii) ప్రస్తుతములోగాని యిదివరలోగాని,

(అ) ఏ శాసనసభలోనైన సభ్యుడైయున్నవాడు లేదా,

(ఆ) ఎగ్జిక్యూటివ్ కౌన్సిలరు లేక మంత్రియైనవాడు, లేక

(ఇ) ఏ విశ్వవిద్యాలయమునకైన ఛాన్సెలరు, లేక ప్రోఛాన్సెలరు, లేక వైస్ ఛాన్సెలరు, లేక ఫెలో, లేక సినేటరు అయినవాడు, లేదా,

(ఈ) ఫెడరల్ కోర్టుజడ్జి, లేక హైకోర్టుజడ్జి, లేక కమిషనరుకోర్టుజడ్డి యైన వాడు.

(ఎ) మద్రాసు, కలకత్తా, బొంబాయి కార్పొరేషనులలో మేయరు, లేక షెరిఫ్‌గా వ్యవహరించువాడు.

(ఏ) రాష్ట్రములో నేజిల్లాబోర్డునకైన ప్రెసిడెంటు, ఏ మునిసిపాలిటీకైన చైర్మనుగా వ్యవహరించువాడు, వ్యవహరించినవాడు.

(ఐ) ఏ సెంట్రల్ బ్యాంకుకుగాని, బ్యాంకుల సంఘములకుగాని ప్రెసిడెంటుగా వ్యవహరించువారు, వ్యవహరించినవారున్ను ఓటర్లయి యుందురు.

## స్త్రీ వోటర్లకుండవలసిన యోగ్యతలు

3. ఈ దిగువ నుదాహరించిన పురుషు భార్యలకు ఓట్లున్నవి:—

(1) రు 20,000/-లకు తక్కువగాని సాలీనా ఆదాయముపైన క్రిత ఆర్థికవత్సరములో ఆదాయపుపన్ను చెల్లించినవాడు.

(2) రు. 3,000/-లకు తక్కువగా సాలీనా ఆదాయమువచ్చు ఎస్టేటుకు అధిపతి.

(3) రు. 1,500/-లకు తక్కువగాని సాలీనా ఆదాయము వచ్చుభూమికి యీనాందారు, జిరాయితీ పట్టాదారు, లేక సాగుహక్కున్న రహితుగా నమోజు కాబడినవాడు.

(4) సాలీనా రు. 1,500/-లకు తక్కువగాకుండా గవర్నమెంటువల్ల భరణము పొందుచున్నవాడు.

(5) 2, వ రూలు (v) (vi) నిబంధనలలో చేరినవారు. (బిరుదులు పొందిన వారు, పింఛను పుచ్చుకొనుచున్నవారు.)

## మెడ్రాస్యాలు తరగతి ఓటర్లకుండవలసిన యోగ్యతలు.

4. మెడ్రాస్యాలు తరగతులకు చెందిన ఓటరున కీ క్రింది యోగ్యతలలో నేదియో యొకటి యున్ననేగాని, ఓటుండదు.

(1) వెనుకటి ఆర్థికసంవత్సరములో నాదాయపుపన్ను చెల్లించినవాడు.

(2) సాలీనా రు. 100/-లకు తక్కువగాని ఆదాయము తెచ్చు ఎస్టేటున కధిపతి.

(3) సాలీనా రు. 50/-లకు తక్కువగాని ఆదాయమువచ్చు భూమికి యీనాందారు లేక సిరాయితీ పట్టాదారు లేక సాగుహక్కున్న రహితుగా నమోదై యున్నవాడు.

(4) మలబారునకు సంబంధించినది.

(5) వెనుకటి ఆర్థికసంవత్సరములో సాలీనా రు. 100/లకు తక్కువగాని శిస్తు మొత్తమేర్పరచినభూమికి రిజిస్ట్రీకౌలుదారుగా లేక ఖండిగుత్త కౌలుదారుగా వ్యవహరించునాతడు.

(6) మలబారునకు సంబంధించినది.

(7) సాలీనా రు. 100/-లకు తక్కువగాని శిస్తుమొత్తముకు భూమి కౌలునకు పుచ్చుకుని సాగుచేయుచున్నవాడు.

(8) వెనుకటి ఆర్థికసంవత్సరములో యీక్రిందిపన్ను లేవిగాని (మొత్తము రు. 20/-లకు తక్కువగాకుండా) చెల్లించినవాడు.:—

(అ) ఇంటిపన్ను

(ఆ) వృత్తిపన్ను.

(ఇ) భూమిపన్ను లేక ఆస్తిపన్ను.

5. (1) ఆస్తి పలువురి పేర జాయింటుగా నమోదైయున్నచో, లేదా పలువు రేకస్థులై పన్నుచెల్లించుచున్నచో, ఓకెవ్వరికిన్ని ఉండదు. దాని కీ క్రిందిమినహాయింపు లున్నవి.

(2) ఓటుహక్కు నొసంగు ఆస్తి ననుభవించువారును, పన్నుచెల్లించువారున్ను జాయింటుదారులైనచో

(అ) వారి జాయింటుసంస్థ హిందూ సమిష్టికుటుంబమైనచో, ఆకుటుంబ యజమానిని ఓటరుగా చేర్పవలెను.

(ఆ) అట్టిసంస్థ మరియొక సమిష్టికుటుంబమైనచో, ఆకుటుంబములోని మెంబర్లెన్నుకొనిన యాతనిని ఓటరుగా చేర్పవలెను.

(ఇ) తక్కిన జాయింటుసంస్థలలోని సభ్యులే వారిలో నెవరు ఓటరుగాచేరవలసినది నిర్ణయింతురు.

(3) ఈ నిబంధన ఆదాయపుపన్ను కట్టుకంపెనీలలోని భాగస్వాములకను వర్తింపదు.

---

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ షెడ్యూలు

### 1వ భాగము – మద్రాసు రాష్ట్రములోని ఎలక్షన్ ఖండములు

| ఖండము పేరు | ఖండపు పరిమితి | సీట్ల సంఖ్య |
|---|---|---|
| | 1 జనరల్ ఖండములు | |
| మద్రాసు | మద్రాసునగరము | 2 |
| విశాఖపట్టణము | విశాఖపట్టణము జిల్లా | 3 |
| తూర్పుగోదావరి | తూర్పుగోదావరి జిల్లా | 3 |
| పశ్చిమగోదావరి | పశ్చిమగోదావరి జిల్లా | 2 |
| కృష్ణా | కృష్ణాజిల్లా | 2 |
| గుంటూరు | గుంటూరు జిల్లా | 1 |
| నెల్లూరు | నెల్లూరుజిల్లా | 1 |
| కడప | కడపజిల్లా | 1 |
| అనంతపురం | అనంతపురంజిల్లా | 1 |
| బళ్లారి | బళ్లారిజిల్లా | 1 |
| కర్నూలు | కర్నూలుజిల్లా | 1 |
| చెంగల్పట్టు | చెంగల్పట్టుజిల్లా | 1 |
| చిత్తూరు | చిత్తూరుజిల్లా | 1 |
| ఉత్తర ఆర్కాటు | ఉత్తర ఆర్కాటుజిల్లా | 1 |
| దక్షిణ ఆర్కాటు | దక్షిణ ఆర్కాటుజిల్లా | 1 |
| తంజావూరు | తంజావూరుజిల్లా | 3 |
| తిరుచినాపల్లి | తిరుచునాపల్లిజిల్లా | 1 |

| | | |
|---|---|---|
| మధుర | మధురజిల్లా | 1 |
| రామనాడు | రామనాడుజిల్లా | 2 |
| తిన్నవేలి | తిన్నవేలిజిల్లా | 1 |
| సేలం | సేలంజిల్లా | 1 |
| కోయంబత్తూరు నీలగిరి | కోయంబత్తూరు, నీలగిరిజిల్లాలు. | 1 |
| మలబారు | మలబారుజిల్లా | 2 |
| దక్షిణ కనర | దక్షిణకనరజిల్లా | 1 |
| | **2 మహమ్మదీయ ఖండములు** | |
| | **ఖండము పరిమితి** | |
| మద్రాసు ఉత్తరభాగము | విశాఖపట్టణము, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, అనంతపురం, బళ్లారి, కర్నూలు, చిత్తూరు జిల్లాలు. | 1 |
| మద్రాసు-ఉత్తర మధ్య భాగములు | మద్రాసు, చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు, దక్షిణ ఆర్కాటుజిల్లాలు | 1 |
| మద్రాసు - దక్షిణమధ్య భాగములు | తంజావూరు, తిరుచునాపల్లి జిల్లాలు | 1 |
| మద్రాసు-దక్షిణభాగము | మధుర, రామనాడు, తిన్నవేలి, సేలం, కోయంబత్తూరు, నీలగిరిజిల్లాలు. | 1 |
| మద్రాసు-పశ్చిమతీరము | మలబారు, దక్షిణ కనరజిల్లాలు | 2 |
| | **3 యూరపియన్ ఖండము.** | |
| | రాష్ట్రమంతయు | 1 |
| యూరపియన్ | **4 ఇండియన్ క్రిస్టియన్ ఖండము.** | |
| ఇండియన్ - క్రిస్టియన్ | రాష్ట్రమంతయు | 3 |

# మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబర్ల నెన్నుకొను విధానము

నిబంధన

1. ఈ నిబంధనలు మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబర్ల నెన్నుకొనుటకును, ఎలక్షన్ వివాదముల పరిష్కరించుటకును సమకూర్చబడినవి.

2. ఈ క్రిందిమాటల కర్థములు తెలుపుచున్నాము.

(1) (i) "ఆక్టు" అనగా 1935 వ సంవత్సరపు ఇండియాపరిపాలనా చట్టము.

(ii) "అసెంబ్లీ ఆర్డరు" అనగా 1936 వ సంవత్సరపు రాష్ట్ర అసెంబ్లీల ఆర్డరు.

(iii) సాపు జాబితాలో వ్రాసిన ఏభాగమునకైన నకలు తీయించి, అనకలు సరియైన నకలని రిజిస్ట్రేషన్ ఆఫీసరు రూఢిపరచి దరఖాస్తు దారునకిచ్చినచో, ఆనకలు "పబ్లికు నకలు"గా భావింపవలెను.

(iv) "అక్రమ చర్యల ఆర్డరు" అనగా 1936 వ సంవత్సరపు అక్రమచర్యల ఆర్డరు.

(v) "గెజెట్" అనగా ఫోర్టుసెంట్ జార్జిగెజెట్.

(iv) "గెల్చిన అభ్యర్థి" అనగా ఎలక్షన్‌లో నుత్తీర్ణుడైనవాడు. ఆతడు విజయుడైనట్లు క్రమమైన ప్రకటన జరిగి యుండవలెను.

(vi) "సంతకము చేసిన" యనగా, సంతకము చేయలేనివాడు వేలుముద్ర వేసిన అను నర్థమున్ను చేసికొనవలెను.

(2) గడు వేర్పరచుట కధికారమున్నవారికి గడువు పెంచుటకున్ను, క్రొత్త గడు వేర్పరచుటకున్ను కూడ నధికార మున్నది.

3. ఎన్నిక లేర్పరచుటలో నేదైన సందేహము కలిగినచో, ఆక్టు విధుల ననుసరించి గవర్నరుగా రొసగు నుత్తరువునుబట్టి ఆ సందేహనివృత్తి చేసుకొనవలెను.

4. ఈ నిబంధనలలో వాడిన మాటల అర్థమునుగూర్చి సంశయము కలిగినచో, (ఎలక్షన్ విచారణలో సంశయము కలిగినచో అందుపై కోర్టువారు తీర్పిత్తురు) గవర్నరుగారి కా సంశయము తెలిపి, వారి యభిప్రాయము ననుసరించి నడుచుకొనవలెను. గవర్నరుగారి తీర్పునకు తిరుగులేదు.

5. (1) ఈ ఆక్టు ననుసరించి గవర్నరుగారు నిర్వహింపవలసిన విధులన్నియు ఆక్టు అమలులోనికి రాకపూర్వము గవర్నరుగారు వారి కౌన్సిలుతో సంప్రతించి నిర్వహింపవలెను.

(2) ఆక్టు అమలులోనికి వచ్చినపిమ్మట యీ క్రింది నిబంధనల ననుసరించి నిర్వహింపవలసిన విధులు గవర్నరుగారు తమంతట తామే నిర్వహింపవలెను; యింకొకరి సలహా పుచ్చుకొవలసినప్రసక్తి లేదు:—

3, 4, 8, 9, 12 (1), 32, 96, 105 (2), 109 (1), 110, 112 (1), 112 (2), 116 నిబంధనలు.

గడువు లేర్పరచుట, పెంచుట, క్రొత్త గడువు లేర్పరచుటయు గవర్నరు గారు స్వతంత్రముగానే చేయవలెను.

6. ఏ స్వతంత్ర ప్రభువునైన, అతని ప్రజలలో నెవరినైనఅసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోవచ్చును. (5 వ అనుబంధము 1 (1) రూలుచూ.)

7. ఈ నిబంధనల ననుసరించి జరుపబడిన కార్యక్రమమును ఏ కోర్టులోను ఆక్షేపణచేయరాదు.

(ఆ కార్యక్రమము నాక్షేపించుచు ఏకోర్టులోనైన ఎట్టి గ్రంథమైన జరుప నుద్యమించినచో, రిజిస్ట్రేషన్ ఆఫీసర్లు వెంటనే గవర్నమెంటు ప్లీడరుగారికి పై 7 వ నిబంధన అమలులోనున్న విషయము తెల్పి, ఈ నిబంధనను బట్టి కోర్టువారికి పైవిషయము దఖలు పుచ్చుకొనుట కట్టి అధికారమున్ను లేదని వాదనపెట్టవలసినదని వ్రాయవలెను. ఒకవేళ కోర్టువారు ఆ గ్రంథములో గవర్నమెంటుకు వ్యతిరేకముగా ఎట్టి అర్డరైనను వేసినచో వెంటనే అందుపై పై కోర్టుకు అపీలు దాఖలుచేయించవలెను.

అనవసరముగా కోర్టులలో గ్రంథములు జరుగకుండ రిజిస్ట్రేషన్ ఆఫీసర్లు జాగరూకులై యుండవలెనని గవర్నమెంటువారు పై విధముగా వారికి హెచ్చరిక చేసినారు) (30-10-1936 తేదీ "హిందూ"పత్రిక చూడుము)

8 (1) క్రొత్త ఆక్టు వరకులు మద్రాసురాష్ట్రములో నమలులోనికి వచ్చుసరికి అసెంబ్లీ సిద్ధముగా నుండున ట్లిలోపుననే యెన్నికలు జరుపవలెను. ఇటుపైని వెనుకటి అసెంబ్లీ ముగియునప్పటికి క్రొత్త అసెంబ్లీ సిద్ధముగా నుండునట్లు క్రొత్త అసెంబ్లీ సభ్యుల నెన్నుకోవలెను.

(2) షెడ్యూలు తరగతులు ఎన్నుకోవలసిన సీట్లకు ముందుగా జరుగవలసిన ఎన్నికలు (సీటుకు నలుగురేసి అభ్యర్థుల నెంచుకొను ఎన్నికలు) ఫలాని తేదీలోపున

జరుపవలసినదని గవర్నరుగారు గెజెట్‌లో ప్రకటింపవలెను. ఫలాని తేదీలోపుగా తక్కిన సీట్లకన్నింటికిని మెంబర్ల నెన్నుకోవలసినదని ఆయాఖండములలోని ఓటర్లను హెచ్చరించుచు గవర్నరుగారు ప్రకటన చేయవలెను.

షెడ్యూలు తరగతుల ప్రథమ ఎలక్షన్ ఫలాని తేదీలోపుగా జరుపవలసినదని అసెంబ్లీ ముగిసే 4 మాసముల లోపుగా గవర్నరుగారు నిర్ణయింపవలెను.

ఏ సీటునకైన షెడ్యూలు తరగతులు ఎన్నుకొనిన 4 గురు అభ్యర్థులున్ను ఆక్టు, లేక విధుల ననుసరించి అనర్హు లని ఏ ఎలక్షన్ విచారణలోనైన తీర్పు జరిగినచో, గవర్నరుగారు తిరుగ వాయిదా యిచ్చి, ఆవాయిదాలోపుగా మరి నలుగు రభ్యర్థుల నెన్నుకోవలసిన దని షెడ్యూలు తరగతి ఓటర్లకు హెచ్చరిక నీయవలెను. అట్లు 4 గురున్ను ఎంచబడిన పిదప, ఆ 4 గురిలో మెంబరు నెన్నుకొనునిమిత్తమై, ఏ తేదీ లోపుగా ఎలక్షన్ జరుగవలెనో గవర్నరుగారు నిర్ణయింపవలెను.

**9. (1)** ఏమెంబరైన చనిపోవుటచే, లేక రాజీయిచ్చుటచే, లేక చట్టము ననుసరించి మెంబరుపదవి కనర్హుడగుటచే, ఆతనిపదవి ఖాళీ కావచ్చును. ఆ ఖాళీ సంభవించిన వెంటనే మరియొక మెంబరును ఫలానా తేదీలోపుగా ఎన్నుకోవలసిన దని ఆ ఖండపు ఓటర్లకు గవర్నరు హెచ్చరిక చేయవలెను. అట్టి హెచ్చరిక గెజెట్‌లో ప్రకటన కావలెను.

(2) పై బాపతు ఖాళీషెడ్యూలు తరగతి సీట్లలో సంభవించినచో, ఆ తరగతి ఓటర్లను ముందుగా 4 గురు అభ్యర్థులను నియమితవ్యవధిలోపుగా నెన్నుకోవలసినదని గవర్నరు హెచ్చరిక చేయవలెను; అట్లు 4 గురిని ఎన్నుకొనిన పిదప, నియమిత వ్యవధిలో మెంబరు నెన్నుకోవలసినదని హెచ్చరింపవలెను. గవర్నరుగారుచేయు హెచ్చరికలు గెజెట్‌లో ప్రకటింపవలెను.

షెడ్యూలు తరగతు లెన్నుకొనిన 4 గురు అభ్యర్థులును అనర్హులని ఏ ఎలక్షన్ విచారణలోనైన తీర్పిచ్చినచో, గవర్నరుగారు తిరిగి వాయిదాయిచ్చి, ఆ వాయిదా లోపుగా మరి 4 గురు అభ్యర్థుల నెన్నుకోవలసిన దని షెడ్యూలుతరగతి ఓటర్లకు హెచ్చరిక నీయవలెను. అట్లు 4 గురున్ను ఎంచబడినపిదప, ఆ 4 గురిలో మెంబరు నెన్నుకొను నిమిత్తమై ఏ తేదీలోపుగా ఎలక్షన్ జరుగవలెనో గవర్నరుగారు నిర్ణయింపవలెను.

**10.** ఎలక్షన్ ఖండములో రిటర్నింగు ఆఫీసర్లుగా నెవరు వ్యవహరింపవలెనో (అనగా ఓట్లుపుచ్చుకొని, ఎలక్షన్ ఫలితములు తేల్చునధికారి)అనుబంధములో తెలిపియున్నాము.

11. ఆ అనుబంధములో రిటర్నింగు ఆఫీసరు స్థానే వ్యవహరించుట కధికార మున్న ఆఫీసర్ల పేర్లున్ను తెలిపినాము. ఆ అధికార్లు,

(i) నామినేషన్లు పుచ్చుకొనుట.

(ii) అభ్యర్థిత్వములకు రాజీ లంగీకరించుట.

(iii) నామినేషన్లు తనిఖీచేయుట.

(iv) ఓట్లు లెక్కపెట్టుట.

ఈ విధులు సర్వసాధారణముగా చేయరాదు. రిటర్నింగు ఆఫీసరు స్వయముగా నా విధులను నిర్వహింపలేనిసందర్భ మేర్పడినపుడు (ఉదా. అత డనారోగ్యముగా నున్నపుడు) వారు పైవిధులుకూడ నిర్వహింపవచ్చును. రిటర్నింగు ఆఫీసరును గూర్చి యీ నిబంధనలలో ప్రసంగించినప్పుడు, అతనిస్థానే వ్యవహరించుట కధికారమున్న ఆఫీసర్లనుగూర్చియు ప్రసంగించినట్లే తలంపవలెను.

## షెడ్యూలు తరగతుల ప్రథమ ఎలక్షన్లు

12. (1) గవర్నరుగారు పై 8 (2) రూలు ననుసరించి చేసిన ప్రకటనమం దీక్రింది విషయములు తెలుపవలెను.

(i) షెడ్యూలు తరగతి ఓటర్లు అభ్యర్థులను ఏ తేదీలోపుగా నామినేషన్ చేయవలెనో (ఆ తేదీ గెజెట్ ప్రకటన జరిగిన తేదీకి 10 రోజులు దాటియుండరాదు)

(నామినేషన్ అనగా ఓటర్లలో నొకరు అభ్యర్థిత్వమున కొకరిపేరు ఉపపాదించుట, మరియొక ఓటరు బలపరచుట. మతలబుప్రకార మొక కాగితముపై అభ్యర్థిగా నొకరిపే రుపపాదించుచు నొక ఓటరు సంతకము చేయును. ఆ కాగితముపైనే అభ్యర్థి పేరు బలపరచుచు మరియొక ఓటరు సంతకము చేయును. తాను అభ్యర్థిగా నుండుట కంగీకారమున్నదని అభ్యర్థివ్రాసి సంతకముచేయును. పై విధముగా క్రమమైన కాగితము దాఖలు కాబడిననే ఏ యభ్యర్థియైన మెంబరుపదవి కెన్నబడుట కర్హుడు. ఎలక్షనుకు ముందుపెట్టు నామినేషన్. నామినేషన్ వ్రాయబడిన మతలబును నామినేషన్ కాగిత మందురు. అటుపైన ఎవరి నామినేషన్లు సక్రమముగా జరిగినవో తనిఖీచేయు నిమిత్తమై ఒకరోజు నియమించి, ఆరోజున దాఖలైన కాగితములు పరీక్షింతురు.)

(ii) నామినేషన్ల తనిఖీకి నియమించిన రోజు. (ఆరోజు నామినేషన్ల దాఖలు తేదీకి 3 రోజులు దాటియుండరాదు.)

(iii) ఓట్లు పుచ్చుకొనురోజు.

(vi) ఓట్లు లెక్కపెట్టురోజు.

(2) పై ప్రకటన జరిగిన వెంటనే, రిటర్నింగు ఆఫీసరు ఆవర్తమానము ఎల్లరకు తెలియునట్లు ప్రచురణ చేయవలెను. అట్టి ప్రచురణ 1 వ మతలబుననుసరించి ఒకే భాషలోగాని పెక్కు భాషలలోగాని వ్రాయవలెను. ఆ ప్రచురణ రిటర్నింగు ఆఫీసు నోటీసుబోర్డుపై నంటించవలెను; మరిన్ని ఎలక్షన్ ఖండములో వఁయు చాటింపుకూడా చేయించవలెను.

మద్రాసు పట్టణములోని ఎన్నికలలో ఆ ప్రచురణ ఫోర్టుసెంట్ జార్జిగజెట్ లో ముద్రింపవలెను; తక్కిన ఎన్నికలలో ఆ ప్రచురణ జిల్లాగజెట్ లో ముద్రింపవలెను. ఆ ప్రచురణ ఆ ఎలక్షన్ ఖండములలోని మునిసిపల్ ఆఫీసులలోను, తహశీల్ దార్ల, డిప్యూటీ తహశీల్ దార్ల ఆఫీసులలోను, కలెక్టరు ఆఫీసులోను అంటించవలెను.

13. నామినేషన్ కాగితముపై యిరువురు ఓటర్లు (జాబితాలో పేర్లున్న ఓటర్లు) సంతకములు చేయవలెను. వారిలో నొకరు అభ్యర్థి నుపపాదింపవలెను; రెండవవారు బలపర్చవలెను. అభ్యర్థిగా నిలుచుట కంగీకార మున్నట్లు అభ్యర్థి ఆ కాగితముపై వ్రాసి సంతకము చేయవలెను. ఆ కాగితము 2 వ మతలబుప్రకారము వ్రాయవలెను. ఆకాగితము అభ్యర్థి స్వయముగాగాని, లేదా ఉపపాదించిన ఓటరుగాని, లేదా బలపరచిన ఓటరుగాని రిటర్నింగు ఆఫీసరు యెదుట (లేదా అతని స్థానే పనిచేయు ఆఫీసరు యెదుట) నిర్ణీతవ్యవధిలోపున నేదియో ఒకరోజున పగలు 11 — 3 గంటల మధ్య దాఖలు చేయవలెను.

14. (1) అర్హతనుబట్టి లేక విధులనుబట్టి, లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యుడుగా నెన్నబడుటకు అర్హుడైన వానినే, షెడ్యూలు తరగతుల ప్రథమ ఎలక్షన్ లో అభ్యర్థిగా నామినేషన్ చేయవచ్చును.

(2) ఒక ఖండములో ఓటున్నవానిని, వేరు ఖండములో (ఆతరగతికి చెందిన) నభ్యర్థిగా నిల్పుచున్నచో, నామినేషన్ కాగితముతోబాటు ఆ అభ్యర్థికి ఓటున్న ఖండపు జాబితా పట్టికనకలు (జాబితా కంతకు పుచ్చుకో నక్కరలేదు.) పుచ్చుకొని దాఖలు చేయవలెను.

15. (1) షెడ్యూలుతరగతులకు చెందిన ఓటరు ఖాళీ లెన్నియున్నవో అన్ని నామినేషన్ కాగితములపై (ఉపపాదించుచు లేక బలపరచును) సంతకములు చేయ వచ్చును.

(ఒకే ఓటరు ఉపపాదించుచు, బలపరచుచు రెండు సంతకములు చేయరాదు. కాని ఓటర్లు వేరువేరు కాగితములపై వేరువేరు అభ్యర్థుల నామినేషన్ల కంగీకరించుచు సంతకము చేయవచ్చును. 6 ఖాళీలు నింపవలసి యున్నదనుకొనుము. 6 కాగితములపై ఏ ఓటర్లైనను ఉపపాదించుచు, (లేక బలపరచుచు), సంతకము చేయవచ్చును. 6 కాగితములలోను 6 గురు అభ్యర్థుల పేర్లు నామినేషన్ చేయవచ్చును. లేదా వేరు వేరు ఓటర్లు ఒకే అభ్యర్థి పేరు వేరువేరు నామినేషన్ కాగితములపై వ్రాసి దాఖలు చేయవచ్చును. అట్లు పెక్కు నామినేషన్లు దాఖలు చేసినను అతని అభ్యర్థిత్వమునకు భంగము రాదు.)

(2) ప్రతి అభ్యర్థియు తన తరఫున పనిచేయుటకు ఒక ఏజంటు నేర్పరుచు కొనవలెను. తనకు తన్నే ఏజంటుగా నేర్పరుచుకొనినను ఏర్పరుచుకొనవచ్చును. అట్టి ఏర్పాటు చేసినట్లు 2 వ షెడ్యూలులో తెలిపినరీతిగా కాగితము వ్రాసి నామి నేషన్‌తోపాటు దాఖలు చేయవలెను. అట్లు నియమించిన ఏజంటు (ఏవిధికను సంచిగాని) ఏజంటుగా పనిచేయుట కనర్హుడై యుండరాదు.

నామినేషన్ కాగితముతోబాటు పై కాగితమున్ను దాఖలైననేగాని అభ్యర్థి నామినేషన్ సక్రమమైనది కానేరదు.

ఒక అభ్యర్థి పేరు పెక్కు నామినేషన్ కాగితములలో నున్నను, యీ రెండవ కాగిత మొక్కటిమాత్రము దాఖలైన చాలును. (అనగా ఏజెంటును నియమించు పత్రము)

16. ఓటర్ల కిచ్చునిమిత్తమై 2 వ మతలబు నకళ్లు ముద్రింపించి రిటర్నింగు ఆఫీసులో సిద్ధపరుపవలెను.)

17. ఆఖరిరోజు (గడువులో ఆఖరురోజు) మధ్యాహ్నము 3 గంటలు దాటిన తర్వాత దాఖలైన నామినేషన్ కాగితములు పుచ్చుకోరాదు.

18. (1) నామినేషన్లు దాఖలుచేయునపుడు, అభ్యర్థి పేరున్ను ఉపపాదనచేసే ఓటరు పేరున్ను, బలపర్చే ఓటరు పేరున్ను వ్రాసియున్న ఓటరు జాబితానకలు చూపుమని నామినేషన్‌కాగితము దాఖలుచేయువారిని కోరుటకు రిటర్నింగు ఆఫీసరు కధికార మున్నది. నామినేషన్‌కాగితముపై వ్రాయబడిన అభ్యర్థి పేరున్ను, ఓటర్ల

పేరున్ను, నంబర్లున్ను, ఓటరుజాబితాలో వ్రాయబడినవానితో సరిచూడవలెను. నామినేషన్ కాగితములో నేవైన వ్రాతపొరబాట్లున్నచో వానిని సవరింపమని నామినేషన్ దాఖలుచేయువారిని కోరవచ్చును.

(2) ఓటరుజాబితాలో నేవైన వ్రాతపొరబాట్లున్నచో, ఆ పొరబాటును బట్టి తాను వదుచుకో నక్కరలేదని ఆఫీసరు అభిప్రాయపడవచ్చును. అట్టి సందర్భములో నతడు తన యభిప్రాయమునకు సబబులు వ్రాసియుంచవలెను.

19. నామినేషన్ దాఖలుచేయువారితో ఫలాని తేదీని, గంటలవేళ, ఫలానిచోట నామినేషన్లు తనిఖీచేతురని రిటర్నింగు ఆఫీసరు తెలుపవలెను. ఆ నామినేషన్ కాగితముపై రిటర్నింగు ఆఫీసరు వరుసనెంబరు వేసి, ఏతేదీని, ఎన్నిగంటల కా కాగితము తన యెదుట దాఖలయ్యెనో వ్రాయవలెను. అందులోని తవిశీళ్లున్ను, అభ్యర్థి పేరున్ను, ఇద్దరభ్యర్థుల పేర్లున్ను తెల్పుచు వెంటనే తన ఆఫీసులో నోటీసు కట్టింపవలెను.

20. (1) ఏ అభ్యర్థియైన తన అభ్యర్థిత్వమునకు రాజీ నీయవచ్చును. అట్టి రాజీ వ్రాయించి, అభ్యర్థి సంతకముచేసి రిటర్నింగు ఆఫీసరు యెదుట దాఖలుచేయవలెను. నామినేషన్ల తనిఖీకి నియమించిన తేదీకి మరుసటిరోజు మధ్యాహ్నం 3 గంటల లోపుగా రాజీలు దాఖలు కావలెను.

ఆ మరుసటిరోజు గవర్నమెంటు సెలవుదిన మైనచో, రాజీలు దానికి మరునాడు దాఖలు చేయవచ్చును.

(2) రాజీ దాఖలుచేయునభ్యర్థి దానిభావ మెరిగి దాఖలు చేయుచున్నట్లు రిటర్నింగు ఆఫీసరు మనస్సునకు తృప్తికల్గిననే అత డా కాగితమును పుచ్చుకొనవలెను. అభ్యర్థి స్వయముగా ఆఫీసరు యెదుటకు రాలేని రోగస్థితిలో నున్నచో, అందులకు నిదర్శనపత్రము గ్రామమునసబు లేక రివిన్యూశాఖలో పనిచేయు నుద్యోగివద్ద పుచ్చుకొని దాఖలుచేయవలెను. అట్టి సందర్భములో నుపపాదించిన ఓటరుగాని, బలపరచిన ఓటరుగాని, రిటర్నింగు ఆఫీసరు యెదుట హాజరయి రాజీ కాగితము దాఖలు చేయవచ్చును.

(3) ఒకసారి రాజీ దాఖలుచేసిన అభ్యర్థి ఆ ఎలక్షనులో తిరిగి అభ్యర్థిగా నిలువరాదు.

21. రాజీ దాఖలైన వర్తమానము వ్రాయించి రిటర్నింగు ఆఫీసరు కచ్చేరీలో ప్రకటింపవలెను.

22. నామినేషన్ దాఖలునిమిత్తమేర్పరచినగడువు ముగియకపూర్వమే ప్రతి అభ్యర్థి (లేక అభ్యర్థితరఫున మరియొకడు) రు 50/-ధరావత్తు సొమ్ము రిటర్నింగు ఆఫీసరుకు చెల్లింపవలెను. అట్లు చెల్లించిననేగాని నామినేషన్ సక్రమమైనది కాదు.

23 (1) పై 20 వ రూలుప్రకారము రాజీ దాఖలు చేసిన అభ్యర్థి ధరావత్తు మొత్తము వానికి వాపసుచేయవలెను. ఏ అభ్యర్థినామినేషనైన నిరాకరింపబడినచో, అతని ధరావత్తున్నూ వాపసుచేయవలెను. (అభ్యర్థితరఫున మరియొకరు సొమ్ముకట్టినచో సొమ్ముకట్టినవారికి వాపసుచేయవలెను.) ఓట్లు పుచ్చుకొనుటకు ముందుగా ఏ అభ్యర్థియైన చనిపోయినచో, వాని ధరావత్తు వారసునకు వాపసుచేయవలెను.

(2) ప్రథమ ఎన్నికలలో గెలుపొందిన ఆఖరు అభ్యర్థికి (అందరికంటె తక్కువ ఓట్లువచ్చి గెలుపొందిన అభ్యర్థికి) వచ్చిన ఓట్లలో $\frac{1}{4}$ వ వంతైనను ఓట్లురాని అభ్యర్థులు కట్టిన ధరావత్తులు గవర్నమెంటుకు చెందిపోవును.

(3) రద్దయిన ఓటుకాగితములు మినహా, తక్కిన వోటుకాగితములలో వేసిన ఓట్లు పై లెక్కలోనికి తీసికొందురు.

(4) పై 2 వ రూలు ప్రకారము గవర్నమెంటుకు చెందని ధరావత్తు సొమ్ములు ఆయా అభ్యర్థులకు (లేక చెల్లించినవారికి) ప్రథమ ఎన్నికలఫలితము తేలిన వెంటనే వాపసుచేయవలెను ; ప్రథమ ఎన్నికలలో నుత్తీర్ణులైనవారి ధరావత్తులు మెంబరు ఎన్నికఫలితము తేలినవెంటనే వాపసు చేయవలెను. ప్రథమ ఎన్నికలో నుత్తీర్ణుడైన వాడు మెంబరు ఎన్నికలో నోడిపోయినను వాని సొమ్ము వాపసుచేయవలసినదే.

ఒకే అభ్యర్థిని రెండు మూడు ఖండములలో నామినేషన్ చేసి రెండు మూడు ధరావత్తు మొత్తములు చెల్లించియున్నచో, ఏ సందర్భములోను అతనికి వాపసుచేయవలసినది ఒక్క ధరావత్తుమొత్తమే.

24. నామినేషన్లు తనిఖీరోజున రిటర్నింగు ఆఫీసరు తనిఖీచేయు గదిలో అభ్యర్థి, అభ్యర్థిపేరు, ఉపపాదించిన ఓటరొకడు, బలపరచిన ఓటరొకడు, అభ్యర్థితరఫున ప్రతినిధి యొకడు మాత్రమే హాజరుండవలెను. రిటర్నింగు ఆఫీసరుకు పనిలో సాయము చేయుటకై అతనిగుమాస్తాలు మొదలైనవారు హాజరుండవచ్చును. ప్రతి అభ్యర్థి తరఫునను పైన తెలిపినవారు మాత్రమే హాజరై యుండవచ్చును, కాని యితరులు లోనికి రారాదు. తన యెదుట దాఖలైన నామినేషన్లన్నియు పరిశీలించుటకు పైవారికి రిటర్నింగు ఆఫీసరు అవకాశ మీయవలెను.

25. (1) రిటర్నింగు ఆఫీసరు నామినేషన్లు తనిఖీ చేయవలెను. వానిపై హాజరున్న అభ్యర్థులున్ను, వారి తరఫువారున్ను తెలుపు ఆక్షేపణలు విమర్శింపవలెను.

అవసరమైనచో విచారణకూడ జరుపవలెను. ఆ వెనుక యీ క్రింది కారణములలో దేనినిబట్టియైన ఏ అభ్యర్థి నామినేషనైన నిరాకరింపవచ్చును.

(అ) ఏ అభ్యర్థియైన ఆక్టు లేక విధులనుబట్టి ఎలక్షనులో నభ్యర్థిగా నిల్చుట కనర్హుడగుట.

(ఆ) ఉపపాదన చేసిన ఓటరుకాని, బలపరచిన ఓటరుకాని, ఓటరుగా నుండ నవర్హుడగుట.

(ఇ) పై 13 లగాయితు 22 వరకు తెలుపబడిన విధులలో దేనినైన అభ్యర్థి లేక (ఉపపాదించిన లేక బలపరచిన) ఓటరు ఉల్లంఘించుట.

(2) (అ) ఓటరు జాబితా పబ్లికు నకలులో అభ్యర్థిపేరు, ఉపపాదకునిపేరు,బల పరచు ఓటరుపేరు కనపరచినచో వారికి వలయు నర్హత యున్నవనియే భావింపవలెను. వారికి ప్రత్యేకముగా ఫలానిమాదిరి అనర్హత లున్నవని రుజువైననేకాని, యిక నావిష యము శంకింపరాదు.

(ఆ) ఒక ఓటరు పెక్కు నామినేషన్లపై సంతకములు చేసినచో (ఉపపా దించుచు లేక బలపరచుచు) ఖాళీ లెన్నియున్నవో అన్ని ఖాళీలకు సరిపోవు నామి నేషన్ల పైనిమాత్రమే అతడు సక్రమముగా సంతకము చేసినట్లు యోచింతురు. ముందు దాఖలైన కాగితములు (4 ఖాళీ లున్నచో ముందు దాఖలైన 4 కాగితములున్ను) సక్రమము లని భావించి, మిగతావానిని త్రోసిపుత్తురు.

(3) ఒకే అభ్యర్థిపేరు పెక్కు నామినేషన్లలో వ్రాసియున్నప్పుడు, ఆ నామినేషన్లలో కొన్ని నిరాకరించినను శాస్త్రవిహితమైన నామినేషను ఒక్క టున్నను అతడు సక్రమముగా నామినేషను కాబడినట్లే యోచింపవలెను.

26. (1) ప్రతినామినేషను కాగితముపై రిటర్నింగు ఆఫీసరు తన యభిప్రాయము తెలుపవలెను. అంగీకరించినచో కారణములు వ్రాయనక్కరలేదు; నిరాకరించినచో వ్రాయవలెను.

(2) తనిఖీ ప్రారంభమైన రోజుననే ముగియవలెను కాని, అందునిమిత్తము వాయిదా వేయరాదు.

27. తనిఖీ పూర్తియైన పిదప, రాజీలు దాఖలుచేయు గడువు దాటనిచ్చి, నిల్చి యున్న అభ్యర్థుల పేర్లు జాబితాలో వ్రాసి (అనగా నామినేషను లంగీకరింపబడిన అభ్యర్థుల పేర్లు) ఆజాబితా రిటర్నింగు ఆఫీసరు తన కచేరీ నోటీసుబోర్డులో ప్రచురింప వలెను.

28. ఖాళీల సంఖ్యకంటె అభ్యర్థుల సంఖ్య హెచ్చుగా నున్నచో 3 వ మతలబు ననుసరించి అభ్యర్థుల పేర్లన్నియు వ్రాసి రిటర్నింగు ఆఫీసరు ప్రచురింపవలెను. అభ్యర్థులపేర్లు అకారాదిగా ( ఇంటిపేర్లను బట్టి ) వ్రాయవలెను. అభ్యర్థులపేర్ల కెదురుగా వరుస సంఖ్యయు ఆ అభ్యర్థికి ప్రత్యేకముగా నేర్పరచిన రంగుపేరును తెలుపవలెను.

(ఓట్లు పుచ్చుకొనుటలో సదుపాయముగానుండునని.తలచి ప్రతిఅభ్యర్థికి ప్రత్యేకముగా నొక రంగేర్పరుతురు. ఈపద్ధతి క్రొత్తగా నీచట్టమమలులోనికి వచ్చినతర్వాత ప్రవేశపెట్టినారు.)

29. (1) అభ్యర్థులసంఖ్య 4 గురికి మించినచో ఓట్లు పుచ్చుకొనవలెను.

(2) అభ్యర్థులు 4 గురే అయినచో వారు 4 గురున్ను ప్రథమ ఎలక్షన్‌లో నుత్తీర్ణులైనట్లు నిర్ణయింపవలెను.

(3) అభ్యర్థులు 4 గురికి తక్కువమంది యున్నచో, వారందరున్ను ప్రథమ ఎలక్షన్‌లో నుత్తీర్ణులైనట్లు నిర్ణయింపవలెను.

అభ్యర్థి ఒక్కడే యున్నచో నాతడు మెంబరుపదవికి నూటిగా నెన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను.

ఒక అభ్యర్థియు నిలువనిచో (లేక నిలిచిన ఒక అభ్యర్థియు కాలవశము చెందినచో) గవర్నరుగారు షెడ్యూలు తరగతి ఓటర్లను మరి 4 గురు అభ్యర్థుల నెన్నుకోవలసినదని నిర్ణీతవ్యవధిలో హెచ్చరిక చేయవలెను. అట్లు హెచ్చరిక పొందియు ఆతరగతి ఓటర్లు సకాలములో అభ్యర్థుల నెన్నుకోనిచో, ఆ తరగతి మెంబరుపదవి ఖాళీగా నుండిపోవును. లేదా షెడ్యూలు తరగతి అభ్యర్థి ఎవరైనను కడపటి మెంబరు ఎలక్షన్‌లో నుత్తీర్ణుడైనచో ఆత డాపదవి గైకొనును. ఖాళీగా నుంచినసీటుకు తిరిగి మెంబరు నెన్నుకోవలసినదని షెడ్యూలుతరగతులకు గవర్నరుగారు మరల హెచ్చరిక నెప్పుడీయవలెనో గవర్నరుగారే నిర్ణయింతురు.

30. ప్రతి ఓటరునకున్ను ఒక్కొక్క ఓటుకాగిత మిత్తురు. దాని నాతడు తన కిష్టమున్న అభ్యర్థి కీయవచ్చును. ఓట్లపెట్టెలు ఏ అభ్యర్థి కా అభ్యర్థికి వేరుగానుంచి ఏ అభ్యర్థి కేర్పరచిన రంగు ఆ అభ్యర్థి ఓట్లపెట్టెకు పూయించి, దానిపై అభ్యర్థి నెంబరుకూడా వేయవలెను. ఓటరు ఆరంగు, సంఖ్యనుబట్టి ఆనవాలుపట్టి తన మనస్సునకు నచ్చిన అభ్యర్థిపెట్టెలో ఓటుకాగితము పడవేయవలెను. ఓట్లు పుచ్చుకొనుపద్ధతులు 51 వ రూలు లగాయతు 73 వ రూలువరకు వున్న నిబంధనలలో తెలుపబడినవి ఆ పద్ధతులను షెడ్యూలు తరగతుల ఎన్నికలలోకూడ గమనింపవలెను.

31. (1) గవర్నరు నిర్ణయించిన తేదీని ఓట్లలెక్క ప్రారంభింపవలెను. వేళ, ప్రదేశము రిటర్నింగు ఆఫీసరు నిర్ణయించును. ఆ తేదీ, వేళ, ప్రదేశము అభ్యర్థుల కందరకున్ను, వారి ఏజంట్లందరికిన్ని రిటర్నింగు ఆఫీసరు తెలుపవలెను.

(2) ఓట్లు రిటర్నింగు ఆఫీసరు స్వయముగా లెక్కపెట్టవచ్చును, లేదా తన యెదుట మరియొకరిచే లెక్కపెట్టించవచ్చును. అభ్యర్థులున్ను, అభ్యర్థి కొకరిచొప్పున వారి ప్రతినిధులున్ను (వ్రాతమూలముగా నియమించుకొన్నవారు) మాత్రయే ఆ సమయములో హాజరుగా నుండవచ్చును. రిటర్నింగు ఆఫీసరు సహాయార్థ మేర్పరచిన మనుష్యులు తప్ప తదితరులు లోనికి రారాదు. ఆఫీసరు ఎలక్షనులో ఏఅభ్యర్థితరఫువనైన పనిచేసినవారిని తన సహాయార్థమై నియమించుకొనరాదు.

(3) లెక్క పూర్తికాగానే, ఎక్కువ ఓట్లువచ్చినవారి పేర్లుచెప్పి, వారు విజయులైనట్లు ఆఫీసరు నిర్ణయింపవలెను.

(4) ఇద్దరభ్యర్థులకు సమానముగా ఓట్లు వచ్చినచో ఆఫీసరు లాట్లువేసి, లాట్లలో గెలుపొందినవారికి ఒక ఓటు అదనముగా చేర్చి, వారు విజయులైనట్లు నిర్ణయింపవలెను.

(5) విజయులైనవారి పేర్లు ఆఫీసరు తనకచేరీ నోటీసు-బోర్డులో నంటింపించవలెను. మరిన్ని వారు విజయులైనట్లు గవర్నమెంటుకు వ్రాయవలెను.

## సాధారణపు ఎలక్షన్లు

(ఈ ఎలక్షనులో ప్రథమ ఎలక్షను ఒకటియు, కడపటి ఎలక్షను ఒకటియు నుండదు. ఒక్కసారి ఎన్నికలలోనే మెంబర్లను స్థిరపరుతురు)

32. గవర్నరుగారు 8 (2) రూలు, లేక 9 (1) రూలు ననుసరించి చేయు ప్రకటనలో

(1) ప్రకటన తేదీకి 21 రోజులు మించకుండ నామినేషన్లు దాఖలుచేయు తేదీ యేర్పరుపవలెను.

(2) నామినేషన్ల దాఖలు తేదీకి 3 రోజులు మించకుండ నామినేషన్లు తనిఖీ చేయు తేదీ యేర్పరుపవలెను.

(3) ఓట్లు పుచ్చుకొను తేదీ, (లేక తేదీలు) నిర్ణయింపవలెను.

(4) ఓట్లు లెక్కపెట్టుతేదీ (లేక తేదీలు) నిర్ణయింపవలెను.

33. గవర్నరుగారి ప్రకటన జరుగగానే, రిటర్నింగు ఆఫీసరు ఎలక్షను జరుగనున్నదను వర్తమాన మెల్లరకును తెలియునట్లు (4 వ మతలబుననుసరించి తనకు యుక్తమని

తోచినభాషలో ప్రకటనవ్రాసి ప్రకటింపవలెను; ఎంక్షన్ ఖండములో ఆప్రకటన రిట ర్నింగు ఆఫీసరుకు యుక్తమని తోచేపద్ధతిని ప్రచురింపవలెను. ఆఖండములోని మునిసి పల్ ఆఫీసులలోను, కలెక్టరు ఆఫీసులలోను, డివిజనల్ ఆఫీసులలోను, తహసీల్దారు డిప్యూటీ తహసీల్దార్ల ఆఫీసులలోను, సబ్ మేజస్ట్రీటు ఆఫీసులలోను ఆప్రకటన నంటింపించవలెను. ఆ ప్రకటన యీ క్రింది గెజెట్టులలోకూడా ప్రచురింపవలెను;

(i) ఎన్నిక యూరపియన్, ఆంగ్లో ఇండియన్ యూనివర్సిటీ, పారి శ్రామిక కార్మిక ఖండములకుగాని, మద్రాసు పట్టణములో జనరల్, మహమ్మదీయ, ఇండియన్ క్రిస్టియన్, స్త్రీ ఖండములకుగాని, జరుగనున్నచో—ఫోర్టుసెంట్ జార్జి గెజెట్‌లో,

(ii) మద్రాసు పట్టణములోగాక తక్కినచోట్ల జనరల్, మహమ్మదీయ, ఇండియన్ క్రిస్టియన్, లేక స్త్రీ ఖండములకున్ను, అజ్ఞానస్థితిలోని జాతులఖండము లకున్ను, ఎన్నిక జరుగనున్నచో—జిల్లా గెజిట్‌లో.

34. నిర్ణీత వ్యవధిలోపుగా పగలు 11-3 గంటల మధ్య అభ్యర్థి (లేక ఉప పాదించు, లేక బలపరచు ఓటరు) రిటర్నింగు ఆఫీసరు యెదుట (2 వ మతలబు ననుస రించి వ్రాసిన) నామినేషన్ కాగితము దాఖలుచేయవలెను. అందుపై అభ్యర్థి నామి నేషన్‌కు అంగీకారము సూచించుచు వ్రాసి సంతకము చేయవలెను; (జాబితాలో పేరున్న) ఒక ఓటరు అభ్యర్థిపేరు ఉపపాదించుచు సంతకము చేయవలెను, మరియొక ఓటరు (జాబితాలో పేరున్నవాడు) అందుకు బలపరచుచు సంతకము చేయవలెను.

35. (1) ఆక్టువిధుల ననుసరించి అర్హులైనవారిని అభ్యర్థులుగా నామినేషన్ చేయ వచ్చును.

(2) అభ్యర్థి తాను నిలువగోరుచున్న ఖండములో ఓటరుగాక (ఆ తరగతికి చెందిన) మరియొక ఖండములో ఓటరైనచో, అతడు రెండవ ఖండములో ఓటరైనట్లు సూచించు జాబితా పబ్లికునకలు (అనకలులో నితని పేరున్న భాగము చాలును) నామి నేషన్ కాగితముతోపాటు దాఖలు చేయవలెను.

కార్మిక ఖండములో ఓటు లేకున్నను అభ్యర్థిగా నిలువగోరునాత డీక్రిందివిష యములు సూచించు నిదర్శనపత్రము దాఖలుచేయవలెను.

(అ) అభ్యర్థి ఒక ట్రేడ్‌యూనియన్ సభ్యుడు, లేక గౌరవ సభ్యుడు, లేక ఉద్యోగి యనియు, అతడు సామాన్యసభ్యుడైనచో అతడు చందా బాకీ లేదనియు.

(ఆ) ఆ ట్రేడ్ యూనియన్ 1936 వ సంవత్సరపు అసెంబ్లీ ఆర్డరు 24 (2) విధి ననుసరించి ఆమోదమును బడసెననియు.

(3) ఆ నిదర్శనపత్రముపై ఆ ట్రేడ్‌యూనియన్ ప్రసిడెంటు, లేక ఛైర్మన్, లేక కార్యదర్శి సంతకముచేసి ఆయూనియన్ సీలు వేయవలెను. ఆసంతకము తమయెదుట చేసినట్లు ప్రసిడెన్సీ మేజస్ట్రీటు, లేక తాలూకా మేజస్ట్రీటు, లేక డిప్యూటీ తహసీల్‌దారు, లేక స్టేషనరీ సబ్ మేజిస్ట్రీటు ధ్రువపర్చవలెను.

(4) అజ్ఞానస్థితిలోని జాతుల తరఫున దాఖలైన నామినేషన్లతోపాటు ఆ అభ్యర్థి ఆ జాతులకు చెందినవాడనియు, ఓటున్నవాడనియు నిదర్శనపత్రము దాఖలుచేయవలెను.

36. (1) ఆ ఖండపు ఓటరు జాబితాలో పేరున్న ప్రతి ఓటరున్ను ఎన్నుకోవలసిన మెంబర్లెందరో, అన్ని నామినేషన్ కాగితములపై ఉపపాదకుడుగానైన, బలపరచుచునైన సంతకములు చేయవచ్చును. ఆ సంఖ్యకు హెచ్చు కాగితములపై సంతకములు చేయరాదు.

ఒక కంపెనీ లేక కుటుంబముతరఫున జాబితాలో ఓటరుగా చేరినవాడభ్యర్థిగా నిలుచుచున్నచో ఆ కంపెనీ లేక కుటుంబముతరఫుననే జాబితాలో చేరిన మరియొక ఓటరు అభ్యర్థిని ఉపపాదించుటకుగాని బలపరచుటకుగాని వీలులేదు.

ఒక కంపెనీ లేక కుటుంబము తరఫున జాబితాలో ఓటరుగా చేరినవాడేనామినేషన్ కాగితమైన (ఉపపాదించుచు లేక బలపరుచుచు) సంతకము చేసినచో, ఆ కంపెనీ లేక కుటుంబముతరఫున జాబితాలోచేరిన మరియొక ఓటరు ఆ నామినేషన్ కాగితముపై (ఉపపాదించుచు లేక బలపరచుచు) సంతకము చేయరాదు.

(2) ప్రతి అభ్యర్థియు తన తరఫున పనిచేయుటకు ఒక ఏజంటు నేర్పరుచుకొవలెను. తనకు తన్నే ఏజంటుగా నేర్పరుచుకొనినను ఏర్పరుచుకొనవచ్చును. అట్టి ఏర్పాటు చేసినట్లు 2 వ షెడ్యూలులో చెప్పినరీతిగా కాగితము వ్రాసి నామినేషన్‌తోపాటు దాఖలు చేయువలెను. అట్లు నియమించిన ఏజంటు ఏ విధి ననుసరించిగాని ఏజంటుపని చేయుట కనర్హుడై యుండరాదు.

నామినేషన్ కాగితముతోపాటు పైకాగితమున్ను దాఖలైననేగాని అభ్యర్థి నామినేషన్ సక్రమమైనది కానేరదు.

ఒక అభ్యర్థిపేరు పెక్కునామినేషన్ కాగితములలో నున్నను, యీ రెండవ కాగిత మొక్కటిమాత్రము దాఖలైన చాలును.

37. ఓటరున కిచ్చునిమిత్తమై 2 వ మతలబు నకళ్లు ముద్రింపించి రిటర్నింగు ఆఫీసులో సిద్ధపరుపవలెను.

38. ఆఖరిరోజు (గడువులో ఆఖరిరోజు) మధ్యాహ్నము 3 గంటలు దాటిన తర్వాత దాఖలైన నామినేషన్ కాగితములు పుచ్చుకోరాదు.

39. (1) నామినేషన్లు దాఖలుచేయునప్పుడు, అభ్యర్థి పేరున్ను, ఉపపాదనచేసే ఓటరు పేరున్ను, బలపర్చే ఓటరు పేరున్ను వ్రాయబడియున్న ఓటరు జాబితా నకలు చూపుమని (నామినేషన్ కాగితము దాఖలుచేయువారిని) కోరుటకు రిటర్నింగు ఆఫీసరున కధికార మున్నది. నామినేషన్ కాగితముపై వ్రాయబడిన అభ్యర్థి పేరున్ను, ఓటర్ల పేరున్ను, నంబర్లున్ను, ఓటరుజాబితాలో వ్రాయబడినవానితో సరి మాడవలెను. నామినేషన్ కాగితములో నేనైన వ్రాత పొరపాట్లున్నచో వానిని సవరింపమని, నామినేషన్ దాఖలుచేయువారిని కోరవచ్చును.

(2) ఓటరు జాబితాలో నేమైన వ్రాతపొరబాట్లున్నచో, ఆ పొరబాటును బట్టి తాను నడుచుకో నక్కరలేదని ఆఫీసరు నిర్ణయింపవచ్చును. అట్టి సందర్భములో నతడు తన యభిప్రాయమునకు సబబులు వ్రాసి యుంచవలెను.

40. నామినేషన్ దాఖలు చేయువారితో ఫలాని తేదీని, ఫలాని వేళ, ఫలాని చోట నామినేషన్లు తనిఖీచేతురని రిటర్నింగు ఆఫీసరు తెలుపవలెను. ఆ నామినేషన్ కాగితముపై రిటర్నింగు ఆఫీసరు వరుసనెంబరు వేసి, ఏ తేదీని ఎన్నిగంటలకా కాగితము తనయెదుట దాఖలయ్యెనో వ్రాయవలెను. అందులోని తబిశీళ్లున్ను, అభ్యర్థి పేరున్ను, ఇద్దరు వోటర్ల పేర్లున్ను తెల్పుచు వెంటనే తన ఆఫీసులో నోటీసు కట్టింపవలెను.

41. (1) ఏ యభ్యర్థియైన తన అభ్యర్థిత్వమునకు రాజీనీయవచ్చును. అట్టి రాజీ వ్రాయించి, అభ్యర్థి సంతకముచేసి, రిటర్నింగు ఆఫీసరుయెదుట దాఖలు చేయువలెను. నామినేషన్ల తనిఖీకి నియమించిన తేదీకి మరుసటిరోజు మధ్యాహ్నం 3 గంటలలోపుగా రాజీలు దాఖలు కావలెను.

ఆ మరుసటిరోజు గవర్నమెంటు సెలవుదినమైనచో, రాజీలు దానికి మరునాడు దాఖలు చేయవచ్చును.

(2) ప్రథమ ఎలక్షన్‌లో నుత్తీర్ణుడైన అభ్యర్థి తన అభ్యర్థిత్వము వదలుకొనుచు రాజీనామా దాఖలుచేయవచ్చును. కడపటి ఎలక్షన్ నామినేషన్ల తనిఖీ నిమిత్త మేర్పరిచిన రోజునకు మరుసటిరోజు మధ్యాహ్నం 3 గంటల లోపుగా నట్టి రాజీనామాలు దాఖలు చేయవలెను. (అభ్యర్థి స్వయముగా దాఖలుచేయలేని రోగస్థితిలో నున్నచో అతని తరఫున నెవరు దాఖలాచేయవచ్చునో 20 (2) లో తెలుపబడినది.)

(3) ఒకసారి రాజీ దాఖలుచేసిన అభ్యర్థి ఆ ఎలక్షనులో తిరిగి అభ్యర్థిగా నిలువరాదు.

42. రాజీ దాఖలైన వర్తమానము వ్రాయించి రిటర్నింగ్ ఆఫీసరు కచ్చేరీలో ప్రకటింపవలెను.

43. (1) నామినేషన్ల దాఖలునిమిత్త మేర్పరిచిన గడువు ముగియకపూర్వమే ప్రతి అభ్యర్థియు (లేక అభ్యర్థితరఫున మరియొకరు) రిటర్నింగు ఆఫీసరువద్ద రు 250/- (లేక ఆ విలువకు సరిపోవు గవర్నమెంటు ప్రామిసరీనోట్లు) ధరావత్తుసొమ్ము కట్టవలెను.

అజ్ఞానస్థితిలోని జాతులకు చెందిన అభ్యర్థి కట్టవలసిన సొమ్ము రు 50 మాత్రమే.

22 వ రూలు ననుసరించి ధరావత్తు కట్టిన షెడ్యూలు తరగతి అభ్యర్థి తిరిగి మెంబరు ఎన్నికకు ముందు ధరావత్తు చెల్లింపనక్కర లేదు.

(2) ధరావత్తు దాఖలుచేయని అభ్యర్థి నామినేషన్ సక్రమమైనది కాదు.

(3) పై 41 వ రూలుప్రకారము రాజీ దాఖలుచేసిన అభ్యర్థి ధరావత్తు మొత్తము వానికి వాపసు చేయవలెను. ఏ అభ్యర్థి నామినేషనైన నిరాకరింపబడినచో అతని ధరావత్తున్ను వాపసు చేయవలెను (అభ్యర్థి తరఫున మరియొకరు సొమ్ముకట్టించో సొమ్ముకట్టినవానికి వాపసు చేయవలెను.) ఓట్లు పుచ్చుకొనుటకు ముందుగా నేయభ్యర్థియైన చనిపోయినచో వాని ధరావత్తు వారసునకు వాపసు చేయవలెను.

(4) ఇద్దరులోపుగా మెంబర్ల నెన్నుకొను ఎలక్షన్ ఖండములో, మొత్తపు ఓట్లలో 8 వ పాలునకు పైగా ఓట్లురాని అభ్యర్థులు దాఖలుచేసిన ధరావత్తు సొమ్ము గవర్నమెంటుకు సంక్రమించును. ఇద్దరు పైగా మెంబర్ల నెన్నుకొను ఖండములోని మొత్తపు ఓట్ల సంఖ్యను అభ్యర్థుల సంఖ్యచే విభాగించి, ఆ విభాగములో తేలిన సంఖ్యలో అష్టమభాగమునకు మించి ఓట్లురాని అభ్యర్థుల ధరావత్తుసొమ్ము గవర్నమెంటుకు సంక్రమించును.

(మొత్తపు ఓట్లు 160 అని తలంపుము. ఆ ఖండములో నిద్దరినే మెంబర్ల నెన్నుకోవలసి యున్నదనుకొనుము. 160 లో 8 వ వంతు 20. 20 ఓట్లకు పైగా రాని అభ్యర్థుల సొమ్ము వాపసు చేయరు. 21 ఓట్లు వచ్చినచో వాపసు చేయుదురు. 160 ఓట్లున్న ఖండములో 4 గురు సభ్యుల నెన్నుకోవలసియున్నదని భావింపుడు. 160 ని 4 గు పెట్టి భాగింతురు. అట్లు భాగింపగా వచ్చిన సంఖ్య 40. 40 లో 8 వ వంతు 5. 5 ఓట్లకు పైగా వచ్చినవారి ధరావత్తుసొమ్ము వాపసు చేయుదురు.)

షెడ్యూలు తరగతుల మెంబర్లకు సీట్లు కేటాయించిన ఎలక్షన్ ఖండములో (ఒక ఖండములో షెడ్యూలు తరగతి మెంబరు ఎన్నిక సాధారణ మెంబరు ఎన్నిక ఒక్కసారే జరుగవచ్చును.)

(i) షెడ్యూలు తరగతి అభ్యర్థి ధరావత్తు గవర్నమెంటుకు చెందరాదు.

(ii) తక్కిన అభ్యర్థులలో నెవరికైన మొత్తపు ఓట్ల సంఖ్యలో (అనగా షెడ్యూలు తరగతి అభ్యర్థులకు వేసిన ఓట్లసంఖ్య మినహా తక్కిన ఓట్ల సంఖ్య 1/8 వ వంతునకు మించి రానియెడల వారు చెల్లించిన ధరావత్తు గవర్నమెంటుకు సంక్రమించును.

(5) రద్దయిన ఓటుకాగితములు మినహా తక్కిన ఓటుకాగితములలో వేసిన ఓట్లు లెక్కలోనికి తీసికొందురు.

(6) పై 4 వ సబ్ రూలు ప్రకారము గవర్నమెంటుకు సంక్రమింపని ధరావత్తు మొత్తములు ఆయా అభ్యర్థులకున్ను, (లేక వారి తరఫున సొమ్ము చెల్లించిన వారికి) గెలుపొందిన అభ్యర్థికిన్ని, (గెజెట్‌లో ఎలక్షన్ ఫలితము ప్రచురించిన వెంటనే) వాపసు చేయవలెను.

ఒకే అభ్యర్థిని రెండుమూడు ఖండములలో నామినేషన్ చేసి రెండుమూడు ధరావత్తు మొత్తములు చెల్లించి యున్నచో, ఏసందర్భములోను అతనికి వాపసు చేయవలసినది ఒక్క ధరావత్తుమొత్తమే.

## నామినేషన్ల తనిఖీ

44. నామినేషన్ల తనిఖీరోజున రిటర్నింగు ఆఫీసరు తనిఖీచేయుగదిలో అభ్యర్థి, అభ్యర్థితరఫు ఓట్ల ఏజంటు, అభ్యర్థిపేరు ఉపపాదించిన ఓటరొకడు, బలపరిచిన ఓటరొకడు, అభ్యర్థితరఫున ప్రతినిధి యొకడుమాత్రమే, హాజరుండవలెను. రిటర్నింగు ఆఫీసరుకు పనిలో సాయముచేయుటకై అతని గుమాస్తాలు మొదలైనవారు హాజరుండవచ్చును. ప్రతి అభ్యర్థితరఫునను పైన తెలిపినవారుమాత్రమే హాజరై యుండవచ్చును, కాని యితరులు లోనికి రారాదు. తనయెదుట దాఖలైన నామినేషన్లన్నియు పరిశీలించుటకు వారికి రిటర్నింగు ఆఫీసరు అవకాశ మీయవలెను.

45 (1) రిటర్నింగు ఆఫీసరు నామినేషన్లు తనిఖీచేయవలెను. నానిపై హాజరున్న అభ్యర్థులున్ను, వారి తరఫువారున్ను, తెలుపు ఆక్షేపణలు విమర్శింపవలెను. అవసరమైనచో విచారణకూడ జరుపవలెను. ఆ పైనుక యీ క్రిందకారణములలో దేనిని బట్టియైన, ఏ అభ్యర్థి నామినేషన్నైన, నిరాకరింపవచ్చును.

(అ) ఏ అభ్యర్థియైన ఆక్టులేక విధులను బట్టి ఎలక్షన్‌లో నభ్యర్థిగా నిల్చుట కనర్హుడగుట.

(ఆ) ఉపపాదన చేసిన ఓటరుగాని, బలపరిచిన ఓటరుగాని, ఓటరుగా నుండ ననర్హుడగుట.

(ఇ) పై విధులలో దేనినైన అభ్యర్థి లేక ఉపపాదించిన, లేక బలపరచిన ఓటరు ఉల్లంఘించుట.

(2) (అ) ఓటరుజాబితా పబ్లిశు నకలులో అభ్యర్థిపేరు, ఉపపాదకునిపేరు బలపరచు ఓటరుపేరు కనపరచినచో వారికి వలయు నర్హత లున్నవనియే భావింప వలెను. వారికి ప్రత్యేకముగా ఫలానిహుదిరి అనర్హత లున్నవని రుజువైనతేకాని యిక నావిషయము శంకింపరాదు.

(ఆ) ఒక ఓటరు పెక్కు నామినేషన్లపై సంతకములు చేసినచో (ఉపపాదించుచు లేక బలపరచుచు) ఖాళీ లెన్ని యున్నవో అన్ని ఖాళీలకు సరిపోవు నామినేషన్లపైని మాత్రమే అతడు సక్రమముగా సంతకము చేసినట్లు యోచింతురు. ముందు దాఖలైన కాగితములు (4 ఖాళీ లున్నచో ముందు దాఖలైన 4 కాగితములున్ను) సక్రమము లని భావించి మిగతావానిని త్రోసిపుత్తురు.

(3) ఒకే అభ్యర్థి పేరు పెక్కు నామినేషన్లలో వ్రాసియున్నప్పుడు ఆ నామినేషన్లలో కొన్ని నిరాకరించినను, శాస్త్రవిహితమైన నామినేషన్ ఒక్కటున్నను అతడు సక్రమముగా నామినేషన్ కాబడినట్లే యోచింపవలెను.

46. (1) ప్రతి నామినేషన్ కాగితముపైని రిటర్నింగు ఆఫీసరు తన అభిప్రాయము తెలుపవలెను. అంగీకరించినచో కారణములు వ్రాయనక్కరలేదు; నిరాకరించినచో వ్రాయవలెను.

(2) తనిఖీ ప్రారంభమైనరోజుననే ముగియవలెను. కాని అందు నిమిత్తము వాయిదా వేయరాదు.

(3) తనిఖీ పూర్తియైనపిదప, రాజీలు దాఖలుచేయు గడువు దాటనిచ్చి, నిల్చియున్న అభ్యర్థులపేర్లు జాబితాలో వ్రాసి (అనగా నామినేషన నంగీకరింపబడిన అభ్యర్థుల పేర్లు) ఆజాబితా రిటర్నింగు ఆఫీసరు తన కచేరీ నోటీసుబోర్డులో ప్రచురింపవలెను.

47. ఖాళీల సంఖ్యకంటె అభ్యర్థుల సంఖ్య హెచ్చుగా నున్నచో, 5 వ మతలబు ననుసరించి అభ్యర్థుల పేర్లన్నియు వ్రాసి, రిటర్నింగు ఆఫీసరు ప్రచురింపవలెను.

అభ్యర్థులపేర్లు అకారాదిగా (ఇంటి పేర్లను బట్టి) వ్రాయవలెను. షెడ్యూలు తరగతినుండి సభ్యు నెన్నుకోవలసియున్నచో ప్రథమ ఎలక్షన్‌లో నుత్తీర్ణులైన షెడ్యూలు తరగతి అభ్యర్థుల పేర్లుకూడ వ్రాయవలెను. అభ్యర్థులపేర్ల కెదురుగా వరుస సంఖ్యయు, ఆ అభ్యర్థికి ప్రత్యేకముగా నేర్పరచిన రంగును్ను తెలుపవలెను.

48. అభ్యర్థులలో నొకరు నామినేషన్లయినపిదప చనిపోయినచో రిటర్నింగు ఆఫీసరు ఎన్నిక లంతటితో నాపుచేయించి, నామినేషన్లు మొదలుకొని జరుగవలసిన కార్యక్రమము క్రొత్త ఎలక్షన్‌కు జరిపినట్లే జరుపవలెను.

అప్పటికి సక్రమముగా నామినేషన్లైన అభ్యర్థులకు తిరిగి నామినేషన్ జరుగ నక్కరలేరు.

ప్రథమ ఎలక్షన్‌లో నుత్తీర్ణులైన అభ్యర్థులలో నొకడు గతించినను, తిరిగి ప్రథమ ఎన్నికలు జరుప నక్కరలేదు.

49. (1) ఖాళీసంఖ్యకు అభ్యర్థుల సంఖ్య మించియున్నచో ఓట్లు పుచ్చుకొనవలెను.

(2) ఖాళీల సంఖ్యకు అభ్యర్థులసంఖ్య సరిపోయినచో అభ్యర్థు లందరును్ను మెంబరుపదవుల కెన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను.

(3) ఖాళీలసంఖ్యకు అభ్యర్థులసంఖ్య లోపించియున్నచో అభ్యర్థు లందరును్ను మెంబరుపదవుల కెన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను. మిగతా ఖాళీలకు మెంబర్ల నెన్నుకోవలసినదని (వ్యవధి నియమించి) గవర్నరు ఆ ఖండపు ఓటర్లకు హెచ్చరిక నీయవలెను.

పై హెచ్చరిక పొందియు ఏ ఖండపు ఓటర్లయిన మెంబరు నెన్నుకొనుట కుపక్రమింపనిచో, వారికి తిరిగి ఎంతకాలము గడచినపిదప హెచ్చరిక నీయవలెనో గవర్నరే నిర్ణయించును.

(4) 50 వ రూలులో నుదాహరించిన ఖండములలో తప్ప (69, 70 విధుల నుదాహరించిన పద్ధతిమినహా) తక్కిన ఖండములలో ఓటరు స్వయముగా ఓటు వేయవలెను.

50. 51 వ విధిలగాయతు 73-వ విధివరకు (65 వ రూలు (1) వ భాగములోని నిర్వచనము గాక)

ఈ క్రింది ఖండముల ఎన్నికలలో అమలులో పెట్టరాదు :—

(అ) యూరపియన్ ఖండములు.

(అ) ఆంగ్లో ఇండియన్ ఖండములు.

(ఇ) భూస్వాముల ఖండములు.

(ఈ) యూనివర్సిటీ ఖండము.

(ఉ) మద్రాసు ప్లాంటర్ల ఖండము.

(అనగా తేయాకు, కాఫీతోటల యజమానులు)

51. ఓట్లు పుచ్చుకొనుట ఉదయము 7 గంటలకు ప్రారంభించి సాయంకాలము 6 గంటలకు ముగింపవలెను. ఈమధ్య నొకగంట ఓట్ల ఆఫీసు మూసినను మూయ వచ్చును.

52. గవర్నరుగారి అనుమతి పుచ్చుకొని తగిన కారణమున్నచో ఓట్లు పుచ్చుకొను తేదీలు మార్చవచ్చును. ఓట్లు పుచ్చుకొను గంటలు ఎక్కువ చేయవచ్చును.

అల్లరులు జరిగినప్పుడు, లేదా వరదలు వచ్చినప్పుడు, లేదా యిట్టి ఆకస్మికపు సంఘటనలలో (ఓట్ల ఆఫీసులో ఓట్లు పుచ్చుకొనే ఆఫీసరు) తన ఆఫీసు మూసివేసి, ఆసంగతి రిటర్నింగు ఆఫీసరు కెరిగింపవలెను. రిటర్నింగు ఆఫీసరు మరియొక తేదీని ఓట్లు పుచ్చుకొనవలసినదని యేర్పాటుచేసి, ఆవర్తమానము గవర్నమెంటుకు తెలుప వలెను.

("ఓట్ల ఆఫీసు" అనుమాట ఓట్లు పుచ్చుకొనే ప్రదేశమునకు పర్యాయపద ముగా వాడుచున్నాము. ఆ ఆఫీసులో ఓట్ల ఆఫీసరు పెద్ద. అతనికి సహాయార్థ మున్న ఆఫీసర్లు పోలింగు ఆఫీసర్లు. వీ రందరున్ను ఓట్లుపుచ్చుకొను పనిలో ఓట్ల ఆఫీసులో పనిచేయుదురు.)

53. గ్రామసముదాయమున కొక ఓట్ల ఆఫీసుచొప్పున రిటర్నింగు ఆఫీస రేర్పరుప వలెను. ఆ ఆఫీసులో ఓట్ల ఆఫీసరును, పోలింగు ఆఫీసర్లను రిటర్నింగు ఆఫీసరే నియమింపవలెను.

54. తన ఆఫీసులో అల్లరి జరుగకుండునట్లున్ను, ఎలక్షన్ సక్రమముగా జరుగు నట్లున్ను, ఓట్ల ఆఫీసరు చూడవలెను. ఒకసారి ఎందరు ఓటర్లు లోనికి వచ్చి ఓట్లు వేయవలెనో అతడే నిర్ణయింపవలెను. తన ఆఫీసులోనికి

(అ) పోలింగు ఆఫీసర్లను, అభ్యర్థులను, (అభ్యర్థి కొక ఏజంటుచొప్పున) ఏజంట్లను (ఓట్ల ఏజంట్లనుపేర్లతో నికముందు వారినిగూర్చి వర్ణింతుము.)

(ఆ) పోలీసువారిని, ఇతర గవర్నమెంటు ఉద్యోగులను,

(ఇ) ఓటర్లను గుర్తుపట్టుటకై ఓట్ల ఆఫీసరు అప్పుడప్పుడు లోనికి రానిచ్చిన వారిని, మాత్రమే రానిచ్చి, తక్కినవారిని బైటనే యుంచవలెను.

55 ఓటరు పేరు ఏ గ్రామసముదాయములో నున్నదో అందుకు సంబంధించిన ఓట్ల ఆఫీసులో తప్ప మరియొకచోట ఓటువేయుట కధికారము లేదు. ఇందుకు మార్పులు 69, 70 విధులలో తెలుపబడినవి.

56 నిర్ణయమైన వేళదాటిన తర్వాత ఓట్ల ఆఫీసరు ఆఫీసు మూయించవలెను. అటు పిమ్మట ఏ ఓటరుకును ఓటుకాగిత మివ్వరాదు.

57 పై వారికి కనబడకుండ ఓటర్లు ఓట్లువేయుట కనువగునట్లు ప్రత్యేకముగా నొకగది ఏర్పాటు చేయవలెను. సాధ్యమైనవరకు స్త్రీలకు ప్రత్యేకగదు లేర్పరిచి ఆ గదులలోనికి రాకపోకలకు వేరుమార్గము లేర్పరుపవలెను.

58 వలసినందరు స్త్రీ ఓట్ల ఆఫీసర్లు, స్త్రీ పోలింగు ఆఫీసర్లు లభించినచో, స్త్రీల ఓట్లు పుచ్చుకొనుటకు ప్రత్యేకముగా ఓట్ల ఆఫీసు నియమించి, ఆ ఆఫీసులోనికి పురుషు లెవ్వరు (పోలీసువారు గవర్నమెంటు ఉద్యోగులు మినహా) వెళ్లరాదను నిర్ణయము రిటర్నింగు ఆఫీసరు చేయవచ్చును. (ఈ విషయమై హైకోర్టు తీర్పున్నది. వేరు భాగములో చూడుడు.)

59. అభ్యర్థి కొకటిచొప్పున వేరువేరు ఓట్లపెట్టె లుంచవలెను. ఏ అభ్యర్థి పెట్టెపై అతనికి ఏర్పరిచిన రంగు పూయించి, అతని వరుస సంఖ్యయు వేయవలెను. వేరువేరు రంగులున్న కవర్లు ఓట్ల ఆఫీసులో వలసినన్నియు రిటర్నింగు ఆఫీసరు సప్లయి చేయవలెను. ఓట్లపై కవర్లున్ను సప్లయి చేయవలెను. ఓటరు జాబితాలున్ను, అభ్యర్థుల పేర్లు స్ఫుటముగా వ్రాసి వారిపేరుల కెదురుగా వరుసపసంఖ్యయు, రంగున్ను వేసియున్న బోర్డు ఒకటియు, రిటర్నింగు ఆఫీసరు ప్రతి ఓట్ల ఆఫీసుకున్ను సప్లయి చేయవలెను.

60. (1) ఓట్లపెట్టెలో ఓట్లు వేయుటకు సంధుంచవలెను. పెట్టె తాళము తీయనిదే ఓట్లు పైకితీయుటకు వీలుండరాదు. ఓట్లు పుచ్చుకొనుటకు ముందు ఓట్ల ఆఫీసరు పెట్టె లన్నియు ఖాళీచేయించి, ఖాళీపెట్టెలు ఆఫీసులో నున్నవారికి చూపి, అవి తాళమువేసి, వానిపై సీళ్లు వేయవలెను. ఆ పెట్టెలు ఓట్లువేయుటకు చాటుగా నేర్పరిచిన గదిలో నుంచవలెను.

(2) ఓట్లు పుచ్చుకొనుటకు ముందుగా అక్కడ హాజరులో నున్నవారికి ఓట్ల ఆఫీసరు 1920 వ సంవత్సరపు ఎలక్షను నేరముల ఆక్టు 14 వ విధి చదివి వినిపించి అందలి భావము తెలుగుభాషలో నెరిగింపవలెను.

(ఆ నేరములు ఇండియన్ పీనల్ కోడ్‌లో తెలిపినవే. ఆనేరముల స్వభావ మంతయు నింకొక భాగములో తెలిపియున్నాము.

61. ఓటుకాగితము రెండు ముక్కలుగా నుండును. ఒక ముక్కపైని 6 వ మతలబు ప్రకారము వ్రాసియుండును రెండవ ముక్కపైని 6 (ఎ) మతలబుప్రకారము వ్రాసియుండును. రెండుముక్కలును కలిపి మధ్యను చింపుటకు వీలుగా చిల్లులుకొట్టి యుంతురు. ఓటుకాగితముపై ఖండముపేరు సూచించు అక్షర మంకవలెను, వరుస నెంబరుండవలెను. రెండు ముక్కలపైని స్టాంపు కొట్టవలెను.

62 (1) ఒకే మెంబరు ఖాళీకి ఎన్నికలు జరుగుచున్నపుడు, ఓటరుకు ఒక్కటే ఓటుకాగిత మిత్తురు. ఆ కాగిత మాతను తన మనస్సునకు నచ్చిన అభ్యర్థి ఓటుపెట్టెలో వేయవలెను.

(2) పెక్కు ఖాళీలకు ఎన్నికలు జరుగునప్పుడు, ఖాళీకొక కాగితముచొప్పున నోటుకాగితము తీయవలెను. ఆ కాగితములు వేరువేరు పెట్టెలలో వేయవచ్చుననియు, లేదా అన్నియు నొకే పెట్టెలో వేయవచ్చుననియు, లేదా కొన్ని ఒక పెట్టెలోను, కొన్ని మరియొక పెట్టెలోను వేయవచ్చుననియు ఓటరుకు ఓట్ల ఆఫీస రెరిగింపవలెను.

(3) ఓటుకాగిత మిచ్చుటకు పూర్వము ఆఫీసరు ఓటరుపేరు పిలిపించవలెను. ఆవెనుక కాగితముపై సీలువేసి మొదటిముక్క ఓటరు కీయవలెను. ఓటరు జాబితాలో ఓటరుపేరున కెదురుగా (ఓటుకాగిత మిచ్చినట్లు జ్ఞాపకమునకై) గుర్తుపెట్టవలెను.

63. కాగితము పుచ్చుకొన్న ఓటరు చాటుగా నేర్పరిచిన గదిలోనికి వెళ్లి, తన కిష్టమువచ్చిన పెట్టెలో నది పడవైచి, వెంటనే ఆఫీసువిడిచి రావలెను.

64. (1) ఏ ఓటరైన గ్రుడ్డివాడగుటచే, లేక యితరకారణములచే, ఓటుకాగితము స్వయముగా పెట్టెలో పడవేయజాలకపోవచ్చును. ఆ సందర్భములో, ఓట్ల ఆఫీసరు ఓటరు మనోభావ మడిగితెలిసికొని, ఓటరు కిష్టమగు నభ్యర్థి పెట్టెలో ఓటు కాగితము పడవేయవలెను.

(2) పైక్రమము జరిగినప్పుడు రెండవముక్కపై ఆఫీస రావిషయము వ్రాసియుంచవలెను.

65. (1) ఓట్ల ఆఫీసరు, లేక పోలింగు ఆఫీసరు, ఓటువేయుటకు వచ్చిన ఓటరు నీక్రిందిప్రశ్న లడుగవచ్చును; ఏ అభ్యర్థి లేక ఏజంటు కోరినచో అడిగితీరవలెను:—

(i) ఈ పేరున్న ఓటరువు నీవేనా? (ఓటరు పేరు పూర్తిగాచదివి)

(ii) నీ వీ ఖండములో నీసరికి ఓటువేసితివా?

(iii) (అ) నీ వింకే యెలక్షన్ ఖండములోనైన ఓటువేసితివా?

(ఆ) (స్త్రీల ఖండములో) నీ వింకే స్త్రీ ఖండములోనైన ఓటు వేసితివా?

(ఇ) (పారిశ్రామిక ఖండములో) నీ వింకే పారిశ్రామిక ఖండములోనైన ఓటువేసితివా?

(ఈ) (కార్మిక ఖండములో) నీ వింకే కార్మిక ఖండములోనైన ఓటు వేసితివా?

ఈ ప్రశ్నలకు జవాబు చెప్పిననేకాని ఓటుకాగిత మీయరాదు. (1) వ ప్రశ్నకు అవు ననియు, తక్కిన ప్రశ్నలకు లేదనియు ఓటరు జవాబుచెప్పిననే కాగిత మీయవలెను.

## 1 వ నిర్వచనము

ఎలక్షన్ ఖండములు 8 తరగతులు:—

(i) జనరల్, మహమ్మదీయ, ఆంగ్లోఇండియన్, యూరపియన్, ఇండియన్ క్రిస్టియన్ ఖండములు.

(ii) స్త్రీ ఖండములు.

(iii) అజ్ఞానస్థితిలోని జాతుల ఖండములు.

(iv) పారిశ్రామిక ఖండములు.

(v) ప్లాంటింగు (తేయాకు, కాఫీ తోటల యజమానుల) ఖండములు.

(vi) భూస్వాముల ఖండములు.

(vii) కార్మికుల ఖండములు.

(viii) విశ్వవిద్యాలయ ఖండములు.

## 2 వ నిర్వచనము

ఒక తరగతికి చెందిన ఒక్క ఖండములో మాత్రమే ఏ ఓటరైన ఓటు వేయవచ్చును.

## 3 వ నిర్వచనము

ఒక తరగతికి చెందిన ఖండములో ఓటున్నవారు వేరుతరగతికి చెందిన ఖండములో ఓటు వేయవచ్చును.

(2) ఓటరుజాబితాలో పేరున్నవారి కందరికి ఓటుకాగిత మీయవలెను.

66. ఫలానిపేరున్న ఓటరు తాననిచెప్పి ఒకడు ఓటువేసి వెళ్లినతర్వాత, మరియొకడు ఓటింగు ఆఫీసులోనికి వచ్చి ఆపేరు తనపేరనియు, తనకు ఓటుకాగిత మిమ్మనియు కోరవచ్చును. అతనికి ఓటుకాగిత మీయవలెను. ఆ కాగిత మాతడు చాటుగదిలోనికి తీసికొనివెళ్లి తాను ఓటేయదలచిన అభ్యర్థికి నియమించిన రంగు కవరులో పెట్టి, కవరంటించి, రంగుకవ రింకొకకవరులో పెట్టి, ఓట్ల ఆఫీసరు అది ఓట్ల ఆఫీసరు కీయవలెను. ఆకవరుపై ఓట్ల ఆఫీసరు ఓటరుపేరు, నంబరు, గ్రామసముదాయముపేరు, వ్రాసికొని, ఆకవరు వేరేకట్టలో నుంచవలెను. ఆకట్టలోని ఓట్లు రిటర్నింగు ఆఫీసరు లెక్కింపడు. ఓటరుపేరు, నంబరు, ఓట్ల ఆఫీసరుపేరు, ప్రత్యేకముగా నొకజాబితాలో వ్రాసియుంచవలెను. ఆ జాబితా పేరు పేచీ ఓట్ల జాబితా. అది 7 వ మతలబుప్రకారము వ్రాయవలెను. ఓటరు జాబితాలో వ్రాలు చేయవలెను, లేదా వేలిముద్ర వేయవలెను.

## నిర్వచనము

66, 67 నిబంధనలు రెండున్ను అమలులో పెట్టుట కవకాశమున్న సందర్భములో రెండున్ను అమలులో పెట్టవలెను.

67. (1) పై సందర్భములో ఫలానిపేరుగల ఓటరునని చెప్పి ఓటుకాగిత మిమ్మని కోరువానిపేరు వేరనియు, అతడు బూటకముగా నింకొకనిపేరు పెట్టుకొని ఓటువేయ నభిలషించుచున్నాడనియు, యీ విషయములు తాను రుజువుచేసెదననియు, ఏ ఓట్ల ఏజంటైన ఓట్ల ఆఫీసరుతో చెప్పినచో, అతడు తగాయిదా ఓట్లజాబితాలో (8 వ మతలబు ననుసరించి ఆ జాబితా వ్రాయవలెను) వోటరు పేరున్ను, నివాసమున్ను వ్రాయుమని అతనిని గుర్తుపట్టజాలిన సాక్షులను తెమ్మనియు కోరవచ్చును.

(2) ఓట్ల ఏజంటును రు 20. ధరావత్తు చెల్లింపమని ఓట్ల ఆఫీసరు కోరవలెను.

(3) సొమ్ముకట్టినవెనుక పై ఆక్షేపణచేసిన ఏజంటును 9 వ మతలబుప్రకారము ఆ విషయము వ్రాసి దాఖలు చేయుమని ఓట్ల ఆఫీసరు కోరవలెను. అతని నందుపై సంతకము చేయించి ఘురానాసాక్షు లిద్దరిచేతకూడా తన యెదుట సంతకములు చేయించవలెను.

(4) 65 వ రూలు ననుసరించి అడిగిన ప్రశ్నలకు పై ఓటరు సరియైన జవాబు లిచ్చినచో, (పై నేరము రుజువైనచో శిక్షపడునని ఓటరుతో ఆఫీసరు చెప్పి) అతని ఓటుకాగిత మీయవలెను. తగాయిదా ఓట్ల జాబితాలో అప్పటి సందర్భములున్ను తన అభిప్రాయమున్ను ఆఫీసరు వ్రాయవలెను.

(5) పై (3) వ రూలు ననుసరించి పుచ్చుకొన్న కాగితముకూడా తగాయిదా ఓట్లజాబితాతోపాటు రిటర్నింగు ఆఫీసరువద్దకు ఓట్ల ఆఫీసరు పంపవలెను.

(6) రిటర్నింగు ఆఫీసరు వలయు భోగట్టాలుచేసి, పై నేరమునకు క్రిమినల్ కేసు పెట్టించవలెను. తత్పూర్వము మద్రాసులో పోలీసు కమీషనరుగారి వల్లను తక్కినచోట్ల జిల్లా కలెక్టరుగారివల్లను అనుమతి పొందవలెను. కేసు విచారణలో ముద్దాయి నిర్దోషియని తీర్పు జరిగినచో, పై ధరావత్తు మొత్తమంతయు (లేక కొంత భాగము) సర్కారుకు చెందజేయవలెనో, వాపసు చేయవలెనో, రిటర్నింగు ఆఫీసరు నిర్ణయింపవలెను.

68. వోటరుచేతిలో చిరిగినందువల్ల (మరి యేయితర కారణముచేనైన) వోటు కాగితము నిరర్థకము కావచ్చును. ఆ కాగితము వోట్ల ఆఫీసరు కిచ్చివేసి వోటరు మరియొక కాగితి మడిగి పుచ్చుకొనవచ్చును., ఆ చిరిగిపోయిన కాగితముపైన, దానివెనుక ముక్కపైన అవి రద్దయినట్లు వోట్ల ఆఫీసరు వ్రాసికొనవలెను.

69. వోట్ల ఆఫీసరు, లేక పోలింగ్ ఆఫీసరు, లేక వోట్ల ఏజెంటు, లేక వోట్ల ఆఫీసులో పనిచేయు గవర్నమెంటు ఉద్యోగికి ఆ ఖండములో వోట్లుండవచ్చును. వారు పనిచేయు ఆఫీసులోగాక మరియొక ఆఫీసులో వోట్లువేయుటకు హక్కుండవచ్చును. వారు రిటర్నింగ్ ఆఫీసరును (10 వ మతలబు ననుసరించి) నిదర్శనపత్రము వ్రాసియీయుమని కోరవచ్చును. ఆ పత్రమునుబట్టి వారికి తాముపనిచేయు ఆఫీసులోనే వోటువేయుటకు హక్కు కలుగును.

ఆ ఖండములో గాక వేరు ఖండములో నట్టివారికి ఓట్లున్నను, వారు పనిచేయు ఆఫీసులోనే ఆవోట్లు వేయవచ్చును. రిటర్నింగ్ ఆఫీసరు నిదర్శనపత్రము పంపుచు, ఆఖండములో నెందరు మెంబర్ల నెన్నుకొనవలెనో, అభ్యర్థు లెందరో, ఎవరో, వారికి నియమించిన రంగులేవియో, నంబర్లేవియో, మొదలగు వర్తమానమున్ను పంపవలెను.

70. పై నిదర్శనపత్రము పొందినవారు తాముపనిచేయుచున్న ఆఫీసులో పెత్తనము వహించు ఓట్ల ఆఫీసరుగారి కది చూపవలెను. ఆయన వారికి ఓటుకాగితము లీయవలెను.

(1) పనిచేయు ఆఫీసునకు సంబంధించిన ఖండములోనే వోటున్నచో

62, 63 విధులనుబట్టి వోటు పుచ్చుకొనవలెను.

72 విధి ననుసరించి పంపే స్టేటుమెంటుతోపాటు నిదర్శనపత్రములు కూడా రిటర్నింగ్ ఆఫీసరుకు పంపవలెను.

(2) పనిచేయు ఆఫీసునకు సంబంధించిన ఖండములో గాక వేరు ఖండములో వోటున్నచో

వోటరు చాటుగదిలోనికి వెళ్లి వోటుకాగితము తన కిష్టుడైన అభ్యర్థి కేర్పర్చిన రంగుకవరులో పెట్టి, ఆకవరు మరియొక కవరులో పెట్టి అంటించి, ఓట్ల ఆఫీసరు కీయవలెను. ఒకటికంటె హెచ్చుకాగితము లిచ్చినచో అన్ని కాగితములున్ను అన్నికవర్లలో పెట్టవచ్చును. లేదా అన్నియు నొకేకవరులో పెట్టవచ్చును. అది వోటరు యిష్టాయిష్టములనుబట్టి యుండును.

ఓట్ల ఆఫీసరు ఆ కవర్లు వేరువేరు ఖండములకు వేరువేరు సంచులలో పెట్టవలెను. ఆ కవరునకు నిదర్శనపత్రములు చేర్చి కట్టవలెను. సంచులు మూసివేసి, సీలువేసి, ఏ సంచి ఆ రిటర్నింగ్ ఆఫీసరువద్దకు పంపవలెను.

71. ఓట్లుపుచ్చుకొనుట పూర్తికాగానే, ఓట్ల ఆఫీసరు యీ క్రింద నుదాహరించిన కాగితములు వేరువేరు సంచులలో పెట్టవలెను. ఆఫీసులో అభ్యర్థులు, వారి ఏజెంట్లు హాజరున్నచో, వారి యెదుటనే యీపని చేయవలెను. ఆ సంచులు మూసివేసి, వానిపై తన సీళ్లున్ను, అభ్యర్థులు, ఏజెంట్లు (తమసీళ్లుకూడా వేసెదమని తెల్పినచో వారి) సీళ్లున్ను వేయవలెను.

(1) ఓట్ల పెట్టెలు.
పెట్టెతాళము తీయరాదు. తాళముపెట్టెను పెట్టి, తాళమునకు ప్రత్యేకముగా సీలు వేయవలెను.

(2) పేచీ ఓట్లు.

(3) ఉపయోగముకాని ఓటుకాగితములు.

(4) పొరపాటున రద్దయిన ఓటు కాగితములు.

(5) గుర్తులుపెట్టిన ఓటరు జాబితా.

(6) ఓట్లకాగితముల వెనుక ముక్కలు.

(7) పేచీ ఓట్ల జాబితా.

(8) తగాయిదా ఓట్లు, ఆ సందర్భములో పుచ్చుకొనిన స్టేటుమెంట్లు.

(9) 70 (2) విధిప్రకారము పుచ్చుకొనిన కవర్లు.

వీనిని ఓట్ల ఆఫీసరు 73 వ నిబంధనలో నుదాహరించిన ఆఫీసరువద్దకు పంపవలెను.

72. పై సంచులతోపాటు ఓట్ల ఆఫీసరొక స్టేటుమెంటు వ్రాసి పంపవలెను. అది 11 వ మతలబుప్రకారము వ్రాయవలెను. అందులో తన కెన్ని ఓటుకాగితములు ఒప్పచెప్పిరో, ఎన్ని ఉపయోగపడెనో, ఎన్ని రద్దయ్యెనో, మిగతా కాగితము లేమయ్యెనో, వ్రాయవలెను.

73 మద్రాసుపట్టణములో 71 రూలులో నుదహరించిన సంచులు ఆయా రిటర్నింగు ఆఫీసర్లకు పంపవలెను. జిల్లాలలో రిటర్నింగు ఆఫీసరుకు (లేక అతను మరియొక ఆఫీసరువద్ద పంపమన్నచో అతనివద్దకు) పంపవలెను. ప్రతిసంచిపైని వరుససంఖ్యవేసి, అందులో నేమున్నదో, అది ఏ గ్రామసముదాయమునకు సంబంధించినదో వ్రాయవలెను. ఓట్లు పడని ఖండములలో, ఓట్ల ఆఫీసరు అట్లనియే రిపోర్టు వ్రాయవలెను. రిటర్నింగు ఆఫీసరువద్ద గాక మరియొక ఆఫీసరువద్దకీ సంచులు పంపబడినచో, వాని నతడు వెంటనే రిటర్నింగు ఆఫీసరువద్దకు పంపవలెను.

## పోస్టుద్వారా ఓట్లువేయు క్రమము

74. 50 వ నిబంధనలో నుదాహరించిన ఖండములను 75 లగాయితు 83 వరకు వ్రాసియున్న విధులనుబట్టియే వోట్లువేయవలెను. వేరుపద్ధతిని వేయరాదు.

[50 వ నిబంధనలో నుదాహరించిన ఖండములు:—

(i) యూరపియన్ ఖండములు.

(ii) ఆంగ్లో ఇండియన్ ,,

(iii) భూస్వాములు ,,

(iv) యూనివర్సిటీ ,,

(v) ప్లాంటర్లు ,,

(గబ్బరు, తేయాకు, కాఫీతోటల యజమానులు.)

75. (1) వోటరుజాబితాలో వ్రాసియున్న చిరునామాను ప్రతి వోటరుకున్న వోటుకాగితి మొకటియు నిదర్శనపత్రపు అచ్చుముకల బొకటియు, రిటర్నింగ్ ఆఫీసరు రిజస్ట్రీపోస్టుద్వారా పంపవలెను. వోటరు అడ్రెస్సు మార్చినట్లు రిటర్నింగ్ ఆఫీసరుకు వ్రాసినచో క్రొత్తనివాసమునకే పంపవలెను.

(2) జాబితాలో వ్రాసియున్న చిరునామా మార్చగోరు వోటరు ఆప్రదేశము లోనున్న ప్రసిడెన్సి మేజిస్ట్రేటు, లేక తాలూకా మేజస్ట్రేటు, లేక డిప్యూటీ తహసీల్దారు, లేక స్టేషనరీ సబ్ మేజిస్ట్రేటువద్దకు వెళ్లి, తానాచోటనుండి నివాసము లేక ఆఫీసు మార్చితినని వ్రాసియిచ్చిఆఫీసరు యెదుట సంతకముచేయవలెను. వోటరును ఆఫీసరెరుగనిచో వోటరునెరిగిన యిద్దరు ఘనులా మనుష్యులు ఆఫీసరువద్దకు వచ్చి, తామతని నెరుగుదుమని పైకాగితముపై సంతకముచేయవలెను. గ్రామోద్యోగులు వోటరు నెరిగియున్నను చాలును. ఆ ఆఫీసరా కాగితము పుచ్చుకొని రిటర్నింగ్ ఆఫీసరువద్దకు పంపవలెను.

ఆ తర్వాత వోటరు చిరునామా మార్చగోరినచో, యీపద్ధతులే అవలంబింపవలెను.

76. 12 వ మతలబుప్రకారము వోటుకాగితము వ్రాసియుండవలెను. 12 వ మతలబుప్రకారము నిదర్శనపత్రము వ్రాసియుండవలెను. 5 వ మతలబులో వ్రాసియున్న ప్రకారము వోటుకాగితముపై అభ్యర్థులపేర్లు వ్రాసియుండవలెను. ఇద్దరభ్యర్థులపేర్లు ఒక్కటే అయినచో, తండ్రిపేరు వ్రాసి, లేక మరియొకవిధముగా, యిరువురకు భేదము కనపరుపవలెను. రిటర్నింగ్ ఆఫీసరుకు యుక్తమని తోచువిధమున ఓట్లకాగితములు ఒక్కభాషలో లేక హెచ్చు భాషలలో ముద్రింపించవలెను. వోటరునంబరు వోటుకాగితమువెనుకను, నిదర్శనపత్రముపైన వేయవలెను. ఆనంబరు వోటరు జాబితాలో వోటరు నంబరే.

77. ఓటుకాగితము పంపుటకు పూర్వము రిటర్నింగు ఆఫీసరు ఓటరుపేరు నిదర్శన పత్రముపై వ్రాయవలెను. ఓటరుజాబితాలో ఓటరు పేరున కెదురుగా గుర్తు పెట్టవలెను. (ఓటుకాగితము పంపినట్లు జ్ఞాపకార్థము)

78. రిటర్నింగు ఆఫీసరు అడ్రస్సు (13 వ మతలబుప్రకారము వ్రాయించి) ఒక కవరుపై వ్రాసి అదిన్ని, మరియొక కవరుపై ఓటరునంబరువేసి అదిన్ని, 14 వ మతిలబు ప్రకారము వ్రాసిన ఉత్తర మొకటియు ఓటరుకు పంపవలెను. మొదటికవరు ఎడమమూల నంబరు వేయవలెను.

79. ఓటువేయగోరు ఓటరు నిదర్శనపత్రము సంతకముచేసి, తన కిష్టమైన అభ్యర్థుల పేర్ల కెదురుగా గుర్తు లుంచవలెను.

80. ఓటరు ఓటుకాగితముపై 2 వ కవరులో పెట్టి అంటించి, ఆ కవరున్ను నిదర్శన పత్రమున్ను మొదటి కవరులో పెట్టి అంటించి, ఆకవరు రిజిష్టరు పోస్టుద్వారా రిటర్నింగు ఆఫీసురునకు పంపవలెను. గడువులోపుగా ఆ కవరు రిటర్నింగు ఆఫీసరుకు చేరవలెను. గడువు దాటినపిమ్మట అందిన కవర్లున్ను, సాధారణపు పోస్టుద్వారా పంపిన కవర్లున్ను మంజూరు చేయరు.

లేదా, రిటర్నింగు ఆఫీసులో పెట్టిన ఓట్లపెట్టెలో యీ కవరు ఓటరు స్వయముగాకాని, నౌఖరుద్వారాకాని, గడువులోపుననే పడవేయవచ్చును.

81. (1) అంధత్వమువల్ల లేక యితర కారణములవల్ల ఓటరు స్వయముగా గుర్తు పెట్టజాలనిచో, నతడు యీ దిగువ ఆఫీసర్లలో నొకరివద్దకు వెళ్లి వారినిగుర్తుపెట్టమని కోరవచ్చును. అతను కోరినరీతిగా వారు గుర్తుపెట్టవలెను.

(2) అట్టి ఆఫీసర్లు:—

స్టయిఫెండరీ మేజస్ట్రీట్లు (గ్రామమునసబు పనికిరాడు)

మద్రాసు స్మాల్ కాజ్ కోర్టు జడ్జీలు,

మద్రాసు సిటీ సివిల్ కోర్టు జడ్జీలు,
సబ్ జడ్జీలు,
డిస్ట్రిక్టు మునసబులు,
జిల్లా రిజిస్ట్రార్లు,
సబ్ రిజిస్ట్రార్లు.

82. (1) వోటుకాగితములు చేరియుండని వోటరు, లేక చేరినవి పొరపాటున పాడైనను లేక పోయినను, అట్టి వోటరు (2) వ విధిలో తెల్పినరీతిగా క్రొత్తకాగితమిమ్మని కోరవచ్చును. పాడైనకాగితములు రిటర్నింగ్ ఆఫీసరుకు పంపవలెను. క్రొత్తకాగితములు పుచ్చుకొన్న వోటరుపేరున కెదురుగా జాబితాలో ప్రత్యేక గుర్తుంచవలెను.

(2) అట్టి వోటరు ఆ ప్రదేశములోనున్న ప్రెసిడెన్సీ మేజస్ట్రీటు లేక తాలూకా మేజిస్ట్రేటు, లేక డిప్యూటీ తహసీల్దారు, లేక స్టేషనరీ సబ్ మేజిస్ట్రేటు వద్దకువెళ్లి, తాను వోటుకాగితము పారవేసికొంటిననికాని, ఓటుకాగితము తనకు చేరలేదని కాని వ్రాసియిచ్చి, ఆ ఆఫీసరుయెదుట సంతకము చేయవలెను. వోటరును ఆఫీసరెరుగనిచో, వోటరునెరిగిన యిద్దఱు ఘరానామనుష్యులు ఆఫీసరువద్దకు వచ్చి తామతనినెరుగుదుమని పైకాగితము పై సంతకములు చేయవలెను. గ్రామోద్యోగులు వోటరునెరిగియున్నను చాలును. ఆ ఆఫీసరా కాగితము పుచ్చుకొని రిటర్నింగ్ ఆఫీసరువద్దకు పంపవలెను.

83. ఈ విధుల ప్రకారము ప్రతివోటరును వోటు కాగితము పంపియున్నచో, అతని కాకాగితము చేరలేదను కారణముచే ఎన్నిక రద్దుచేయరు.

## వోట్లు లెక్కపెట్టు క్రమము

84. వోట్లు లెక్క గవర్నరు నియమించిన తేదీని ప్రారంభింతురు. వేళ, ప్రదేశము రిటర్నింగ్ ఆఫీసరు నిర్ణయించును. అంద రభ్యర్థులకున్ను, వోట్ల ఏజంట్లకున్ను, రిటర్నింగ్ ఆఫీసరు వోట్లు లెక్కపెట్టు ప్రదేశము, తారీఖు, వేళయున్న వ్రాతమూలముగా తెలుపవలెను.

## మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబరు ఎన్నికలకు సంబంధించిన విధులు

85. ఓట్లు రిటర్నింగ్ ఆఫీసరు (లేక అతనిసమక్షములో అతనిచేతిక్రింది ఆఫీసరు) లెక్కపెట్టవలెను. అచ్చట అభ్యర్థి, అభ్యర్థితరపు ఏజెంటు, అభ్యర్థి నియమించిన

యింకొక ప్రతినిధిమాత్రమే హాజరుండవచ్చును. పైవారెవరును హాజరుండరాదు. రిటర్నింగ్ ఆఫీసరు తన సహాయార్థము నియమించిన ఆఫీసర్లు హాజరు డవచ్చును. ఏ అభ్యర్థి తరఫునవైన పనిచేయువారిని రిటర్నింగ్ ఆఫీసరు తన సహాయార్థమేర్పాటు చేసుకొనరాదు.

86. వోట్ల లెక్కకుముందు రిటర్నింగ్ ఆఫీసరు ఎలక్షన్ నేరములు (వేరుభాగములో వ్రాసినాము) హాజరున్న వారికి చదివి వినిపించవలెను. ఆవెనుక యీ క్రింది కార్యక్రమ మవలంబింపవలెను:—

(1) (i) ఓటర్లు స్వయముగా ఓట్లువేయుపద్ధతిని ఓట్లుపుచ్చుకొన్న సందర్భములో:

ఒకే రంగున్ను ఒకేసంఖ్యయు కలుగు ఓట్లపెట్టె లన్నియున్ను, ఆరంగు కవర్లున్ను (70, 73 విధులప్రకారము ఓట్లు వేసిన కవర్లున్ను) తీయించవలెను. ఆరంగు పెట్టెలలోను, కవర్లలోను ఉన్న ఓట్లన్నియు తీసి, అవి లెక్కపెట్టించి, రిటర్నింగు ఆఫీసరు ఆసంఖ్య ఒక స్టేట్‌మెంటులో వ్రాసియుంచవలెను. ఆ వెనుక మరియొకరంగు, సంఖ్య, యున్న పెట్టెలున్ను, కవర్లున్ను తీయించి, వానిలోని ఓట్లు లెక్కపెట్టించి, మొత్తపుసంఖ్య వ్రాసికొనవలెను. అట్లే అన్నిరంగుల పెట్టెలున్ను, కవర్లున్ను, ఒకటి తర్వాత నొకటి తీయించి, దేనికిదానికి ప్రత్యేకముగా ఓట్లమొత్తపుసంఖ్య తన స్టేట్‌మెంటులో వ్రాసికొనవలెను.

(ii) ఓటర్లు పోస్టుద్వారా ఓట్లువేయుపద్ధతిని ఓట్లుపుచ్చుకొన్న సందర్భములో:—

పోస్టుద్వారా పంపిన కవర్లున్ను, పెట్టెలో పడవేసిన కవర్లున్ను, ఒకటి తర్వాత నొకటి విప్పి, అందులోని ఓటుకాగితములు పైకి తీయవలెను. నిదర్శనపత్రము కవరులో లేకపోయినచో, లోపలికవరు విప్పరాదు. అందుపై 'నిరాకరించిన ఓటు' అని వ్రాయవలెను. నిదర్శనపత్ర మున్నచో, అది సక్రమముగా వ్రాయబడియున్నదో లేదో రిటర్నింగు ఆఫీసరు తనిఖీచేయవలెను. నిదర్శనపత్రము తాను పంపినమతలబుపై వ్రాయలేదని, లేక సక్రమముగా వ్రాయలేదని, రిటర్నింగు ఆఫీసరభిప్రాయపడినచో, 'నిరాకరించినది' అని దానివెనుక వ్రాసి, అదిన్నీ లోపలికవరున్ను వేరుకట్టలో నుంచవలెను. ఒకేకవరులో పెక్కు నిదర్శనపత్రములున్ను ఓటు కవర్లున్ను పంపినచో వాని నన్నింటిని ఆఫీసరు నిరాకరించి, వేరుకట్టలో నుంచవలెను. తక్కిన (సక్రమముగానున్న) నిదర్శనపత్రములున్ను, కవరులున్ను వేరుగా నుంచి, ఆ కవర్లలోని ఓటుకాగితములు పైకి తీసి, లెక్కపెట్టి, ఆ మొత్తపుసంఖ్య నొక స్టేటుమెంటులో వ్రాయ

వలెను. ఆవెనుక తన సహాయార్థ మేర్పర్చిన ఆఫీసర్లకు ఓటుకాగితములు పంచియిచ్చి, ఏ అభ్యర్థి కెన్నిఓట్లు వచ్చినవో లెక్కపెట్టించవలెను.

(2) అభ్యర్థులు లేక వారి ఏజంట్లు రిటర్నింగు ఆఫీసరు నిరాకరింపదలచిన ఓటుకాగితములు చూడవచ్చును, కాని పట్టుకొనరాదు. నిరాకరించిన ఓటుకాగితముపై రిటర్నింగు ఆఫీసరు 'నిరాకరించినది' అని వ్రాయవలెను. ఏ అభ్యర్థియైన, ఏజెంటైన, నిరాకరణ చేయరాదని వచించినచో, రిటర్నింగు ఆఫీసరు నిరాకరణకు కారణములున్ను వ్రాయవలెను. ఏజెంటుకుకాని, అభ్యర్థినికాని, ఓటుకాగితము వెనుక నున్న ఓటరుసంఖ్య చూపనీయరాదు.

(ఒక ఓటుకాగితము పూర్తిగా నిరాకరింప నగత్యము లేకపోవచ్చును. తప్పు గుర్తులు మొదలైనవి కాగితములో కొంతభాగములో మాత్రము పెట్టియున్నచో ఆ భాగము నిరాకరించి మిగతా భాగము రిటర్నింగు ఆఫీసరంగీకరింపవచ్చును.)

(3) లెక్క పూర్తియగువరకు రిటర్నింగు ఆఫీసరు లెక్క సాగింపవలెను. అది సాధ్యముకానిచో, పంచులు కవర్లు మొదలైనవి మూయించి అందుపై తన సీలున్ను, అభ్యర్థుల లేక ఏజెంట్ల సీళ్లున్ను వేసి, కాగితములు భద్రపరుపవలెను.

87. (1) ఓటు కాగిత మీక్రిందికారణములలో దేని ననుసరించియైన నిరాకరింపవలెను:—

(i) పోస్టుద్వారా ఓటింగు జరిగినప్పుడు, స్వయముగా ఓటరు ఓటు వేసినప్పుడు:—

ఓటుకాగితముపై ఓటరు నానవాలుపట్టుట కవకాశమిచ్చు ఎట్టి గుర్తైనను పెట్టియుండుట.

(ii) స్వయముగా ఓట్లువేయునపుడు:—

(i) 61 రూలులో తెల్పిన స్టాంపు లేనప్పుడు.

(ii) మరియొక ఎలక్షన్ ఖండమునకు సంబంధించిన గుర్తిఖండపు కాగితముపై నున్నప్పుడు.

(iii) పోస్టుద్వారా ఓటింగు జరిగినసందర్భములో:—

(i) ఖాళీలకు మించి హెచ్చుమంది అభ్యర్థుల పేర్ల కెదురుగా గుర్తులుంచబడినచో

[మెంబరు ఖాళీలు రెండున్నచో, ఓటుకాగితముపై 6 గురు అభ్యర్థులపేర్లు వ్రాసియున్నను, వారిలో నిద్దరిపేర్ల కెదురుగా మాత్రమే ఓటరు గుర్తు పెట్టవచ్చును. ఇద్దరకుమించి హెచ్చుపేర్ల కెదురుగా గుర్తు పెట్టినచో, ఓటుకాగితము నిరాకరింతురు.]

(ii) ఏ పేరున కెదుర గుర్తులేనప్పుడు.

(iii) గుర్తే పేరున కెదురుగానున్నదో నిర్ణయింప వీలులేనప్పుడు.

(iv) కవరు రిటర్నింగ్ ఆఫీసరుకు గడువులోపుగా చేరునట్లు రిజిష్టరు పోస్టుద్వారా పంపకుండుట; లేక ఓట్లపెట్టెలో పడవేయకుండుట.

(v) కవరుతోపాటు నిదర్శనపత్రము పంపకుండుట.

(vi) ఒకే కవరులో రెండుమూడు నిదర్శనపత్రములు లేక ఓటు కవర్లు పెట్టియుండుట.

[ఒక కవరులో నొక్కే ఓటుకవరు పెట్టవలెను, ఒకే నిదర్శనపత్రి ముండవలెను.]

(vii) నిదర్శనపత్రము రిటర్నింగు ఆఫీసరు పంపిన మతలబుపై వ్రాయక వేరుకాగితముపై వ్రాసి పంపుట. నిదర్శకపత్రప్రవ్రాత చట్టవిరుద్ధమై యుండుట.

ఏ గుర్తైనను రెండుపేరుల కెదురుగా (ఏ పేరునకెదురుగా పెట్టియున్నదో నిర్ణయించుటకు వీలులేని పద్ధతిని) పెట్టియున్నచో, ఆగుర్తునకు విలువలేదు కాని ఓటు కాగితములోని తక్కిన గుర్తులకు విలువ నీయవలెను.

(2) పై కారణములు మినహా తక్కిన కారణములకు ఓటుకాగితము నిరాకరింపరాదు.

(3) ఎలక్షన్ పిటిషనులో మార్పు కావలసినదే కాని, యితరత్రా రిటర్నింగు ఆఫీసరు తీర్పు ఖాయముగా చెల్లవలసినదే. అతడు నిరాకరించిన ఓట్లు లెక్కలోనికి తీసికొనరు; అంగీకరించిన ఓట్లు లెక్కలోనికి తీసికొందురు.

88. లెక్క పూర్తికాగానే ఏ అభ్యర్థికి (లేక అభ్యర్థులకు) హెచ్చు ఓట్లు వచ్చినవో, ఎవరు విజయులైరో వెంటనే ఆఫీసరు వెల్లడిచేయవలెను.

షెడ్యూలు తరగతి మెంబరుగా ఎవ్వరెన్నుకొబడిరో ముందు తెలుపవలెను.

89. ఇర్వురభ్యర్థులకు సమానముగా ఓట్లు వచ్చినచో లాట్లువేసి, ఎవరిపేరు పైకి తీసిరో వారు జయమందినట్లు నిర్ణయింపవలెను.

90. (1) ఎన్నికఫలితము వెంటనే రిటర్నింగు ఆఫీసరు అసెంబ్లీ కార్యదర్శికిన్ని, గవర్నమెంటుకున్ను తెలుపవలెను.

(2) గవర్నమెంటు గెల్చొందిన అభ్యర్థులపేర్లు గెజెటులో ప్రచురింపవలెను.

91. స్వయముగా ఓటర్లు ఓటువేయు ఖండములలో రిటర్నింగు ఆఫీసరీ కార్యక్రమమవలంబింపవలెను.

పేచీ ఓట్లసంచియు, ఓటరుజాబితాయున్న సంచియు, ఓటుకాగితముల వెనుక ముక్కలున్న సంచియు, రిటర్నింగు ఆఫీసరు విప్పరాదు. ఓట్లసంఖ్యయు, నిరాకరించిన ఓటుకాగితముల సంఖ్యయు, వాడుకకాని ఓటుకాగితముల సంఖ్యయు తనిఖీ చూచి, ఓట్ల ఆఫీసరు స్టేటుమెంటులో వ్రాసినవానితో సరిపోవునో లేదో చూడవలెను. తాను విప్పిన సంచులన్నియు నావెంటనే మూసివేసి, సీళ్లువేసి, ప్రతిసంచిపైని అందులో నేకాగితము లున్నవో, ఏనాడు జరిగిన ఏ ఎన్నిక కది సంబంధించినదో వ్రాయవలెను.

92. పోస్టుద్వారా ఓట్లువేయు ఖండములో రిటర్నింగు ఆఫీసరీ కార్యక్రమ మవలంబింపవలెను.

లెక్క పూర్తియైన పిదప

(1) లెక్కపెట్టిన ఓటుకాగితములున్ను

(2) నిరాకరించిన నిదర్శనపత్రములు, వానికిసంబంధించిన ఓటుకాగితములున్ను

(3) లెక్కపెట్టు సమయమందు నిరాకరించిన ఓటుకాగితములున్ను

(4) ఓటుకాగితములు నిరాకరించినచో అవియు, వానికి సంబంధించిన నిదర్శనపత్రములున్ను

(5) గుర్తులు పెట్టియున్న ఓటరు జాబితాయున్ను వేరువేరు సంచులలో పెట్టి, వానిపై సీళ్లువేయించవలెను. ప్రతిసంచిపైని అందులో నేకాగిత ములున్నవో, అది ఏ తేదీని జరిగిన ఎన్నికకు సంబంధించినదో, వ్రాయవలెను. మరిన్ని 15 వ మతలబు ప్రకారము స్టేట్‌మెంటు వ్రాసి సంతకము చేయవలెను.

93. 16 వ మతలబు ననుసరించి అన్నిఖండముల ఎన్నికలలోను రిటర్నింగు ఆఫీసర్లు రిపోర్టువ్రాసి సంతకము చేయవలెను. ఆ రిపోర్టులో

(1) సక్రమమైన ఓట్లువచ్చిన అభ్యర్థులపేర్లు.

(2) ఏ అభ్యర్థి కెన్ని ఓట్లు వచ్చినవి; (సక్రమమైనవి)

(3) గెల్పొందిన అభ్యర్థి పేరు.

(4) నిరాకరించిన ఓట్లసంఖ్య.

(5) పేచీ ఓట్లసంఖ్య వ్రాయవలెను.

ఈ పై రిపోర్టునకు అభ్యర్థికాని అభ్యర్థితరఫు ఏజెంటుకాని నకలు వ్రాసికొన గోరినచో రిటర్నింగు ఆఫీసరు వ్రాసికొన అనుజ్ఞ యీయవలెను.

94. (1) ఎలక్షన్ ఫలితము తెలిపిన పిదప వీలైనంత త్వరలో ఈరిపోర్టు రిటర్నింగు ఆఫీసరు గవర్నమెంటుకు పంపవలెను.

(2) పై సంచులు రిటర్నింగు ఆఫీసరు స్వాధీనమందే భద్రపరుపవలెను.

95 పై ఓట్లసంచు లేవియు ఆటుతర్వాత విప్పరాదు. ఎలక్షన్ విచారణలో పీకోర్టువారైన వాటిని పంపమని కోరినచో పంపవలెను. అట్టి విచారణ జరుపు నధికారి వానిని విప్పవచ్చును.

ఎలక్షనుకు సంబంధించిన యితరకాగితములు కావలెనని గోరువారికి చూపెదరు. వారు రు 5/- చెల్లించినచో అట్టి అవకాశ మిచ్చెదరు.

96. (1) పై కాగితములు 1 సం॥ వరకు నిలువయుంచి యీ లోపుగా పీకోర్టువారున్ను ఏ కమీషనరున్ను వానిని పంపమని కోరనిచో, కాల్చివేయవలెను.

[కమీషన రనగా యీ ఎన్నికలకు సంబంధించినవి వారల పరిష్కరించు నధికారి. 103—117 విధులు చూ.]

(2) నామినేషన్ కాగితములున్ను అభ్యర్థులు దాఖలుచేసిన రాజీకాగితములున్ను 5 సం॥లు రిటర్నింగు ఆఫీసులో భద్రపర్చియుంచి ఆవెనుక కాల్చివేసెదరు.

## ఎలక్షన్ ఏజెంట్లు, ఎలక్షన్ ఖర్చులు

97. ఎలక్షన్ అక్రమచర్యల ఆర్డరుప్రకారము అభ్యర్థిగా నుండుటకు, లేక ఓటు వేయుటకు, అనర్హుడైన వానిని ఏ ఎన్నికలోను ఓట్ల ఏజెంటుగా నియమింపరాదు.

98. అభ్యర్థి పెట్టిన ఖర్చులు, ఏజెంటు పెట్టిన ఖర్చులు, అభ్యర్థిగాక మరియొకరైన పెట్టిన ఖర్చులున్ను ఏజెంటు వ్రాయు లెక్క పుస్తకములో వ్రాయవలెను. మరిన్ని ఏజెంటు, అభ్యర్థి (లేక వారితరఫున మరియొకరు) ఎలక్షను నిమిత్తమై పెట్టినఖర్చులకు బాకీపడియున్నచో అట్టి బాకీలు కూడా వ్రాయవలెను. ఆతవిసీళ్లు 2 వ షెడ్యూలులో తెలియజేసినవిధముగా వ్రాయవలెను.

99. ఎలక్షన్ఫలితము ప్రచురించిన 35 రోజులలోపుగా ఖర్చు లెక్కలు వ్రాసి రిటర్నింగు ఆఫీసరు యెదుట దాఖలు చేయవలెను.

100. (1) 3, 4 షెడ్యూళ్లలో తెల్పినరీతిగా అట్టి లెక్కలు వ్రాయవలెను.

(2) అభ్యర్థి విదేశములకు వెళ్లియున్నచో, అతడు హిందూదేశమునకు తిరిగి వచ్చిన 14 రోజులలోగా అతని నివేదిక దాఖలుచేయవచ్చును.

101. (1) పై లెక్క దాఖలుకాగానే ఫలానితేదీని లెక్కదాఖలైన దనియు, చూడగోరువారు రు 1/- చెల్లించి దానిని ఫలాని తేదీలలో ఫలానిచోట చూడవచ్చు

వనియు తన ఆఫీసులో నోటీసు ప్రచురింపవలెను. ఆ నోటీసు గెజెటులో కూడ వేయుంచవలెను.

(2) లెక్కలకు పబ్లికు నకలు కావలసినవారికి మామూలు పబ్లికు నకళ్లు తయారుచేయుటకు పుచ్చుకొను రేట్లనుబట్టి సొమ్ము పుచ్చుకొని యీయవలెను.

(3) (i) ఈ క్రింది తఖిసీళ్లుకనబర్చు స్టేటుమెంటొకటి గవర్నమెంటు తయారుచేయించవలెను:—

(అ) అభ్యర్థులపేర్లు.

(ఆ) ఏ అభ్యర్థితఫున ఏ ఏజెంటు పనిచేసెనో, అతనిపేరు.

(ఇ) ఎలక్షను జరిగిన తేదీ.

(ఈ) ఏ ఏ ఖండములలో ఎన్నికలు జరిగినవో

(ఉ) ఏ అభ్యర్థి ఎలక్షను లెక్కలు ఏ తేదీని దాఖలయ్యెనో

(ii) ఈ తఖిసీళ్లు గవర్నమెంటుకు రిటర్నింగు ఆఫీసర్లు పంపవలెను.

(iii) ఈ స్టేటుమెంటు చూడగోరువారి కెవరికైన చూపవలెను.

(iv) అట్టి స్టేటుమెంటు ఎలక్షను జరిగిన 6 సం॥ ల వరకు భద్రపర్చియుంచవలెను.

(v) సాధారణ ఎన్నికలకు వేరు స్టేటుమెంట్లును, ఆకస్మికపు ఖాళీల ఎన్నికలకు వేరు స్టేటుమెంట్లును వ్రాసియుంచవలెను.

102. మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబరుపదవి కభ్యర్థియై నిల్చినవారు యీ దిగువ తెల్పిన మొత్తములకు మించి ఖర్చుపెట్టరాదు ఈ మొత్తములో అభ్యర్థుల స్వంతఖర్చులును యిమిడియే యున్నవి.

## ఎలక్షను ఖండపు స్వభావము

ఎంత మొత్తము మించరాదు?

(i) 8,000 మందికి తక్కువ ఓటర్లున్న ఖండములలో రు 1,000/-

(ii) తక్కిన ఖండములలో ఓటరుకు 2 అణాలు లెక్కచొప్పున అన్యే మొత్తము.

## ఎలక్షను వివాదముల పరిష్కరించు విధానము

103. షెడ్యూలు తరగతులలో ప్రథమ ఎన్నిక విషయమై అక్రమచర్యల ఆర్డరులోని విధులతోపాటు యీ క్రింది విధులును గమనింపవలసినవే.

(i) ప్రథమ ఎన్నికలో విజయుడైన అభ్యర్థి ఎన్నిక నాక్షేపించును పిటిషన్ దాఖలు చేయుదున్నచో ఎన్నిక మద్రాసు పట్టణములో జరిగిన యెడల మద్రాసు కలెక్టరుగారికి దాఖలు చేయవలెను.

ఎన్నిక జిల్లాలలో జరిగినయెడల ఆయా జిల్లా కలెక్టరుగారికి దాఖలు చేయవలెను.

ప్రథమ ఎలక్షన్ ఫలితములు వెల్లడిచేసిన రెండురోజులలోగా అట్టి పిటిషను దాఖలు చేయవలెను.

(ii) ఆ కలెక్టరు ఆ పిటిషన్ పై టూకీగా విచారణచేసి వీలైనంత త్వరలో తీర్పు చెప్పవలెను.

(iii) కలెక్ట రిచ్చిన తీర్పు ఖాయమైనది.

104. గెల్చొందిన అభ్యర్థి ఎన్నిక నాక్షేపించుచు దాఖలుచేసిన ఎలక్షన్ పిటిషన్ గవర్నరుగారికి దాఖలుచేయు విధానము లివ్వవి:—

(i) గవర్నరుగారి యెదుట, లేక గవర్నరుగారు నియమించిన మరియొక ఉద్యోగియెదుట, ఆక్షేపణదారు స్వయముగా దాఖలుచేయుట.

(ii) వారి యెదుట, ఆక్షేపణదారు తరఫున (ఆక్షేపణదారువల్ల వ్రాతమూలమైన అనుమతి పొందిన) మరియొకరు దాఖలు చేయుట, లేదా

(iii) వారి కా పిటిషను రిజిస్ట్రీ పోస్టులో పంపుట.

105. ఎలక్షన్ పిటిషన్ దాఖలు చేయుట కీ క్రిందివారి కధికార మున్నది:—

(i) 101 (i) రూలుబట్టి గెల్చొందిన అభ్యర్థి లెక్కలు గెజెటులో ప్రచురణ కాబడిన తేదీలగాయితు 14 రోజుల లోపుగా ఏ అభ్యర్థియైన ఏ ఓటరైన అట్టి పిటిషన్ దాఖలు చేయవచ్చును.

(2) ఎన్నికలో అనేక లంచపునేరములు, మోసగించి వోటర్లబుద్ధి మార్చిన నేరములు జరిగిన వని గవర్న రభిప్రాయపడినచో, ఎన్నికరద్దు నిమిత్తమై పిటిషన్ దాఖలుచేయు మని గవర్నరే ఒక ఆఫీసరున కాజ్ఞయిచ్చును.

## 1 వ నిర్వచనము

పిటిషన్ దాఖలు కావలసిన ఆఖరురోజు గవర్నమెంటు సెలవుదిన మైనచో, ఆ మర్నాడు దాఖలుచేసినను సకాలములో దాఖలు చేసినట్లే భావింతురు.

## 2 వ నిర్వచనము

100 (2) రూలులో విదేశముల కేగిన అభ్యర్థి తిరిగివచ్చి నివేదిక దాఖలుచేసిన పిదప 14 రోజులలో పిటిషను దాఖలుచేయవచ్చును.

106. (1) పిటిషనులో ఆక్షేపణకారణములన్నియు సంక్షేపముగా వ్రాయవలెను. పేరాలక్రింద విడదీసి వ్రాయవలెను. వ్రాతచివర ఆక్షేపణదారు సంతకముచేసి, పైని వ్రాసిన విషయములన్నియు యథార్థములని వ్రాసి రెండవసారి సంతకము చేయవలెను.

(2) పిటిషనుతోపాటు ఒకజాబితాయున్ను దాఖలుచేయవలెను. అందుపై ఆక్షేపణదారు సంతకముచేయవలెను. అందులో అక్రమచర్యలను, లేక నేరములను పూర్తియైన తబిసీల్లు వ్రాయవలెను. ఆ అక్రమచర్య లెవరు చేసిరో ఏచోట, ఏ తేదీని, ఎన్నిగంటలవేళ చేసిరో మొదలగు విషయములు సాధ్యమైనంత విపులముగా వ్రాయవలెను.

(3) ఆజాబితాలో వ్రాసినవిషయములు మార్పుచేయుటకు వాని కదనముగా మరికొన్ని విషయములు వ్రాయుటకు, ఆక్షేపణదా రభిలషించుచో (ఎదురు పార్టీకి ఖర్చులు మొదలైనవి యిప్పించి) కమీషనర్లట్టి సవరణలుచేయ నీయవచ్చును.

107. గెల్చొందిన అభ్యర్థి ఎన్నిక నాక్షేపించుటయే గాక, తానే గెల్చొందిన అభ్యర్థియని తీర్పుచెప్పమని ఆక్షేపణదారు కోరవచ్చును. ఆ సందర్భములో నతడు తక్కిన అభ్యర్థుల నందరను పిటిషనులో పార్టీలుగా చేర్చవలెను.

108. పిటిషనుతోపాటు రు 1,000/- రొక్కము లేక గవర్నమెంటు ప్రామిసరీ నోట్లు దాఖలుచేయవలెను.

షెడ్యూలు తరగతుల ప్రథమ ఎలక్షన్ సందర్భములో రు 250/- దాఖలు చేసిన చాలును.

109 (2) ప్రకారము గవర్నరుచే నియమితుడగు ఆఫీసరు సొమ్ముకట్ట నక్కర లేదు.

109. (1) ఆక్షేపణదారు చనిపోయినచో పిటిషన్ అంత మొందును.

పిటిషన్ దాఖలుచేసినవారు గవర్నమెంటు ఉద్యోగి యైనచో అతడు చనిపోయినను, అతని స్థానే మరియొక ఉద్యోగి పిటిషన్ నడుపవచ్చును.

(2) పిటిషన్ అంతమొందిన విషయము గెజెట్‌లో ప్రకటింపవలెను.

(3) ఈప్రకటన జరిగిన 14 రోజులలో మరియొక అభ్యర్థి తన్నాక్షేపణదారుగా భావించి పిటిషన్ గ్రంథము విచారింపుమని కమీషనర్లను కోరవచ్చును. అతడున్ను పైధరావత్తుమొత్తములు కట్టవలెను.

110. (1) కమీషనర్లు లేక గవర్నరు అనుమతి యిచ్చిననే పిటిషన్ వదులుకొనవచ్చును.

(2) రెండు మూడు పిటిషన్లు దాఖలైనచో, అందరాక్షేపణదార్లు సమ్మతించిననే కాని ఏ పిటిషను వదులుకొనుటకు వీలులేదు.

(3) విడుదలనిమిత్తమై పిటిషన్ దాఖలైనచో పార్టీలందరకున్ను నోటీసు చేయించవలెను. ఆ పిటిషన్ విచారణకు వాయిదా ఏర్పరుపవలెను.

(4) ఆక్షేపణదారు లంచముపుచ్చుకొని లేక ఏదైన బహుమాన మాసించి పిటిషన్ వదులుకొనుచున్నాడని కమీషనర్ల కనుమానము కలిగినచో వారు విడుదలపిటిషన్ కొట్టివేయవలెను.

(5) విడుదలపిటిషన్ కమీషన ర్లంగీకరించుచో

(i) ఎదురు పార్టీ ఖర్చులు (లేక అందులోనిభాగము) ఆక్షేపణదా రిచ్చుకొనవలసియుండును.

(ii) పిటిషన్ వదులుకొనిన వర్తమానము గెజెట్‌లో ప్రచురింపవలెను.

(iii) అట్టి ప్రచురణ జరిగిన 14 రోజులలోగా మరి ఎవరైన తన్నాక్షేపణదారుగా భావించి పిటిషన్ గ్రంథము నడుపవలసిన దని (అతడు ధరావత్తుసొమ్ము కట్టవలెను.) కమీషనర్లను కోరవచ్చును.

(6) ఆక్షేపణదారు పిటిషన్ వదులుకొనిన పిమ్మట పై రీతిగా ఎవరున్ను కోరియుండనిచో, కమీషన ర్లా వర్తమానము గవర్నరుగారికి తెలియపర్చవలెను.

111. ఎదురుపార్టీ చనిపోయిన సందర్భములో, లేక ఎదురుపార్టీ పిటిషనుకు అడ్డుచెప్పనని నోటీ సిచ్చినచో, యీ విజయము కమీషనర్లు గెజెటులో ప్రచురింపవలెను. అట్టి ప్రచురణ జరిగిన 14 రోజుల లోపుగా మరి యెవరైనను పిటిషనులో తన్ను పార్టీగా చేర్చుకొమ్మనియు, తాను పిటిషనుకు అడ్డువాదము పెట్ట సిద్ధపడియున్నాననియు, కమీషనర్ల కెరిగింపవచ్చును.

112. (1) పై విధుల ననుసరించి వ్రాసియుండని పిటిషన్ గవర్నరు కొట్టివేయవచ్చును.

(2) పిటిషన్ కొట్టివేయని సందర్భములలో, ఆ పిటిషన్ విచారణనిమిత్తము గవర్నరుగా రేర్పరిచిన కమీషనర్లవద్దకు పంపవలెను.

(3) ఆ కమీషనర్లలో ప్రధానుడు ఆ పిటిషన్ దాఖలైన వర్తమానము ఎదురు పార్టీలందరకు తెలుపవలెను, గెజెటులో ప్రచురింపవలెను. ఆక్షేపణదారు ఖర్చుల నిమిత్తమై జామీనుబాండు (మరికొందరు జామీనుదారులతోసహా) వ్రాసి యివ్వ వలసిన దని ఉత్తర్వు వేయవచ్చును. పైప్రచురణ జరిగిన 14 రోజుల లోగా మరి ఏ అభ్యర్థియైన తన్నుకూడా పిటిషనులో పార్టీగా చేర్చుకొమ్మని కమీషనర్లను కోర వచ్చును. అతడున్ను ధరావత్తు కట్టుటకున్ను, బాండు వ్రాసి యిచ్చుటకున్ను సంసిద్ధుడై యుండవలెను.

105 (2) ప్రకారము పిటిషన్ దాఖలుచేయు గవర్నమెంటు ఆఫీసరు బాండు దాఖలుచేయ నక్కరలేదు.

113 దావాల విచారణలో నవలంబించు క్రమమును బట్టియే పిటిషన్ల విచార ణయు జరుపవలెను.

సాక్షులు చెప్పిన విషయము కమీషనర్లు సంక్షేపముగా వ్రాసికొనిన చాలును. వాంగ్మూలములపై సాక్షుల సంతకములు చేయింప నక్కరలేదు.

114. గవర్నరుగారు నియమించిన ప్రదేశములో విచారణ జరుగవలెను.

కమీషనర్లు విచారణలో కొంతభాగము మరియొకచోట జరుపవచ్చును; లేదా తమలో నొకరిని రాష్ట్రములో నేప్రదేశమునకైన నేగి సాక్ష్యము పుచ్చు కొమ్మని పంపవచ్చును.

115. (1) గెల్పొందిన అభ్యర్థి గాక మరియొక అభ్యర్థి తాను విజయుడైనట్లు తీర్పి యమని కమీషనర్లను కోరినచో ఆరెండవ అభ్యర్థి మెంబరగుట కనర్హుడని పార్టీగా నున్న ఏ అభ్యర్థియైన రుజువుచేయవచ్చును. ఈ రెండవ అభ్యర్థి విజయుడై యున్నచో అతని ఎన్నిక రద్దుపర్చుటకు బలవత్కారణము లున్నవని రుజువుపర్చ వచ్చును.

అట్టి ఆక్షేపణ చేయదలచినవారు పిటిషన్ నోటీసు ప్రకటనజరిగిన 14 రోజుల లోగా (తా మాక్షేపణచేయ సంకల్పించినట్లు) కమీషనర్లకు నోటీసు యీయవలెను. ధరావత్తు కట్టి బాండు వ్రాసి యీయవలెను.

116. ఎలక్షన్ పిటిషన్లున్ను కమీషనర్ల తీర్పులున్ను 5 సం॥లు భద్రపర్చియుంచి ఆవెనుక గవర్నమెంటు కాల్చివేయవలెను.

**117.** (1) ఏ అభ్యర్థియైన పెక్కుఖండములలో మెంబరుగా నెన్నుకొనబడినచో అత డేఖండములో మెంబరుగా నుండగోరునది అసెంబ్లీకార్యదర్శికి వ్రాసిపంప వలెను. ఎలక్షను ఫలితము ప్రచురణకాబడిన 7 రోజులలోగా అట్టి కాగితము కార్యదర్శి కీయవలెను. అభ్యర్థి ఏ ఖండమునకు మెంబరుగా నుండగోరునో, ఆఖండ మునకే అతడు మెంబరుగా నుండును. అతని మనోనిశ్చయమున కాక్షేపణచేయరాదు.

(2) తక్కిన ఖండముల ఓటర్లను తిరిగి మెంబరు నెన్నుకోవలసిన దని గవర్నరు గారు హెచ్చరిక చేయవలెను.

(3) అభ్యర్థి పైకాగితము దాఖలుచేయనిచో, అతని ఎన్నిక (అన్నిఖండముల లోను) పూర్తిగా రద్దగును. ఆ వెనుక ఆయాఖండముల ఓటర్లను తిరిగి మెంబరు నెన్నుకోవలసిన దని గవర్నరుగారు హెచ్చరిక చేయవలెను.

## మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబర్ల ఎన్నికకు సంబంధించిన విధులు

### 2–వ షెడ్యూలు

......................పేరు గల నేను..................................

నావోట్ల ఏజెంటుగా నియమించితి నని తెలుపుచున్నాను.

ప్రదేశము

తేదీ అభ్యర్థి సంతకము.

### 1-వ మతలబు (12-వ రూలు చూ.)

............ఖండములో షెడ్యూలు తరగతి మెంబరు ఎన్నిక నిమిత్తమై నలుగు రభ్యర్థులను షెడ్యూలుతరగతి వోట రెన్నుకొనవలసియున్నది కావున,

....................పేరు గల నేను ఆఖండపు రిటర్నింగ్ ఆఫీసరును కావున యీ దిగువనోటీసిచ్చుచున్నాను.

### నోటీసు

(i) ఎన్నుకోవలసిన అభ్యర్థులు నలుగురు.

(ii) ఈక్రింద సంతకము చేసినవారికి, లేక వానిస్థానమున వ్యవహరించు నాతనికి, నామినేషన్లు.........చోట, పగలు 11-3 గంటలమధ్య, .........తేదీని కాని, ఆలోపుగా కాని దాఖలు చేయవలెను.

(iii) నామినేషను మతలబులు..............ఆఫీసులలో...............
తేదీలలో............గంటలమధ్య నుచితముగా నిచ్చెదరు.

(iv) నామినేషన్లు..................తేదీని ...............గంటలకు
............ప్రదేశములో తనిఖీ చేతురు.

(v) వోట్లు...........తేదీని............గంటలమధ్య................
చోట పుచ్చుకొందురు.

(vi) వోటరు తన గ్రామసముదాయములోని వోట్ల ఆఫీసులోనే వోటు వేయవలెను. వోట్ల ఆఫీసులో పనిచేయువారు నిదర్శనపత్రము పుచ్చుకొనవచ్చును.

వోట్లు పుచ్చుకొను నాఫీసులు దిగువ తెలుపుచున్నాము

| గ్రామసముదాయము నంబరు | వోట్ల ఆఫీసు |
|---|---|
| ............ప్రదేశము | ..................... |
| ..............తేదీ | .........ఎలక్షన్ ఖండపు రిటర్నింగ్ ఆఫీసరు సంతకం |

## మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ మెంబర్ల ఎన్నికలు

### 2-వ మతలబు (13, 34 విధులు చూ.)

### నామినేషన్ కాగితము

ఎలక్షన్ ఖండము పేరు.......................................
అభ్యర్థి పేరు.......................................
అభ్యర్థి తండ్రిపేరు.......................................
అభ్యర్థి వయస్సు.......................................
అభ్యర్థి చిరునామా.......................................
అభ్యర్థి వోటరుగా నమోదైయున్న
ఎలక్షన్ ఖండము.......................................
అభ్యర్థినంబరు (జాబితాలో).......................................
ఉపపాదించు వోటరు పేరు.......................................
ఉపపాదించు వోటరు నంబరు.......................................
ఉపపాదించు వోటరు సంతకము.......................................
బలపర్చు వోటరు పేరు.......................................

బలపర్చు వోటరు నంబరు..............................

బలపర్చు వోటరు సంతకము..............................

## అభ్యర్థి అంగీకారము

నే నభ్యర్థిగా నుండుట కంగీకరించుచున్నానని తెలుపుచున్నాను.

తేది ..........................

అభ్యర్థి సంతకము

వరుస సంఖ్య.........

ఈ నామినేషన్ కాగితము నా ఆఫీసులో............తేదీని.........
గంటలవేళ దాఖలైనది. ..........................

రిటర్నింగ్ ఆఫీసరు సంతకము

## 5-వ మతలబు (47-వ రూలు చూ.)

..................ఎలక్షన్ ఖండము లెజిస్లేటివ్ అసెంబ్లీ

### ఎన్నికకు నిల్చిన అభ్యర్థుల జాబితా

| వరుస సంఖ్య | అభ్యర్థుల పేర్లు | అభ్యర్థుల నివాసములు |
|---|---|---|
| 1 | .................. | ...................... |
| 2 | .................. | ...................... |
| 3 | .................. | ...................... |

............తేదీని............గంటలమధ్య యిదివరలో ప్రచురించిన ఓట్ల ఆఫీసులలో ఓట్లు పుచ్చుకొందురు. ..........................

రిటర్నింగ్ ఆఫీసరు సంతకం

## 7-వ మతలబు (66-వ రూలు చూ.)

### వేచీవోట్ల జాబితా

ఓట్ల ఆఫీసు పేరు..................

| ఎలక్షన్ ఖండము | ఓటరు పేరు | జాబితాలో ఓటరు నంబరు | వోటరు సంతకము లేక వేలుముద్ర |
|---|---|---|---|
| | | | |

8-వ మతలబు (67-వ రూలు చూ.)

## తగాయిదా వోట్ల జాబితా

ఓట్ల ఆఫీసు పేరు..................

| జాబితాలో ఓటరు నంబరు | పేరు | ఓటరు వ్రాలు లేక వేలుముద్ర | ఓటును గుర్తుపట్టు వాని పేరు |
|---|---|---|---|
| | | | |

............................(ఓట్ల ఆఫీసరు వేసిన ఆర్డరు)

........................

ఓట్ల ఆఫీసరు సంతకము

9-వ మతలబు (67-వ రూలు చూ.)

## ఏజెంటు దాఖలు చేయునది

..................పేరు గల నేను యీ దిగువ నుదాహరించిన ఆసామీ కృత్రిమ నామముతో ఓటువేయ యత్నించెనని రుజువు చేయుటకు సిద్ధముగా నున్నాను.

| ఆసామీ పేరు | విలాసము | వ్రాలు లేక వేలుముద్ర |
|---|---|---|
| | | |

.............ప్రదేశము

................తేదీ

........................

అభ్యర్థి లేక ఏజెంటు వ్రాలు

సాక్షి వ్రాళ్లు

..................

(1)..................పేరు, విలాసము

(2).................. ,,

12-వ మతలబు (76-వ రూలు చూ.)

## పోస్టుద్వారా పంపు వోటుకాగితము

........................ఎలక్షన్ ఖండము

| అభ్యర్థుల పేర్లు | గుర్తు |
|---|---|
| (1) | |
| (2) | |
| (3) | |

### వెనుక పేజీ

(1) మీరు............గుర్తులు మాత్రమే పెట్టవచ్చును.

(2) ఒక అభ్యర్థి పేరుయెదుట నొక్క గుర్తుమాత్రమే పెట్టవచ్చును.

(3) మీరు వోటీయదలచిన అభ్యర్థి పేరున కెదురుగా × గుర్తు పెట్టుడు.

[ ] వోటుకాగితపు సంఖ్య

12-వ మతలబు (76-వ రూలు చూ.)

## పై కాగితముతోపాటు దాఖలుచేయు నిదర్శనపత్రము

..................ఎలక్షన్ ఖండము.

..................వరుస సంఖ్య.

..............................ఓటరు పేరు, నంబరు.

..................పేరు గల నేను యీ ఖండములో ఓటరు ననియు, నేను మరి ఏఖండములోను ఓటు వేయలే దనియు తెలుపుచున్నాను.

............తారీఖు ....................ఓటరు వ్రాలు

............ప్రదేశము ....................విలాసము

16-వ మతలబు (93-వ రూలు చూ.)

## ఖండపు ఎన్నికల ఫలితము తెల్పు రిపోర్టు

| ఓట్లువచ్చిన అభ్యర్థుల పేర్లు | ఓట్ల సంఖ్య |
|---|---|
| సుందరం.......................... | ............ |
| నరసింహం.......................... | ............ |
| విష్ణుమూర్తి.......................... | ............ |
| రామచంద్రుడు.......................... | ............ |
| సక్రమమైన ఓటుకాగితముల సంఖ్య ... | ............ |
| నిరాకరించిన ఓటుకాగితముల సంఖ్య ... | ............ |
| పేచీ ఓటుకాగితముల సంఖ్య ... | ............ |

ఈ దిగువ నుదాహరించిన అభ్యర్థులు విజయులై రని నేను వెల్లడిచేయుచున్నాను.

సుందరం

విష్ణుమూర్తి

..........................

రిటర్నింగ్ ఆఫీసరు సంతకం

# మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరు ఎన్నికలు జరుపు విధానము

నిబంధన

**1.** ఈ నిబంధనలు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబర్ల నెన్నుకొనుటకును, ఎలక్షను వివాదముల పరిష్కరించుటకును సమకూర్చబడినవి.

**2.** ఈక్రింది మాటల కర్థములు తెలుపుచున్నాము:—

(1) (i) "ఆక్టు" అనగా 1935 వ సంవత్సరపు ఇండియా పరిపాలనా చట్టము.

(ii) సాపుజాబితాలో వ్రాసిన ఏభాగముసక్కైన నకలు తీయించి, ఆనకలు సరియైనవని రిజిస్ట్రేషన్ ఆఫీసరు రూఢిపరచి, దరఖాస్తుదారున కిచ్చినచో, ఆనకలు "పబ్లికు నకలు"గ భావింపవలెను.

(iii) "అక్రమ చర్యల ఆర్డరు" అనగా 1936 వ సంవత్సరపు అక్రమ చర్యల ఆర్డరు.

(iv) "కౌన్సిళ్ల ఆర్డరు" అనగా 1936 వ సంవత్సరపు రాష్ట్రకౌన్సిళ్ల ఆర్డరు.

(v) "గజెట్" అనగా ఫోర్టుసెంట్‌జార్జిగజెట్.

(vi) "గెల్చిన అభ్యర్థి" అనగా ఎలక్షనులో నుత్తీర్ణుడైనవాడు. అతడు విజయుడైనట్లు క్రమమైన ప్రకటన జరిగియుండవలెను.

(vii) "సంతకము చేసిన" అనగా, సంతకము చేయలేనివాడు వేలుముద్ర వేసిన అను నర్థమున్ను చేసుకొనవలెను.

(2) గడువేర్పరుచుట కధికార మున్నవారికి గడువు పెంచుటకున్ను, క్రొత్తగడు వేర్పరుచుటకున్ను కూడ నధికార మున్నది.

(3). ఎన్నిక తేర్పరుచుటలో ఏదైన సందేహము కలిగినచో, (ఆక్టు విధుల ననుసరించి) గవర్నరుగా రొసగు నుత్తరువుసుబట్టి ఆసందేహనివృత్తి చేసుకొనవలెను.

(4). ఈ నిబంధనలలో వాడిన మాటల అర్థమునుగూర్చి సంశయము కలిగినచో, (ఎలక్షను విచారణలో సంశయము కలిగినచో నందుపై కమీషనర్లు తీర్పిత్తురు.) గవర్నరుగారి కాసంశయము తెలిపి, వారి యభిప్రాయము ననుసరించి నడుచుకో వలెను. గవర్నరుగారి తీర్పునకు తిరుగులేదు.

5. (1) ఈ ఆక్టు ననుసరించి గవర్నరుగారు నిర్వహింపవలసిన విధు లన్నియు, ఆక్టు అమలులోనికి రాకపూర్వము గవర్నరుగారు వారి కౌన్సిలుతో సంప్రతించి నిర్వహింపవలెను.

(2) ఆక్టు అమలులోనికి వచ్చినపిమ్మట యీ క్రిందినిబంధనల ననుసరించి నిర్వహింపవలసిన విధులు గవర్నరుగారు తమంతతామే నిర్వహింపవలెను; యింకొకరి సలహా పుచ్చుకొనవలసిన ప్రసక్తి లేదు:—

3, 4, 8, 9, 12, 76, 84 (2), 88 (1), 89 (1), 91 (1), 91 (2), 95.

గడువు లేర్పరుచుట, పెంచుట, క్రొత్తగడువు లేర్పరుచుట గవర్నరుగారు స్వతంత్రముగానే చేయవలెను.

6. ఏ స్వతంత్ర ప్రభువులైన, అతని ప్రజలలో నెవరినైన కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకోవచ్చును.

7. ఈ నిబంధనల ననుసరించి జరుపబడిన కార్యక్రమమును ఏ కోర్టులోను ఆక్షేపణ చేయరాదు.

8. (1) క్రొత్తఆక్టు షరతులు మద్రాసురాష్ట్రములో నమలులోనికి వచ్చుసరికి కౌన్సిలు సిద్ధముగా నుండునట్లు ఈ లోపుననే ఎన్నికలు జరుపవలెను.

(2) వివిధ ఖండములలోని సీట్లకు మెంబర్లను ఫలాని తేదీలోపుగా నెన్నుకొనవలసిన దని ఆయాఖండముల ఓటర్లందరికిన్ని గవర్నరుగారు హెచ్చరిక చేయవలెను.

9. (1) ఏమెంబరైన చనిపోవుటచే, లేక రాజీయిచ్చుటచే, లేక చట్టము ననుసరించి మెంబరుపదవి కనర్హు డగుటచే, ఆతనిపదవి ఖాళీ కావచ్చును. ఆఖాళీ సంభవించిన వెంటనే మరియొక మెంబరను ఫలానా తేదీలోపుగా ఎన్నుకొనవలసిన దని ఆఖండపు ఓటర్లకు గవర్నరు హెచ్చరిక చేయవలెను. అట్టి హెచ్చరిక గెజెట్‌లో ప్రకటన కావలెను.

5 వ అనుబంధము 18 వ రూల్సుప్రకారము ఏ మెంబరు సీటైనను ఖాళీ కానున్నచో, తత్పూర్వమే గవర్నరు ప్రకటన సాగించి, ఖాళీ వచ్చునప్పటికి ఎలక్షన్ ముగియు నేర్పాట్లు చేయవలెను.

(2) గవర్నరు నియమించిన మెంబర్లలో ఖాళీవచ్చినచో, మరియొకరిని ఆస్థానే గవర్నరు నియమింపవలెను.

10. ఎలక్షన్ ఖండములో రిటర్నింగు ఆఫీసర్లుగా నెవరు వ్యవహరింపవలెనో (అనగా ఓట్లు పుచ్చుకొని ఎలక్షన్ ఫలితములు తేల్చునధికారి) అనుబంధములో తెలిపి యున్నాము.

11. ఆ అనుబంధములో రిటర్నింగు ఆఫీసరుస్థానే వ్యవహరించుట కధికార మున్న ఆఫీసర్ల పేర్లున్ను తెలిపినాము. ఆ అధికార్లు,

(i) నామినేషన్లు పుచ్చుకొనుట,

(ii) అభ్యర్థిత్వములకు రాజీ లంగీకరించుట,

(iii) నామినేషన్లు తనిఖీచేయుట,

(iv) ఓట్లు లెక్కపెట్టుట,

ఈ విధులు సర్వసాధారణముగా చేయరాదు. రిటర్నింగు ఆఫీసరు స్వయముగా నావిధులను నిర్వహింపలేని సందర్భ మేర్పడినప్పుడు (ఉదా. అతడనారోగ్యముగా నున్నప్పుడు) వారు పై విధులుకూడ నిర్వహింపవచ్చును. రిటర్నింగు ఆఫీసరును గూర్చి యీ నిబంధనలలో ప్రసంగించినప్పుడు, అతనిస్థానే వ్యవహరించుట కధికార మున్న ఆఫీసర్లను గూర్చియు ప్రసంగించినట్లే తలంపవలెను.

12. గవర్నరుగారు 8 (2) రూలు లేక, 9 (1) రూలు ననుసరించి చేయు ప్రకటనలో

(1) ప్రకటన తేదీకి 21 రోజులు మించకుండ నామినేషన్లు దాఖలుచేయు తేదీ యేర్పరుపవలెను.

(2) నామినేషన్ల దాఖలు తేదీకి 3 రోజులు మించకుండ, నామినేషన్లు తనిఖీ చేయు తేదీ యేర్పరుపవలెను.

(3) ఓట్లు పుచ్చుకొను తేదీ (లేక తేదీలు) నిర్ణయింపవలెను.

(4) ఓట్లు లెక్కపెట్టు తేదీ (లేక తేదీలు) నిర్ణయింపవలెను.

13. గవర్నరుగారి ప్రకటన జరుగగానే, రిటర్నింగు ఆఫీసరు ఎలక్షను జరుగనున్నదను వర్తమాన మెల్లరకును తెలియునట్లు (1 వ మతలబు ననుసరించి తనకు యుక్తమని తోచిన భాషలో ప్రకటన వ్రాసి) ప్రకటింపవలెను; ఎలక్షన్ ఖండములో ఆప్రకటన ఆఫీసరుకు యుక్తమని తోచే పద్ధతిని ప్రచురింపవలెను ఆఖండములోని మునిసిపల్ ఆఫీసులలోను, కలక్టరు ఆఫీసులోను, డివిజనల్ ఆఫీసులోను, తహసీల్దారు డిప్యూటీ తహసీల్దార్ల ఆఫీసులలోను, సబ్ మేజిస్ట్రేటు ఆఫీసులలోను ఆప్రకటన నటింపించవలెను. ఆప్రకటన యీక్రింది గెజెట్లలో కూడా ప్రచురింపవలెను.

(i) ఫోర్టు సెంట్ జార్జి గెజెట్:

మహమ్మదీయ, యూరపియన్, ఇండియన్ క్రిస్టియన్ ఖండముల ఎన్నికలలో, మద్రాసుపట్టణములో జనరల్ ఖండముల ఎన్నికలలో.

(ii) జిల్లా గెజెట్.

మద్రాసుపట్టణములో గాక మిగతా జనరల్ ఖండముల ఎన్నికలలో.

14. నిర్ణీత వ్యవధిలోపుగా పగలు 11—3 గంటల మధ్య అభ్యర్థి (లేక ఉపపాదించు లేక బలపర్చు ఓటరు) రిటర్నింగు ఆఫీసరు యెదుట 2వ మతలబు ననుసరించి వ్రాసిన) నామినేషన్ కాగితము దాఖలుచేయవలెను. అందుపై అభ్యర్థి నామినేషన్ కు అంగీకారము సూచించు వ్రాసి సంతకము చేయవలెను; (జాబితాలో పేరున్న) ఒకఓటరు అభ్యర్థిపే రుపపాదించుచు సంతకము చేయవలెను. మరియొక ఓటరు (జాబితాలో పేరున్నవాడు) బలపర్చుచు సంతకము చేయవలెను.

15. (1) ఆక్టువిధుల ననుసరించి అర్హులైనవారిని అభ్యర్థులుగా నామినేషన్ చేయవచ్చును.

(2) అభ్యర్థి తాను నిలువగోరుచున్న ఖండములో ఓటరుగాక (ఆతరగతికి చెందిన) మరియొకఖండములో ఓటరైనచో, ఆతడు రెండవఖండములో ఓటరైనట్లు సూచించుజాబితా పబ్లికునకలు (ఆనకలులో నితనిపే రున్నభాగము చాలును) నామినేషన్ కాగితముతోపాటు దాఖలు చేయవలెను.

16. (1) ఆఖండపు ఓటరుజాబితాలో పేరున్న ప్రతి ఓటరున్ను ఎన్నుకోవలసిన మెంబర్లెందరో, అన్ని నామినేషన్ కాగితములపై ఉపపాదకుడుగానైన, బలపరచుచునైన, సంతకములు చేయవచ్చును. ఆసంఖ్యకు హెచ్చు కాగితములపై సంతకము చేయరాదు.

(2) ప్రతి అభ్యర్థియు తన తరపున పనిచేయుటకు ఒక ఏజంటు నేర్పరుచుకొనవలెను. తనకు తన్నే ఏజంటుగా నేర్పరుచుకొనినను ఏర్పరుచుకొనవచ్చును. అట్టి ఏర్పాటు చేసినట్లు 2 వ షెడ్యూలులో చెప్పనరీతిగా కాగితమువ్రాసి నామినేషన్ తో పాటు దాఖలుచేయవలెను. అట్లు నియమించిన ఏజంటు (ఏవిధి ననుసరించిగాని) ఏజంటుపని చేయుట కనర్హుడై యుండరాదు.

నామినేషన్ కాగితముతోపాటు పై కాగితమున్ను దాఖలైననేగాని అభ్యర్థి నామినేషన్ సక్రమ మైనది కానేరదు.

ఒక అభ్యర్థిపేరు పెక్కు నామినేషన్ కాగితములలోనున్నను, యీరెండవ కాగిత మొక్కటి మాత్రము దాఖలైన చాలును.

17. ఓటర్లకిచ్చు నిమిత్తమై 2 వ మతలబునకళ్లు ముద్రింపించి రిటర్నింగు ఆఫీసులో సిద్ధపరుపవలెను.

18. ఆఖరిరోజు (గడువులో ఆఖరిరోజు) మధ్యాహ్నము 3 గంటలు దాటిన తర్వాత దాఖలైన నామినేషన్ కాగితములు పుచ్చుకోరాదు.

19. (1) నామినేషన్లు దాఖలుచేయునప్పుడు, అభ్యర్థి పేరున్ను, ఉపపాదనచేసే ఓటరుపేరున్ను, బలపర్చే ఓటరుపేరున్ను వ్రాయబడియున్న ఓటరుజాబితా నకలు చూపుమని (నామినేషన్‌కాగితము దాఖలుచేయువారిని) కోరుటకు రిటర్నింగు ఆఫీసరుకు అధికార మున్నది. నామినేషన్ కాగితముపై వ్రాయబడిన అభ్యర్థి పేరున్ను, ఓటర్ల పేరున్ను, నంబర్లున్ను ఓటరుజాబితాలో వ్రాయబడియున్నవానితో సరిచూడ వలెను. నామినేషన్ కాగితములలో నేమైన వ్రాతపొరపాట్లున్నచో వానిని సవరింపు మని, నామినేషన్ దాఖలుచేయువారిని కోరవచ్చును.

(2) ఓటరుజాబితాలో నేమైన వ్రాతపొరపాట్లున్నచో, ఆపొరపాటును బట్టి తాను నడుచుకో నక్కరలేదని ఆఫీసరు నిర్ణయింపవచ్చును. అట్టి సందర్భములో నతడు తన అభిప్రాయమునకు సబబులు వ్రాసి యుంచవలెను.

20. నామినేషన్ దాఖలు చేయువారితో ఫలానితేదీని, ఫలానివేళ, ఫలాని చోట, నామినేషన్లు తనిఖీచేతురని రిటర్నింగు ఆఫీసరు తెలుపవలెను. ఆనామినేషన్ కాగితముపై రిటర్నింగు ఆఫీసరు వరుసనంబరు వేసి, ఏతేదీని, ఎన్నిగంటలకా కాగితము తన యెదుట దాఖలయ్యెనో వ్రాయవలెను. అందులోని తబిశీళ్లున్ను, అభ్యర్థి పేరున్ను ఇద్దరు ఓటర్ల పేరున్ను, తెలుపుచు వెంటనే తన ఆఫీసులో నోటీసు కట్టింపవలెను.

21. (1) ఏయభ్యర్థియైన తన అభ్యర్థిత్వమునకు రాజీనీయవచ్చును. అట్టి రాజీ వ్రాయించి, అభ్యర్థి సంతకముచేసి, రిటర్నింగు ఆఫీసరు యెదుట దాఖలుచేయవలెను. నామినేషన్ల తనఖీతేదీకి మరుసటిరోజు మధ్యాహ్నము 3 గంటలలోపుగా రాజీలు దాఖలు కావలెను.

ఆ మరుసటిరోజు గవర్నమెంటుసెలవుదిన మైనచో, రాజీలు దానికి మరు నాడు దాఖలు చేయవచ్చును.

(2) ఒకసారి రాజీ దాఖలుచేసిన అభ్యర్థి ఆ ఎలక్షన్‌లో తిరిగి అభ్యర్థిగా నిలువరాదు.

22. రాజీ దాఖలైన వర్తమానము వ్రాయించి రిటర్నింగు ఆఫీసరు కచేరీలో ప్రకటింపవలెను.

23. (1) నామినేషన్లు దాఖలునిమిత్త మేర్పరిచిన గడువు ముగియకపూర్వమే ప్రతి అభ్యర్థియు (లేక అభ్యర్థితరపున మరియొకడు) రిటర్నింగు ఆఫీసరువద్ద రు- 250/- (లేక ఆవిలువకు సరిపోవు గవర్నమెంటు ప్రామిసరీనోట్లు.) ధరావత్తు సొమ్ము కట్టవలెను.

(2) ధరావత్తు దాఖలుచేయని అభ్యర్థి నామినేషన్ సక్రమమైనది కాదు.

(3) పై 21 వ రూలు ప్రకారము రాజీదాఖలుచేసిన అభ్యర్థి ధరావత్తు మొత్తము వానికి వాపసుచేయవలెను. ఏ అభ్యర్థి నామినేషనైన నిరాకరింపబడినచో ఆతనిధరావత్తున్ను వాపసుచేయవలెను. (అభ్యర్థి తరఫున మరియొకరు సొమ్ము కట్టినచో, సొమ్ము కట్టినవారికి వాపసుచేయవలెను.) ఓట్లు పుచ్చుకొనుటకు ముందుగా నేయభ్యర్థియైన చనిపోయినచో, వాని ధరావత్తు వారసునకు వాపసుచేయవలెను.

(4) ఒకరిద్దరు మెంబర్ల నెన్నుకొను ఎలక్షన్ ఖండములో, మొత్తపు ఓట్లలో 8 వ పాలునకు పైగా ఓట్లురాని అభ్యర్థుల ధరావత్తుసొమ్ము గవర్నమెంటుకు సంక్రమించును. ఇద్దరు పైగా మెంబర్ల నెన్నుకొను ఖండములోని మొత్తపు ఓట్ల సంఖ్యను అభ్యర్థుల సంఖ్యచే విభాగించి, ఆవిభాగములో తేలిన సంఖ్యలో అష్టమ భాగమునకు మించి ఓట్లురాని అభ్యర్థుల ధరావత్తుసొమ్ము గవర్నమెంటుకు సంక్రమించును.

(5) రద్దయిన ఓటుకాగితములు మినహా తక్కిన ఓటుకాగితములలో వేసిన ఓట్లు లెక్కలోనికి తీసుకొందురు.

(6) పై (4) వ సబ్ రూలు ప్రకారము గవర్నమెంటుకు సంక్రమింపని ధరావత్తు మొత్తములు ఆయా అభ్యర్థులకున్ను (లేక వారితరఫున సొమ్ము చెల్లించిన వారికి) గెలుపొందిన అభ్యర్థికిన్ని (గెజెట్‌లో ఎలక్షన్ ఫలితము ప్రచురించిన వెంటనే) వాపసు చేయవలెను.

ఒకే అభ్యర్థిని రెండు మూడు ఖండములలో నామినేషన్‌చేసి రెండు మూడు ధరావత్తు మొత్తములు చెల్లించియున్నచో, ఏ సందర్భములోను అతనికి వాపసుచేయవలసినది ఒక్క ధరావత్తు మొత్తమే.

## నామినేషన్ల తనిఖీ

24. నామినేషన్ల తనిఖీ రోజున రిటర్నింగు ఆఫీసరు తనిఖీచేయుగదిలో అభ్యర్థి, అభ్యర్థి తరపు ఓట్ల ఏజంటు, అభ్యర్థిపే రుపపాదించిన ఓటు రొకడు, బలపరిచిన ఓటు రొకడు, అభ్యర్థితరపున ప్రతినిధియొకడు మాత్రమే, హాజరుండవలెను. రిటర్నింగు ఆఫీసరుకు పనిలో సాయముచేయుటకై అతని సుమాస్తాలు మొదలైనవారు హాజరుండ వచ్చును. ప్రతి అభ్యర్థి తరపునను పైన తెలిపినవారుమాత్రమే హాజరై యుండ వచ్చును, కాని యితరులు లోనికి రారాదు. తనయెదుట దాఖలైన నామినేషన్లన్నియు పరిశీలించుటకు రిటర్నింగు ఆఫీసరు వారి కవకాశ మీయవలెను.

25. (1) రిటర్నింగు ఆఫీసరు నామినేషన్లు తనిఖీచేయవలెను. వానిపై హాజరున్న అభ్యర్థులున్ను, వారి తరపువారున్ను, తెలుపు ఆక్షేపణలు విమర్శింపవలెను. అవసర మైనచో విచారణకూడ జరుపవలెను. ఆ వెనుక యీక్రింది కారణములలో దేనినిబట్టి యైన, ఏ అభ్యర్థినామినేషనైన, నిరాకరింపవచ్చును.

(అ) ఏ అభ్యర్థియైన ఆక్టు లేక విధులనుబట్టి ఎలక్షన్‌లో అభ్యర్థిగా నిల్చుట కనర్హుడగుట,

(ఆ) ఉపపాదనచేసిన ఓటరుగాని, బలపరచిన ఓటరుగాని, ఓటరుగా నుండ ననర్హుడగుట,

(ఇ) పై విధులలో దేనినైన అభ్యర్థి, లేక ఉపపాదించిన, లేక బలపరచిన ఓటరు ఉల్లంఘించుట.

(2) (అ) ఓటరు జాబితా పబ్లికు నకలులో అభ్యర్థిపేరు, ఉపపాదకుని పేరు, బలపర్చు ఓటరుపేరు కనపరచినచో వారికి వలయు నర్హత లున్నవనియే భావింప వచ్చును. వారికి ప్రత్యేకముగా ఫలాని మాదిరి అనర్హత లున్నవని రుజువైననేకాని, యిక నావిషయము శంకింపరాదు.

(ఆ) ఒక ఓటరు పెక్కు నామినేషన్లపై సంతకము చేసినచో (ఉపపాదించు చు లేక బలపరుచుచు) ఖాళీ లెన్నియున్నవో అన్ని ఖాళీలకు సరిపోవు నామి నేషన్లపైని మాత్రమే అతడు సక్రమముగా సంతకము చేసినట్లు యోచింతురు. ముందు దాఖలైన కాగితములు (4 ఖాళీలున్నచో ముందు దాఖలైన 4 కాగితములున్ను) సక్రమము అని భావించి, మిగతావానిని త్రోసివేస్తురు.

(3) ఒకే అభ్యర్థిపేరు పెక్కు నామినేషన్లలో వ్రాసియున్నప్పుడు ఆ నామినేషన్లలో కొన్ని నిరాకరించినను, శాస్త్ర విహితమైన నామినేష నొక్క టున్నను, అతడు సక్రమముగా నామినేషన్ కాబడినట్లే యోచింపవలెను.

26. (1) ప్రతి నామినేషన్ కాగితముపైని రిటర్నింగు ఆఫీసరు తన అభిప్రాయము తెలుపవలెను. అంగీకరించినచో కారణములు వ్రాయనక్కరలేదు. నిరాకరించినచో వ్రాయవలెను.

(2) తనిఖీ ప్రారంభమైన రోజుననే ముగియవలెను. కాని అందునిమిత్తము వాయిదా వేయరాదు.

(3) తనిఖీ పూర్తియైనపిదప, రాజీలు దాఖలుచేయుగడువు దాటనిచ్చి, నిల్చియున్న అభ్యర్థులపేర్లు జాబితాలో వ్రాసి (అనగా నామినేష నంగీకరింపబడిన అభ్యర్థుల పేర్లు) ఆజాబితా రిటర్నింగు ఆఫీసరు తన కచేరి నోటీసుబోర్డులో ప్రచురింపవలెను.

27. ఖాళీలసంఖ్యకంటె అభ్యర్థులసంఖ్య హెచ్చుగానున్నచో, 3 వ మతలబు ననుసరించి అభ్యర్థుల పేర్లన్నియు వ్రాసి, రిటర్నింగు ఆఫీసరు ప్రచురింపవలెను. అభ్యర్థులపేర్లు అకారాదిగా (ఇంటిపేర్ల ననుబట్టి) వ్రాయవలెను. అభ్యర్థుల పేర్లకెదురుగా వరుసంఖ్యయు ఆ అభ్యర్థికి ప్రత్యేకముగా నేర్పరిచిన రంగున్ను తెలుపవలెను.

28. అభ్యర్థులలో నొకరు నామినేషన్ లైనపిదప చనిపోయినచో, రిటర్నింగు ఆఫీసరు ఎన్నిక లంతటితో నాపుచేయించి, నామినేషన్ల మొదలుకొని జరుగవలసిన కార్యక్రమము క్రొత్తఎలక్షన్ జరిపినట్లే జరుపవలెను.

అప్పటికి సక్రమముగా నామినేషనైన అభ్యర్థులకు తిరిగి నామినేషన్ జరుగనక్కరలేదు.

29. (1) ఖాళీసంఖ్యకు అభ్యర్థులసంఖ్య మించియున్నచో ఓట్లు పుచ్చుకొనవలెను.

(2) ఖాళీసంఖ్యకు అభ్యర్థులసంఖ్య సరిపోయినచో అభ్యర్థు లందరున్ను మెంబరుపదవుల కెన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను.

(3) ఖాళీలసంఖ్యకు అభ్యర్థులసంఖ్య లోపించియున్నచో, అభ్యర్థులందరున్ను మెంబరుపదవుల కెన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను. మిగతా ఖాళీలకు మెంబర్ల నెన్నుకోవలసినదని (వ్యవధి నియమించి) గవర్నరు ఆఖండపు ఓటర్లకు హెచ్చరిక నీయవలెను.

పైహెచ్చరిక పొందియు ఏఖండపు ఓటర్లైన మెంబరు నెన్నుకొనుట కుపక్రమింపనిచో, వారికి తిరిగి ఎంతకాలము గడచినపిదప హెచ్చరిక నీయవలెనో గవర్నరే నిర్ణయింతురు.

(4) ఓటర్లు స్వయముగా ఓట్లువేయవలెను. (ఇందులకు మినహాయింపు 49, 50 నిబంధనలలో తెలుపబడినది.)

30. 31 మొదలు 53 వరకున్న విధులు జనరల్ ఖండములకు మాత్రమే సంబంధించినవి.

31. ఓట్లు పుచ్చుకొనుట ఉదయము 7 గంటలకు ప్రారంభించి సాయంకాలము 6 గంటలకు ముగింపవలెను. ఈమధ్య ఒక గంట ఓట్ల ఆఫీసు మూసినను మూయవచ్చును.

32. గవర్నరుగారి అనుమతి పుచ్చుకొని తగినకారణ మున్నచో ఓట్లు పుచ్చుకొను తేదీలు మార్చవచ్చును? ఓట్లు పుచ్చుకొను గంటలు వృద్ధిచేయవచ్చును.

అల్లరులు జరిగినప్పుడు, లేదా వరదలు వచ్చినప్పుడు, లేదా యిట్టి ఆకస్మికపు సంఘటనలలో ఓట్ల. ఆఫీసరు (ఓట్ల ఆఫీసులో ఓట్లు పుచ్చుకొనే ఆఫీసరు) తన ఆఫీసు మూసివేసి, ఆసంగతి రిటర్నింగు ఆఫీసరు కెరిగింపవలెను. రిటర్నింగు ఆఫీసరు మరియొక తేదీని ఓట్లుపుచ్చుకొనవలసిన దని యేర్పాటుచేసి, ఆవర్తమానము గవర్నమెంటుకు తెలుపవలెను.

33. గ్రామసముదాయమున కొక ఓట్ల ఆఫీసుచొప్పున రిటర్నింగు ఆఫీస రేర్పరుపవలెను. ఆ ఆఫీసులో ఓట్ల ఆఫీసరును, పోలింగు ఆఫీసర్లను, రిటర్నింగు ఆఫీసరే నియమింపవలెను.

34. తన ఆఫీసులో అల్లరి జరుగకుండునట్లును, ఎలక్షన్ క్రమముగా జరుగునట్లును, ఓట్ల ఆఫీసరు చూడవలెను. ఒకసారి ఎందరు ఓటర్లు లోనికివచ్చి ఓట్లువేయవలెనో అతడే నిర్ణయింపవలెను. తన ఆఫీసులోనికి,

(అ) పోలింగు ఆఫీసర్లను, అభ్యర్థులను (అభ్యర్థి కొక ఏజంటుచొప్పున) ఏజంట్లును (ఓట్లఏజం ట్లనుపేర్లతో నికముందు వారినిగూర్చి వచింతుము)

(ఆ) పోలీసువారిని, యితర గవర్నమెంటు ఉద్యోగులను,

(ఇ) ఓటర్లను గుర్తుపట్టుటకై ఓట్లఆఫీసరు అప్పుడప్పుడు లోనికి రానిచ్చిన వారిని,

మాత్రమే రానిచ్చి, తక్కినవారిని బైటనే యుంచవలెను.

35. ఓటరుపేరు ఏ గ్రామసముదాయములో నున్నదో అందుకు సంబంధించిన ఓట్ల ఆఫీసులో తప్ప, మరియొకచోట ఓటువేయుట కతని కధికారములేదు. ఇందుకు మార్పులు 49, 50 విధులలో తెలుపబడినవి.

36. నిర్ణయమైన వేళదాటినతర్వాత, 31,32 విధుల ననుసరించి, ఓట్ల ఆఫీసరు ఆఫీసు మూయించవలెను. అటుపిమ్మట ఏఓటరునకును ఓటుకాగిత మివ్వరాదు.

37. పైవారికి కనబడకుండ ఓటర్లు ఓట్లువేయుటకు కనువగునట్లు ప్రత్యేకముగా నొకగది ఏర్పాటు చేయవలెను.

38. వలసినందరు స్త్రీ ఓట్ల ఆఫీసర్లు, స్త్రీపోలింగు ఆఫీసర్లు, లభించినచో, స్త్రీలఓట్లు పుచ్చుకొనుటకు ప్రత్యేకముగా ఓట్ల ఆఫీసు నియమించి, ఆ ఆఫీసులోనికి పురుషు లెవ్వరును (పోలీసువారు గవర్నమెంటు ఉద్యోగులు మినహా) వెళ్లరాదను నిర్ణయము రిటర్నింగు ఆఫీసరు చేయవచ్చును. (ఈ విషయమై హైకోర్టు తీర్పున్నది. వేరుభాగములో చూడుడు.)

39. అభ్యర్థి కొకటి చొప్పున వేరువేరు ఓట్లపెట్టె లుంచవలెను. ఏ అభ్యర్థి పెట్టెపై నతని కేర్పరచిన రంగుపూయించి, అతని వరుస సంఖ్యయు వేయవలెను. వేరువేరు రంగులున్న కవర్లు ఓట్ల ఆఫీసులో వలసినన్నియు రిటర్నింగు ఆఫీసరు సప్లై చేయవలెను. ఓట్లపై కవర్లున్ను సప్లయిచేయవలెను. ఓటరు జాబితాలున్ను, అభ్యర్థుల పేర్లు స్ఫుటముగా వ్రాసి, వారి పేరుల క్రమముగా వరుస సంఖ్యయు, రంగున్ను వేసియున్న బోర్డు ఒకటియు, రిటర్నింగు ఆఫీసరు ప్రతి ఓట్ల ఆఫీసుకున్ను సప్లయి చేయవలెను.

40. (1) ఓట్లు పెట్టెలో వేయుటకు సందుంచవలెను. పెట్టెతాళము తీయనిదే ఓట్లు పైకి తీయుటకు వీలుండరాదు. ఓట్లు పుచ్చుకొనుటకు ముందు ఓట్ల ఆఫీసరు పెట్టెలన్నియు ఖాళీచేయించి, ఆ పెట్టెలు ఆఫీసులో నున్నవారికి చూపి, అవి తాళముచేసి, వానిపై సీళ్లు వేయవలెను. ఆపెట్టెలు ఓట్లు వేయుటకు ప్రత్యేకముగా నేర్పరచిన గదిలో నుంచవలెను.

(2) ఓట్లు పుచ్చుకొనుటకు ముందుగా అక్కడ హాజరులో నున్నవారికి ఓట్ల ఆఫీసరు 1920 వ సంవత్సరపు ఎలక్షన్ నేరముల ఆక్టు 14 వ విధి చదివి వినిపించి అందరికి భావము తెలుగుభాషలో నెరిగింపవలెను. (ఈ నేరములు వేరు భాగములో వ్రాసినాము.)

41. ఓటు కాగితము రెండుముక్కలుగా నుండును. ఒక ముక్కపైని 4 వ మతలబుప్రకారము వ్రాసి యుండును. రెండవ ముక్కపైని 4 ఎ. మతలబు ప్రకారము వ్రాసి యుండును. రెండు ముక్కలూ కలిపి మధ్యకు చింపుటకు వీలుగా చిల్లులుకొట్టి యుండును.

ఓటుకాగితముపై ఖండము పేరు సూచించు అక్షర ముండవలెను, వరుసనంబ రుండవలెను. రెండుముక్కలపైని స్టాంపుకొట్టవలెను.

**42.** (1) ఒకే మెంబరు ఖాళీకి ఎన్నికలు జరుగుచున్నప్పుడు ఓటరుకు ఒక్కటే ఓటుకాగిత మిత్తురు. ఆ కాగిత మాతడు తన మనస్సునకు నచ్చిన అభ్యర్థి ఓటుపెట్టెలో వేయవలెను.

(2) పెక్కుఖాళీలకు ఎన్నికలు జరుగునప్పుడు, ఖాళీకొక కాగితము చొప్పున ఓటుకాగిత మీయవలెను. ఆకాగితములు వేరువేరు పెట్టెలలో వేయవచ్చుననియు, లేదా అన్నియు నొకేపెట్టెలో వేయవచ్చుననియు, లేదా కొన్ని ఒక పెట్టెలోను, కొన్ని మరియొక పెట్టెలోను వేయవచ్చుననియు, ఓటరుతో ఓట్ల ఆఫీసరు చెప్ప వలెను.

(3) ఓటుకాగిత మిచ్చుటకు పూర్వము ఆఫీసరు ఓటరు పేరు పిలిపించవలెను. ఆ వెనుక కాగితముపై సీలువేసి మొదటిముక్క ఓటరు కీయవలెను. ఓటరుజాబితాలో ఓటరున కెదురుగా (ఓటుకాగితమిచ్చిన జ్ఞాపకమునకై) గుర్తు పెట్టవలెను.

**43.** కాగితము పుచ్చుకొనిన ఓటరు చాటుగా నేర్పర్చిన గదిలోనికి వెళ్లి తన కిష్టమువచ్చిన పెట్టెలో నది పడవైచి వెంటనే ఆఫీసువిడిచి రావలెను.

**44.** (1) ఏ ఓటరైన గ్రుడ్డివాడగుటచే, లేక యితరకారణములచే, ఓటుకాగితము స్వయముగా పెట్టెలోపడవేయజాలక పోవచ్చును. ఆ సందర్భములో, ఓట్ల ఆఫీసరు ఓటరు మనోభావ మడిగి తెలిసికొని, ఓటరు కిష్టమగు నభ్యర్థి పెట్టెలో ఓటుకాగితము పడవేయవలెను.

(2) పైక్రమము జరిగినప్పుడు రెండవముక్కపై ఆఫీసరా సంగతి వ్రాసియుంచ వలెను.

**45.** (1) ఓట్ల ఆఫీసరు, లేక పోలింగుఆఫీసరు, ఓటువేయుటకు వచ్చిన ఓటరు నీక్రిందిప్రశ్న లడుగవచ్చును; ఏ అభ్యర్థి లేక ఏజంటు కోరినచో అడిగితీరవలెను.

(i) ఈ పేరున్న ఓటరువు నీవేనా? (ఓటరుపేరు పూర్తిగా చదువు.)

(ii) నీ వీఖండములో నీసరికి ఓటు వేసితివా?

(iii) కాన్సిలు ఎన్నికలలో [illegible] కేఖండములోనైన ఓటువేసితివా?

ఈప్రశ్నలకు జవాబు చెప్పిన [illegible]ని ఓటుకాగిత మీయరాదు. (i) వ ప్రశ్నకు అవుననియు, తక్కిన ప్రశ్నలకు లేదని [illegible], ఓటరు జవాబుచెప్పిననే ఓటుకాగిత మీయ వలెను.

(2) పైనచెప్పిన సందర్భములో తప్ప, ఓటరుజాబితాలో పేరున్న ప్రతిఓటరు నకును ఓటుకాగిత మీయవలెను.

46. ఫలానిపేరున్న ఓటరు తానని చెప్పి ఒకడు ఓటువేసి వెళ్లినతర్వాత, మరి యొకడు ఓటింగు ఆఫీసులోనికి వచ్చి ఆ పేరు తనపేరనియు, తనకు ఓటుకాగిత మిమ్మనియు కోరవచ్చును. అతనికి ఓట్ల ఆఫీసరు ఓటుకాగిత మీయవలెను. ఆకాగిత మాతడు చాటుగదిలోనికి తీసికొని వెళ్లి, తాను ఓటీయదలచిన అభ్యర్థికి నియమించిన రంగుకవరులో పెట్టి, కవరంటించి, రంగుకవ రింకొకకవరులో పెట్టి అది ఓట్ల ఆఫీసరు కీయవలెను. ఆ కవరుపై ఓట్ల ఆఫీసరు ఓటరుపేరు, నంబరు, గ్రామసముదాయము పేరు, వ్రాసి కొని, ఆ కవరు వేరేకట్టలో నుంచవలెను. ఆకట్టలోని ఓట్లు రిటర్నింగు ఆఫీసరు లెక్కింపడు. ఓటరుపేరు, నంబరు, ఓట్ల ఆఫీసుపేరు, ప్రత్యేకముగా నొక జాబితాలో వ్రాసియుంచవలెను. ఆ జాబితాపేరు పేచీ ఓట్ల జాబితా. అది 5 వ మతలబుప్రకారము వ్రాయవలెను. ఓటరు జాబితాలో వ్రాలు చేయవలెను, లేదా వేలుముద్ర వేయవలెను.

## నిర్వచనము:

46, 47 నిబంధనలు రెండున్ను అమలులో పెట్టుట కవకాశ మున్నసందర్భములో, రెండున్ను అమలులో పెట్టవలెను.

47. (1) పై సందర్భములో, (ఫలాని పేరు గల ఓటరు నని చెప్పి) ఓటుకాగిత మిమ్మని కోరువానిపేరు వేరనియు, అతడు బూటకముగా నింకొకనిపేరు పెట్టుకొని ఓటువేయ నభిలషించుచున్నాడనియు, యీ విషయములు రుజువుచేసెదననియు, ఏ ఓట్ల ఏజంటైన ఓట్ల ఆఫీసరుతో చెప్పినచో అతడు తగాయిదా ఓట్ల జాబితాలో (6 వ మతలబు ననుసరించి ఆ జాబితా వ్రాయవలెను.) ఓటరుపేరున్ను, నివాస మున్ను వ్రాయుమని, అతనిని గుర్తుపట్టజాలిన సాక్షులను తెమ్మనియు కోరవచ్చును.

(2) ఓట్ల ఏజంటును రు 20/- ధరావత్తు చెల్లింపుమని ఓట్ల ఆఫీసరు కోరవలెను.

(3) సొమ్ము కట్టినవెనుక పై ఆక్షేపణచేసిన ఏజంటును 7 వ మతలబు ప్రకారమా విషయము వ్రాసి దాఖలు చేయుమని ఓట్ల ఆఫీసరు కోరవలెను. అతని నందుపై సంతకముచేయించి, ఘరానాసాక్షు లిద్దరిచేత తన యెదుట సంతకములు చేయించవలెను.

(4) 45 వ రూలు ననుసరించి అడిగిన ప్రశ్నలకు పై ఓటరు సరియైన జవాబు లిచ్చినచో, (పైనేరము రుజువైనచో శిక్షపడునని ఓటరుతో ఆఫీసరు చెప్పి) అతనికి

ఓటుకాగిత మీయవలెను. తగాయిదా ఓట్ల జాబితాలో అప్పటి సందర్భములున్ను తన అభిప్రాయమున్ను ఆఫీసరు వ్రాయవలెను.

(5) పై (3) వ రూలుననుసరించి పుచ్చుకొనిన కాగితముకూడా తగాయిదా ఓట్ల జాబితాతోపాటు రిటర్నింగు ఆఫీసరువద్దకు ఓట్ల ఆఫీసరు పంపవలెను.

(6) రిటర్నింగు ఆఫీసరు వలయు భోగట్టాలుచేసి, పై నేరమునకు క్రిమినల్ కేసు పెట్టించవలెను. తత్పూర్వము మద్రాసులో పోలీసు కమీషనరుగారి వల్లను, తక్కినచోట్ల జిల్లాకలెక్టరుగారివల్లను, అనుమతి పొందవలెను. కేసు విచారణలో ముద్దాయి.నిర్దోషియని తీర్పుజరిగినచో, పై ధరావత్తు మొత్తమంతయు (లేక కొంత భాగము) సర్కారుకు చెందవలెనో, వాపసుచేయవలెనో, రిటర్నింగు ఆఫీసరు నిర్ణయింపవలెను.

48. ఓటుకాగితము చిరిగినందువల్ల (మరి యేయితరకారముచేనైన) నది నిరర్థకము కావచ్చును. ఆ కాగితము ఓట్ల ఆఫీసరు కిచ్చివేసి మరియొక కాగిత మడిగి పుచ్చుకొనవచ్చును. ఆ చిరిగిపోయిన కాగితముపైని, దాని వెనుకమక్కపైని అది రద్దయినట్లు ఓట్ల ఆఫీసరు వ్రాసికొనవలెను.

49. ఓట్ల ఆఫీసరు లేక పోలింగు ఆఫీసరుకు, లేక ఓట్ల ఏజంటుకు, లేక ఓట్ల ఆఫీసులో పనిచేయుచున్న గవర్నమెంటు ఉద్యోగికి ఆఖండములో ఓట్లుండవచ్చును. వారు పనిచేయుచున్న ఆఫీసులోగాక మరియొక ఆఫీసులో ఓట్లువేయుటకు హక్కుండ వచ్చును. వారు రిటర్నింగు ఆఫీసరును (8 వ మతలబు ననుసరించి) నిదర్శనపత్రము వ్రాసియిమ్మని కోరవచ్చును. ఆ పత్రమునుబట్టి వారికి తాము పనిచేయుచున్న ఆఫీసులోనే ఓట్లువేయుటకు హక్కుకలుగును.

ఆ ఖండములోగాక వేరు ఖండములో వారికి ఓట్లున్నను, వారు పనిచేయు ఆఫీసులోనే ఆఓట్లు వేయవచ్చును. రిటర్నింగు ఆఫీసరు నిదర్శనపత్రము పంపుచు, ఆఖండములో నెందరు మెంబర్ల నెన్నుకొనవలెనో, అభ్యర్థు లెందరో, ఎవరో, వారికి నియమించిన రంగులేవియో, నంబ ర్లేవియో, మొదలగు వర్తమానమున్ను పంపవలెను.

50. పైనిదర్శనపత్రము పొందినవారు తాము పనిచేయుచున్న ఆఫీసులో పెత్తనము వహించు ఓట్ల ఆఫీసరుగారి కది చూపవలెను. ఆయన వారికి ఓటు కాగితము తీయవలెను.

(1) పనిచేయు ఆఫీసునకు సంబంధించిన ఖండములోనే ఓ టున్నచో-

42, 43 విధులనుబట్టి ఓటు పుచ్చుకోవలెను. 52 విధి ననుసరించి పంపే స్టేట్మెంటుతోపాటు నిదర్శనపత్రములు కూడా రిటర్నింగు ఆఫీసరుకు పంపవలెను.

(2) పనిచేయు ఆఫీసుకు సంబంధించిన ఖండములో గాక వేరు ఖండములో ఓటున్నచో,

ఓటరు చాటుగదిలోనికి వెళ్లి ఓటుకాగితము తన కిష్టుడైన అభ్యర్థి కేర్పరిచిన రంగుకవరులో పెట్టి, ఆకవరు మరియొకకవరులో పెట్టి అంటించి, ఓట్ల ఆఫీసరు కీయవలెను. ఒకటికంటె హెచ్చుకాగితము లిచ్చినచో అన్ని కాగితములును అన్ని వర్లలో పెట్టవచ్చును. లేదా అన్నియు నొకే కవరులో పెట్టవచ్చును, అది ఓటరు యిష్టాయిష్టములనుబట్టి యుండును.

ఓట్ల ఆఫీసరు ఆకవర్లు వేరువేరు ఖండములకు వేరువేరు సంచులలో పెట్టవలెను. ఆకవరుకు నిదర్శనపత్రములు చేర్చి కట్టవలెను. సంచులు మూసివేసి, సీలువేసి, ఏసంచి ఆ రిటర్నింగు ఆఫీసరువద్దకు పంపవలెను.

51. ఓట్లు పుచ్చుకొనుట పూర్తికాగానే ఓట్ల ఆఫీసరు యీ క్రింద నుదాహరించిన కాగితములు వేరువేరు సంచులలో పెట్టవలెను. ఆఫీసులో అభ్యర్థులు వారి ఏజంట్లు హాజరున్నచో వారియెదుటనే యీపని చేయవలెను. ఆ సంచులు మూసివేసి, వానిపై తనసీళ్లున్ను అభ్యర్థుల, ఏజంట్ల (తమసీళ్లుకూడా వేసెదమని చెప్పినచో) సీళ్లున్ను వేయవలెను.

(1) ఓట్ల పెట్టెలు:—పెట్టెతాళము తీయరాదు. తాళముపెట్టెను పెట్టి, తాళమునకు ప్రత్యేకముగా సీలువేయవలెను.

(2) పేచీ ఓట్లు.

(3) ఉపయోగముకాని ఓటుకాగితములు.

(4) పొరపాటున రద్దయిన ఓటుకాగితములు.

(5) గుర్తులు పెట్టిన ఓటరుజాబితా.

(6) ఓట్లకాగితముల వెనుకముక్కలు.

(7) పేచీ ఓట్ల జాబితా.

(8) తగాయిదా ఓట్లు, ఆసందర్భములో పుచ్చుకొనిన స్టేట్‌మెంట్లు.

(9) 50 (2) విధిప్రకారము పుచ్చుకొనిన కవర్లు. వీనిని ఓట్ల ఆఫీసరు 53 వ నిబంధనలో నుదాహరించిన ఆఫీసరుకు పంపవలెను.

52 పై సంచులతోపాటు ఓట్ల ఆఫీసరొక స్టేట్‌మెంటు కూడా వ్రాసిపంపవలెను. అది 9 వ మతలబుప్రకారము వ్రాయవలెను. అందులో తన కిన్ని ఓటు

కాగితములు ఒప్పచెప్పిరో, ఎన్ని ఉపయోగపడెనో, ఎన్ని రద్దయ్యెనో, మిగతా కాగితము లేమయ్యెనో వ్రాయవలెను.

53. మద్రాసుపట్టణములో 51 వ రూలులో నుదాహరించిన పంచులు మద్రాసు కార్పొరేషన్ కమీషనరుకు పంపవలెను. జిల్లాలలో రిటర్నింగు ఆఫీసరుకు (లేక అతడు మరియొక ఆఫీసరువద్దకు పంపుమన్నచో అతనివద్దకు) పంపవలెను. ప్రతి పంచిపైని వరుససంఖ్య వేసి, అందులో నేమున్నదో, అది ఏ గ్రామసముదాయమునకు సంబంధించినదో వ్రాయవలెను. ఓట్లుపడని ఖండములలో, ఓట్ల ఆఫీసరు అట్లనియే రిపోర్టు వ్రాయవలెను. రిటర్నింగు ఆఫీసరువద్దకు గాక మరియొక ఆఫీసరువద్దకీ పంచులు పంపబడినచో, వాని నతడు వెంటనే రిటర్నింగు ఆఫీసరువద్దకు పంపవలెను.

## పోస్టుద్వారా ఓట్లువేయు క్రమము

54. 55 మొదలు 63 వరకున్న విధులు మహమ్మదీయ, యూరపియన్, ఇండియన్ క్రిస్టియన్ ఖండములకు మాత్రమే చెందును. ఈ ఖండములకు చెందిన ఓటర్లు ఆ విధులనుబట్టియే ఓట్లు వేయవలెను. వేరుపద్ధతిని వేయరాదు.

55. (i) ఓటరుజాబితాలో వ్రాసియున్న చిరునామాకు ప్రతి ఓటరుకున్నూ ఓటు కాగిత మొకటియు, నిదర్శనపత్రపు అచ్చుమతలబు ఒకటియు, రిటర్నింగు ఆఫీసరు రిజిస్ట్రీ పోస్టుద్వారా పంపవలెను. ఓటరు అడ్రస్సు మార్చినట్లు రిటర్నింగు ఆఫీసరుకు వ్రాసినచో, క్రొత్తవిలాసమునకే పంపవలెను.

(2) జాబితాలో వ్రాసియున్న చిరునామా మార్చగోరు ఓటరు, ఆ ప్రదేశములో నున్న ప్రసిడెన్సీ మేజిస్ట్రేటు, లేక తాలూకా మేజిస్ట్రేటు, లేక డిప్యూటీ తహసీల్దారు, లేక స్టేషనరీ సబ్ మేజిస్ట్రేటువద్దకువెళ్లి, తా నాచోటినుండి నివాసము (లేక ఆఫీసు) మార్చితినని వ్రాసియిచ్చి, ఆఫీసరుయెదుట సంతకముచేయవలెను. ఓటరును ఆఫీస రెరుగనిచో ఓటరు నెరిగిన యిద్దరు ఘరానామనుష్యులు ఆఫీసరువద్దకు వచ్చి, తా మతని నెరుగుదు మని పై కాగితముపై సంతకము చేయవలెను. గ్రామోద్యోగులు ఓటరు నెరిగియున్నను చాలును. ఆ ఆఫీస రాకాగితము పుచ్చుకొని రిటర్నింగు ఆఫీసరు వద్దకు పంపవలెను.

తర్వాత ఓటరు చిరునామా మార్చగోరినచో, యీ పద్ధతులే అవలంబింపవలెను.

56. 10 వ మతలబుప్రకారము ఓటుకాగితము వ్రాసియుండవలెను. 10 వ మతలబు ప్రకారము నిదర్శనపత్రము వ్రాసి యుండవలెను. 3 వ మతలబులో వ్రాసియున్న ప్రకారము ఓటు కాగితముపై అభ్యర్థుల పేర్లు వ్రాసియుండవలెను. ఇద్ద

అభ్యర్థుల పేర్లు ఒక్కటే యైనచో, తండ్రిపేరు వ్రాసి, లేక మరియొకవిధముగా నిర్ధారకు భేదము కనపర్చవలెను. రిటర్నింగు ఆఫీసరుకు యుక్తమని తోచు విధమున ఓట్లు కాగితములు ఒక్కభాషలో లేక పెక్కు భాషలలో ముద్రింపించవలెను. ఓటరు నంబరు ఓటు కాగితము వెనుకను నిదర్శనపత్రముపైన వేయవలెను. ఆ నంబరు ఓటరు జాబితాలో ఓటరు నంబరే.

57. ఓటుకాగితము పంపుటకు పూర్వము రిటర్నింగు ఆఫీసరు ఓటరుపేరు నిదర్శనపత్రముపై వ్రాయవలెను. ఓటరుజాబితాలో ఓటరుపేరున కెదురుగా గుర్తు పెట్టవలెను. (ఓటుకాగితము పంపినట్లు జ్ఞాపకార్థము)

58. రిటర్నింగు ఆఫీసరు అడ్రసు (11 వ మతలబు ప్రకారము వ్రాయించి) ఒక కవరుపై వ్రాసి అదిన్ని, మరియొక కవరుపై ఓటరు నంబరువేసి అదిన్ని, 12 వ మతలబుప్రకారము వ్రాసిన ఉత్తర మొకటియు ఓటరుకు పంపవలెను. మొదటి కవరు ఎడమమూల నంబరు వేయవలెను.

59. ఓటువేయుగోరు ఓటరు నిదర్శనపత్రము సంతకముచేసి, తన కిష్టులైన అభ్యర్థులపేర్ల కెదురుగా గుర్తు లుంచవలెను.

60. ఓటరు ఓటుకాగితము పై 2 వ కవరులో పెట్టి అంటించి, ఆ కవరున్ను నిదర్శనపత్రమున్ను, మొదటి కవరులో పెట్టి అంటించి, ఆకవరు రిజిస్ట్రీ పోస్టుద్వారా రిటర్నింగు ఆఫీసరుకు పంపవలెను. గడువులోపుగా నాకవరు రిటర్నింగు ఆఫీసరుకు చేరవలెను. గడువు దాటినపిమ్మట అందిన కవర్లున్ను, సాధారణపు పోస్టుద్వారా పంపిన కవర్లున్ను, మంజూరుచేయరు.

లేదా రిటర్నింగు ఆఫీసులో పెట్టిన ఓట్లపెట్టెలో యీకవరు ఓటరు స్వయముగా గాని, నౌఖరుద్వారా గాని, గడువులోపున పడవేయవచ్చును.

61. (1) అంధత్వమువల్ల లేక యితరకారణములవల్ల ఓటరు స్వయముగా గుర్తుపెట్ట జాలనిచో, అతను యీదిగువ ఆఫీసర్లలో నొకరివద్దకు వెళ్లి, వారిని గుర్తుపెట్ట మని కోరవచ్చును. అతడు కోరినరీతిగా వారు గుర్తుపెట్టవలెను.

(2) అట్టి ఆఫీసర్లు.

స్టయిపెండరీ మేజిస్ట్రీట్లు (గ్రామమునసబు పనికిరాడు)

మద్రాసు స్మాల్ కాజ్ కోర్టు జడ్జీలు.

మద్రాసు సిటి సివిల్ కోర్టు జడ్జీలు.

సబ్ జడ్జీలు.

డిస్ట్రిక్టు మునసబులు.
జిల్లా రిజిస్ట్రార్లు.
సబ్ రిజిస్ట్రార్లు

62. (1) ఓటుకాగితములు చేరియుండని ఓటరు, లేక చేరినవి పొరపాటున పాడైనను, పోయినను, అట్టి ఓటరు (2) వ విధిలో తెలిపిన రీతిగా క్రొత్త ఓటుకాగితమిమ్మని కోరవచ్చును. పాడైన కాగితములు రిటర్నింగు ఆఫీసరుకు పంపవలెను. క్రొత్తకాగితములు పుచ్చుకొన్న ఓటరుపేరున కెదురుగా జాబితాలో ప్రత్యేకగు ర్తుంచవలెను.

(2) అట్టి ఓటరు ఆప్రదేశములోనున్న ప్రసిడెన్సీ మేజిస్ట్రేటు, లేక తాలూకామేజిస్ట్రేటు, లేక డిప్యూటీతహసీల్దారు, లేక స్టేషనరీ సబ్ మేజిస్ట్రేటువద్దకు వెల్లి తాను ఓటుకాగితము పారవేసికొంటినని కాని ఓటుకాగితము తనకు చేరలేదనికాని వ్రాసియిచ్చి, ఆ ఆఫీసరు యెదుట సంతకముచేయవలెను. ఓటరును ఆఫీసరెరుగనిచో, ఓటరునెరిగిన యిరువురు ఘరానామనుష్యులు ఆఫీసరువద్దకు వచ్చి, తా మతని నెరుగుదుమని పైకాగితముపై సంతకములు చేయవలెను. గ్రామోద్యోగులు ఓటరు నెరిగియున్నను చాలును. ఆ ఆఫీసరాకాగితము పుచ్చుకొని రిటర్నింగు ఆఫీసరువద్దకు పంపవలెను.

63. ఈ విధులప్రకారము ప్రతి ఓటరునకు ఓటుకాగితము పంపియున్నచో, అతని కా కాగితము చేరలేదను కారణముచే ఎన్నిక రద్దుచేయరు.

## ఓట్లు లెక్కపెట్టు క్రమము

64. ఓట్లులెక్క గవర్నరు నియమించిన తేదీని ప్రారంభింతురు. వేళ, ప్రదేశము రిటర్నింగు ఆఫీసరు నిర్ణయించును. అందరభ్యర్థులకున్ను, ఓట్ల ఏజంట్లకున్ను, రిటర్నింగు ఆఫీసరు ఓట్లులెక్కపెట్టు ప్రదేశము, తారీఖు, వేళయున్ను వ్రాతమూలముగా తెలుపవలెను.

65. ఓట్లు రిటర్నింగు ఆఫీసరు (లేక అతని సమక్షములో నతని చేతిక్రింది ఆఫీసర్లు) లెక్కపెట్టవలెను. అప్పుడు అభ్యర్థి, అభ్యర్థితరఫు ఏజంటు, అభ్యర్థి నియమించిన యింకొక ప్రతినిధిమాత్రమే హాజరుండవచ్చును. పైవా రెవరున్ను హాజరుండరాదు. రిటర్నింగు ఆఫీసరు తన సహాయార్థము నియమించిన ఆఫీసర్లు హాజరుండవచ్చును. ఏ అభ్యర్థితరఫునైన పనిచేయువారిని రిటర్నింగు ఆఫీసరు తన సహాయార్థ మేర్పరుచుకొనరాదు.

66. ఓట్లు లెక్కపెట్టుటయందు రిటర్నింగు ఆఫీసరు ఎ.క్షన్ నేరములు (వేరొక చోట వ్రాసినాము) హాజరున్నవారికి చదివి వినిపించవలెను. ఆవెనుక నీక్రింది కార్య క్రమ మవలంబింపవలెను:—

(1) (i) ఓటర్లు స్వయముగా ఓట్లువేయుపద్ధతిని ఓట్లుపుచ్చుకొను సందర్భములో ఒకేరంగున్ను, ఒకేసంఖ్యయు కలుగు ఓట్లపెట్టె లన్నియున్ను, ఆరంగు కవర్లున్ను (50,53 విధుల ప్రకారము ఓట్లువేసినకవర్లున్ను) తీయించవలెను. ఆరంగుపెట్టెలలోను, కవర్లలోను ఉన్న ఓట్లన్నియు తీసి, అవి లెక్కపెట్టించి, రిటర్నింగు ఆఫీసరు ఆ సంఖ్య నొక స్టేట్‌మెంటులో వ్రాసియుంచవలెను. ఆవెనుక మరియొకరంగు, సంఖ్య, ఉన్న పెట్టెలున్ను, కవర్లున్ను తీయించి, వానిలోని ఓట్లు లెక్కపెట్టించి, మొత్తపు సంఖ్య వ్రాసికొనవలెను. అట్లే అన్నిరంగుల పెట్టెలున్ను, కవర్లున్ను, ఒకటి తర్వాత నొకటి తీయించి, దేనికిదానికి ప్రత్యేకముగా ఓట్ల మొత్తపుసంఖ్య తన స్టేట్ మెంటులో వ్రాసికొనవలెను.

(ii) ఓటర్లు పోస్టుద్వారా ఓట్లువేయు పద్ధతిని ఓట్లు పుచ్చుకొన్న సందర్భములో:—

పోస్టుద్వారా పంపిన కవర్లున్ను, పెట్టెలో పడవేసిన కవర్లున్ను, ఒకటి తర్వాత నొకటి విప్పి, అందులోని ఓటుకాగితములు పైకి తీయవలెను. నిదర్శన పత్రము కవరులో లేకపోయినచో లోపలి కవరు విప్పరాదు. అందుపై "నిరాక రించిన ఓటు" అని వ్రాయవలెను. నిదర్శనపత్రి మున్నచో, అది సక్రమముగా వ్రాయబడియున్నదో లేదో రిటర్నింగు ఆఫీసరు తనిఖీచేయవలెను. నిదర్శనపత్రము తాను పంపిన మతలబుపై వ్రాయలేదని, లేక సక్రమముగా వ్రాయలేదని రిటర్నింగు ఆఫీస రభిప్రాయపడినచో, 'నిరాకరించినది' అని దానివెనుక వ్రాసి, అదన్ని లోపలి కవరున్ను వేరు కట్టలో నుంచవలెను. ఒకే కవరులో పెక్కు నిదర్శనపత్రములున్ను ఓటుకవర్లున్ను పంపినచో వానినన్నిటిని ఆఫీసరు నిరాకరించి, వేరుకట్టలో నుంచవలెను. తక్కిన (సక్రమముగా నున్న) కవర్లలోని ఓటుకాగితములు బైటకు తీసి లెక్కపెట్టి ఆ మొత్తపుసంఖ్య నొకస్టేట్‌మెంటులో వ్రాయవలెను. ఆవెనుక తన సహాయార్థ మేర్పరచిన ఆఫీసర్లకు ఓటుకాగితములు పంచియిచ్చి, ఏ అభ్యర్థి కెన్ని ఓట్లు వచ్చినవో లెక్కపెట్టించవలెను.

(2) అభ్యర్థులు లేక వారి ఏజంట్లు రిటర్నింగు ఆఫీసరు నిరాకరింపదలచిన ఓటుకాగితములు చూడవచ్చును, కాని పట్టుకొనరాదు. నిరాకరించిన ఓటు కాగి తముపై రిటర్నింగు ఆఫీసరు 'నిరాకరించినది' అని వ్రాయవలెను. ఏ అభ్యర్థియైన

ఏజంటైన, నిరాకరణచేయరాదని వచించినచో, రిటర్నింగు ఆఫీసరు నిరాకరణకు కారణములున్న వ్రాయవలెను. ఏజంటును కాని అభ్యర్థిని కాని, ఓటుకాగితము వెనుకనున్న ఓటరుసంఖ్య చూడనీయరాదు.

(8) లెక్క పూర్తియగువరకు రిటర్నింగ ఆఫీసరు లెక్కసాగింపవలెను. అది సాధ్యముకానిచో సంచులు, కవర్లు మొదలైనవి మూయించి అందుపై తనసీలున్ను, అభ్యర్థుల లేక ఏజంట్ల సీల్లున్నువేసి, కాగితములు భద్రపర్చవలెను.

67. (1) ఓటుకాగిత మీక్రిందికారణములలో దేనిననుసరించినైన నిరాకరింపవలెను:—

(అ) పోస్టుద్వారా ఓటింగు జరిగినప్పుడు, స్వయముగా ఓటరు ఓటు వేసినప్పుడు ఓటుకాగితముపై ఓటరు నానవాలుపట్టుట కవకాశ మిచ్చు ఎట్టి గుర్తైనను పెట్టియుండుట.

(ఆ) స్వయముగా ఓట్లు వేయునప్పుడు.

(i) 41 వ రూలులో తెలిపిన స్టాంపు లేనప్పుడు.

(ii) మరియొక ఎలక్షన్ ఖండమునకు సంబంధించిన గుర్తీ కాగితముపైనున్నప్పుడు.

(ఇ) పోస్టుద్వారా ఓటింగు జరిగినసందర్భములో

(i) ఖాళీలకు మించి హెచ్చుమంది అభ్యర్థుల పేర్ల కెదురుగా గుర్తులుంచబడినచో

[మెంబరు ఖాళీలు రెండున్నచో ఓటుకాగితముపై 6 గు రభ్యర్థుల పేర్లు వ్రాసియున్నను, వారిలో నిద్దరిపేర్ల కెదురుగా మాత్రమే ఓటరు గుర్తుపెట్టవచ్చును. ఇద్దరకుమించి హెచ్చుపేర్ల కెదురుగా గుర్తుపెట్టినచో ఓటుకాగితము నిరాకరింతురు.]

(ii) ఏపేరునకు ఎదుట గుర్తు లేనప్పుడు.

(iiii) గుర్తేపేరున కెదురుగా నున్నదో నిర్ణయింప వీలులేనప్పుడు.

(iv) కవరు రిటర్నింగు ఆఫీసరుకు గడువులోపుగా చేరునట్లు రిజిస్ట్రీ పోస్టుద్వారా పంపకుండుట; లేక ఓట్లపెట్టెలో పడవేయకుండుట.

(v) కవరుతోపాటు నిదర్శనపత్రము పంపకుండుట.

(vi) ఒకే కవరులో రెండు మూడు నిదర్శనపత్రములు లేక ఓటు కవర్లు పెట్టియుండుట.

[ఒక కవరులో నొకే ఓటుకవరు పెట్టవలెను; ఒకే నిదర్శనపత్రి ముండవలెను]

(vii) నిదర్శితపత్రము రిటర్నింగు ఆఫీసరు పంపిన మతలబుపై వ్రాయక వేరుకాగితముపై వ్రాసి పంపుట; నిదర్శనపత్రిపువ్రాసిత పట్టవిరుద్ధమై యుండుట.

ఏ గుర్తయినను రెండుపేరుల కెదురుగా (ఏపేరున కెదురుగా పెట్టియున్నదో నిర్ణయించుటకు వీలులేని పద్ధతిని) పెట్టియున్నచో, ఆగుర్తునకు విలువలేదు కాని ఓటు కాగితములోని తక్కిన గుర్తులకు విలువ యుండును.

(2) పైకారణములు మినహా తక్కినకారణములకు ఓటుకాగితము నిరాకరింపరాదు.

(3) ఎలక్షన్ పిటిషనులో మార్పుకావలసినదే గాని, యితరత్రా రిటర్నింగు ఆఫీసరు తీర్పు ఖాయముగా చెల్లవలసినదే. అతడు నిరాకరించిన ఓట్లు లెక్కలోనికి తీసికొనరు; అంగీకరించిన ఓట్లు లెక్కలోనికి తీసికొందురు.

68. లెక్క పూర్తి కాగానే, ఏ అభ్యర్థికి (లేక అభ్యర్థులకు) హెచ్చు ఓట్లు వచ్చినవో, ఎవరు విజయులైరో వెంటనే ఆఫీసరు వెల్లడిచేయవలెను.

69. ఇరువు రభ్యర్థులకు సమానముగా ఓట్లువచ్చినచో, లాట్లువేసి ఎవరిపేరు పైకి తీసిరో వారు విజయమందినట్లు చెప్పవలెను.

70. (1) ఎన్నికఫలితములు వెంటనే రిటర్నింగు ఆఫీసరు కౌన్సిలు కార్యదర్శికిన్ని, గవర్నమెంటుకున్ను తెలుపవలెను.

(2) గవర్నమెంటు గెల్పొందిన అభ్యర్థులపేర్లు గెజెట్‌లో ప్రచురింపవలెను.

91. స్వయముగా ఓటర్లు ఓట్లువేయు ఖండములలో రిటర్నింగు ఆఫీసరీకార్యక్రమము నవలంబింపవలెను. పేచీ ఓట్లసంచియు, ఓటరుజాబితా లున్నసంచియు, ఓటుకాగితముల వెనుకముక్క లున్న సంచియు, రిటర్నింగు ఆఫీసరు విప్పరాదు. ఓట్ల సంఖ్యయు, నిరాకరించిన ఓటు కాగితముల సంఖ్యయు, వాడుకకాని ఓటు కాగితముల సంఖ్యయు తనిఖీచూచి, ఓట్ల ఆఫీసరు స్టేట్‌మెంటులో వ్రాసినవానితో సరిపోవునో లేదో చూడవలెను. తాను విప్పిన సంచులన్నియు నావెనుక మూసివేసి, సీళ్లువేసి, ప్రతి సంచిపైని అందులో నేకాగితములున్నవో ఏరోజున జరిగిన ఏ ఎన్నికకిది సంబంధించినదో, వ్రాయవలెను.

92 పోస్టుద్వారా ఓట్లువేయు ఖండములలో రిటర్నింగు ఆఫీసరీకార్యక్రమ మవలంబింపవలెను. లెక్క పూర్తియైన పిదప

(1) లెక్క పెట్టిన ఓటుకాగితములున్న

(2) నిరాకరించిన నిదర్శనపత్రములు, వానికి సంబంధించిన ఓటు కాగితములున్ను

(3) లెక్క పెట్టు సమయమందు నిరాకరించిన ఓటుకాగితములున్ను

(4) ఓటుకాగితములు నిరాకరించినచో అవియు, వానికి సంబంధించిన నిదర్శనపత్రములున్ను

(5) గుర్తులు పెట్టియున్న ఓటరు జాబితాయున్ను వేరువేరు సంచులలో పెట్టి వానిపై సీళ్లువేయించవలెను. ప్రతి సంచిపైని అందులో నేకాగితము లున్నవో, అది ఏ తేదీని జరిగిన ఎన్నికకు సంబంధించినవో వ్రాయవలెను. మరిన్ని 18 వ ఫారము ప్రకారము స్టేట్మెంటు వ్రాసి సంతకము చేయవలెను.

73. 14 వ ఫారము ననుసరించి అన్ని ఖండముల ఎన్నికలలోను రిటర్నింగు ఆఫీసర్లు రిపోర్టువ్రాసి సంతకము చేయవలెను. ఆ రిపోర్టులో

(1) సక్రమమైన ఓట్లు వచ్చిన అభ్యర్థుల పేర్లు

(2) ఏ అభ్యర్థి కెన్ని ఓట్లు వచ్చినవి (సక్రమమైనవి)

(3) గెల్పొందిన అభ్యర్థి పేరు.

(4) నిరాకరించిన ఓట్లసంఖ్య.

(5) పేసీ ఓట్లసంఖ్య

వ్రాయవలెను.

ఈ రిపోర్టునకు అభ్యర్థికాని, అభ్యర్థితరపు ఏజంటుగాని నకలు వ్రాసికొన గోరినచో రిటర్నింగుఆఫీసరు వ్రాసికొన ననుజ్ఞ నీయవలెను.

74. (1) ఎలక్షన్ ఫలితము తేలినపిదప వీలైనంత త్వరలో యీ రిపోర్టు రిటర్నింగు ఆఫీసరు గవర్నమెంటుకు పంపవలెను.

(2) పై సంచులు రిటర్నింగు ఆఫీసరు స్వాధీనమందే భద్రపరుపవలెను.

75. పై ఓట్లసంచు లేవియు నటుతర్వాత విప్పరాదు. ఎలక్షన్ విచారణలో ఏ కోర్టువారైన వానిని పంపమని కోరినచో పంపవలెను. అట్టి విచారణజరుపు నధికారి వానిని విప్పవచ్చును.

ఎలక్షన్లకు సంబంధించిన యితరకాగితములు చూడగోరువారికి చూపెదరు. వారు రు 5/- లు చెల్లించినచో నట్టి అవకాశ మిచ్చెదరు.

76. (1) పై కాగితములు 1 సంవత్సరము నిలువయుంచి, యీలోపుగా ఏకోర్టు వారున్ను ఏ కమీషనరున్ను వానిని పంపమని కోరనిచో, కాల్చివేయవలెను.

(2) నామినేషన్ కాగితములున్ను, అభ్యర్థులు దాఖలుచేసిన రాజీకాగిత ములున్ను 9 సంవత్సరములు రిటర్నింగు ఆఫీసులో భద్రపరిచియుంచి ఆవెనుక కాల్చివేసెదరు.

## ఎలెక్షన్ ఏజెంట్లు, ఎలెక్షన్ ఖర్చులు.

77. ఎలెక్షన్ అక్రమచర్యల ఆర్డరుప్రకారము అభ్యర్థిగా నుండుటకు లేక ఓటు వేయుటకు, అనర్హులైనవారిని ఏ ఎన్నికలోను ఓట్ల ఏజంటుగా నియమింపరాదు.

78. అభ్యర్థి పెట్టిన ఖర్చులు, ఏజెంటు పెట్టిన ఖర్చులు, అభ్యర్థితరపు మరి యెవ రైనపెట్టిన ఖర్చులున్ను ఏజెంటు వ్రాయు లెక్కపుస్తకములలో వ్రాయవలెను. మరిన్ని ఏజంటు, అభ్యర్థి (లేక వారితరపున నుఱియొకరు) ఎలక్షన్ నిమిత్తమై పెట్టిన ఖర్చులకు బాకీలుపడియున్నచో అట్టి బాకీలుకూడా వ్రాయవలెను. ఆ తబి సీళ్లు 3 వ షెడ్యూలులో తెలియజేసినవిధముగా వ్రాయవలెను.

79. ఎలక్షన్ ఫలితము ప్రచురించిన 35 రోజులలోపుగా ఖర్చు లెక్కలు వ్రాసి రిటర్నింగు ఆఫీసరుయెదుట దాఖలు చేయవలెను.

80. (1) 3, 4 షెడ్యూళ్లలో తెల్పినరీతిగా నట్టి లెక్కలు వ్రాయవలెను.

(2) అభ్యర్థి విదేశములకు వెళ్లియున్నచో, అతడు హిందూదేశమునకు తిరిగి వచ్చిన 14 రోజులలోగా అతని నివేదిక దాఖలుచేయవచ్చును.

81. పై లెక్కలు దాఖలుకాగానే, ఫలానితేదీని లెక్కలు దాఖలైనదనియు, చూడగోరు వారు (రు 1/- చెల్లించి) దానిని ఫలాని తేదిలలో ఫలానిచోట చూడవచ్చు ననియు, రిటర్నింగు ఆఫీసరు తన ఆఫీసులో నోటీసు ప్రకటింపవలెను. ఆనోటీసు గెజెట్‌లో కూడ వేయించవలెను.

(2) లెక్కలకు పబ్లికునకలు కావలసినవారికి మామూలు పబ్లికునకళ్లు తయారు చేయుటకు పుచ్చుకొను రేట్లనుబట్టి సొమ్ము పుచ్చుకొని, నకలీయవలెను.

(3) (i) ఈ క్రింది తఫసీళ్లుకలిగియున్న స్టేట్మెంటు ఒకటి గవర్నమెంటు తయారు చేయించవలెను.

(అ) అభ్యర్థుల పేర్లు.

(ఆ) ఏ అభ్యర్థితరపున ఏ ఏజెంటు పనిజేసెనో,

(ఇ) ఎలక్షన్ జరిగిన తేదీ.

(ఈ) ఏఏ ఖండములలో ఎన్నికలు జరిగినవో.

(ఉ) ఏ అభ్యర్థి ఎలక్షన్ లెక్కలు ఏ తేదీని దాఖలయ్యెనో.

(ii) ఈ తబిసీళ్లు గవర్నమెంటుకు రిటర్నింగు ఆఫీసరు పంపవలెను.

(iii) ఈ స్టేట్‌మెంటు చూడగోరువారి కెవరికైన చూపవలెను.

(iv) అట్టి స్టేట్‌మెంటు ఎలక్షన్ జరిగిన 9 సంవత్సరములవరకు భద్రపరిచి యుంచవలెను.

(v) సాధారణ ఎన్నికలకు వేరు స్టేట్‌మెంట్లున్ను, ఆకస్మికపు ఖాళీల ఎన్నికలకు వేరు స్టేట్‌మెంట్లున్ను వ్రాసియుంచవలెను.

82. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరుపదవి కభ్యర్థియై నిల్చినవారు యీ దిగువ తెలిపిన మొత్తములకు మించి ఖర్చుపెట్టరాదు. ఈ మొత్తములో అభ్యర్థుల స్వంతఖర్చులున్ను యిమిడియే యున్నవి.

| ఎలక్షన్ ఖండపు స్వభావము. | ఎంతమొత్తము మించరాదు? |
| --- | --- |
| (i) 8,000 అంతమంది అకతకు తక్కువమంది ఓటర్లున్న ఖండములలో | రు 1,000/- |
| (ii) తక్కిన ఖండములలో | ఓటరునకు 2 అణాలు లెక్క చొప్పున అయ్యే మొత్తము. |

## ఎలెక్షన్ వివాదములు: పరిష్కరించువిధానము

83. గెలుపొందిన అభ్యర్థి ఎన్నిక నాక్షేపించుచు దాఖలుచేసిన ఎలక్షన్ పిటిషను గవర్నరుగారికి దాఖలుచేయు విధానము లియ్యవి:—

(i) గవర్నరుగారి యెదుట, లేక గవర్నరుగారు నియమించిన మరియొక యుద్యోగియెదుట, లేదా ఆక్షేపణదారు స్వయముగా దాఖలుచేయవలెను.

(ii) వారియెదుట, ఆక్షేపణదారు తరఫున (ఆక్షేపదారువలన వ్రాతమూలమైన యనుమతి పొందిన) మరియొకడు దాఖలు చేయవలెను, లేదా

(iii) వారి కా పిటిషను రిజిస్ట్రిపోస్టులో పంపవలెను.

84. ఎలక్షన్ పిటిషన్ దాఖలుచేయుట క్రిందివారి కధికార మున్నది:—

(1) 81 (i) వ రూలుబట్టి గెలుపొందిన అభ్యర్థి లెక్కలు గెజెట్‌లో ప్రచురణకాబడిన తేదీలగాయితు 14 రోజుల లోపుగా ఏ అభ్యర్థియైన, ఏ ఓటరైన అట్టి పిటిషన్ దాఖలుచేయవచ్చును.

(2) ఎన్నికలో అనేక లంచపునేరములు, మోసగించి ఓటర్లబుద్ధిమార్చిన నేరములు జరిగినవని గవర్న రభిప్రాయపడినచో, ఎన్నిక రద్దుచేయు నిమిత్తమై పిటిషన్ దాఖలుచేయుమని గవర్నరే ఒక ఆఫీసరున కాజ్ఞ యిచ్చును.

## 1 వ నిర్వచనము

పిటిషన్ దాఖలుకావలసిన, ఆఖరురోజు గవర్నమెంటు సెలవుదిన మైనచో, ఆమరునాడు దాఖలుచేసినను సకాలములో దాఖలు చేసినట్లే భావింతురు.

## 2 వ నిర్వచనము

80 (2) వ రూలులో విదేశముల కేగిన అభ్యర్థి తిరిగివచ్చి నివేదిక దాఖలు చేసినతర్వాత, 14 రోజులలో పిటిషను దాఖలు చేయవచ్చును.

85. (1) పిటిషనులో ఆక్షేపణకు కారణము లన్నియు సంక్షేపముగా వ్రాయ వలెను. పేరాలక్రింద విడదీసి వ్రాయవలెను. వ్రాతవరకు ఆక్షేపణదారు సంతకము చేసి, పైని వ్రాసినవిషయము లన్నియు యథార్థము లని వ్రాసి రెండవసారి సంతకము చేయవలెను.

(2) పిటిషనుతోపాటు ఒక జాబితాయున్ను దాఖలు చేయవలెను. అందుపై ఆక్షేపణదారు సంతకము చేయవలెను. అందులో అక్రమచర్యలకు, లేక నేరములకు పూర్తియైన తఖసీళ్లు వ్రాయవలెను. ఆ అక్రమచర్య లెవరుచేసిరో, ఏచోట, ఏతేదీని ఎన్ని గంటలవేళ చేసిరో మొదలగు విషయములు సాధ్యమైనంత విపులముగా వ్రాయ వలెను.

(3) ఆజాబితాలో వ్రాసినవిషయములు మార్పుచేయుటకు, వాని కదనముగా మరికొన్ని విషయములు వ్రాయుటకు, ఆక్షేపణదా రభిలషించుచో, (ఎదురుపార్టీకి ఖర్చులు మొదలైనవి యిప్పించి) కమీషన ర్లట్టు సవరణలుచేయ ననుమతి యీయ వచ్చును.

86. గెల్పొందిన అభ్యర్థి ఎన్నిక నాక్షేపించుటయే గాక తానే గెలుపొందిన అభ్యర్థియని తీర్పుచెప్పమని ఆక్షేపణదారు కోరవచ్చును. ఆ సందర్భములో నతడు తక్కిన అభ్యర్థుల నందరను పిటిషనులో పార్టీలుగా చేర్చవలెను.

87. పిటిషనుతోపాటు రు 1,000/- రొక్కము లేక గవర్నమెంటు ప్రామిసరీ నోట్లు దాఖలు చేయవలెను. 105 (2) ప్రకారము గవర్నరుచేనియామక మగు ఆఫీసరు సొమ్ముకట్టనక్కర లేదు.

88. (1) ఆక్షేపణదారు చనిపోయినచో పిటిషన్ అంతమొందును.

పిటిషన్ దాఖలుచేసినవారు గవర్నమెంటు ఉద్యోగియైనచో, అతడు చని పోయినను, అతనిస్థానే మరియొక ఉద్యోగి పిటిషన్ నడుపవచ్చును.

(2) పిటిషన్ అంతమొందిన విషయము గెజెట్‌లో ప్రకటింపవలెను.

(3) ఈ ప్రకటన జరిగిన 14 రోజులలో మరియొక అభ్యర్థి తన్నాక్షేపణదారుగా భావించి పిటిషన్‌గ్రంథము విచారింపుమని కమీషనర్లను కోరవచ్చును. అతడున్ను పై ధరావత్తుమొత్తములు కట్టవలెను.

89. (1) కమిషనర్లు, లేక గవర్నరు అనుమతి యిచ్చినచో ఆక్షేపణదారు పిటిషను వదలుకొనవచ్చును.

(2) ఒకే ఎన్నికకు సంబంధించి రెండు మూడు పిటిషన్లు దాఖలైనచో, అందరాక్షేపణదార్లు సమ్మతించిననే కాని ఏ పిటిషను వదులుకొనుటకు వీలులేదు.

(3) విడుదలనిమిత్తమై పిటిషన్ దాఖలైనచో, పార్టీలందరకున్ను నోటీసు చేయించవలెను. ఆపిటిషన్ విచారణకు వాయిదా యేర్పరుపవలెను.

(4) ఆక్షేపణదారు లంచము పుచ్చుకొని, లేక ఏదైన బహుమాన మాసించి పిటిషన్ వదలుకొనుచున్నారని కమీషనర్ల కనుమానము కలిగినచో వారు విడుదల పిటిషన్ కొట్టివేయవలెను.

(5) విడుదలపిటిషను కమీషనర్లంగీకరించినచో

(i) ఎదురుపార్టీ ఖర్చులు (లేక అందులోని భాగము) ఆక్షేపణదారిచ్చుకొనవలసి యుండును.

(ii) పిటిషన్ వదులుకొనిన వర్తమానము గెజెట్‌లో ప్రచురింపవలెను.

(iii) అట్టి ప్రచురణజరిగిన 14 రోజులలోగా మరి ఎవరైన తన్నాక్షేపణదారుగా భావించి పిటిషన్‌గ్రంథము నడుపవలసిన దని (అతడు ధరావత్తు సొమ్ము కట్టవలెను) కమీషనర్లను కోరవచ్చును.

(6) ఆక్షేపణదారు పిటిషన్ వదలుకొనిన పిమ్మట పై రీతిగా ఎవరున్ను కోరి యుండనిచో, కమీషనర్లా వర్తమానము గవర్నరుగారికి తెలియపర్చవలెను.

90. ఎదురుపార్టీ చనిపోయిన సందర్భములో, లేక ఎదురుపార్టీ పిటిషనుకు అడ్డు చెప్పనని నోటీ సిచ్చినచో, యీ విషయము కమీషనర్లు గెజెట్‌లో ప్రచురింపవలెను. అట్టి ప్రచురణ జరిగిన 14 రోజులలోపుగా మరి యెవరైనను పిటిషన్‌లో తన్ను పార్టీగా చేర్చుకొమ్మనియు, తాను పిటిషన్‌కు అడ్డువాదముపెట్ట సిద్ధపడి యున్నాననియు, కమీషనర్ల కోరిగింపవచ్చును.

91. (1) పై విధులననుసరించి వ్రాసియుండని పిటిషను గవర్నరు కొట్టివేయవచ్చును.

(2) పిటిషన్ కొట్టివేయనిసందర్భములలో, ఆ పిటిషన్ విచారణనిమిత్తము గవర్నరుగా రేర్పరచిన కమీషనర్లవద్దకు దానిని పంపవలెను.

(3) ఆ కమీషనర్లలో ప్రధానుడు ఆపిటిషన్ దాఖలైన వర్తమానము ఎదురు పార్టీలందరకు తెలుపవలెను, గెజెట్‌లో ప్రచురింపవలెను. ఆక్షేపణదారు ఖర్చుల నిమిత్తమై జామీనుబాండు (మరికొందరు జామీనుదారులతో సహా) వ్రాసి యివ్వ వలసినదని ఉత్తరువు వేయవచ్చును. పై ప్రచురణజరిగిన 14 రోజులలోగా మరి ఏ అభ్యర్థియైన తన్నుకూడా పిటిషన్‌లో పార్టీగా చేర్చుకొమ్మని కమీషనర్లను కోరవచ్చును. అతడున్ను ధరావత్తు కట్టుటకున్ను, బాండు వ్రాసియిచ్చుటకున్ను సంసిద్ధుడై యుండవలెను.

84 (2) ప్రకారము పిటిషన్ దాఖలుచేయు గవర్నమెంటు ఆఫీసరు బాండు దాఖలుచేయ నక్కరలేదు.

92. దావాలవిచారణలో నవలంబించు క్రమమును బట్టియే పిటిషన్ల విచారణయు జరుపవలెను.

సాక్షులుచెప్పిన విషయము కమీషనర్లు సంక్షేపముగా వ్రాసికొనిన చాలును. వాంగ్మూలముపై సాక్షుల సంతకములు చేయించనక్కరలేదు.

93. గవర్నరుగారు నియమించిన ప్రదేశములో విచారణ జరుగవలెను.

కమిషనర్లు విచారణలో కొంతభాగము మరియొకచోట జరుపవచ్చును; లేదా తమలో నొకరిని రాష్ట్రములో నే ప్రదేశమునకైన నేగి సాక్ష్యము పుచ్చు కొమ్మని పంపవచ్చును.

94. (1) గెలుపొందిన అభ్యర్థిగాక మరియొక అభ్యర్థి తాను విజయుడైనట్లు తీర్పీయమని కమీషనర్లను కోరినచో, ఆ రెండవ అభ్యర్థి మెంబరగుట కనర్హుడని పార్టీగానున్న ఏ అభ్యర్థియైన రుజువు చేయవచ్చును. ఈ రెండవ అభ్యర్థి విజయుడై యున్నచో, అతని యెన్నిక రద్దుపరిపించుటకు బలవత్కారణము లున్నవని రుజువు పర్చవచ్చును.

అట్టి ఆక్షేపణ చేయదలచిన వారు పిటిషన్ నోటీసు ప్రకటన జరిగిన 14 రోజులలో (తాము ఆక్షేపణచేయ సంకల్పించినట్లు) కమీషనర్లకు నోటీసు యీయ వలెను. ధరావత్తుకట్టి బాండు వ్రాసియీయవలెను.

95. ఎలక్షన్ పిటిషన్లున్ను కమీషనర్ల తీర్పులున్ను 3 సంవత్సరములు భద్రపరిచి యుంచి ఆ వెనుక గవర్నమెంటు కాల్చివేయవలెను.

96. (1) ఏ అభ్యర్థియైన పెక్కు ఖండములలో మెంబరుగా నెన్నుకోబడిన అతడేఖండములో మెంబరుగా నుండగోరనది కౌన్సిలుకార్యదర్శికి వ్రాసిపంపవలెను. ఎలక్షను ఫలితము ప్రచురణకాబడిన 7 రోజులలోగా అట్టి కాగితము కార్యదర్శికి చేరవలెను. అభ్యర్థి ఏ ఖండమునకు మెంబరుగా నుండగోరునో, అఖండమునకే అతడు మెంబరుగా నుండును. అతని మనో నిశ్చయమున కాక్షేపణ చేయరాదు.

(2) తక్కిన ఖండముల ఓటర్లను తిరిగి మెంబరు నెన్నుకోవలసినదని గవర్నరుగారు హెచ్చరిక చేయవలెను.

(3) అభ్యర్థి పై కాగితము దాఖలుచేయనిచో, అతని ఎన్నిక (అన్ని ఖండములలోను) పూర్తిగా రద్దగును. ఆ వెనుక ఆయా ఖండములలో ఓటర్లను తిరిగి మెంబరు నెన్నుకోవలసినదని గవర్నరుగారు హెచ్చరిక చేయవలెను.

## మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబర్ల ఎన్నికకు సంబంధించిన విధులు

## 2 వ షెడ్యూలు

...............పేరు గల నేను...............నా ఓట్ల ఏజంటుగా నియమించితినని తెలుపుచున్నాను.

ప్రదేశము. ...................

తేదీ. అభ్యర్థి సంతకము.

### 1 వ మతలబు (13 వ రూలు చూ.)

............ఖండములో............మెంబరును.........(గ్రామ సముదాయపు) ఓటర్లెన్నుకొనవలసియున్నది గావున............పేరు గల నేను ఆ ఖండపు ఆఫీసరు కావున యీ దిగువ నోటీసు నిచ్చుచున్నాను.

### నోటీసు

(i) ఎన్నుకోవలసిన అభ్యర్థులు.........

(ii) ఈ క్రింద సంతకము చేసినవారికి, లేక వాని స్థానమున వ్యవహరించు వాలనికి, నామినేషన్లు.........చోట, పగలు 11-3 గంటలకు మధ్య,......... తేదీని కాని, ఆ లోపుగా కాని దాఖలు చేయవలెను.

(iii) నామినేషన్ మతలబులు.........ఆఫీసులలో,.........తేదీలలో... ......గంటల మధ్య నుచితముగా నిచ్చెదరు.

(iv) నామినేషన్లు.........తేదీని.........గంటలకు.........ప్రదేశములో తనిఖీ చేతురు.

(v) ఓట్లు.........తేదీని.........గంటల మధ్య............చోటపుచ్చుకొందురు.

(vi) ఓటరు తన గ్రామసముదాయములోని ఓట్ల ఆఫీసులోనే ఓటు వేయవలెను. ఓట్ల ఆఫీసులో పనిచేయువాడు నిదర్శనపత్రము పుచ్చుకొనవచ్చును.

ఓట్లు పుచ్చుకొను ఆఫీసులు దిగువ తెలుపుచున్నాము.

| గ్రామసముదాయము నంబరు | ఓట్ల ఆఫీసు. |
|---|---|
| ..............ప్రదేశము | ............................... |

............తేదీ —ఎలక్షన్ ఖండపు రిటర్నింగు ఆఫీసరు సంతకం.

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు ఎన్నికలు

### 2 వ మతలబు (14 వ విధి చూ.)

### నామినేషన్ కాగితము

ఎలక్షన్ ఖండము పేరు..................................

అభ్యర్థి పేరు..........................................

అభ్యర్థి తండ్రి పేరు....................................

అభ్యర్థి వయస్సు.......................................

అభ్యర్థి చిరునామా.....................................

అభ్యర్థి ఓటరుగా నమోదైయున్న ఎలక్షన్ ఖండము..............................

అభ్యర్థి నంబరు ( జాబితాలో )..........................

ఉపపాదించు ఓటరు పేరు..............................

ఉపపాదించు ఓటరు నంబరు...........................

ఉపపాదించు ఓటరు సంతకం...........................

బలపర్చు ఓటరు పేరు..........................
బలపర్చు ఓటరు నంబరు..........................
బలపర్చు ఓటరు సంతకం..........................

## అభ్యర్థి అంగీకారము

నే నభ్యర్థిగా నుండుట కంగీకరించుచున్నానని తెలుపుచున్నాను.

....................

తేదీ............ అభ్యర్థి సంతకం.

వరుస సంఖ్య............

ఈ నామినేషన్ కాగితము నా ఆఫీసులో.........తేదీని.........గంటల వేళ దాఖలైనది.

..........................

రిటర్నింగు ఆఫీసరు సంతకము

నేను అభ్యర్థియొక్కయు, ఉపపాదకుని, బలపర్చిన వానియొక్కయు అర్హతలను తనిఖీ చేసినాను. వా రందరు నందుల కర్హులు.

..........................

రిటర్నింగు ఆఫీసరు సంతకం.

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు

### 3 వ మతలబు (27 వ విధి చూ.)

............ఎలక్షన్ ఖండము. లెజిస్లేటివ్ కౌన్సిల్.

ఎన్నికకు నిల్చినఅభ్యర్థులజాబితా

| వరుస సంఖ్య | అభ్యర్థుల పేరు | అభ్యర్థుల విలాసము. |
|---|---|---|
| 1. | ............. | ............. |
| 2. | ............. | ............. |
| 3. | ............. | ............. |
| 4. | ............. | ............. |

.........తేదీని.........గంటల మధ్య యిదివరలో ప్రచురించిన ఓట్ల ఆఫీసులలో ఓట్లు పుచ్చుకొందురు.

..........................

రిటర్నింగు ఆఫీసరు సంతకం.

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు

5 వ మతలబు (46 వ విధి చూ.)

ఓట్ల ఆఫీసు పేరు పేచీఓట్ల జాబితా.

| ఎలక్షన్ ఖండము | ఓటరు పేరు. | జాబితాలో ఓటరు నంబరు. | ఓటరు సంతకము లేక వేలు ముద్ర. |
|---|---|---|---|
| | | | |

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు

6 వ మతలబు (47 వ విధి చూ.)

తగాయిదా ఓట్ల జాబితా

ఓట్ల ఆఫీసు పేరు...............

| జాబితాలో ఓటరు నంబరు | పేరు | ఓటరు వ్రాలు లేక వేలుముద్ర | ఓటరును గుర్తుపట్టువాని పేరు |
|---|---|---|---|
| | | | |

..........................................(ఓట్ల ఆఫీసరు వేసిన ఆర్డరు)

........................

ఓట్ల ఆఫీసరు సంతకం.

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు

7 వ మతలబు (47 వ విధి చూ.)

### ఏజంటు దాఖలు చేయునది

..............................పేరు గల నేను యీదిగువ నుదాహరించిన ఆసామీ కృత్రిమనామముతో ఓటువేయ యత్నించెనని రుజువు చేయుటకు సిద్ధముగా నున్నాను.

| ఆసామీ పేరు | విలాసము | సంతకము లేక వేలుముద్ర |
|---|---|---|
| | | |

..............................
అభ్యర్థి లేక ఏజంటు సంతకము.

సాక్షులు.

1..................పేరు, విలాసము
2.................. ,, ,,
3.................. ,, ,,

..................ప్రదేశము.
..................తేదీ.

..............................
ఓట్ల ఆఫీసరు సంతకము.

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు

10 వ మతలబు (56 వ విధి చూ.)

### పోస్టుద్వారా పంపు వోటుకాగితము

..................ఎలక్షన్ ఖండము.

| అభ్యర్థుల పేర్లు. | గుర్తు. |
|---|---|
| | |
| | |
| | |

## వెనుక పీఠీ

(1) మీ రివ్వవలసిన ఓట్ల సంఖ్య.........

(2) మీకున్న ఓట్లన్నియు ఎవరో యొక అభ్యర్థికే యిచ్చుటకుగాని లేదా మీ యిష్టము వచ్చినట్లు పంచుటకు, మీ కధికార మున్నది.

(3) మీరు ఓటివ్వదలచిన అభ్యర్థి (లేక అభ్యర్థుల పేర్లు) పేరు కెదురుగా X గుర్తు పెట్టుడు.

| ఓటు కాగితపు సంఖ్య. |
| --- |

(వెనుక పీఠీ నందుకు.)

## మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు

10 ఎ మతలబు (56 వ విధి చూ.)

### పైకాగితముతోపాటు దాఖలుచేయు నిదర్శనపత్రము

..................ఎలక్షన్ ఖండము

..................వరుస సంఖ్య

................................ఓటరు పేరు, నంబరు.

______________________________ పేరుగల నేను యీ ఖండములో ఓటరుననియు, నేను, యీ ఎలక్షనుకు, మరియే ఖండములోను ఓటు వేయలేదని తెలుపుచున్నాను.

నేను, యీ ఎలక్షనుకు, మరియే మహమ్మదీయఖండములోను ఓటువేయ లేదని తెలుపుచున్నాను.

______________ ప్రదేశము ______________________ ఓటరు వ్రాలు

______________ తేదీ ______________________ విలాసము

## మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు

14 వ మతలబు (73 వ విధి చూ.)

............ఖండపు ఎన్నికల ఫలితము తెల్పు నివేదిక.

| ఓట్లు వచ్చిన అభ్యర్థుల పేర్లు | ఓట్ల సంఖ్య. |
|---|---|
| సుందరం.................. | |
| నరసింహం................ | |
| విష్ణుమూర్తి................ | |
| రామచంద్రుడు............ | |
| సక్రమములైన ఓటు కాగితముల సంఖ్య. | |
| నిరాకరించిన ఓటు కాగితముల సంఖ్య. | |
| పేచీ ఓటు కాగితముల సంఖ్య. | |

ఈ దిగువ నుదాహరించిన అభ్యర్థులు విజయులైరని నేను ప్రల్లడి చేయుచున్నాను.

సుందరం——————

విష్ణుమూర్తి——————

——————

రిటర్నింగు ఆఫీసరు సంతకం.

# మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ

---

## ఓటరు జాబితాలు తయారుచేయు విధానము

### 1 వ భాగము

#### జనరల్ సీట్లు

నిబంధన

1. యూరపియన్, ఆంగ్లో‌ఇండియన్ ఎలక్షన్ ఖండములకు తప్ప మిగతా ఖండములలో ఓటరు జాబితాలు తయారుచేయుటలో యీవిధుల ననుసరించి నడుచుకోవలెను.

2. ఏ ఖండమున కాఖండమునకు ప్రత్యేకముగా నొక ఓటరుజాబితా తయారు చేయవలెను. 6 వ అనుబంధము ననుసరించి గవర్నరుగారు నిరూపించిన తేదీనిబట్టి యిదివరలో తయారైన జాబితాలు పరిచూడవలెను. ఆ తేదీని ఓటరు హక్కున్నవారందరిపేర్లున్ను జాబితాలో చేర్చవలెను. (2-7-1936 వ తేదీనిబట్టి పరిచూడవలెనని గవర్నరుగారు నిరూపించినారు.) ఓటరుపేరు అతని తండ్రి లేక ఆమె భర్తపేరు, చిరునామా, ఓటుహక్కున్ను, జాబితాలో తెలుపవలెను. ఓటరు జాబితా 1 వ మతలబునసుసరించి వ్రాయవలెను. ఎలక్షన్ ఖండములో వివిధ రిజిస్ట్రేషన్ విభాగములకు (రిజిస్ట్రేషన్‌విభాగ మనగా ఖండములోని స్థలవిభాగము. ఓట్లజాబితాలు తయారు చేయునిమిత్తమె ఎలక్షన్ నిమిత్త మేర్పరచిన ఖండములు పెక్కుశాఖలుగా విభాగింతురు. రిజిస్ట్రేషన్ అనగా ఓటర్లపేర్లు జాబితాలో చేర్చుట. ఇందు నిమిత్తమై ప్రత్యేక స్థలవిభాగముగా నేర్పరుపబడినది రిజిస్ట్రేషన్ విభాగము. దీనికి ప్రత్యేకముగా ఒక రిజిస్ట్రేషన్ ఆఫీసరుండును. రాజమండ్రి భద్రాచలం డివిజన్లు రెండున్ను చేరి ఒక ఎలక్షన్ ఖండము. అందులో రాజమండ్రి డివిజన్ ప్రత్యేకముగా నొక రిజిస్ట్రేషన్ విభాగము. భద్రాచలండివిజన్ ప్రత్యేక రిజిస్ట్రేషన్ విభాగము. రాజమండ్రిడివిజన్ రిజిస్ట్రేషన్ ఆఫీసరు రాజమండ్రి సబు కలెక్టరు). ఏ విభాగమున కా విభాగమునకు ప్రత్యేకముగా ఓటరుజాబితాలు తయారు చేయవలెను. ఆ భాగములో చేరిన ఓటర్లందరిపేర్లున్ను ఆ భాగమునకు సంబంధించిన జాబితాలో చేర్చవలెను. (ఎలక్షన్‌లో ఒక రిజిస్ట్రేషన్ విభాగములోని ఓట్లన్నియు నొక ప్రదేశము

లోనే పుచ్చుకొనుట కవకాశ ముండకపోవచ్చును. ఆ సందర్భములో కొన్ని గ్రామము లొక గుంపుగాను, మరికొన్ని గ్రామము లొక గుంపుగాను చేర్చి, ఒక్కొక్క గుంపునకు ఓట్లు పుచ్చుకొను కేంద్రస్థానము నిర్ణయింతురు. పట్టణ మంతయు నొకే రిజిస్ట్రేషన్ విభాగమై యుండవచ్చును. ఓట్లు పుచ్చుకొనుటకు సదుపాయముగా నుండునట్లు పట్టణమును వేరువేరు పేటలుగా లేక వార్డులుగా విభజించి, ప్రతి వార్డులోను ఒక్కొక్క ఓట్లు పుచ్చుకొను నధికారిని నియమింతురు. సాధారణముగా గ్రామములు కొన్నిచేర్చి ఏక సముదాయముగా చేర్చుచుందురు. కావున ఓట్లు పుచ్చుకొనునిమిత్త మేర్పరచిన చీలికలను, దరవోమీద గ్రామసముదాయము లని వ్యవహరింతుము. గ్రామసముదాయమని మే మెచ్చట వాడినను ఓట్లు పుచ్చుకొనుటకు ప్రత్యేకముగా నేర్పరచిన చీలిక లని చదువరు లూహించుకొనవలెను. అట్టి చీలికలు పట్టణములలో కూడ నేర్పరచుచుందురని పైన వ్రాసియున్నాము. ఈ గ్రామసముదాయములు ఒక్కొక్క రిజిస్ట్రేషన్ విభాగమునం దనేకము లుండ వచ్చును. ఒక రిజిస్ట్రేషన్ విభాగములో పెక్కు గ్రామసముదాయము లున్నచో ఒక్కొక్క గ్రామసముదాయము నొక్కొక్క చీలికగా చీల్చి, వేరు వేరు చీలికకు వేరువేరు జాబితాలు వ్రాయవలెను. ఏ తాలూకాలోని గ్రామసముదాయమున కాతాలూకాలో వేరుగా వ్రాయవలెను. గ్రామసముదాయములలోని ఓటర్ల పేర్లు నేక వరుసను వ్రాయవలెను. గ్రామనామములు అకారాదిగా వ్రాసి గ్రామములో ఓటరుల పేర్లున్ను అకారాదిగానే వ్రాయవలెను. మునిసిపాలిటీలలో ఆయావార్డులలో ఓటర్ల పేర్లున్ను అకారాదిగా వ్రాయవలెను.

(2) ప్రతి గ్రామములోను, ప్రతి గ్రామసముదాయములోను, తక్కిన ఓటర్ల పేర్లన్నియు వ్రాసి, ఆచివర షెడ్యూలు తరగతి ఓటర్ల పేర్లు వ్రాయవలెను.

(3) జనరల్ సీట్లకు స్త్రీ మెంబర్ల నెన్నుకొనవలసినచో ఆయాఖండములలోని జనరల్ మెంబర్ల ఎన్నికలలో పాల్గొన నర్హులైన ఓటర్లందరున్ను స్త్రీ మెంబరు ఎన్నికలలో కూడ పాల్గొన నర్హులు. మహమ్మదీయ సీట్లకు స్త్రీ మెంబర్ల నెన్నుకొన వలసినచో, ఆయాఖండములలోని మహమ్మదీయ మెంబర్ల ఎన్నికలలో పాల్గొన నర్హులైన ఓటర్లందరున్ను స్త్రీ మెంబరు ఎన్నికలలోగూడ పాల్గొన నర్హులు. ఇండియన్ క్రిస్టియన్ సీట్లకు స్త్రీ మెంబరు నెన్నుకొనవలసివచ్చినచో, ఆయాఖండముల లోని ఇండియన్ క్రిస్టియన్ మెంబర్ల ఎన్నికలలో పాల్గొన నర్హులైన ఓటర్లందరును స్త్రీ మెంబరు ఎన్నికలలోకూడ పాల్గొన నర్హులు.

3. ప్రతి ఓటరు జాబితాయున్ను ఆయాజిల్లాలోని వాడుకభాషలో వ్రాయవలెను. ఏ జాబితా కాని అందులోని కొంతభాగముగాని మరి ఏ యితరభాషలోనైన

వ్రాసియుంచమని గవర్నరు నిరూపింపవచ్చును. (తూర్పుగోదావరిజిల్లాలోని ఓటరు జాబితాలు తెలుగుభాషలో వ్రాయవలెను. అదనముగా మరియొకభాషలో వ్రాసినను వ్రాయవచ్చును.)

4. మద్రాసుపట్టణ మంతయు ఒక రిజిస్ట్రేషన్ విభాగము. ప్రతి మునిసిపాలిటీయున్ను, ప్రతి రివిన్యూ డివిజనున్ను (అందులోని మునిసిపాలిటీలు మినహా-అనగా సబ్ కలెక్టరు లేక డిప్యూటీ కలెక్టరు పరిపాలనచేయు రివిన్యూఖండము. సాధారణముగా రెండు మూడు తాలూకాలుచేర్చి ఒక రివిన్యూడివిజన్‌గా ఏర్పరతురు.) ప్రత్యేక రిజిస్ట్రేషన్‌ఖండముగా భావింతురు.

మద్రాసు పట్టణమునకు రిజిస్ట్రేషన్ ఆఫీసరు మద్రాసు కార్పొరేషన్ కమీషనరు. మునిసిపాలిటీలకు రిజిస్ట్రేషన్ ఆఫీసరు ఆయా మునిసిపాలిటీల కమీషనరు లేక మేనేజరు. రివిన్యూడివిజన్లకు రిజిస్ట్రేషన్ ఆఫీసరు డివిజనల్ ఆఫీసరు (డిప్యూటీ కలెక్టరు లేక సబ్ కలెక్టరు.)

[ఓటరు జాబితాలు తయారుచేయు నిమిత్తమై దేశమును వివిధ ఖండములుగా విభజించినారు. అన్నిటికంటె పెద్దది ఎలక్షన్ ఖండము. ఎలక్షన్‌ఖండ మనగా ఒకరినిగాని పలువురనుగాని మెంబర్లను పంపు దేశవిభాగము. ఆ ఖండములోని ఓటర్లకు (చట్టము ననుసరించి) ఒక్క మెంబరు నెన్నుకోవలసినచో ఒకని నెన్నుకొనుటకున్ను, లేదా పలువుర నెన్నుకోవలసినచో పలువుర నెన్నుకొనుటకున్ను అధికార మున్నది. ఆఖండములో మెంబర్లుగా నెన్నుకోబడినవారికి ఆ ఖండములోని ఓట్లలో నధిక సంఖ్య రావలెను. వేరొకఖండములోని ఓట్లకో వారి కెట్టి ప్రసక్తియు లేదు. ఖండముకంటె చిన్నవిభాగము రిజిస్ట్రేషన్ విభాగము. ఒక ఎలక్షన్ ఖండములో ననేక రిజిస్ట్రేషన్‌భాగను లుండవచ్చును. రిజిస్ట్రేషన్ భాగ మనగా ఓటరుజాబితాలు ఏ ఏ ప్రదేశమున కంతకును ఒక్కపర్యాయము తయారుచేయబడి, తక్కిన ఓటరుజాబితాలకు వేరుగా నుంచబడునో, అట్టి స్థలవిభజన. ఒక్కొక్క ప్రదేశమును (అనగా పెద్ద పట్టణము కాని, అనేక గ్రామములనుకాని) వేరుగా తీసికొని అందులోని ఓటర్ల నందరను ఒకే పర్యాయము ఓటరు జాబితాలలో చేర్చుదురు. అది పూర్తియైన తర్వాత మరియొక రిజిస్ట్రేషన్‌విభాగములోని ఓటర్ల నందరను జాబితాలలో చేర్తురు. రాజమహేంద్రవరపు మునిసిపాలిటీ యొక్క రిజిస్ట్రేషన్ విభాగము. అందులోని ఓటర్ల పేర్లన్నియు నొక్కమారుగా జాబితాలలో చేర్చి యీ జాబితాలు, తక్కిన రిజిస్ట్రేషన్ విభాగములలోని జాబితాలకు, వేటాయింపుగా నుంచెదరు. అభ్యర్థులకు ఓట్లన్నియు నొక రిజిస్ట్రేషన్ ఖండమునుండియే రావలెనను నియమములేదు. కొన్ని

ఒక ఖండమునుండియు కొన్ని మరియొక ఖండమునుండియు రావచ్చును. అన్నిటి కంటె చిన్న చీలిక గ్రామసముదాయము. ఈ సముదాయము ఓటరు జాబితాలు తయారుచేయు నిమిత్తముగాక, ఓటర్లుగా చేరినవారు ఓట్లు వేయుటకు సదుపాయము కలిగించుటకై ఏర్పరుపబడినది. కొన్ని గ్రామముల నొక సముదాయముగా నేర్పరచి, వాని కొక కేంద్రస్థాన మేర్పరచి, ఆ గ్రామములవా రందరును ఆ కేంద్రస్థానమునకు వచ్చి ఓట్లు వేయవలసిన దని నిర్ధారణ చేయుదురు.]

రిజిస్ట్రేషన్ ఆఫీసరుగారి తరఫున వారి విధులున్ను, అధికారములున్ను నిర్వహించుటకు మరియొకరిని రిజిస్ట్రేషన్ ఆఫీసరుగారు నియమింపవచ్చును. అట్టి నిర్ణయము గవర్నరుగా రామోదింపవలెను. అ ట్లేర్పరచినవారు రిజిస్ట్రేషన్ ఆఫీసరుగారి విధులను నిర్వహింపవలెను.

5. ప్రతి రిజిస్ట్రేషన్ విభాగమున్ను పెక్కు గ్రామసముదాయముల క్రింద విభజింపవలెను. గవర్నరుగారిచ్చు సూచనలను గమనించుచు మద్రాసు పట్టణములో కార్పొరేషన్ కమీషనరుగారున్ను, తక్కిన భాగములో డివిజనల్ ఆఫీసర్లున్ను యీ విభజన జరుపవలెను.

ఓటర్లకు సదుపాయముగా నుండునట్లు గ్రామసముదాయముల నేర్పరుపవలెను. ఒక రిజిస్ట్రేషన్ విభాగములో వేరు వేరు తరగతుల సభ్యుల నెన్నుకొనవలసిన నో (ఉదా. జనరల్ సీటుకు సభ్యుని, మహమ్మదీయసీటుకు సభ్యుని) వేరు వేరు సీట్లకు సంబంధించినంతవరకు వేరు వేరు గ్రామసముదాయము నేర్పరుపవలెను.

6. (i) రిజిస్ట్రేషన్ భాగములో ఓటుహక్కున్నవా రందరినిగూర్చియు భోగట్టా చేసి వారి పేర్లన్నియు రిజిస్ట్రేషన్ ఆఫీసరు జాబితాలో వ్రాయవలెను. ఓటరు జాబితా తయారుచేయుచున్న వర్తమానము ఎల్లరకు తెలియునట్లు ప్రతిగ్రామము లోను, ప్రతి వార్డులోను (మునిసిపాలిటీలలో) టముకు వేయించవలెను. ఆ జాబితాలు గవర్నమెంటు నిర్ణయించిన మతలబు (ఫారము) ప్రకారము వ్రాసియుంచవలెను. అందులో ఓటుహక్కు స్వభావమున్ను తెలుపవలెను. స్త్రీల పేర్లకు గుర్తుగా "యస్"అను ఇంగ్లీషుఅక్షరము వ్రాయవలెను. చదువుకొన్న ఓటర్ల పేర్లకు గుర్తుగా "యల్" అను ఇంగ్లీషు అక్షరము వ్రాయవలెను.

(ii) సైనికుడు తనంతట పనిమానెనా లేక పనినుండి తొలగింపబడెనా అను సమస్య వచ్చినప్పుడు, షెడ్యూలులో తెలియజేసిన ఆయా అధికారుల నడిగి తెలిసికొనవలెను.

(iii) ఆదాయపుపన్ను విధింపబడిన కంపెనీలోని భాగస్వామి ఓటరుగా నుండ నర్హుడా కాడా యను సంశయము కలిగినచో, 2 వ మతలబుప్రకారము అర్హతాపత్రము తెచ్చినవారినే జాబితాలో చేర్పవలెను.

7. (1) ఈ నిరువ తెల్పిన యోగ్యతలలో దేని ననుసరించియైన ఓటరుగా చేరగోరువాడు 3 వ మతలబునుబట్టి ఒక దరఖాస్తు రిజిస్ట్రేషన్ ఆఫీసరు యెదుట స్వయముగా దాఖలుచేయవలెను. మరిన్ని ఆ యోగ్యత తెలుపు నాధారము కూడ ఆఫీసరునకు చూపవలెను.

దరఖాస్తుదారు ఆఫీసరుయెదుటకురాని ఘోషాస్త్రీ యైనచో ఆమె భర్త (లేక యింకొక బంధువు) ఆమెతరఫున ఆ దరఖాస్తు దాఖలుచేయవచ్చును. ఆ దరఖాస్తు వెనుక పీఠిని దాఖలుచేయువారు ఈ క్రిందివిధముగా వ్రాయవలెను.

ఇది నేను దాఖలుచేసిన దరఖాస్తు. ఇది వ్రాసిన స్త్రీ స్వయముగా దాఖలు చేయుటకు రాజాలనందున నే నామెతరఫున దాఖలు చేయుచున్నాను.

గ్రామం సంతకము

తారీఖు పూరా చిరునామా

యోగ్యతలు:—

(1) పన్ను సక్రమముగా చెల్లింపబడిన యింటి నద్దెకు పుచ్చుకొని ఒక్కడే సంవత్సరమంతయు నివసించినవాడు (6 వ అనుబంధము 2 వ భాగములోని 2 (5) నిబంధన చూ.)

(2) మలబారునకు సంబంధించినది.

(3) వెనుకటి ఫసలీ ఖండసుత్త కవులునుబట్టి, లేదా రిజిస్ట్రీ కవులునుబట్టి, యితరులభూమి భుక్తనుం దుంచుకొన్నవాడు. సాలీనా సిస్తు నగరఖండములలో రు. 100/-లకు, గ్రామఖండెములలో రు 50/-లకు తక్కువగా నుండరాదు. (6 వ అనుబంధము 2 వ భాగములోని 3 (4) నిబంధన చూ.)

(4) మైనర్లకు ఓటుహక్కు లుండినను వారికి యుక్తవయస్సు లేనికారణముచే ఓట్లజాబితాలో చేర్చుటకు వీలులేనప్పుడు ఆ మైనరుతరఫున వ్యవహరించు గార్డియనును ఓటరుగా చేర్పవలెను. (6 వ అనుబంధము 2 వ భాగములోని 5 వ నిబంధన చూ.)

(5) చదువుకొన్నవాడు ప్రతివాడును ఓటరుగా చేర నర్హుడు. (6-వ అనుబంధము 2 వ భాగములోని 6 వ నిబంధన చూ.)

(6) గవర్నమెంటు సేనలో పనిచేసి పింఛను పుచ్చుకొన్నవాని భార్య, (6 వ అనుబంధము 2వ భాగములోని 9 (2) నిబంధన చూ.)

(ii) ఈ దరఖాస్తులు దాఖలుచేయుటకు ప్రతి రిజిస్ట్రేషన్ విభాగములోను సదుపాయములగు చోట్లు రిజిస్ట్రేషన్ ఆఫీసరేర్పరుపవలెను. అవి యేతారీఖున పుచ్చుకొందురో నిర్ణయింపవలెను. ఈభోగట్టా ప్రజలకు వెల్లడియగునట్లు ప్రతిగవర్నమెంటు ఆఫీసులోని నోటీసుబోర్డులలోను ప్రచురణలంటించి, ప్రతి గ్రామములోను ఆఫీసరు టముకు వేయించవలెను.

(iii) పురుషుని భార్యగా ఓటరుజాబితాలో చేరుట కొక్క స్త్రీకి మాత్రమే అధికార మున్నది. పలువురు భార్యలున్న పురుషులు ఎవరిని ఓటరుగా చేర్పవలసినది నిర్ణయింపవలెను. పురుషుడు నిర్ణయించిన స్త్రీ పేరు జాబితాలో చేర్తురు. తక్కిన భార్యలపేర్లు చేర్పరు.

(iv) చదువుకొన్నందున ఓటరుగా చేరగోరువారు పై దరఖాస్తు రిజిస్ట్రేషన్ ఆఫీసరుసమక్షమున స్వదస్తూరీని వ్రాయవలెను. లేదా గ్రామమునసబు కాని, మరియొక అధికారిగాని తనఎదుట ఆఓటరు దరఖాస్తు వ్రాసినట్లు నిదర్శనపత్ర మిచ్చినచో దరఖాస్తు శాస్త్రవిహితము కాగలదు.

ఆఫీసరు ఎదుట దరఖాస్తు వ్రాసినగాని, నిదర్శనపత్రము చూపినగాని, ఓటరు చదువుకొనినవా డని నిశ్చయింపవలెను.

(v) రిజిస్ట్రేషన్ ఆఫీసర్లవద్దను, తహసీల్దార్ల వద్దను, డిప్యూటీ తహసీల్దార్లవద్దను, దరఖాస్తు అచ్చుమతలబులు ఉచితముగా దొరుకును.

(vi) పైదరఖాస్తుపై అట్టివారిని ఓటరుగా అంగీకరించుచు (లేదా నిరాకరించుచు) ఆఫీసరు ఉత్తరువు వేయవలెను. అట్లుత్తరువిచ్చుటకుముందు వలయు విచారణ చేయవలెను. పై నిబంధనలకు వ్యతిరేకముగా వ్రాసిన దరఖాస్తులు వెంటనే నిరాకరింపవచ్చును.

7. ఏ.

(1) వోటరుజాబితాలో పేరు చేర్చమని లేక చేరిన పేరు తీసివేయమనియు ఆక్షేపణలు యీ విధులననుసరించియే దాఖలుచేయవలెను. చేరవలసిన పేరు చేర్చలేదని, లేక చేర్చరాని పేరు చేర్చిరనియు ఏకోర్టులోనైన ఎట్టిదావాలోనైన వాదించుటకు వీలులేదు. అట్టి ఆక్షేపణచేయుచు, ఏకోర్టుచర్యయు జరుపరాదు.

(2) ఈవిధులననుసరించి జరిగిన ఎట్టిచర్యయు ఏకోర్టులోను ఆక్షేపించుటకు వీలులేదు.

(27-10-36 తేదీ ఫోర్టుసెంట్‌జార్జిగెజెట్ చూ)

8. (1) ఏఓటరు జాబితాలోనైన ఓటరుపేరు ఒక్కపర్యాయమే చేర్పవలెను. పెక్కుపర్యాయములు చేర్పరాదు.

(2) ఏ ఓటరునకైన ఓటుహక్కు రెండుమూడు ఎలక్షన్ ఖండములలో, లేక ఒక ఖండములోనే రెండుమూడు గ్రామములలో నున్నచో, ఆఓటరు సామాన్యముగా నెచ్చట నివసించునో ఆగ్రామజాబితాలో వానిపేరు చేర్పవలెను. మరియొక చోట చేర్పరాదు.

అట్టి ఓటరు దిగువ 12 (1) నిబంధన ననుసరించి పైచర్య కాక్షేపణ దాఖలు చేయవచ్చును. అట్టి ఆక్షేపణలో తనపేరు మరియొకఖండపు జాబితాలోగాని, మరియొక గ్రామ జాబితాలో గాని చేర్చుమని కోరవచ్చును. అట్టి యాక్షేపణ క్రమమైనదని ఆక్షేపణలు విచారించు నధికారి భావించినచో నతనిపేరు కోరినచోట వేసి, మొదటిచోట కొట్టివేయవలెను.

9. (1) పై 6 వ నిబంధన ననుసరించి తయారుచేసిన జాబితాలను బట్టియు, 7. (1) నిబంధన ప్రకారము దాఖలైన దరఖాస్తులను బట్టియు, చిత్తు జాబితాలను తయారుచేసి ఆఫీసులో (గవర్నరుగారు నియమించిన తేదీలోపుగా) ప్రచురింపవలెను. ఆ చిత్తుజాబితాలో పేర్లేవియు చేరనిచో ఖాళీజాబితాయే ప్రచురింపవలెను.

(ఆఫీసు అనగా రిజిస్ట్రేషన్ ఆఫీసు; ఆఫీస రనగా రిజిస్ట్రేషన్ ఆఫీసరు)

(2) ఆఫీసరీజాబితాలతోపాటు 4 వ ఫుతలబు ననుసరించి నోటీసులున్ను ప్రచురణ చేయవలెను. ఈ జాబితా లెక్కడ దొరకునో, ఏరోజులోపుగా ఆక్షేపణలు దాఖలు చేయవలెనో, ఏరోజున, ఏప్రదేశమున, పునర్విచారణ చేయునధికారి విచారణ జరుపునో, అను విషయము లా నోటీసులందు వ్యక్తపరుపవలెను.

10. (1) పై 9 (1) (2) నిబంధనల ననుసరించి తయారుచేసిన జాబితాలున్ను నోటీసులున్ను జిల్లా గెజెట్‌లో వీలైనంతత్వరలో ప్రచురింపవలెను.

(2) ఆయా రిజిస్ట్రేషన్ విభాగములకు సంబంధించిన ఓటరు జాబితాలు ఆయా రిజిస్ట్రేషన్ ఆఫీసులలో చూడగోరువారు చూచుటకును, కొనగోరువారు కొనుటకును అందుబాటుగా నుంచవలెను. మునిసిపాలిటీలకు సంబంధించిన జాబితాలు మునిసిపల్ ఆఫీసులలో నుంచవలెను. డివిజన్లకు సంబంధించిన జాబితాలు డివిజనల్ ఆఫీసులలోను, తహసీల్‌దార్ల ఆఫీసులలోను, డిప్యూటీ తహసీల్‌దార్ల ఆఫీసులలో నుంచవలెను. గ్రామసముదాయములకు సంబంధించిన జాబితాలు ఆగ్రామములలో నున్న గవర్నమెంటు ఆఫీసులలోను లేదా ఆగ్రామములలో నెల్లడిచోటను ప్రచురింప

వలెను. గ్రామములకు సంబంధించిన జాబితాలు గ్రామచావడిలో ప్రచురింపవలెను. ఆజాబితాలతోపాటు 4 వ మతలబు ప్రకారము వ్రాసిన నోటీసుకూడా ప్రచురింప వలెను.

(3) ఈజాబితాలు ప్రచురణకాబడిన వర్తమానము నలుగురికి తెలియునట్లుగా ప్రతివార్డులోను లేదా ప్రతి గ్రామములోను టముకువేయించవలెను.

11. (1) గవర్నరుగారు చిత్తుజాబితా ప్రచురణకు నియమించిన వ్యవధి పూర్తి కానిచో యీలోపుగాగాని, లేదా

(2) ఆవ్యవధి పూర్తియైనచో, గవర్నరుగారు తిరిగి యిచ్చిన గడులోపునగాని, రిజిస్ట్రేషన్ ఆఫీసరు సవరించిన చిత్తుజాబితా లేక చిత్తుజాబితా సవరింప కయే అదియు, సవరణలు జాబితాలోవ్రాసి ఆజాబితాయున్ను, ప్రచురింపవలెను.

## ఆక్షేపణలు

12. (1) తనకు ఓటుహక్కున్నను జాబితాలో తనపేరు చేర్చలేదని, లేదా చేర్పవలసినచోట చేర్చలేదని, లేదా తనపేరునకు సంబంధించిన తబిసీల్లు పొరపాటుగా వ్రాసినారనియు ఏ ఓటరైన ఆక్షేపణలు వ్రాసి పంపవచ్చును. ఇవి మొదటితరగతిలో చేరినవి. ఈ మొదటితరగతి ఆక్షేపణలు 5 వ మతలబుననుసరించి వ్రాయవలెను. జాబితాలో పేరు చేరియున్నవారు తమపేరు చేర్పరాదని, లేదా మరియొకరి పేరు చేర్పరాదనియు, నాక్షేపణలు వ్రాసి పంపవచ్చును. ఇవి రెండవతరగతిలోనివి. వీనిని 6 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. ఏ తేదీలోపుగా నివి రిజిస్ట్రేషన్ ఆఫీసరుకు చేరవలెనో గవర్నరుగారు నిర్ణయింతురు. ఇందు ఆక్షేపణకారణము పూర్తిగా తెలుపవలెను. ఆక్షేపణ కాధారములగు కాగితములన్నియు ఆక్షేపణతోపాటు రిజిస్ట్రేషన్ ఆఫీసరుకు పంపవలెను. అట్లు పంపుటకు సాధ్యముకానిచో కాగితములన్నియు పునర్విచారణాధికారియెదుట హాజరు పెట్టవలెను. గ్రామాదులలో యీఆక్షేపణ లన్నియు తహసీల్‌దార్లకు, లేక డిప్యూటీ తహసీల్‌దార్లకు పైతేదీలోపుగా పంపవచ్చును. ఆ ఆఫీసరులు ఆ ఆక్షేపణలున్ను వాని కాధారములగు కాగితములున్ను పుచ్చుకొని (ఆక్షేపణదారు వ్రాసిన విషయములు యథార్థములని అతనిచే ప్రమాణము చేయించి) వానిని రిజిస్ట్రేషన్ ఆఫీసరువద్దకు వెంటనే పంపవలెను.

(2) ఆక్షేపణదారు యీఆక్షేపణ స్వయముగా, లేక ప్రతినిధిద్వారా, లేక పోస్టుద్వారా పంపవచ్చును.

(3) నిర్ణీతదినము దాటినపిమ్మట దాఖలైన ఆక్షేపణలు మంజూరు చేయరు.

(4) పై 7 (1) నిబంధననుసరించి ఓటుహక్కున్నవారు (అనిబంధనలో తెల్పినరీతిగా) సకాలములో దరఖాస్తు పంపిననే కాని, తనపేరు జాబితాలో చేర్పలేదను నాక్షేపణ చేయరాదు.

(5) (5) (6) మతలబులు రిజిస్ట్రేషన్ ఆఫీసరుగారివద్దను; తహసీల్దార్ల వద్దను, డిప్యూటీ తహసీల్దార్ల వద్దను ఉచితముగా దొరకును.

13. మృతులైనవారిపేర్లు తనంతటతానే రిజిస్ట్రేషన్ ఆఫీసరు జాబితానుండి తీసివేయవచ్చును. వ్రాతపొరపాట్లు లెక్క పొరపాట్లున్ను సవరింపవచ్చును. తనంతటతానే జాబితాలో ఓటర్ల (హక్కున్నవారి) పేర్లు చేర్పవచ్చును; ఓటుహక్కు లేనివారి పేర్లు జాబితానుండి తొలగింపవచ్చును.

14. గవర్నరుగారు నిర్ణయించిన తేదీలోపుగా (1) తన ఆఫీసులోను, తహసీల్దార్ల, డిప్యూటీ తహసీల్దార్ల ఆఫీసులలోను, మునిసిపాలిటీలో ప్రతివార్డులోను, ప్రతి గ్రామసముదాయములో నొక వెల్లడిచోటను, సకాలములో దాఖలైన రెండు తరగతుల ఆక్షేపణలున్ను,

తాను స్వయముగా చేసిన సవరణలున్ను, 7వ మతలబు ననుసరించి రిజిస్ట్రేషన్ ఆఫీసరు వ్రాయించి, ప్రకటింపవలెను.

(2) ఎవరిపేరు చేర్చినందుల కాక్షేపణ చేయబడినదో వారికి నోటీసు చేయింపవలెను. వీలున్నచో తాను చేసిన మార్పులకు సంబంధించిన ఓటర్లకు ప్రత్యేకముగా నోటీసు చేయించవలెను.

పై రెండుబాపతు నోటీసులలో పునర్విచారణ సంఘము సమావేశమై ఆక్షేపణలు విచారించు చోటు, తారీఖు, వేళయు తెలుపవలెను.

15. రిజిస్ట్రేషన్ విభాగమున కొక్కొక పునర్విచారణసంఘ ముండవలెను. ఆసంఘమున కధ్యక్షుడు రిజిస్ట్రేషన్ ఆఫీసరు; అందులో తక్కినసభ్యు లిరువురను జిల్లా కలెక్టరు (గవర్నమెంటు ఉద్యోగులు కానివారిని) నియమించును.

ఈ యిరువురిలో నెవరైన విచారణకాలమందు హాజరు లేకపోయినచో వారి స్థానే వ్యవహరించుటకు కలెక్టరు మరికొందరను నియమింపవలెను.

కలెక్టరు ఉపాధ్యక్షుని కూడ నియమింపవచ్చును. మద్రాసు పట్టణములో ఉపాధ్యక్షునిపదవి కార్పొరేషన్ రివిన్యూ ఆఫీసరు కీయవలెను; డివిజన్లలో (డివిజనల్ ఆఫీసు ఏపట్టణములో నున్నదో అచ్చట పని చేయుచున్న) తహసీల్దారు కీయవలెను.

16. నిర్ణీతదినమున నిర్ణీతప్రదేశమున పై సంఘము సమావేశమై రోజునెంబడి రోజు ఆక్షేపణలు విచారింపవలెను. ప్రతి ఆక్షేపణకు సంబంధించిన విషయమంతయు తెలిసికొని, అందుపై వారితీర్పు వ్రాయవలెను. 1 వ తరగతి ఆక్షేపణలు నిరాకరించి నచో అందుకు కారణములున్ను, 2వ తరగతి ఆక్షేపణలలో ఎదురువాదము జరిగిన సందర్భములో చివరవారిచ్చు తీర్పునకు సబవులున్ను వ్రాయవలెను. రిజిస్ట్రేషన్ ఆఫీసరు చేసిన మార్పులు, సవరణలపై వారి అభిప్రాయములున్ను వెలిబుచ్చవలెను. ఈ సంఘములోనే సభ్యుడైన విచారణ రోజున రాకున్నచో కలెక్టరు వెంటనే అతనిస్థానే వ్యవహరించుటకు మరియొక సభ్యుని నియమింపవలెను. ఆ సంఘసభ్యులలో నభిప్రాయ భేదములు కలిగినప్పుడు అధికసంఖ్యాకుల అభిప్రాయమునుబట్టి సంఘమువారు నడుచు కొనవలెను. ఈసంఘ మిచ్చిన తీర్పులకు తిరుగులేదు.

## సాఫుజాబితాల ప్రకటన

18. రిజిస్ట్రేషన్ ఆఫీసరు పైసంఘమిచ్చిన తీర్పులనుబట్టి జాబితాలో మార్పులు చేయువలెను. అటుపై తయారైన సాఫుజాబితాలు రిజిస్ట్రేషన్ ఆఫీసులో ప్రకటింప వలెను. అట్టి ప్రకటన గవర్నరుగారు నియమించిన వ్యవధిలోపుననే జరుగవలెను. చిత్తు జాబితాలున్ను, అందులోని మార్పులకు పట్టీయున్ను వ్రాసి, అవి రెండున్ను సాఫు జాబితాకు బదులుగా ప్రకటింపవచ్చును. ప్రకటన జరిగిన పిమ్మట, మార్పుల పట్టీని కాని, లేక సాఫుజాబితా పూర్తిగాకాని జిల్లాగెజెట్‌లో ప్రచురింపవలెను. 10 (2) నిబంధనప్రకారము ప్రతి రిజిస్ట్రేషన్ విభాగమునకున్ను సంబంధించిన జాబితాలు చూడగోరువారి కందుబాటుగా నుండవలెను; మరిన్ని ఆయాప్రదేశములకు సంబంధించిన జాబితాలు ఆయా ఆఫీసులలో నంటింపించవలెను.

19. రిజిస్ట్రేషన్ విభాగమునకు సంబంధించిన జాబితాలలో రెండింటిపై రిజిస్ట్రేషన్ ఆఫీసరు సంతకము చేయవలెను. అందులో నొకటి ఆయన ఆఫీసులో నుంచవలెను; రెండవది ఆ ఎలక్షన్ ఖండము రిటర్నింగు ఆఫీసరువద్దకు పంపవలెను. (రిటర్నింగు ఆఫీసరు అనగా ఓట్లు పుచ్చుకొను అధికారి జిల్లాబోర్డుల, మునిసిపాలిటీల ఎలక్షన్‌లలో మనము ఎలక్షన్ ఆఫీసరుపేరుతో వ్యవహరించు నధికారిని రిటర్నింగు ఆఫీసరను పేరుతో నీసందర్భములో వ్యవహరింతుము.)

20. రిటర్నింగు ఆఫీసరు తన ఎలక్షన్ ఖండములో వేరువేరు విభాగములనుండి వచ్చిన జాబితాలన్నియు నొకచోట కూర్చి, ఎలక్షన్ ఖండమున కంతకును, ఒక్కటే ఓటరుజాబితా తయారుచేయును. వ్రాతపొరపాట్లు, లెక్కపొరపాట్లు యీసాఫు

జాబితాలో వచ్చినచో, వానిని సవరింపవలెను. జాబితాల అన్ని నకళ్లలోను అట్టి సవరణ జరుపవలెను.

21. చూడగోరువారికి చూపుటకును, కొనగోరువారి కమ్ముటకును, సాపు జాబితాలను నకళ్లు తీయించి రిజిస్ట్రేషన్ ఆఫీసులో నుంచవలెను. ఎలక్షన్ ఖండము నకు సంబంధించిన పూరా జాబితాల నకళ్లు రిటర్నింగు ఆఫీసరు కచేరీలో చూడగోరు వారికిన్ని, కొనగోరువారికిన్ని లభింపవలెను.

22. రిజిస్ట్రేషన్ ఆఫీసరు పంపవలసిన నోటీసులు ఆయా ఆసామీ లిచ్చిన చిరు నామాలకు పోస్టుద్వారా పంపిన చాలును; వారు చిరునామా లీయనిచో ఓటరు జాబి తాలలోనున్న చిరునామాలకు పంపిన చాలును; అదిన్ని లేనిచో వారు కడపట నివసిం చినచోటికి పంపిన చాలును.

23. గవర్నరు నియమించిన గడువులోపున జరుగవలసిన పనులు జరుగనిచో వ్యవధి ఎక్కువ యిచ్చుటకు గవర్నరున కధికార మున్నది.

24. ఓటరు జాబితాలలో క్రొత్తపేర్లు చేర్చుటకున్ను, వానిలోనుంచి తీసివేయ వలసిన పేర్లు తీసివేయుటకున్ను రిజిస్ట్రేషన్ ఆఫీసరుకు ఫలానితేదీలోపుగా నివేదన లంపుకొనవచ్చు నని గవర్నరు ప్రతిసాలున ప్రకటన జరుపవలెను. ఆ నివేదనలపై రిజిస్ట్రేషన్ ఆఫీసరు అభిప్రాయమిచ్చును; పై 12 నుండి 17 వరకున్న నిబంధనల ననుసరించి రిజిస్ట్రేషన్ ఆఫీసరు అభిప్రాయము లన్నియు పునర్విచారణ సంఘమువారు విమర్శించి వారి యభిప్రాయములను వెలిబుచ్చెదరు.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 1 వ మతలబు

———— ఎలక్షన్ ఖండమునకు సంబంధించిన ఓటరు జాబితా

రిజిస్ట్రేషన్ విభాగము..............................

గ్రామసముదాయము పేరు..............................

గ్రామసముదాయములో ఓట్లు పుచ్చుకొను కేంద్రస్థానము..............................

1 వరుస సంఖ్య..................

2 పేరు........................

3 తండ్రి లేక భర్తపేరు......................

4 చిరునామా (గ్రామము పేరు, లేక వీథిపేరున్ను, ఇంటినెంబరున్ను)

...........................................................

5 ఓటు హక్కు స్వభావము ...........................................................

## మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ

### 2వ మతలబు

...............వారు....................కంపెనీలో భాగస్వామి యని తెలియజేయుట కిది నిదర్శనము.............సంవత్సరములో ఆకంపెనీకి ఆదాయపు పన్ను విధించినారు. ఆదాయపు పన్ను విధి కేర్పరిచిన కనీసపు రాబడికంటె యీ భాగస్వామి వాటారాబడి మించియే యున్నది.

...............................

ఇన్కమ్‌టాక్సు ఆఫీసరు సంతకము.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 3వ మతలబు

.........................రిజిస్ట్రేషన్ విభాగమునకు ఆఫీసరుగా వ్యవహరించుచున్నవారికి.

...................పేరుకల్గిన నన్ను...................ఎలక్షన్ ఖండములో ...................రిజిస్ట్రేషన్ విభాగములో...........................గ్రామ సముదాయమునకు సంబంధించిన ఓటరు జాబితాలో చేర్పవలసినదని కోరుచున్నాను.

| ఓటరు పూరా పేరు | ఓటరు తండ్రి లేక భర్త పేరు; ఓటుహక్కు; మైనరు తరఫున గార్డియనైనచో మైనరు పేరు. | చిరునామా గ్రామం లేక వీధి ఇంటి నెంబరు. | ఓటుహక్కు స్వభావము | దరఖాస్తునకు ఆధారముగా దాఖలుచేసిన నిదర్శనము లెట్టివి. |
|---|---|---|---|---|
| | | | | |

చదువుకొనినవాడు ఓటరుగా చేర నపేక్షించినప్పుడు దాఖలు చేయవలసిన యోగ్యతాపత్రము

..... ......పేరు గల దరఖాస్తుదారు నా యెదుట స్వదస్తూరీని దరఖాస్తు వ్రాసె నని యిందుమూలముగా నే నీ యోగ్యతాపత్రము నిచ్చుచున్నాను.

............ప్రదేశము ......................

..............తేదీ (సంతకము)

......................

హోదా.

## మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ

## 4-వ మతలబు

ఎలక్షన్ ఖండము పేరు...............

1.............రిజిస్ట్రేషన్ విభాగమందలి...............తరగతి ఓటర్ల నిత్తుజాబితా యిందుతో ప్రకటించడ మైనది. ఆ జాబితా నకళ్లు............ఆఫీసులలో దొరుకును.

2. 1 వ తరగతి యాక్షేపణ లున్నవారు తమ పేరు చేర్పమనికాని జాబితాలో చేర్చినపేరు సవరింపమని గాని రిజిస్ట్రేషన్ ఆఫీసరుగారికి వ్రాసి నివేదన పంపవచ్చును.

3. 2 వ తరగతి యాక్షేపణ లున్నవారు తమ యాక్షేపణలు వ్రాసి రిజిస్ట్రేషన్ ఆఫీసరుకు పంపవచ్చును.

4. 1 వ తరగతి యాక్షేపణలు యీ దిగువ నుదాహరించిన 5 వ మతలబుప్రకారము వ్రాయవలెను. 2 వ తరగతి యాక్షేపణలు 6 వ మతలబు ప్రకారము వ్రాయవలెను. రిజిస్ట్రేషన్ ఆఫీసరున్ను, తహసీల్దార్లున్ను, డిప్యూటీ తహసీల్దార్లున్ను కోరినవారికి వలయు మతలబుల నుచితముగా నిచ్చెదరు.

5. 1, 2 తరగతుల ఆక్షేపణలు రిజిస్ట్రేషన్ ఆఫీసరుగారి యెదుటగాని, లేక తహసీల్దార్ల యెదుటగాని, లేక డిప్యూటీ తహసీల్దార్ల యెదుటగాని వారు ఆఫీసు పని చేయునప్పు డేవేళనైన దాఖలు చేయవచ్చును, లేదా వారికి పోస్టుద్వారా పంపవచ్చును. కాని అవి వారికి............తారీఖునకాని, ఆలోపుగా కాని చేరవలెను.

6. మతలబు ప్రకారము వ్రాయని ఆక్షేపణలున్ను, గడువుదాటిన పిమ్మట చేరినవియు, మంజూరుచేయరు.

7. పునర్విచారణ సంఘము సకాలములో దాఖలైనట్టియు మతలబు ప్రకారము వ్రాసిన యాక్షేపణలున్ను............(చోట)............తారీఖున విచారింతురు.

.........తారీఖు ..........................

రిజిస్ట్రేషన్ ఆఫీసరు.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 5-వ మతలబు

వ్రాత సవరణకొరకు లేదా / పేరు చేర్పునందుకు — ఆక్షేపణ (1 వ తరగతి)

............రిజిస్ట్రేషన్ విభాగపు పునర్విచారణ సంఘమునకు

అయ్యా,

............ఎలక్షన్ ఖండముయొక్క ఓటరు జాబితాలో నా పేరు సవరింపమని లేదా / నా పేరు చేర్చుమని నేను కోరుచున్నాను. సవరణ యీ క్రిింది విధముగా జరుగవలెను.

| ఆక్షేపణదారు పూరాపేరు, తండ్రి లేక భర్త పేరు. (1) | చిరునామా (గ్రామము లేక వీధి, యింటి నెంబరు) (2) | ఓటు హక్కు స్వభావము. (3) |
|---|---|---|
| | | |

నేను బ్రిటిషు సబ్జక్టువనియు, 21 సంవత్సరములు నాకు............తేదీకి నిండినవనియు, నేనీ ఎలక్షన్ ఖండములో విధ్యుక్తకాలము నివసించితిననియు తెలుపుచున్నాను.

.........తేదీ ..........................

ఆక్షేపణదారు సంతకము.

# మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

## 6 వ మ త ల బు

## 2–వ తరగతి ఆక్షేపణ

....................రిజిస్ట్రేషన్ విభాగపు పునర్విచారణ సంఘమునకు.

అయ్యా,

............................ఎలక్షన్ ఖండములో..................

....................రిజిస్ట్రేషన్ విభాగములో......................గ్రామసముదాయములో యీ దిగువ నుదహరించిన ఆసామీ పేరు చేర్పరాదని నే నధిక్షేపించుచున్నాను.

| ఎవరి పేరు చేర్చినందుల కాక్షేపణయో వారి పేరు (1) | చిత్తుజాబితాలో వారి నంబరు (2) | ఆక్షేపణ స్వభావము (3) |
|---|---|---|
| | | |

తేది............ ....................

ఆక్షేపణదారు సంతకము.

ఆక్షేపణదారు పేరుచేర్చిన గ్రామసముదాయము

....................................................

చిత్తుజాబితాలో ఆక్షేపణదారు నంబరు ............

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 7-వ మతలబు

### 1, 2 తరగతుల ఆక్షేపణల జాబితా

(1) ఈ దిగువ జాబితాలో నుదహరించినవారు తమ............పేర్లు ఖండపు ఓటరుజాబితాలలో చేర్చియుండలేదని (తమ పేరు సరిగా చేర్చియుండలేదని) ఆక్షేపణలు వ్రాసి పంపినారు.

| గ్రామసముదాయము (1) | ఆక్షేపణదారు పేరు. (2) | చిరునామా (3) | ఓటు హక్కు స్వభావం (4) |
|---|---|---|---|
| | | | |

(2)....................ఎలక్షన్ ఖండములో చేర్చిన యీ క్రింది ఆసామీల పేర్ల విషయమై ఆక్షేపణలు దాఖలైనవి.

| గ్రామసముదాయము (1) | ఆక్షేపణదారు పేరు జాబితాలో నంబరు (2) | ఎవరిపేరు చేర్చినందుల కాక్షేపణమో వారిపేరు, నంబరు (3) |
|---|---|---|
| | | |

(3)........................ఎలక్షన్ ఖండపు జాబితాలో యీ క్రింది దిద్దుబాట్లు రిజిస్ట్రేషన్ ఆఫీసరు తనంతటతానే చేసినాడు.

| గ్రామ సముదాయము | జాబితాలో నంబరు | చేసిన సవరణ |
|---|---|---|
| (1) | (2) | (3) |
| | | |

(4).......................ఎలక్షన్ ఖండపు జాబితాలలో యీ క్రింది ఆసాములపేర్లు రిజిస్ట్రేషన్ ఆఫీసరు తనంతటతానే చేర్చినాడు.

| గ్రామ సముదాయము | పేరు | తండ్రి పేరు | చిరునామా | ఓటుహక్కు స్వభావము |
|---|---|---|---|---|
| | | | | |

(5).......................ఎలక్షన్ ఖండపు జాబితానుండి యీ క్రింది పేర్లు రిజిస్ట్రేషన్ ఆఫీసరు తనంతటతానే తీసివేసినాడు.

| గ్రామ సముదాయము | జాబితాలో ఓటరు నంబరు | ఓటరు పేరు | పేరు తీసివేసినందుకు కారణము |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| | | | |

పై ఆక్షేపణలు, సవరణలు పునర్విచారణసంఘము................తేదీని ..................చోట విచారించును.

..............................

తేదీ............ రిజిస్ట్రేషన్ ఆఫీసరు సంతకము.

## 2 వ భాగము

### యూరపియనుల, భూస్వాముల ఆంగ్లో ఇండియన్ల ఖండములు.

నిబంధన.

1. ఈ భాగమునందలి నిబంధనలు భూస్వాముల, యూరపియనుల, ఆంగ్లో ఇండియనుల ఎలక్షన్ ఖండములకు సంబంధించినవి.

2. ఏ ఖండమునకాఖండమునకు ప్రత్యేకముగా ఓటర్ల జాబితా తయారుచేయవలెను. ఫలాని తేదీని ఓటుహక్కున్నవారందరను ఓటరుజాబితాలో చేర్చవలెనని గవర్నరుగారు నిర్ణయింతురు. తొలిసారి ఓట్లజాబితా తయారుచేయునప్పుడు, ఆ తేదీని ఓటుహక్కున్నవారి పేర్లన్నియు అందులో చేర్పవలెను. ఇదివరలోనే జాబితా తయారైయున్నచో, ఆ తేదీని ఓటుహక్కున్నవారి పేర్లు చేర్చియు, హక్కులేనివారి పేర్లు తీసివేసియు, జాబితా సవరింపవలెను. జాబితాలో నీక్రింది తఖసీళ్లు వ్రాయవలెను:

ఓటరుపేరు, తండ్రి లేక భర్తపేరు. చిరునామా. జాబితా 1 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. అందులో వేరువేరు రిజిస్ట్రేషన్ విభాగములకు వేరువేరు శాఖ లేర్పరుపవలెను. రిజిస్ట్రేషన్ విభాగములో గ్రామసముదాయమున కొక్కటిచొప్పున వేరువేరు చీలికలుగా విడదీయవలెను. ప్రతిచీలికకు గుర్తుగా నొకసంఖ్య నీయవలెను. గ్రామసముదాయములలోని ఓటర్ల పేర్లన్నియు అకారాదిగా వ్రాయవలెను. (గవర్నరుగారు 2-7-36 వ తేదీని ఓటుహక్కున్నవారి పేర్లు ఓటరు జాబితాలో చేర్పవలసినదని నిర్ణయించినారు. 16-6-36 వ తేదీ ఫోర్టుసెంట్‌జార్జిగెజెట్ 856 వ పుట చూ.)

3. ఒక వ్యక్తి యూరపియన్ లేక ఆంగ్లో ఇండియన్ ఔనా కాదా అని సందేహము రావచ్చును. అట్టి సందర్భములో ఆవ్యక్తి తాను యూరపియన్ అనియు, లేక ఆంగ్లోఇండియన్ అనియు వ్రాసి (అట్టి వ్రాత 2 లేక 3 వ మతలబు ననుసరించి వ్రాయవలెను) అట్టి వ్రాతపై ప్రెసిడెన్సీ మేజిస్ట్రీటు సమక్షముననగాని, లేక యే రెండవతరగతి మేజిస్ట్రీటు యెదుటగాని సంతకముచేసి దాఖలుచేసినచో, అతడాతరగతికి చెందినట్లే నిశ్చయింపవలెను.

4. ఓటరు జాబితా ఇంగ్లీషుభాషలో వ్రాయవలెను.

5. జిల్లాఅంతయు నొకే రిజిస్ట్రేషన్ విభాగముగా నేర్పరుతురు. ఆ జిల్లాకు రిజిస్ట్రేషన్ ఆఫీసరు జిల్లా కలెక్టరు. ఓట్లు పుచ్చుకొనుసందర్భములో కూడ జిల్లా

అంతయు నొకేవిభాగముగా పరిగణింతురు. కాని ఓట్లుపుచ్చుకొను నిమిత్తమై జిల్లాను పెక్కు భాగములుగా విభజించుటకు జిల్లాకలెక్టరున కధికార మున్నది.

కలెక్టరు తరఫున రిజిస్ట్రేషన్ ఆఫీసరు పని చేయుటకు మరియొక ఉద్యోగిని నియమింపవచ్చును. అట్టి నిర్ణయము గవర్నరుగా రంగీకరింపవలెను.

6. (1) రిజిస్ట్రేషన్ విభాగములోనున్న ఓటర్ల నందరి గూర్చియు భోగట్టాలు చేసి, ఓటుహక్కున్నవారి పేర్లన్నియు కలెక్టరు ఓటర్ల జాబితాలో చేర్పించవలెను. ఆ జాబితాలు గవర్నమెంటు నిర్ణయించిన మతలబు ననుసరించి వ్రాయవలెను. భూస్వాముల జాబితాలలో సరియైన ఆదాయము, పన్ను మొదలగువివరములు వ్రాయవలెను. యూరపియన్ల, ఆంగ్లోఇండియన్ల జాబితాలలో వారి కెట్టి ఓటుహక్కున్నదియు తెలుపవలెను. స్త్రీలపేర్లకు గుర్తుగా "యస్" అను ఇంగ్లీషు అక్షరము వ్రాయవలెను. యూరపియన్, ఆంగ్లోఇండియన్ ఓటర్లలో చదువుకొన్న ఓటర్ల పేర్ల కెదురుగా "యల్" అను ఇంగ్లీషు అక్షరము వ్రాయవలెను.

(2) ఆదాయపుపన్ను విధించిన కంపెనీలలో భాగస్వాములు ఓటర్లు చేర నర్హులైనది కానిది (4 వ మతలబు ప్రకారము వ్రాసిన) నిదర్శనపత్రము ననుసరించి నిర్ణయింపవలెను.

7. (1) యూరపియన్ లేక ఆంగ్లోఇండియన్ జాబితాలలో యీ దిగువహక్కులలో దేనినిబట్టి ఓటరుగా చేర నపేక్షించినను, ఆ వ్యక్తి 5 వ మతలబు ననుసరించి దరఖాస్తు వ్రాసి కలెక్టరు ఎదుట స్వయముగా దాఖలుచేయవలెను.

(i) పన్నులు సరిగా చెల్లించిన యింటిలో క్రితసంవత్సర మంతయు తా నొక్కడే అద్దెకుపుచ్చుకొని నివసించుట. (6 వ అనుబంధము 2 వ భాగములో నిబంధన చూ.)

(ii) మలబారుదేశమునకు సంబంధించినది.

(iii) వెనుకటి ఫసలీలో రిజిష్ట్రీ కవులునుబట్టి లేక ఖండ గుత్తకవులునుబట్టి భూమి స్వాధీనములో నుంచుకొన్నవాడు. సాలీనా కవులుసిస్తు పట్టణములలో రు. 100/-లకు గ్రామములలో రు. 50/-లకు తక్కువ కారాదు. (పై అనుబంధములోనే 3 (4) నిబంధన చూ.)

(iv) భూస్వామిగా మరియొకరితోపాటు జాయింటుగా నమోదైయున్నవాడు. (4 వ నిబంధన చూ.)

(v) ఓటుహక్కున్న మైనరుస్థానే ఓటరుగా చేరగోరిన గార్డియను. (5 వ నిబంధన చూ.)

(vi) చదువుకొన్నవాడు (6 వ నిబంధన చూ.)

(vii) సేనలో సిపాయిగా గాని ఉద్యోగిగా గాని పనిచేసి ఫించనుపుచ్చుకొన్న వాని భార్య.

(2) జిల్లాకలెక్టరు జిల్లాలో సదుపాయమగు ప్రదేశములు, రోజులు యేర్పాటు చేసి అచోట్ల, ఆయారోజులలో యూరపియన్, ఆంగ్లో ఇండియన్ ఓటర్ల దరఖాస్తులు దాఖలు చేయవచ్చునని ప్రకటింపవలెను.

(3) చదువుకొన్నవాడు దాఖలుచేసే దరఖాస్తు కలెక్టరుయెదుట వ్రాయవలెను' లేదా గ్రామోద్యోగి యెదుటగాని అంతకు పైయధికారియెదుటగాని దరఖాస్తు వ్రాసి' ఆవిధముగా వ్రాసినట్లు వారివల్ల నిదర్శనపత్రము పుచ్చుకొని, దరఖాస్తుతోపాటు దాఖలుచేయవలెను.

(4) 5 వ మతిలబు అచ్చునకళ్లు జిల్లాకలెక్టరు ఆఫీసులో నుచితముగా దొరకును'

(5) తలయు విచారణసలిపి, దరఖాస్తు సక్రమమైనదియు కానిదియు కలెక్టరు నిర్ధారణ చేయవలెను. పై నిబంధనలకు వ్యతిరేకముగా వ్రాసిన దరఖాస్తులు వెనువెంటనే కలెక్టరు నిరాకరింపవచ్చును.

8. (1) ఏ ఓటరుపేరును ఒకే భూస్వాముల ఖండములో చేరవలెను గాని, పెక్కు ఖండములలో చేరరాదు. ఒకే రిజిస్ట్రేషన్ విభాగములలో చేరవలెను గాని పెక్కు విభాగములలో చేరరాదు.

(2) రెండుమూడు భూస్వాముల ఖండములలో ఓటరుపేరు చేరియున్నచో, ఏ రిజిస్ట్రేషన్ ఆఫీసరుగాని అతనికి ఏఖండములో ఓటున్నదియు, ఏ జాబితాలో అతని పేరు చేర్పవలసినదియు తెలుపుమని అతనిని కోరవచ్చును. రెండుమూడు ఖండములలో ఓటున్నచో, ఏ ఖండములోని ఓటు భద్రపరుచుకొని తక్కినవి వదులుకొనుటకు అతనికి అంగీకారమో తెలుపుమని ఆతనిని కోరవలెను.

(3) ఒక ఓటరుపేరు రెండుమూడు రిజిస్ట్రేషన్ విభాగములలో చేరియున్నచో ఏ రిజిస్ట్రేషన్ ఆఫీసరుగాని అతనికి ఏ విభాగములో ఓటున్నదియు తెలుపుమనిగాని, రెండుమూడింటిలో ఓటు హక్కున్నచో ఏ విభాగములో నతడు ఓటరుగా చేరగోరునో తెలుపుమనిగాని, అతనిని కోరవచ్చును.

(4) పై (2) (3) నిబంధనల ప్రకారము రిజిస్ట్రేషన్ ఆఫీసరు వేసిన ప్రశ్నలకు ఆ ఓటరు జవాబీయనిచో అతని పేరు అన్ని జాబితాలలోనుండియు తప్పించవలెను.

9. (1) 6 వ నిబంధనప్రకారము తయారుచేసిన చిత్తు జాబితాలనుబట్టి, 7 (1) ప్రకారము దాఖలైన దరఖాస్తులనుబట్టి, చిత్తుజాబితాలు తయారుచేసి ఆ జాబితాలు (గవర్నరుగారు నియమించిన తేదీలోపుగా) రిజిస్ట్రేషన్ ఆఫీసులో ప్రచురింపవలెను. చిత్తుజాబితాలలో పేర్లేవియు చేరనిచో ఖాళీజాబితాయే ప్రచురింపవలెను.

(2) ఈ జాబితాలతోపాటు నోటీసులుకూడ ప్రకటింపవలెను. ఆ నోటీసులు 6 వ మతలబుననుసరించి వ్రాయవలెను. అందులో జాబితా లెక్కడ దొరకునో, ఏరోజులోపుగా ఆక్షేపణలు దాఖలుచేయవలెనో, ఏరోజున, ఏచోట అట్టి ఆక్షేపణలు విచారింతురో, అను విషయములను గూర్చి ఖోగట్టా నీయవలెను.

10. (1) వీలైనంతత్వరలో పై జాబితాలను, నోటీసులను జిల్లాగజెట్‌లో ప్రచురింపవలెను. ప్రతి రిజిస్ట్రేషన్ విభాగమునకు సంబంధించిన జాబితాలను ఆయా జిల్లా కలెక్టరు ఆఫీసులోను డివిజనల్ ఆఫీసులలోను, తహసీల్‌దార్ల ఆఫీసులలోను, డిప్యూటీ తహసీల్‌దార్ల ఆఫీసులలోను, నకళ్లు తీయించి యుంచవలెను. అట్టి నకళ్లు చూడగోరు వారికి చూచుటకును, కొనగోరువారికి కొనుటకును, అందుబాటుగా నుండవలెను. ఎలక్షన్ ఖండమునకు సంబంధించిన జాబితాలన్నియు రిటర్నింగు ఆఫీసరు (అనగా ఓట్లుపుచ్చుకొను అధికారి) ఆఫీసులో లభింపవలెను.

11. పై జాబితాలను మార్పుచేసి రిజిస్ట్రేషన్ ఆఫీసరు సవరించిన చిత్తుజాబితాలు ప్రచురింపవచ్చును. లేదా చిత్తుజాబితాలును, వానితోపాటు మార్పులన్నియు ఒక జాబితాగా వ్రాసి, ఆ జాబితాయైనను ప్రచురింపవచ్చును. ఈ ప్రచురణ గవర్నరు నియమించిన వ్యవధిలోపున జరుగవలెను. ఆవ్యవధి దాటిపోయి గవర్నరు క్రొత్తవ్యవధి కల్పించినచో, ఆ క్రొత్తవ్యవధిలోపున జరుగవలెను.

12. (1) తనకు ఓటుహక్కున్నను జాబితాలో పేరు చేర్చలేదని, లేదా చేర్ప వలసినచోట చేర్చలేదని, తన పేరునకు సంబంధించిన తబిసీళ్లు పొరపాటుగా వ్రాసిరని గాని ఏ ఓటరైన ఆక్షేపణలు వ్రాసి పంపవచ్చును. ఇవి మొదటితరగతిలో చేరినవి. వీనిని 7 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. జాబితాలో పేరుచేరియున్నవారు తమ పేరు చేర్పరాదని, లేదా మరియొకరిపేరు చేర్పరాదనియు ఆక్షేపణలు వ్రాసి పంప వచ్చును. ఇవి రెండవతరగతిలోనివి. వీనిని 8 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. ఇవి ఏ తేదీలోపుగా చేరవలెనో గవర్నరుగారు నిర్ణయింతురు. ఇందు ఆక్షేపణకారణము

పూర్తిగా తెలుపవలెను. ఆక్షేపణకు ఆధారమగు కాగితములన్నియు ఆక్షేపణతోపాటు కలెక్టరుగారికి పంపవలెను. అట్లు పంపుటకు సాధ్యముగానిచో కాగితము లన్నియు పునర్విచారణాధికారియెదుట దాఖలుచేయవలెను. గ్రామాగులలో యీ ఆక్షేపణ లన్నియు పై తేదీలోపుగా తహసీల్‌దార్లకు లేక డిప్యూటీ తహసీల్‌దార్లకు పంప వచ్చును. ఆ ఆఫీసరులు ఆక్షేపణలన్నియు వెంటనే జిల్లాకలెక్టరుకు పంపవలెను. అవి దాఖలు చేయువారిచే అందలి హంశము లన్నియు యథార్థమైనట్లు ప్రమాణముచేయించి, అట్లు ప్రమాణముచేయించిన నివేదికకూడ ఆ ఆఫీసరులు కలెక్టరుగారికి పంపవలెను.

(2) ఆక్షేపణలు స్వయముగా నీయవచ్చును, లేక ప్రతినిధిచేగాని పోస్టులో గాని పంపవచ్చును.

(3) నిర్ణీతగడువు దాటినతర్వాత దాఖలైన ఆక్షేపణలు మంజూరు చేయరు.

(4) పై 7 (1) నిబంధనప్రకారము హక్కున్నవాడు సకాలములో దరఖాస్తు పంపియుండిననే గాని, అట్టివాడు ఆక్షేపణ దాఖలుచేయుటకు అర్హుడు కాడు.

(5) 7, 8 మతలబులు కలెక్టరు ఆఫీసులోను, తహసీల్‌దార్లవద్దను, డిప్యూటీ తహసీల్‌దార్లవద్దను ఉచితముగా దొరకును.

13. కలెక్టరు తనంతటతానే జాబితానుండి మరణించినవారి పేర్లు తొలగింప వచ్చును. వ్రాతపొరపాట్లు, లెక్క పొరపాట్లు సవరింపవచ్చును. తనంతట తానే హక్కున్నవారి పేర్లు చేర్పవచ్చును; హక్కులేనిదే యిదివరలో చేరియున్నవారి పేర్లు తీసివేయవచ్చును.

14. రిజిస్ట్రేషన్ ఆఫీసరు (గవర్నరుగారు నిర్ణయించిన తేదీలోపుగా) సకాల ములో దాఖలైన ఆక్షేపణలను, తాను స్వయముగా చేసిన మార్పులను 9 వ మతలబు ననుసరించి వ్రాసి ప్రకటింపవలెను. మరియు ఎవరిపేర్లు చేర్పరాదని ఆక్షేపణలు దాఖలుకాబడినవో, వారికి ప్రత్యేకముగా నోటీసు చేయించవలెను. తాను చేసిన సవ రణలకు సంబంధించిన ఓటర్లకు, వీలునుబట్టి ప్రత్యేకపు నోటీసులు చేయించవలెను.

పై ప్రకటనలలోను, నోటీసులలోను పునర్విచారణాధికారి ఫలానిచోట, ఫలానిరోజున, ఫలాని గంటలవేళ ఆక్షేపణలు, సవరణలు విచారించునని తెలుపవలెను.

15. ఆయా జిల్లాకలెక్టరే ఆయా విభాగములకు పునర్విచారణాధికారిగా వ్యవహ రించును. నిర్ణీతదినమున కలెక్టరు ఆక్షేపణలు విమర్శించుట కారంభించి, అవి పూర్తి యగువరకు రోజువెంబడిరోజు పని సాగింపవలెను. ప్రతి ఆక్షేపణకు సంబంధించిన వర్తమాన మంతయు అడిగి తెలిసికొని, అందుపై తన తీర్పు వ్రాయవలెను. ఒకటత

తరగతి ఆక్షేపణలు నిరాకరించుపట్లను, రెండవ తరగతి ఆక్షేపణల కెదురువాద మున్న సందర్భములోను, తనతీర్పున కాధారమగు సబుబులుకూడా వ్రాయవలెను. తా నిదివరలో చేసిన సవరణలపై తన అంత్యాభిప్రాయము కూడ తెలుపవలెను. ఈ తీర్పులపై అపీలు లేదు.

16. పునర్విచారణాధికారి జరుపు విచారణలో ఆక్షేపణదారు (లేక అతనితరపున మరియొకవ్యక్తి) తనవాదము తెలుపవచ్చును. పార్టీలతరపున ప్లీడర్లుగాని లేదా మరి యొకరుగాని వారివారి వాదముల తెలుపవచ్చును.

17. పునర్విచారణాధికారి తీర్పులననుసరించి జాబితాలలో వలయు మార్పులను రిజిస్ట్రేషన్ ఆఫీసరు చేయవలెను.

18. ప్రతి రిజిస్ట్రేషన్ ఆఫీసరును తనకు సంబంధించిన రెండు సాఫు జాబితాలపై సంతకములుచేసి, ఒకటి తనవద్ద నుంచుకొని, రెండవది రిటర్నింగు ఆఫీసరుకు పంప వలెను.

19. రిటర్నింగు ఆఫీసరు అన్నివిభాగములనుండి వచ్చిన జాబితాలున్ను సమకూర్చి, ఎలక్షన్ ఖండమున కంతకును ఒకే జాబితా తయారుచేయవలెను. ఆ జాబితా ఫోర్టు సెంట్‌జార్జి గెజెట్‌లో (గవర్నరు నిర్ణయించిన తేదీలోపుగా) ప్రచురింపవలెను. సాఫు జాబితాలో వ్రాత పొరపాట్లున్నచో అవి రిటర్నింగు ఆఫీసరు సవరణచేయించి, ఆ సవరణలు నకళ్లన్నింటిలోను చేయునట్లు చూడవలెను.

20. పూరాజాబితా నకళ్లు రిజిస్ట్రేషన్ ఆఫీసులలోను, రిటర్నింగు ఆఫీసులలోను కొనగోరువారికి, చూడగోరువారికి అందుబాటుగా నుంచవలెను.

21. రిజిస్ట్రేషన్ ఆఫీసరు పంపవలసిన నోటీసులు ఆసామీలిచ్చిన చిరునామాలకు పోస్టులో పంపిన చాలును; వారు చిరునామా లీయనిచో జాబితాలో నున్న చిరునామా లకు పంపిన చాలును; అదియు సందర్భము కానిచో, ఓటరు కడపట నివసించినచోటికి పంపిన చాలును.

22. మొదట ఏకార్యమునకైన ఏర్పరిచిన వ్యవధి చాలనిచో, తిరుగ వ్యవధినిచ్చు టకు గవర్నరున కధికార మున్నది.

23. ఓటరు జాబితాలలో క్రొత్తపేర్లు చేర్చుటకును, తీసివేయవలసినవి తీసివేయుట కును, రిజిస్ట్రేషన్ ఆఫీసరుకు ఫలానా తేదీలోపుగా నివేదన వంపవచ్చునని గవర్నరు గారు ప్రతిసాలున ప్రకటింపవలెను. ఆ నివేదనపై రిజిస్ట్రేషన్ ఆఫీసరు మొదట అభి ప్రాయ మిచ్చును. పునర్విచారణాధికారి ఖాయపు తీర్పు చెప్పును.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

**1-వ మతలబు** (2-వ రూలు చూ.)

భూస్వాములు, యూరపియనుల, ఆంగ్లో ఇండియనుల.........కు సంబంధించిన ఎలక్షన్ ఖండము.

రిజిస్ట్రేషన్ విభాగము......................

గ్రామసముదాయము పేరు.....................

1. వరుససంఖ్య..........................

2. పేరు...................................

3. తండ్రి లేక భర్త పేరు......................

4. చిరునామా (గ్రామము పేరు లేక వీధి పేరున్ను యింటి నెంబరున్ను)...

5. ఓటుహక్కు స్వభావము...................

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

**2-వ మతలబు**

యూరపియన్ ఖండము

(3 వ నిబంధన చూ.)

యూరపియన్ దాఖలు చేయునది

.......................................(పేరు, వృత్తి, విలాసము)

అయిన నేను యీ క్రిందివిషయములు యథార్థము లని తెలియజేయుచున్నాను:—

(1) నా తండ్రి (తాత లేక మూలపురుషుడు) యూరపియన్ సంతతివాడు.

(2) నేను భారతీయుడను కాను. నా పూర్వీకులు హిందూదేశములోనైన, బర్మాలోనైన నివసించియున్నను, అందెచ్చటను స్థిరనివాస మేర్పరుచుకొని యుండ లేదు.

......................

తేదీ............ సంతకము.

ఈ కాగితము............తేదీని పై ఆసామీచే స్వయముగా నా యెదుట దాఖలు చేయబడినది.

......................

మేజిస్ట్రేటు.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 3-వ మతలబు

ఆంగ్లోయిండియన్ ఖండము

(3-వ రూలు చూ.)

### ఆంగ్లో ఇండియను దాఖలు చేయునది

..........................................(పేరు, వృత్తి,విలాసము)
అయిన నేను యీ క్రిందివిషయములు యథార్థము లని తెలియజేయుచున్నాను:—

(1) నా తండ్రి (లేక తాత లేక మూలపురుషుడు) యూరపియన్ సంతతివాడు.

(2) నేను భారతదేశీయుడను. నా పూర్వీకులు హిందూదేశములోనైన బర్మాలోనైన నివసించియుండి, అందు స్థిరనివాస మేర్పరుచుకొన్నారు.

తేదీ.........  ........................

సంతకము.

ఈ కాగితము............తేదీని పై ఆసామిచే స్వయముగా నా యెదుట దాఖలు చేయబడినది.

..........................

మేజిస్ట్రేటు.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 4 వ మ త ల బు

యూరపియను, ఆంగ్లో-ఇండియను ఖండము.

....................వారు....................కంపెనీలో భాగస్వామి యని తెలియజేయుట కిది నిదర్శనము............సంవత్సరములో ఆ కంపెనీకి ఆదాయపుపన్ను విధించినారు. ఆదాయపుపన్ను విధి కేర్పరిచిన కనీసపు రాబడికంటె, యీ భాగస్వామి వాటారాబడి మించియే యున్నది.

..............................

ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు సంతకము.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 5 వ మతలబు

భూస్వాముల, యూరపియనుల, ఆంగ్లో-ఇండియనుల ఖండము.

......................రిజిస్ట్రేషన్ విభాగపు రిజిస్ట్రేషన్ ఆఫీసరుగారికి.

అయ్యా,

.....................ఖండమును చెందిన.....................

గ్రామసముదాయపు ఓట్ల జాబితాలో నా పేరు చేర్పవలసిన దని యిందుమూలముగా కోరుచున్నాను.

.......................

సంతకం.

| పేరు | తండ్రిలేక భర్త పేరు గార్డియనుగా నున్నందున ఓటు హక్కు వచ్చినయెడల మైనరు పేరు | చిరునామా (గ్రామము పేరు, లేక వీధిపేరున్ను ఇంటి నెంబరున్ను) | ఓటుహక్కు స్వభావము | దరఖాస్తును బలపర్చుచు దాఖలుచేసిన కాగితములు |
|---|---|---|---|---|
| | | | | |

చదువుకొన్నందువలన ఓటుహక్కునకు దరఖాస్తు పెట్టినప్పుడే యీ నిదర్శనపత్రమును నింపవలెను

ఈ పై దరఖాస్తుదారు............నా యెదుట యీ దరఖాస్తును స్వదస్తూరీని వ్రాసెనని నే నీ నిదర్శనపత్ర మిచ్చుచున్నాను.

..........................

తేదీ.........

సంతకం.

ఉద్యోగస్థునియొక్క హోదా.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 6-వ మతలబు

భూస్వాముల, యూరపియనుల, ఆంగ్లో ఇండియనుల............ఖండము.

ఖండము పేరు..................................

1..................రిజిస్ట్రేషన్ విభాగపు చిత్తుజాబితాలు ప్రకటించడమైనది. అవి ఆఫీసులలో దొరుకును.

2. పేరు చేర్పించుకొనుటకు హక్కున్నవారు చేర్పవలసినదని కోరవచ్చును. తప్పుచోట లేక తప్పు తపసీళ్లతో పేరు వ్రాసియున్నచో, అవి సవరణ చేయమని కోరవచ్చును. అట్టి ఆక్షేపణలు వ్రాసి పునర్విచారణాధికారికి దాఖలు చేయవచ్చును.

3. పేరు చేరియున్నవాడు తన పేరు చేర్పరాదని, లేక మరియొకరి పేరు చేర్పరాదనియు, ఆక్షేపణ వ్రాసి పునర్విచారణాధికారికి దాఖలు చేయవచ్చును.

4. పై 2 వ పేరాలో ఆక్షేపణలు 7 వ మతలబు ననుసరించి, 3 వ పేరాలో ఆక్షేపణలు 8 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. ఆ మతలబు నకళ్లు రిజిస్ట్రేషన్ ఆఫీసరున్ను, తహసీల్దార్లున్ను, డిప్యూటీ తహసీల్దార్లున్ను కోరినవారికి ఉచితముగా నిత్తురు.

5. ఆక్షేపణలు రిజిస్ట్రేషన్ ఆఫీసరు యెదుట దాఖలుచేయవచ్చును. గ్రామాదులలో తహసీల్దార్లకు, డిప్యూటీ తహసీల్దార్లకు దాఖలు చేయవచ్చును. అవి... .........తేదీని కాని ఆలోపుగా కాని ఆఫీసు గంటలనడుమ దాఖలు చేయవలెను.

6. మతలబుల ననుసరించి వ్రాయని ఆక్షేపణలు పుచ్చుకొనరు. కాలాతీతమైన పిదప ఆక్షేపణలు పుచ్చుకొనరు.

7. మిగతా ఆక్షేపణలు పునర్విచారణాధికారి............తేదీని......... గంటల వేళ............ప్రదేశములో విచారించును.

తేదీ.........                ............................

రిజిస్ట్రేషన్ ఆఫీసరు సంతకము.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 7-వ మతలబు

భూస్వాముల, యూరపియనుల, ఆంగ్లో ఇండియనుల.........ఖండము.

పై 6 వ మతలబు 2 వ పేరాలో నుదాహరించిన ఆక్షేపణపత్రము

.........................రిజిస్ట్రేషన్ విభాగపు పునర్విచారణాధికారికి

అయ్యా,

..................ఖండము లోని..................గ్రామసముదాయమునకు చెందిన ఓటరు జాబితాలో యీ క్రిందివిధముగా

నా పేరు సవరణ చేయుటకు / నా పేరు చేర్చుటకు యీ ఆక్షేపణ దాఖలు చేయుచున్నాను.

| ఆక్షేపణదారు పేరు తండ్రి లేక భర్త పేరు (1) | చిరునామా గ్రామము పేరు లేక వీధిపేరు ఇంటి నెంబరున్ను (2) | నివసించుచున్న, నివసించుచున్న యింటియొక్క సంవత్సరపు టాదాయము, లేక తనభూమి వలన సాలీనాసిస్తు, లేక సాలీనా నికరాదాయము (3) |
|---|---|---|
| | | |

నేను బ్రిటిషు సబ్జక్టు ననియు, నాకు............తేదీని 21-వ యేడు నిండినదనియు, నిర్ణీతకాలము నేను ఖండములో నివసించితి ననియు, యిందుమూలముగా తెలుపుచున్నాను.

..........................

తేదీ............ ఆక్షేపణదారు సంతకం.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 8 వ మ త ల బు

భూస్వాముల, యూరపియనుల, ఆంగ్లో-ఇండియనుల ఖండము.

పై 6 వ మతలబు, 3 వ పేరాలో తెల్పిన ఆక్షేపణ

......................గ్రామసముదాయపు పునర్విచారణాధికారికి.

అయ్యా,

..................ఖండములోని..................రిజిస్ట్రేషన్ విభాగమునకు చెందిన గ్రామసముదాయపు ఓట్ల జాబితాలో యీ క్రింది ఆసామీ పేరు చేర్చరాదని నే నాక్షేపించుచున్నాను.

| ఎవరి పేరు చేర్చుట కాక్షేపణ? (1) | చిత్తు జాబితాలో నెంబరు. (2) | ఆక్షేపణ స్వభావము అందు కాధారముగా దఖలుచేసిన కాగితములు. (3) |
|---|---|---|
| | | |

తేదీ.........

చిరునామా......

............గ్రామసముదాయము.

............చిత్తు జాబితాలో సంఖ్య.

........................

ఆక్షేపణదారు సంతకం.

## మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీ

### 9—వ మతలబు

భూస్వాముల, యూరపియనుల, ఆంగ్లో ఇండియనుల.........ఖండము.

### ఆక్షేపణల పట్టీ

(అ)...............ఖండమునకు చెందిన ఓట్లజాబితాలో తమ్ము ఓటర్లగా రిజిస్టరు చేయుమని (లేక రిజిస్ట్రీయయిన పేరుల సవరణ చేయుమని) యీ క్రింది ఆసాములు ఆక్షేపణలు దాఖలు చేసినారు.

| గ్రామసముదాయము. | హక్కుదారుని పేరు. | చిరునామా. | ఓటుహక్కు స్వభావము |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| | | | |

(ఆ)..................ఖండమునకు చెందిన జాబితాలో యీ క్రింది ఆసాముల పేర్లు చేర్చినందుల కాక్షేపణలు దాఖలైనవి.

| గ్రామసముదాయము. | ఆక్షేపణదారు పేరు జాబితాలో సంఖ్య | ఎవరి పేరున కాక్షేపణయో వారి పేరుసంఖ్య. |
|---|---|---|
| (1) | (2) | (3) |
| | | |

(ఇ)....................ఖండమునకు చెందిన జాబితాలో రిజిస్ట్రేషన్ ఆఫీసరు తనంతటతానే యీ క్రింది సవరణలు చేసెను.

| గ్రామసముదాయము. | జాబితాలో సంఖ్య | సవరణస్వభావము. |
|---|---|---|
| (1) | (2) | (3) |
| | | |

(ఈ).....................ఖండమునకు చెందిన జాబితాలో రిజిస్ట్రేషన్ ఆఫీసరు తనంతటతానే యీ క్రింది మార్పులను చేసెను.

| గ్రామసముదాయం. | పేరు. | తండ్రి లేక గార్డియన్ పేరు | చిరునామా. | హక్కునుగూర్చి తబిసీళ్లు. |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| | | | | |

(ఉ).........................ఖండమునకు చెందిన జాబితానుండి యీ దిగువ నిచ్చిన పేర్లు రిజిస్ట్రేషన్ ఆఫీసరు తనంతటతానే తొలగించెను.

| గ్రామ సముదాయము | జాబితాలో ఓటరు సంఖ్య | ఓటరు పేరు | రద్దు చేసినందుకు కారణములు |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| | | | |

.................తారీఖున.........................స్థలమునందు పునర్విచారణాధికారి పై నుదహరించిన ఆక్షేపణలను విచారించును. రిజిస్ట్రేషన్ ఆఫీసరు జేసిన సవరణలు, మార్పులను గూర్చి తన అభిప్రాయము తెలిబుచ్చును.

.............................

తేదీ............ రిజిస్ట్రేషన్ ఆఫీసరు సంతకము.

## తూర్పుగోదావరిజిల్లాలో అజ్ఞానస్థితిలోని జాతులు

**1.** కోయలు, **2.** కొండరెడ్లు, **3.** కొండదొరలు, **4.** కొండకాపులు, **5.** మాలలు, **6.** కమ్మరులు, **7.** మాదిగలు, **8.** గడబాలు.

## ఓటరు జాబితాలు భద్రపరుచుట- అందుకు సంబంధించిన నిబంధనలు:—

**1.** చిత్తు జాబితాలున్ను, సాఫు జాబితాలున్ను, ఆక్షేపణ జాబితాలున్ను ఎలక్షన్ ఖండమునకు క్రొత్తజాబితాలు తయారగువరకు భద్రపరిచియుంచి, ఆ వెనుక కాల్చివేయవలెను.

ఎలక్షన్ పూర్తియైనవెనుక ఆ కాగితము లన్నియు రిటర్నింగు ఆఫీసరువద్దకు పంపవలెను. వాళమొందించువరకు వానిని ఆయన ఆఫీసులో జాగ్రత్తపెట్టవలెను.

**2.** రుసుములు చెల్లించినవారికి పై కాగితములలో వేనినైన పబ్లికునకళ్లు తయారు చేయించి యీయవలెను.

**3.** ఈ కాగితములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరము లన్నియు రిటర్నింగు ఆఫీసరు ఉత్తరవులననుసరించి జరుపవలెను.

---

# మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఓటరుజాబితాలు తయారుచేయు విధానము

---

## యూరపియన్ ఎలక్షను ఖండములు మినహా మిగతా ఎలక్షను ఖండములకు సంబంధించిన నిబంధనలు

నిబంధన

1. యూరపియన్ ఎలక్షన్ ఖండములు మినహా తక్కిన ఎలక్షన్ ఖండములలో ఓటరు జాబితాల కీనిబంధన లమలులో పెట్టవలెను.

2. (1) ఏ ఖండమున కాఖండమున కొక ఓటరు జాబితా తయారు చేయవలెను. ఫలాని తేదీని ఓటు హక్కున్నవా రందరును ఓటరు జాబితాలో చేర నర్హు లని గవర్నరుగారు నిర్ణయింతురు. (గవర్నరుగారు 2-7-36 వ తేదీని ఓటు హక్కున్న వారిని జాబితాలలో చేర్పవలసినదని నిర్ణయించినారు. 16-6-1936 వ తేదీ ఫోర్టుసెంట్ జార్జిగెజెట్ 856 వ పుట చూ.) తొలిసారి ఓటరు జాబితా తయారు చేయునప్పుడు ఆ తేదీని ఓటర్లుగా నున్నవారి పేర్లన్నియు జాబితాలో చేర్చవలెను. ఇదివరలోనే జాబితా తయారై యున్నచో, ఆ తేదీని ఓటుహక్కున్నవారి పేర్లుచేర్చియు, హక్కు లేనివారి పేర్లు తొలగించియు, జాబితా సవరింపవలెను. జాబితాలో నీ క్రింది తబిసీళ్లు వ్రాయవలెను:

ఓటరుపేరు, తండ్రి లేక భర్తపేరు, ఓటరు చిరునామా, జాబితా 1 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. అందులో వేరు వేరు రిజిస్ట్రేషన్ విభాగములకు వేరు వేరు శాఖ లేర్పరుపవలెను. రిజిస్ట్రేషన్ విభాగమును వేరు వేరు గ్రామసముదాయములుగా విడదీయవలెను. తాలూకాలోని గ్రామసముదాయములు వరుసగా వ్రాయవలెను. గ్రామసముదాయములోని ఓటర్లపేర్లన్నియు ఒకేజాబితాలో వ్రాయవలెను. గ్రామములను విడదీసి అకారాదిగా నమర్చవలెను. గ్రామములోని ఓటర్లపేర్లు అకారాదిగా వ్రాయవలెను. మునిసిపాలిటీలలో ఏవార్డున కావార్డునకు వేరుగా ఓటరు జాబితాలు తయారుచేయవలెను.

(2) ఆంగ్లో ఇండియన్ ఓటర్లపేర్లు ఎలక్షన్ ఖండపు ఓటరు జాబితాలలో వేరేశాఖయందు చేర్చవలెను.

3. ఓటరుజాబితాలు వాడుకభాషలో వ్రాయవలెను. గవర్నరు ఏ ఓటరు జాబితాగాని, అందులో భాగముకాని మరియొకభాషలోకూడ వ్రాయమని ఆజ్ఞాపింపవచ్చును.

4. (1) మద్రాసుపట్టణ మంతయు నొకే రిజిస్ట్రేషన్ విభాగము. మునిసిపాలిటీలున్నూ, రివిన్యూ డివిజన్లున్నూ (మునిసిపాలిటీలోని ఓటర్లు మినహా) ప్రత్యేకవిభాగముగా నేర్పర్చినారు.

(2) మద్రాసు పట్టణపు రిజిస్ట్రేషన్ ఆఫీసరు కార్పొరేషన్ కమీషనరు; మునిసిపాలిటీలకు ఆయామునిసిపాలిటీ కమీషనరు లేక మేనేజరు; డివిజన్లకు డివిజనల్ ఆఫీసరు (డిప్యూటీకలెక్టరు లేక సబ్ కలెక్టరు.)

(3) రిజిస్ట్రేషన్ ఆఫీసరు తరపున వారిస్థానే మరియొకడు వ్యవహరింపవచ్చును. ఆ ఏర్పాటు గవర్నరుగా రామోదింపవలెను.

5. రిజిస్ట్రేషన్ విభాగమును పెక్కు గ్రామసముదాయములుగా విభజింపవలెను. ఈ విభజన మద్రాసు పట్టణములో కార్పొరేషన్ కమీషనరుగారున్నూ, తక్కిన డివిన్లలో డివిజనల్ ఆఫీసరు (డిప్యూటీ కలెక్టరు లేక సబ్ కలెక్టరు)న్నూ చేయవలెను. వారీసందర్భములలో గవర్నరుగా రిచ్చు సూచనల ననుసరింపవలెను.

ఓటర్లకు సదుపాయ మగునట్లు గ్రామసముదాయము లేర్పరుపవలెను. ఒకే రిజిస్ట్రేషన్ విభాగములో వేరు వేరు తరగతుల సభ్యుల నెన్నుకోవలసి వచ్చినచో (జనరల్ సీటు సభ్యుని, యూరపియన్ సీటు సభ్యుని) వేరు సీట్లకు వేరు గ్రామసముదాయముల నేర్పరుపవలెను.

6. (1) రిజిస్ట్రేషన్ విభాగములో ఓటుహక్కున్నవారి పేర్లన్నియు భోగట్టా చేసి తెలిసికొని ఓటరుజాబితాలో చేర్చవలసిన పూచీ రిజిస్ట్రేషన్ ఆఫీసరుది. మునిసిపాలిటీలలో ప్రతివార్డులోను, గ్రామాదులలో ప్రతి గ్రామములోను ఓటరు జాబితా తయారగుచున్న సంగతి ఎల్లవారికి తెలియునట్లు టముకువేయించవలెను. జాబితాలు గవర్నమెంటు నిర్ణయించిన మతలబుననుసరించి వ్రాయవలెను. ప్రతి ఓటురు ఓటుహక్కుస్వభావ మెట్టిదో తెలుపవలెను. స్త్రీల పేర్ల కెదురుగా "యస్" అను ఇంగ్లీషు అక్షరము వ్రాయవలెను.

(2) ఆదాయపు పన్ను విధించిన కంపెనీలలో భాగస్వాములు ఓటర్లుగా చేర నర్హులైనది కానిది (2 వ మతలబుప్రకారము వ్రాసిన) నిదర్శనపత్రమునుబట్టి నిర్ణయింపవలెను.

7. (1) ఎలక్షన్ ఖండములో ఓటరుపేరు ఒక్కచోటనే ఒక్కసారి మాత్రమే వ్రాయవలెను.

(2) ఏ ఓటరునకైన రెండు మూడు ఖండములలో ఓట్లున్నచో, లేదా ఒక ఖండములోనే రెండు మూడు గ్రామములలో ఓటున్నచో, ఆ ఓటరు సామాన్యముగా నెచ్చట నివసించునో ఆ గ్రామపు ఓటరు జాబితాలో వానిపేరు చేర్పవలెను. మరి యెచ్చటను చేర్పరాదు. అట్టి ఓటరు 12 (1) రూలు ననుసరించి పైచర్య నాక్షేపణ చేయవచ్చును. తనపేరు మరొక ఖండములోగాని జాబితాలోగాని చేర్పుమని కోర వచ్చును. పునర్విచారణాధికారి పై యాక్షేపణ సక్రమమని తలచినచో, అతడు కోరిన చోట పేరువేసి మొదటిచోట కొట్టివేయవలెను.

7. ఏ (1) ఓటరుజాబితాలో పేరు చేర్చుమని లేక చేరినపేరు తీసివేయమనియు ఆక్షేపణలు యీ విధుల ననుసరించియే దాఖలుచేయవలెను. చేరవలసినపేరు చేర్చ లేదని, లేక చేర్చరానిపేరు చేర్చిరనియు ఏకోర్టులోనైన ఎట్టిదావాలోనైన వాదించు టకు వీలులేదు. అట్టి ఆక్షేపణచేయుచు ఏ కోర్టుచర్యయు జరుపరాదు.

(2) ఈ విధుల ననుసరించి జరిగిన ఎట్టిచర్యయు ఏకోర్టులోను ఆక్షేపించుటకు వీలులేదు.

(27-10-1936 తేదీ ఫోర్టుసెంట్ జార్జిగజెట్ చూ.)

8. ఒకపురుషునికి పెక్కుభార్య లున్నను అతనిభార్యగా ఓటరుజాబితాలో ఒక స్త్రీ పేరే చేర్తురు. ఎవరిపేరు చేర్పవలసినదో నిర్ణయించు నధికారము భర్తదే.

9. (1) 6 వ రూలుప్రకారము తయారుచేసిన జాబితానుబట్టి చిత్తుజాబితాలు తయారుచేసి రిజిస్ట్రేషన్ ఆఫీసరు వానిని తన ఆఫీసులో ప్రకటింపవలెను. ఆప్రకటన గవర్నరు నిర్ణయించిన తేదీలోపుగా జరుపవలెను.

(2) ఈ జాబితాలతోపాటు నోటీసులును ప్రకటింపవలెను. అవి 3 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. ఆ నోటీసులలో జాబితా లెక్కడ దొరుకునో, ఏరోజు లోపుగా నాక్షేపణలు దాఖలు చేయవలెనో, ఏరోజున, ఏచోట ఆక్షేపణలు విచా రింతురో అను విషయముల గూర్చి భోగట్టా నీయవలెను.

10. (1) వీలైనంత త్వరలో పై జాబితాలున్ను, నోటీసులున్ను జిల్లాగజెట్‌లో ప్రకటింపవలెను.

(2) ప్రతి రిజిస్ట్రేషన్ భాగమునకు సంబంధించిన జాబితాలు చూపుటకును, అమ్ముటకును సిద్ధముచేసి యుంచవలెను. మునిసిపాలిటీ జాబితాలు మునిసిపల్

ఆఫీసులో నుంచవలెను. తక్కినవి డివిజనల్ ఆఫీసులోను, తాహసీల్దార్ల, డిప్యూటీ తహసీల్దార్ల ఆఫీసులలోను ఉంచవలెను. ప్రతిగ్రామసముదాయమునకు సంబంధించిన జాబితాలు అచ్చటనున్న గవర్నమెంటు ఆఫీసులలో ప్రకటింపవలెను. గ్రామమునకు సంబంధించిన జాబితాలు గ్రామసావడిలో నంటించవలెను. ఈ జాబితాలతో పాటు 3 వ మతలబునుబట్టి వ్రాసిన నోటీసులుకూడ ప్రకటింపవలెను.

11. రిజిస్ట్రేషన్ ఆఫీసరు జాబితాలలో మార్పుచేసి క్రొత్త చిత్తుజాబితాలు ప్రకటింపవచ్చును; లేదా చిత్తుజాబితాలు వేరుగాను, మార్పులపట్టీలు వేరుగాను ప్రకటింపవచ్చును. ఈ ప్రకటన గవర్నరు నియమించిన గడువులోపుగా జరుపవలెను. ఆ గడువు దాటిపోయినందున గవర్నరు క్రొత్తగా గడువిచ్చినచో ఆ క్రొత్తగడువు లోపుగా జరుపవచ్చును.

12. (1) ఏ ఆసామీయైన తనకు ఓటుహక్కున్నను జాబితాలో పేరుచేర్చలేదని, లేదా చేర్చవలసినచోట చేర్చలేదని, తన పేరునకు సంబంధించిన తబిసీళ్లు పొరపాటుగా వ్రాసిరనికాని లిఖితరూపముగా ఆక్షేపణలు పంపవచ్చును. ఇవి మొదటితరగతిలో చేరినవి. వీనిని 4 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. జాబితాలో పేరుచేరియున్న వారు తమపేరు చేర్పరాదని, లేదా మరియొకరిపేరు చేర్పరాదనియు ఆక్షేపణలు వ్రాసిపంపవచ్చును. ఇవి రెండవతరగతిలోనివి. వీనిని 5 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. ఇవి ఏ తేదీలోపుగా రిజిస్ట్రేషన్ ఆఫీసరుకు చేరవలెనో గవర్నరుగారు నిర్ణయింతురు. ఇందు ఆక్షేపణకారణము పూర్తిగా తెలుపవలెను. ఆక్షేపణ కాధారమగు కాగితములన్నియు ఆక్షేపణతోపాటు రిజిస్ట్రేషన్ ఆఫీసరుకు పంపవలెను. అట్లు పంపుట సాధ్యముకానిచో కాగితము లన్నియు పునర్విచారణాధికారియెదుట కనబర్చవలెను. గ్రామాదులలో నీ యాక్షేపణలన్నియు పై తేదీలోపుగా తహసీల్దార్లకు, డిప్యూటీ తహసీల్దార్లకు పంపవచ్చును. ఆ ఆఫీసర్లు వెంటనే ఆక్షేపణలన్నియు రిజిస్ట్రేషన్ ఆఫీసరువద్దకు పంపవలెను. అవి దాఖలుచేయువారిచే అందులోని హంశములన్నియు యథార్థమైనట్లు ప్రమాణము చేయించి అట్లు ప్రమాణము చేయించిన నివేదిక కూడ ఆ ఆఫీసర్లు రిజిస్ట్రేషన్ ఆఫీసరువద్దకు పంపవలెను.

(2) ఆక్షేపణలు స్వయముగా నీయవచ్చును లేదా ప్రతినిధిద్వారాగాని, పోస్టులోగాని పంపవచ్చును.

(3) నిర్ణీతదినము దాటినతర్వాత దాఖలైన ఆక్షేపణలు మంజూరుచేయరు.

(4) 4, 5 మతలబులు రిజిస్ట్రేషన్ ఆఫీసులోను, తహసీల్దార్లవద్దను, డిప్యూటీ తహసీల్దార్లవద్దను ఉచితముగా దొరకును.

13. రిజిస్ట్రేషన్ ఆఫీసరు తనంతటతానే జాబితాలనుండి మరణించినవారి పేర్లు తొలగింపవచ్చును: వ్రాతపొరపాట్లు, లెక్క పొరపాట్లు సవరింపవచ్చును. తనంతట తానే హక్కున్నవారిపేర్లు చేర్పవచ్చును. హక్కులేనిదే యిదివరకు చేరియున్నవారి పేర్లు తీసివేయవచ్చును.

14. రిజిస్ట్రేషన్ ఆఫీసరు సకాలములో దాఖలైన ఆక్షేపణలున్ను, తాను స్వయముగా చేసిన మార్పులున్ను, 6 వ మతలబు ననుసరించి వ్రాసి తన ఆఫీసులోను, తహసీల్దార్ల డిప్యూటీ తహసీల్దార్ల ఆఫీసులలోను, మునిసిపాలిటీలో ప్రతివార్డులోను, గ్రామసముదాయములలో జెల్లడిచోట్లను గవర్నరుగారు నియమించిన తేదీలోగా ప్రకటింపవలెను. ఎవరెవరిపేర్లు చేర్చరాదని ఆక్షేపణలు దాఖలయ్యెనో వారికి ఆక్షేపణల నకళ్లు తీయించి పంపవలెను. తాను చేసిన సవరణలకు సంబంధించిన ఓటర్లకు వీలైనచో ప్రత్యేకముగా నోటీసులు చేయించవలెను. ఈ పై ప్రకటనలలోను, నోటీసులలోను పునర్విచారణ ఫలానిచోట, ఫలానిరోజున, ఫలాని గంటలవేళ జరుగుననియు తెలుపవలెను.

15. పునర్విచారణసంఘమున కధ్యక్షుడు రిజిస్ట్రేషన్ ఆఫీసరు. వానితోపాటు మరి యిద్దరు సభ్యులుకూడి సంఘముగా నేర్పడుదురు. గవర్నమెంటు ఉద్యోగులు కానివారిని యీ సంఘసభ్యులుగా జిల్లాకలెక్టరు నియమింపవలెను. వీ రిరువురిలో నెవరైన విచారణకాలమందు హాజరులేకపోయినచో, వారిస్థానే వ్యవహరించుటకు మరి కొందరు సభ్యులను కలెక్టరు నియమింపవలెను. ఈ సంఘమునకు ఉపాధ్యక్షుని కూడ కలెక్టరు నియమింపవచ్చును. మద్రాసు పట్టణములో ఆపదవి కార్పొరేషన్ రివిన్యూ ఆఫీసరున కీయవలెను. డివిజన్లలో కేంద్రస్థానములో పనిచేయుచున్న తహసీల్దారున కీయవలెను.

16. నిర్ణీతదినమున, నిర్ణీతప్రదేశములో సంఘమువారు సమావేశమై, రోజువెంబడి రోజు ఆక్షేపణ లన్నియు విచారించువరకును పనిసాగింపవలెను. ప్రతి ఆక్షేపణకు సంబంధించిన భోగట్టా అంతయు నడిగితెలిసికొని అందుపై వారితీర్పు వ్రాయవలెను. ఒకటవ తరగతి ఆక్షేపణలు నిరాకరించినచో అందుకు సబబులున్ను, రెండవ తరగతి ఆక్షేపణలకు వారువాదము జరిగినచో, వారి తీర్పున కాధారములగు కారణములున్ను, వ్రాయవలెను. రిజిస్ట్రేషన్ ఆఫీసరు చేసినమార్పులు, సవరణలపై వారి అభిప్రాయము తీయవలెను. ఈ సంఘములోనే సభ్యుడైన విచారణరోజున రాకున్నచో కలెక్టరు వెంటనే అతనిస్థానే వ్యవహరించుటకు మరియొక సభ్యుని నియమింపవలెను. ఆసంఘ సభ్యులలో అభిప్రాయభేదము కలిగినప్పుడు ఎక్కువమంది ఏ అభిప్రాయ మిస్తురో

ఆప్రకారము తీర్పుజరుగును. ఈ ఖండమువారు చేసిన తీర్పులపై అపీలులేదు. ఆ తీర్పులకు తిరుగులేదు.

17. పునర్విచారణసంఘము జరుపు విచారణకు సంబంధించిన ఆక్షేపణదారు గాని, మరి యే యితరవ్యక్తిగాని, తనవాదము తెలుపవచ్చును. అట్టివారి తరఫున ప్లీడరుగాని లేదా మరియొక ప్రతినిధిగాని వారివారి వాదములు తెలుపవచ్చును.

18. పునర్విచారణసంఘము తీర్పుల ననుసరించి జాబితాలో వలయు మార్పులను రిజిస్ట్రేషన్ ఆఫీసరు చేయవలెను. గవర్నరు నియమించిన తేదీలోపుగా సాపు జాబితాలు రిజిస్ట్రేషన్ ఆఫీసరు ప్రచురింపవలెను, లేదా చిత్తు జాబితాలును, మార్పుల పట్టీలున్ను ప్రచురింపవలెను. వీలయినంతత్వరలో మార్పులపట్టీలు (అవకాశమున్నచో పూరాజాబితా) జిల్లా గెజెట్‌లో ప్రకటింపవలెను. 10 (2) వ రూలులో చెప్పిన ప్రకారము సాపుజాబితాలు ప్రకటింపవలెను, చూడగోరువారికి చూపవలెను.

19. తన రిజిస్ట్రేషన్ భాగమునకు సంబంధించిన రెండు సాపుజాబితాలపై రిజిస్ట్రేషన్ ఆఫీసరు సంతకము చేయవలెను. ఒకటి తన ఆఫీసులో నుంచుకోవలెను, రెండవది రిటర్నింగుఆఫీసరుకు పంపవలెను.

20. రిటర్నింగు ఆఫీసరు అన్నిభాగములనుండివచ్చిన జాబితాలు సమకూర్చి, ఖండమున కంతకు నొకేజాబితా తయారుచేయవలెను. సాపుజాబితాలో వ్రాతపొరపాట్లున్నచో ఆ పొరపాట్లు నకళ్లన్నింటిలోను ఆఫీసరు సవరణ చేయవలెను.

21. రిజిస్ట్రేషన్ ఆఫీసులో ఆవిభాగమునకు సంబంధించిన సాపుజాబితాలు చూడగోరువారికిని, కొనగోరువారికిని అందుబాటుగా నుంచవలెను. రిటర్నింగు ఆఫీసరు కచేరీలో అన్నిభాగములకు సంబంధించిన జాబితాలు చూడగోరువారికిని, కొనగోరువారికిని అందుబాటుగా నుంచవలెను.

22. రిజిస్ట్రేషన్ ఆఫీసరు పంపవలసిన నోటీసులు ఆయా ఆసాములిచ్చిన చిరునామాలకు పోస్టులోపంపిన చాలును. వారు చిరునామా లీయనిచో జాబితాలో నున్న చిరునామాలకు పంపిన చాలును. అదియు సందర్భముకానిచో ఓటరు కడపట నివసించిన చోటికి పంపిన చాలును.

23. మొదట ఏకార్యమునకైన ఏర్పరిచిన వ్యవధి చాలనిచో, తిరిగి వ్యవధినిచ్చుటకు గవర్నరున కధికార మున్నది.

24. ఓటరు జాబితాలలో క్రొత్తపేర్లు చేర్చుటకును, తీసివేయవలసినవి తీసివేయుటకును, రిజిస్ట్రేషన్ ఆఫీసరుకు ఫలానా తేదీలోగా నివేదన నంపుకొనవచ్చునని గవర్నరు ప్రతిసాలున ప్రకటింపవలెను. ఆ నివేదనలపై రిజిస్ట్రేషన్ ఆఫీసరు మొదట అభిప్రాయ మిచ్చును. పునర్విచారణాధికారి ఖాయపుతీర్పు చెప్పును.

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్

### 1-వ మతలబు

....................భాగము..........................ఖండపు ఓటరు జాబితా.

రిజిస్ట్రేషన్ విభాగము సెక్షన్ — గ్రామసముదాయము సంఖ్య — గ్రామసముదాయములో ఓట్లువేయు కేంద్రస్థానము

1. వరుస సంఖ్య............
2. పేరు...................
3. తండ్రి లేక భర్త పేరు............
4. చిరునామా (గ్రామము లేక..............................
   వీధి పేరున్ను, యింటినెంబరున్ను)..............................
5. ఓటుహక్కు స్వభావము..............................

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్

### 2-వ మతలబు

..........................వారు..............................కంపెనీలో భాగస్వాము లని తెలియజేయుటకు ఇది నిదర్శనము..............................సంవత్సరములో ఆకంపెనీకి ఆదాయపు పన్ను విధించినారు. ఆదాయపు పన్ను విధి కేర్పరిచిన కనీసపు రాబడికంటె యీభాగస్వామి వాటారాబడి మించియే యున్నది.

..............................

ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు సంతకము

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్

### 3-వ మతలబు

భూస్వాముల యూరపియనుల ఆంగ్లోఇండియనుల ఖండము.

................................రిజిస్ట్రేషన్ విభాగపు రిజిస్ట్రేషన్

ఆఫీసరుగారికి

అయ్యా,

........................ఖండమునకు చెందిన..............

గ్రామసముదాయపు ఓట్లజాబితాలో

నా పేరు చేర్పవలసిన దని యిందుమూలముగా కోరుచున్నాను.

| పేరు (1) | తండ్రి లేక భర్త పేరు గార్డియనుగా నున్నందున ఓటుహక్కు వచ్చిన యెడల మైనరు పేరు (2) | చిరునామా (గ్రామము పేరు లేక వీధి పేరున్ను, యింటినెం. రున్ను) (3) | ఓటు హక్కు స్వభావము (4) | దరఖాస్తును బలపరచుచు దాఖలు చేసిన కాగితములు (5) |
|---|---|---|---|---|
| | | | | |

చదువుకొన్నందువలన ఓటుహక్కునకు దరఖాస్తు పెట్టినప్పుడే యీ నిదర్శనపత్రము నింపవలెను.

ఈ పై దరఖాస్తుదారు..................నా యెదుట యీ దరఖాస్తును స్వదస్తూరీని వ్రాసె నని నేను నీ నిదర్శనపత్రము నిచ్చుచున్నాను.

సంతకం

ఉద్యోగస్థునియొక్క హోదా.

## మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్

### 4-వ మతలబు

భూస్వాముల యూరపియనుల ఆంగ్లోఇండియనుల ఖండము.

### మొదటితరగతి ఆక్షేపణలపత్రము

(12 (1) నిబంధన చూ.)

............................రిజిస్ట్రేషన్ విభాగపు పునర్విచారణాధికారికి

అయ్యా,

........................ఖండములోని........................

చెందిన ఓటరుజాబితాలో యీ క్రిందివిధముగా $\frac{\text{నా పేరు సవరణచేయుటకు}}{\text{నా పేరు చేర్పుటకు}}$ యీ ఆక్షేపణ దాఖలు చేయుచున్నాను.

| ఆక్షేపణదారుని పేరు, తండ్రి లేక భర్త పేరు (1) | చిరునామా (గ్రామము పేరు లేక వీథి పేరును, యింటి నంబరును) (2) | నివసించుచున్న యింటియొక్క సంవత్సరపు టాదాయము లేక తనభూమి యొక్క సాలీనా సిస్తు (3) |
|---|---|---|
| | | |

నేను బ్రిటిషు సబ్జక్టు ననియు, నాకు............తేదీని 21 వ యేడు నిండిన దనియు, నిర్ణీతకాలము నేను ఖండములో నివసించితి ననియు, నిందుమూలముగా తెల్పుచున్నాను.

తేదీ............ ........................

ఆక్షేపణదారు సంతకం

## మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు

### 5 వ మతలబు

భూస్వాముల, యూరపియనుల ఆంగ్లో-ఇండియనుల ఖండము.

### రెండవ తరగతి

ఆక్షేపణపత్రము (12 (1) నిబంధన చూ.)

......................గ్రామసముదాయపు పునర్విచారణాధికారికి.

అయ్యా,

..................ఖండములోని..................రిజిస్ట్రేషన్ విభాగమునకు చెందిన గ్రామసముదాయపు ఓట్ల జాబితాలో యీ క్రింది ఆసామీ పేరు చేర్పరాదని నే నాక్షేపించుచున్నాను.

| ఎవరి పేరు చేర్చుట కాక్షేపణ ? (1) | చిత్తుజాబితాలో నెంబరు (2) | ఆక్షేపణ స్వభావము (3) |
|---|---|---|
| | | |

తేదీ............ ..........................

చిరునామా................ ఆక్షేపణదారు సంతకము.

గ్రామసముదాయము

......................చిత్తుజాబితాలో సంఖ్య.

# మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు

## 9 వ మతలబు

భూస్వాముల, యూరపియనుల ఆంగ్లో-ఇండియనుల ఖండము.

## ఆక్షేపణల పట్టీ

(అ)..................ఖండమునకు చెందిన ఓట్లజాబితాలో తమ్ము ఓటర్లగా రిజిష్టరు చేర్పుమని (లేక రిజిస్ట్రీ అయిన పేర్ల సవరణ చేయుమని) యీ క్రింది ఆసామీలు ఆక్షేపణలు దాఖలు చేసినారు.

| గ్రామసముదాయము (1) | హక్కుదారుని పేరు (2) | చిరునామా (3) | ఓటుహక్కు స్వభావము (4) |
|---|---|---|---|
| | | | |

(ఆ)........................ఖండమునకు చెందిన జాబితాలో యీ క్రింది ఆసామీల పేర్లు చేర్చినందుల కాక్షేపణలు దాఖలైనవి.

| గ్రామసముదాయము (1) | ఆక్షేపణదారు పేరు జాబితాలో సంఖ్య (2) | ఎవరి పేరున కాక్షేపణమో వారి పేరు, సంఖ్య (3) |
|---|---|---|
| | | |

(ఇ)........................ఖండమునకు చెందిన జాబితాలో రిజిస్ట్రేషను ఆఫీసరు తనంతటతానే యీ క్రింది సవరణలు చేసెను.

| గ్రామసముదాయము | జాబితాలో సంఖ్య | సవరణస్వభావము |
|---|---|---|
| (1) | (2) | (3) |
| | | |

(ఈ)......................ఖండమునకు చెందిన జాబితాలో రిజిస్ట్రేషన్ ఆఫీసరు తనంతటతానే యీ క్రింది మార్పులను చేసెను.

| గ్రామసముదాయములు | పేరు | తండ్రి లేక గార్డియను పేరు | చిరునామా | హక్కునుగూర్చి తెలిసినవి |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| | | | | |

## ఎలక్షన్ కమీషనర్ల తీర్పులు ఖండించుటకు హైకోర్టున కెట్టి యధికార మున్నది?

---

1936 ఆల్ ఇండియా రిపోర్టరు (మద్రాసు) 105 బర్ను, మీనను న్యాయమూర్తులు

10 వ రూలులో తెలిపిన ఎలక్షన్ నేరములుకాని, అక్రమచర్యలు కాని జరిగిన ట్లభిప్రాయము నీయకయే కమీషనరు ఎలక్షన్ (లోకల్ బోర్డు) రద్దుచేసెను. గెలుపొందిన అభ్యర్థిని పదవిహీనుని చేసెను. ఎదిరిపార్టీలలో నొకడు (అభ్యర్థులలో నొకడు) ఎలక్షన్ రద్దుపర్చుట కంగీకరించెను. కమీషనరు (నేరము లేక అక్రమచర్య జరిగినట్లు వ్రాయకయే) పై ఒప్పుదలపై నాధారపడి ఎలక్షన్ రద్దుపరచి, ఆక్షేపణదారు విజయుడైనట్లు తీర్పుచేసెను. ఆక్షేపణదారు మెంబరుగా నెన్నబడుటకు అనర్హుడని రుజువు చేయుటకు గెలుపొందిన అభ్యర్థికి అవకాశ మీయలేదు.

హైకోర్టుజడ్జీలు కమీషనరు తీర్పు ఖండించి, కేసు క్రిందికోర్టుకు పంపినారు.

ఈ కేసు పర్యవసాన మిది. 10 వ రూలులో తెల్పిన నేరములు లేక అక్రమచర్యలు జరిగిన వని కమీషనరు అభిప్రాయమును వెలిబుచ్చిననే కాని, అతనికి ఎన్నిక రద్దుచేయుట కధికారము లేదు.

66. మద్రాసు లా జర్నలు 367—బీస్లీ (ప్రధానన్యాయమూర్తి) కార్నిష్ వెల్ (న్యాయమూర్తి)

ఈ కేసు తిన్నవేలి జిల్లాబోర్డు తిరుచందూరు ఎన్నికలకు సంబంధించినది. ఆ సర్కిలులో అనేక ఘోషాస్త్రీలు ఓటర్లుగా నుండిరి. స్త్రీల ఓట్లు పుచ్చుకొనునిమిత్తమై ప్రత్యేకపు ఓట్ల ఆఫీసు లేర్పరిచిరి. ఈ ఆఫీసులలో ఓట్లు పుచ్చుకొనునిమిత్తము స్త్రీలనే ఓట్ల ఆఫీసర్లుగా నియమించిరి. ఎన్నికలకు మూడురోజులు ముందు ఎలక్షన్ ఆఫీసరు "స్త్రీ ఓటర్ల నానవాలు పట్టుటకై ముసుగుతీయవలసిన దని అభ్యర్థులు కాని, అభ్యర్థుల తరఫు స్త్రీ ఏజంట్లు కాని, కోరినచో తీయవలెను" అని నోటీసు వ్రాసిపంపెను. ఒక అభ్యర్థి ఆ ఓట్ల ఆఫీసులోనికి వెళ్లి కూర్చొని, ఓట్లు వేయుటకు వచ్చిన ఘోషాస్త్రీలను ముసుగుతీసి తనకు ముఖము కనపర్చవలసిన దని కోరుచుండెను. ఆ ఓట్ల ఆఫీసులో ఒకస్త్రీయే ఓటువేసెను. ఆ అభ్యర్థి

చివరకు విజయముపొందెను. ఆక్షేపణదారు పిటిషన్‌లో నీ క్రిందివిధముగా వ్రాసెను. "ఎలక్షన్ ఆఫీసరు పంపిన నోటీసు క్రమవిరుద్ధము. గెల్పొందిన అభ్యర్థి ఓట్ల ఆఫీసులో కూర్చొని స్త్రీ ఓటర్లను ముసుగుతీసి మొగము తనకు చూపమని కోరుటచే, స్త్రీ ఓటర్లు వచ్చి ఓట్లు వేయలేదు. అందువల్ల ఆక్షేపణదారునకు నష్టము వచ్చినది. కాబట్టి గెలుపొందిన అభ్యర్థి ఎన్నిక రద్దుపర్చవలెను." ఆ పిటిషన్‌పై కమీషనరు ఎన్నిక రద్దు పర్చి, క్రొత్త ఎన్నిక జరుగవలసిన దని శాసించెను.

ఈ కేసు మొదట జడ్జి రామేశంగారు విచారించి గెల్పొందిన అభ్యర్థి నడవడి శాస్త్రవిరుద్ధము కాదనియు, కమీషన రిచ్చిన తీర్పు తప్పనియు నభిప్రాయ మిచ్చిరి. రామేశంగారి తీర్పుపై, పైయిద్దరు జడ్జీలకు అపీలుచేసిరి.

ఎలక్షన్ ఆఫీసరు పంపిన నోటీసు సక్రమమైనదని న్యాయమూర్తు లభిప్రాయ పడిరి. అభ్యర్థి ఓట్లఆఫీసులో హాజరుండి, ఓటర్ల నానవాలుపట్టి, ఓటర్ల పేరుతో పైవారు వచ్చి ఓటువేయకుండ జాగ్రత్తపడుటకు హక్కున్నది. అట్టి సందర్భములలో నభ్యర్థి ఓటర్లముఖము చూడవలెనని కోరుట శాస్త్రవిరుద్ధము కాదు. ఘోషాస్త్రీలు ముసుగుతో వచ్చి ఓటువేసి వెళ్లినచో, ఓటర్లే వచ్చి ఓటు వేయుచున్నారో, పైవారు వేయుచున్నారో తెలిసికొనుటకు అభ్యర్థికి సావకాశ ముండదు. కాబట్టి కమీషనరు పడిన అభిప్రాయము తప్పనియు, రామేశంగారి తీర్పు సరియైనదనియు, పై యిద్దరు న్యాయమూర్తులున్ను అభిప్రాయపడిరి.

## 66 మద్రాసు లాజర్నలు 468.

## కర్గన్వెన్, వాల్షు న్యాయమూర్తులు.

ఎలక్షన్ కమీషనరు తీర్పులు న్యాయవిరుద్ధములైనచో వానిని ఖండించుటకు హైకోర్టున కధికార మున్నది.

1. (3) రూలులో కమీషనరు కోర్టుగా వ్యవహరించుట లేదని తెలిపినంత మాత్రముచే, అతడు జరుపు విచారణాస్వభావ మేమియు మార్పుకాలేదు. దావాల విచారణకు కమీషనరు జరుపు విచారణకు విశేష సాపత్య మున్నది. కమీషనరు తన కున్న హక్కుల నతిక్రమించి నడుచుచుండెనని హైకోర్టువారికి నమ్మకము కల్గినచో, వా రాతని తీర్పులు రద్దుపర్చవచ్చును.

## 58. మద్రాసు లాజర్నలు. 118—కర్గన్వెన్ న్యాయమూర్తి.

మునిసిపల్ చైర్మన్ ఎలక్షన్ ఆఫీసరుగా వ్యవహరించుచు, ఓట్లులెక్క తప్పుగా బెట్టెను కారణముచే వేలూరు సబ్జడ్జిగారివద్ద ఎలక్షన్ పిటిషన్లు దాఖలు కాబడెను;

సబ్‌జడ్జి తిరిగి లెక్క పెట్టించగా మొదట గెల్పొందిన యిర్వురు పదవిహీనులైరి; ఓడిపోయిన యిర్వురు విజయులైరి.

ఆక్షేపణదారు దాఖలుచేసిన పిటిషన్‌పై పైచర్య పుచ్చుకొనుటకు సబ్‌జడ్జికి అధికార మున్నది.

## 57. మద్రాసు లాజర్నల్ 241 (ఫుల్ బెంచి)

కూట్సుట్రాటరు (ప్రధానన్యాయమూర్తి) వాలేసు, అనంతకృష్ణయ్యరు, న్యాయమూర్తులు.

1, 11 నిబంధనల పకారము దాఖలుచేసిన ఎలక్షన్ పిటిషన్‌లో గెలుపొందిన అభ్యర్థి మునిసిపాలిటీ ఆక్టు 48, 49, 50 సెక్షన్ల ననుసరించి మెంబరుగా పనిచేయుట కనర్హుం డనియు, ఆ కారణముచే నతని యెన్నిక రద్దుపర్చవలె ననియు కోరవచ్చును. ఈ కేసులో గెలుపొందిన అభ్యర్థి సైదాపేట బెంచికోర్టులో మేజిస్ట్రీటుపని చేయుచున్నందున అతని నెన్నుకోరాదని ఆక్షేపణ చేసినారు. ఆ ఆక్షేపణ సమంజసమైనదే.

## 1929 ఆల్ ఇండియా రిపోర్టరు (మద్రాసు) 793

### జాక్సన్ న్యాయమూర్తి

ఒక ఓటుకాగితముపై గీటుపెట్టియుండెను. ఆ గీటున్నను కాగితము నిందార్హము కాదని క్రిందికోర్టు జడ్జి అభిప్రాయపడెను.

ఆ అభిప్రాయమును ఖండించుటకు హైకోర్టున కధికారము లేదు.

## 57. మద్రాసు లా జర్నలు 551—రామేశం న్యాయమూర్తి.

మునిసిపాలిటీ ఎలక్షన్ వివాదముల పరిష్కారమునకై కూర్చిన నిబంధనలలో 11 (1) రూలులో తెల్పిన నేరము జరిగినదని కమీషన రభిప్రాయపడినచో ఎన్నిక రద్దుకాదగినదే. అట్టి నేరము జరుగుటవల్ల ఎలక్షన్ ఫలితము తారుమారయ్యెనను రుజు వక్కరలేదు. 11 (2), 11 (3) నిబంధనల కట్టి రుజువుండవలెను. నేరము రుజువైనదని కమీషన రభిప్రాయపడిన చాలును; అందుపై క్రిమినల్ కోర్టులో కేసుపెట్టినచో శిక్షపడునా, పడదా యను మీమాంసతో పనిలేదు.

## ఎలక్షన్ విధులు

71. మద్రాసు లా జర్నలు 199. కార్నిషు వెంకటసుబ్బారావు న్యాయమూర్తులు.

పోలింగు ఆఫీసరు ఓటుకాగితము వెనుక ఆఓటరునంబరు వేసెను. ఇట్లు 322 కాగితములపై వేసెను. విధులప్రకార మానంబరు రెండవముక్కపై వేయవలెను. ఏ ఓటుకాగితముమీద ఆ ఓటు వేసిన ఓటరునంబరు వేయుటచే, ఆ ఓటరు ఓటు ఏ అభ్యర్థి కిచ్చినది గుర్తుపట్టుటకవకాశ ముండును. బళ్లారి జిల్లాబోర్డు ఎన్నికలో యీ పొరపాటు జరిగెను.

అందుపై బళ్లారి జిల్లాజడ్జిగారి యెదుట పిటిషన్ దాఖలుచేయగా, ఆయన గెల్పొందిన అభ్యర్థి ఎన్నిక రద్దుపరిచినారు. గెలుపొందిన అభ్యర్థి హైకోర్టులో రిట్ ఆఫ్ సర్టియరారై అను పిటిషను దాఖలు చేసెను.

322 ఓట్లలో 2 ఓట్లు యితరకారణములవల్ల చెడిపోయెను. మిగతా 320 లో 194 గెలుపొందిన అభ్యర్థికిన్ని, 126 రెండవ అభ్యర్థికిన్ని వేయుబడెను. గెలుపొందిన అభ్యర్థికి మొత్తముమీద 114 ఓట్లు, రెండవఅభ్యర్థికంటె ఎక్కువవచ్చెను. ఈ రద్దయిన 320 లో కూడా 68 ఓట్లు గెల్పొందిన అభ్యర్థి కెక్కువ వచ్చెను. రద్దు ఓట్లన్నియు సక్రమములని భావించినను గెలుపొందిన అభ్యర్థికి వచ్చిన ఓట్లు హెచ్చైయుండును. రద్దు ఓట్లు కలిసినందువల్ల రెండవ అభ్యర్థి గెలుపొందుటకుగాని, ఎలక్షన్ఫలితము వేరగుటకుగాని సావకాశము లేదు.

రూలు 10 (3) లో, (1) ఎలక్షన్లో అక్రమచర్య జరుగుట, (2) ఆ అక్రమచర్యవల్ల ఎలక్షన్ఫలితములు తారుమారగుట తటస్థించిననేకాని, కమీషనరు ఎన్నిక రద్దుపర్చరాదు. ఈ కేసులో అక్రమచర్య జరిగినదికాని అందువల్ల ఎలక్షన్ఫలితము తారుమారు కాలేదు. కాబట్టి కమీషనరు ఎన్నిక రద్దుపర్చుట న్యాయవిరుద్ధము.

రూలు 11 (3) లో కమీషనరు తీర్పునకు తిరుగులేదని వ్రాసియున్నను పైసందర్భములో శాస్త్రమునకు విరుద్ధముగా కమీషనరు తీర్పిచ్చిన కారణముచే, ఆ తీర్పు ఖండించుటకు హైకోర్టున కధికార మున్నది. అట్టి సందర్భములలో హైకోర్టు (గెల్పొందిన అభ్యర్థి కోరినప్రకారము) కమీషనరు తీర్పు రద్దుచేయవలెను.

ఈ కేసులో కమీషనరు తీర్పు ఖండించి గెలుపొందిన అభ్యర్థి యెన్నిక ఖాయపర్చినారు.

ఓట్ల జాబితాలు తయారైనపిమ్మట వానిని ఆక్షేపింపవచ్చునా?—

59. మద్రాసు లాజర్నలు 907—రామేశం న్యాయమూర్తి.

ఒకసారి ఓటరుజాబితా తయారయినపిదప, తిరిగి ఆఖండమునకు క్రొత్తజాబితా తయారగువరకు మొదటిజాబితా అమలులో నుండును. మొదటిజాబితా అనేక సంవత్సరముల క్రితము తయారయి యున్నను బాధలేదు. మొదటిజాబితాలో పేర్లున్న ఓటర్లందరు మెంబరు ఎన్నికలలో అభ్యర్థులై నిలువవచ్చును. ఈ కేసులో 6 సంవత్సరములకు పూర్వము తయారయిన జాబితా యింకను అమలులో నున్నదనియే తీర్పిచ్చినారు.

30 లా వీక్లీ 851—వెంకటసుబ్బారావు, మాధవనాయరు, న్యాయమూర్తులు.

పునర్విచారణసంఘములో ముగ్గురు సభ్యులు పనిచేయుచుండిరి. కొంతవిచారణ జరిగినపిమ్మట నొకతేదీకి వాయిదావేసిరి. ఆ తేదీని వారిలో నొకడు రాలేదని వ్రాసి, తిరిగి వాయిదా వేయుమని కోరెను. అట్లు చేయక, అవసరముగా కలెక్టరు నియమించిన వ్యక్తులలో నొకరిని తమతో కలిపి పనిచేయుమని మిగతా యిద్దరు కోరిరి. మూడవ ఆయన కేసు మొదటినుండియు వినియుండగా, నేను తీర్పు చెప్పేరోజున ఎట్లీసంఘ చర్యలో పాల్గొందును?' అని, యీ అవసరపుసభ్యుడు తీర్పు చెప్ప నిరాకరించెను. మూడవవాడు లేకుండగనే యిరువురుచెప్పిన తీర్పుకావున నది చెల్లవలె నని వ్రాసిరి. మూడవమెంబరు తర్వాత కొన్నిరోజులకు మరికొంత తీర్పుసాగించి యిద్దరి అభిప్రాయమునకు వ్యతిరేకముగా తీర్పిచ్చెను. ఇరువు రిచ్చిన తీర్పు శాస్త్రవిరుద్ధ మని ఆ ఓటరు దావాచేసెను. దావా ఓటరుపక్షము తీర్పుజరిగెను. ఎదురుపార్టీ హైకోర్టున కపీలుచేయగా న్యాయమూర్తు లిట్లని నుడివిరి:—

ముగ్గురు సమావేశమై తీర్పు చెప్పవలసినదేగాని వారిలో కొందరు మాత్రము కూడి తీర్పు చెప్పుటకు వీలులేదు. ముగ్గురు లేనికారణముచే యిరువురు చెప్పిన తీర్పునకు విలువలేదు. అది శాస్త్రవిహితమైన తీర్పు కానేకాదు.

నిబంధనలలో పునర్విచారణసంఘము చేసిన తీర్పులకు తిరుగులేదని వ్రాసి యున్నమాట సత్యమే. అనగా సంఘ మంతయు సమావేశమై యిచ్చిన తీర్పుల కన్నమాట కాని, సంఘసభ్యులలో కొందరు మాత్రమే యిచ్చిన తీర్పుల కనికాదు.

1932 మద్రాసు వీక్లీనోట్సు 654 —న్యాయమూర్తి అనంతకృష్ణయ్యార్.

వెనుకటి జాబితాలో ఓటరుపేరు వ్రాసినారు. ఆ పేరు తర్వాత కొట్టివేసినారు. పేరు కొట్టివేసిన జాబితా ముద్రింపించలేదు, ప్రచురింపలేదు. వెనుకటిజాబితా ముద్రి

తమై యుండెను. విధులలో వ్రాసినరీతిగా ప్రచురణ కూడ అయియుండెను. కాబట్టి మొదటి జాబితాలో పేర్లున్నవారు ఓటర్లనియే భావింపవలెను. రెండవజాబితా ముద్రితమై ప్రకటిత మగువరకు వెనుకటిజాబితా అమలులో నుండును.

1934 ఆల్ ఇండియా రిపోర్టరు [మద్రాసు]—318 న్యాయమూర్తి లక్ష్మణరావు.

రాజాగౌండరు—ఎదిరి—శనియప్ప గౌండరు. ఈరోడు తాలూకాబోర్డు ఎన్నికలలో రాజాగౌండరుకు 12 వోట్లును్న శనియప్పగౌండరుకు 9 వోట్లున్ను వచ్చెను. రాజాగౌండరుకు వోట్లిచ్చిన 12 గురున్ను ఆ సభాధ్యక్షునివద్దకు వెళ్లి తాము వోటు వేయలేమనిచెప్పి, తమవోట్లు రాజాగౌండరున కీయ సంకల్పించుకొంటిమనియు తెల్పిరి. సభాధ్యక్షుడు వారుచెప్పినరీతిగా గుర్తులుపెట్టెను. ప్రెసిడెంటు వైస్‌ప్రెసిడెంట్ల ఎన్నికలకు సంబంధించిన విధులలో వోట్లువేయలేమని సభాధ్యక్షునితో చెప్పువారితరపున అతడు గుర్తుపెట్టవలసి యున్నది కాని, వారు చెప్పెడి విషయమందలి సత్యాసత్యములు విచారించుటకు సభాధ్యక్షుని కధికారం మీయలేదు. ఇట్టిచర్య జరిగినందువల్ల రెండవ అభ్యర్థికి కీడుసంభవించినదను రుజువేమియు లేదు. కాని యీచర్య అక్రమచర్య యని భావించి కమీషనరుగారు ప్రెసిడెంటు ఎన్నిక రద్దుచేసిరి. నిబంధనలప్రకారము నడువవలసిన అధికార్లు కొన్ని సందర్భములలో వానికి భిన్నముగా సంచరించినను, అందువల్ల ఏ అభ్యర్థికైన కీడు కలిగినదనియు, వారు సక్రమముగా సంచరించి యున్నచో ఎన్నికల ఫలితము వేరుగా నుండు ననియు రుజువైననేకాని, ఎన్నిక రద్దుచేయరాదు. హైకోర్టు జడ్జీగారు ఎన్నిక ఖాయపర్చి కమీషనరు తీర్పు రద్దుచేసిరి.

1934 ఆల్ ఇండియా రిపోర్టరు 357 [మద్రాసు]—న్యాయమూర్తి వార్డెస్వెల్. శంకరనారాయణపిళ్లె—ఎదిరి—అహమ్మద్ మీరన్‌సాహేబు.

ఎలక్షన్ కమీషనరు చేయు విచారణ శాస్త్రవిహితముగా జరుపక, ఏవిషయమునవైన అతనికిచ్చిన అధికారము నతిక్రమించి నడుచుకొన్నచో, హైకోర్టువారు రిట్ ఆఫ్ సర్టియరారై అను పిటీషనుపై, అతనిచర్య ఖండించుచు తీర్పునీయవచ్చును.

52 మద్రాసు లా జర్నలు 309— న్యాయమూర్తి సుందరంచెట్టి. వడమలై—ఎదిరి—శ్రీరామ.

మొదట ప్రచురించిన నామినేషన్ల జాబితాలో పిటీషనరుపేరు చేర్చలేదు ఆ ప్రచురణ 22-2-1935 తేదీని జరిగెను. ఎన్నిక 5-3-1925 తేదీని ఏర్పాటుకాబడెను. ఆ అభ్యర్థి కోర్టులో దావాచేసి తాను సక్రమముగా నామినేషన్ కాబడిన అభ్యర్థి

నని 4-3-25 తేదీని డిక్రీపొందెను. ఆ డిక్రీఫలిత మాతడు 22-2-25 తేదీని సక్రమముగా నామినేషనైనట్లు భావింపవలసినదే. నామినేషన్లను (22-2-25 తేదీకిన్ని) ఎన్నిక తేదీకిన్ని (5-3-25 తేదీకిన్ని) మధ్య విధ్యుక్తమగు గడువున్నది కాబట్టి, ఎన్నికలు జరుపుటలో నెట్టిదోషమున్ను లేదు. ఏదైనా యీమాత్రము దోష మున్నను, అట్టి దోషమువల్ల ఏ అభ్యర్థికైన నష్టము వచ్చెనని, లేక ఎలక్షన్ ఫలితము తారుమా రయ్యెననియు రుజువైననేకాని ఎన్నిక రద్దుచేయరాదు.

57. మద్రాసు లాజర్నల్ 487— రాజాబహదూరు — విశ్వనాథరెడ్డియార్, న్యాయమూర్తి పండాలే.

ఎన్నికలో గుర్తులు పెట్టుటకై కొందరు ఓటర్లు నీలపుపెన్సిలు వాడియున్న కారణముచే వారి ఓట్లు వ్యర్థములు కావు. నీలపు పెన్సిలుగుర్తును బట్టి ఓటరు నానవాలుపట్టుటకు వీలున్నచో ఆ వోట్లు నిరర్థకము లగును.

63. మద్రాసు లాజర్నల్ 932— న్యాయమూర్తి వాడ్స్వెల్.

ఎలక్షన్ కమీషనగు తన అధికార మతిక్రమింపక ఏదైన స్వల్పపాటి పొరబాట్లు చేసియున్నను వానితీర్పు హైకోర్టువారు ఖండింపరు. అధికార మతిక్రమించినచో ఖండింతురు.

ఒక అభ్యర్థి మునిసిపాలిటీల ఆక్టు 49 వ సెక్షన్ ప్రకారము అనర్హుడని ఎలక్షన్ కమీషనరు నిర్ణయించెను. ఆ అభ్యర్థికి అందరికంటె నెక్కువ ఓట్లు వచ్చియుండెను. అతనితర్వాత వాడు మెంబరుగా నెన్నుకోబడినట్లు కమీషనరు తీర్పిచ్చెను. ఆతీర్పు సరియైన తీర్పేయని హైకోర్టు జడ్జీగా రభిప్రాయపడిరి. గెల్చిన అభ్యర్థి అనర్హుడని మొదటనే తెలిసియున్నచో ఓటర్లు అతనికి ఓట్లు యిచ్చియుండరనియు, మరియొకరి నెన్నుకొని యుందురేమోయనియు, ఆ కారణముచే రెండవ అభ్యర్థి విజయుడైనట్లు నిరూపింపరాదనియు హైకోర్టులో వాదముచేసిరి. హైకోర్టువా రావాద మంగీకరింపలేదు. రెండవ అభ్యర్థి విజయుడైనట్లు కమీషనరుగారు చేసిన తీర్పును ఖాయపరిచిరి.

1929 ఆల్ ఇండియా రిపోర్టరు (మద్రాసు) 391— న్యాయమూర్తి దేవదాసు.

ఓటుకాగితముపై గుర్తుపెట్టుకోని ఓటరు తరఫున ఆఫీసరు గుర్తుపెట్టినప్పుడు ఓట్ల ఏజెంటు సమీపములో లేకున్నను ఆవోటు నిరర్థకము కానేరదు.

## జిల్లా బోర్డు, పంచాయితీబోర్డు ఎన్నికలలో వోటుహక్కున్నవారు

---

### 3 వ షెడ్యూలు—లోకల్ బోర్డుల ఆక్టు

1. ఈక్రిందివారికి జిల్లాబోర్డు పంచాయితీబోర్డు ఎన్నికలలో వోటుహక్కున్నది:-

(i) క్రిత సంవత్సరములో ఇండియాగవర్నమెంటుకు, లేక మద్రాసు గవర్నమెంటుకు, లేక ఏ లోకల్ బోర్డునకైన పన్ను చెల్లించినవారు;

[పన్ను మొత్త మింత యుండవలెనని, లేక పన్ను స్వభావ మిట్టిదై యుండవలెనను నియమము లేదు.]

(ii) ఆ జిల్లాలో (లేక ఆగ్రామములో) రహితువారీ పట్టాదారు, లేక యీనాందారుగా నమోదై యున్నవారు;

(iii) రహితువారీ పట్టాదారువల్ల లేక యీనాందారువల్ల వ్రాతకవులుపొంది భూమిసాగుచేయువారు;

(iv) మలబారునకు సంబంధించినది.

(v) ఆ జిల్లాలో (లేక ఆ గ్రామములో) ఎస్టేటున కధిపతియై యున్నవాడు;

(vi) ఆ జిల్లాలో (లేక ఆగ్రామములో) సాగుహక్కున్న రహితుగా నమోదై యున్నవాడు.

(vii) గవర్నమెంటు సేనలో పనిచేసి పింఛన్ పుచ్చుకొన్న భటుడు లేక సేనాని.

2. (రద్దుపర్చినారు.)

3. ఒక కంపెనీకి, లేక కుటుంబమునకు పై ఆస్తియున్న కారణముచే, లేక పన్ను చెల్లించుచున్న కారణముచే వోటుహక్కున్నచో, ఆ కంపెనీ లేక కుటుంబముతరఫున వోటరుగా నెవరిపేరు చేర్చవలెనో అందులోని సభ్యులే నిర్ణయించుకొనవలెను. హిందూ సమష్టికుటుంబము తరఫున (కుటుంబ మెంబర్లు మరియొకరిని నియమించియుండనిచో) కుటుంబ యజమానిపేరు వోటరు జాబితాలో చేర్తురు.

4. ఒక ఆసామీ కంపెనీతరఫున, లేక కుటుంబముతరఫున వోటరు హక్కుండి, తనకు వేరేహక్కు కల్గియున్నచో, ఏదో యొక హక్కు పరసక్కరించుకొని

జాబితాలో చేరవచ్చును. కాని రెండుహక్కు లున్నవని అతని పేరు రెండుసార్లు జాబితాలో చేర్పరు.

5. స్వయముగా పన్నుచెల్లించువారి పేర్లున్ను, స్వయముగా పైనుదాహరించిన ఆస్తులనుభవించువారి పేర్లున్ను మాత్రమే జాబితాలో చేర్తురు.

ఇందుకు మార్పు పై 3 వ రూలులో తెలుపబడినది. ఇంకేమార్పున్ను లేదు.

(పై హక్కులతో పాటు ప్రతివోటరుకున్ను 21 సం॥ ల వయస్సు నిండవలెను.

ప్రతివోటరున్ను బ్రిటిషు సబ్జక్టు లేక స్వతంత్రరాజ్యము ప్రజలలో చేరిన వాడున్ను అయియుండవలెను. ఈమాటల కర్థములు ముందుభాగములలో తెలిపియున్నందున, తిరిగి వ్రాయలేదు.

ప్రతివోటరున్ను క్రితసాలులో 120 రోజులకు తక్కువకాకుండ ఆయాబోర్డు పాలనలోనున్న గ్రామములందు, లేక పట్టణములందు నివసించి యుండవలెను.

లోకల్‌బోర్డుల ఆక్టు 52 వ సెక్షన్ చూ.)

# 1920 సం॥పు మద్రాసు లోకల్‌బోర్డుల ఆక్టు,

## లోకలుబోర్డుల సమకూర్పు పద్ధతులు

సెక్షను.

6 (1) ప్రతిజిల్లాలోను ఒకజిల్లాబోర్డుండవలెను. ప్రతిగ్రామములోను ఒక పంచాయితీ యుండవలెను.

(2) ఆయాలోకల్‌బోర్డు చేతిక్రిందనున్న దేశఖండములో నా లోకల్‌బోర్డుపరిపాలన సాగింపవలెను. ఇతర లోకల్‌బోర్డులకు, యితర ఆఫీసర్లకు, ఆబోర్డు ప్రసిడెంటుగారికి ప్రత్యేకముగాను నియమించిన విధులజోలికి లోకల్‌బోర్డు పోరాదు.

ఏ గ్రామములోనైన పంచాయితీ లేకున్నచో ఆ గ్రామపరిపాలన జిల్లాబోర్డు సాగింపవలెను. ఖర్చువెచ్చములు జిల్లాబోర్డే చేయవలెను. పంచాయితీబోర్డుప్రెసిడెంటు నిర్వహింపవలసిన కార్యము లన్నియు జిల్లాబోర్డుప్రెసిడెంటు నిర్వహింపవలెను.

... ... ... ... ... ...

7. ఏ జిల్లాబోర్డు మెంబర్లసంఖ్యయు 52 దాటి 24 లోపించి యుండరాదు.

ఏ పంచాయితీ మెంబర్ల సంఖ్యయు 16 దాటి 8 లోపించి యుండరాదు.

8. ప్రతి లోకల్‌బోర్డులోని సభ్యు లందరున్ను వోటర్లెన్నుకొనినవారై యుండవలెను.

9. (1) ఏ జిల్లాబోర్డులోనైన యీ క్రిందితరగతులకు గవర్న్మెంటువారు మెంబరు పదవులు కేటాయించి యుంచవచ్చును:—

(i) మహమ్మదీయులు;

(ii) ఇండియన్ క్రైస్తవులు;

(iij) ఆదిద్రావిడులు (పంచములు)

(iv) యూరపియన్లు;

(v) ఆంగ్లో యిండియన్లు;

(vi) స్త్రీలు.

ఏ తరగతి కెన్నిసీట్లు కేటాయించిరో గవర్న్మెంటే నిర్ణయింపవలెను.

(2) ఏ పంచాయితీలోనైన యీ క్రింది తరగతులకు గవర్నమెంటువారు మెంబరుపదవులు కేటాయించి యుంచవచ్చును:—

(i) మహమ్మదీయులు;

(ii) ఇండియన్ క్రైస్తవులు;

(iii) ఆదిద్రావిడులు.



ఏ తరగతి కెన్నిసీట్లు కేటాయించిరో గవర్నమెంటే నిర్ణయింపవలెను.

(3) ఆయా లోకల్ బోర్డు మొత్తపుమెంబర్ల సంఖ్యలో నాల్గవ పాలునకు మించి కేటాయించిన సీట్లుండ (అన్నితరగతులకు కేటాయించిన మొత్తపుసీట్లు) రాదు.

(4) మొత్తపు జనాభాలో, ఏతరగతిప్రజల జనాభాయైన సగమునకు మించి యున్నచో, ఆతరగతి మెంబర్లకు సీట్లు కేటాయించి యుంచరాదు.

(5) ఆయాతరగతి ప్రజాబాహుళ్యము ప్రాముఖ్యమును బట్టి సీట్లు కేటాయించి యుంచవలెను.

(6) అట్లు కేటాయించిన తరగతులకు చెందినవారున్ను, స్త్రీలున్ను, సామాన్య జనరల్ సీట్ల ఎన్నికలలో నభ్యర్థులై నిలువవచ్చును.

10. (1) ప్రతి లోకల్ బోర్డు మెంబర్ల మొత్తపు సంఖ్యయు గవర్నమెంటువారు నియమింతురు.

(2) గవర్నమెంటువారు చేసిన నియమము ఆయాలోకల్ బోర్డు మార్చవచ్చును. అందునిమిత్తమై ప్రత్యేకముగా సభ సమావేశము చేయవలెను. ఆరోజున హాజరైన సభ్యులలో $\frac{3}{4}$ వ వంతుమంది మార్పున కంగీకార మీయవలెను. అటుపై గవర్నమెంటు వారున్ను ఆ మార్పున కామోదము చూపవలెను.

(3) పై (1) (2) విధుల ననుసరించి చేసిన నిర్ణయములు, విస్పష్టముగా ప్రకటింపవలెను.

11. (1) సాధారణముగా లోకల్ బోర్డు మెంబర్ల వరకు 3 సం॥లు. ఆ వరకు నవంబరు 1 వ తేదీ మధ్యాహ్నము 12 గంటలకు ప్రారంభమై 3 సం॥లు గడిచిన పిమ్మట అంతమొందును.

(2) సాధారణపు ఎన్నికలు ఆయా అధికారుల్లు ఆగస్టు, సెప్టెంబరు నెలలో (ఖాళీలు రాకముందు ఆగస్టు సెప్టెంబరునెలలు) జరుపవలెను. గవర్నమెంటువారు సెప్టెంబరునెల దాటినపిదప ఎన్నికలు జరుపుట కనుమతి యీయవచ్చును.

(3) ఖాళీ రాకపూర్వము ఎన్నికకాబడిన మెంబరున్ను, ఖాళీ వచ్చినపిదప ఎన్నికకాబడిన మెంబరున్ను, పరతాఖరున పదవులు విడువవలెను.

(4) ఆకస్మికపుఖాళీలు వచ్చినవెంటనే ఎన్నికలు జరుపవలెను. పర తాఖరు నకు 3 మాసములు మాత్రమే వ్యవధియుండగా నాకస్మికపుఖాళీ వచ్చినచో, ఆ ఖాళీలో నింకొకమెంబరు నెన్నుకొన నవసరము లేదు.

(5) ఆకస్మికపుఖాళీలో మెంబరైనవాడు, మొదటిమెంబరు పర తాఖరున తనపదవి విడువవలెను.

11. ఏ (2) ఒకసారి ఎన్నికలో మెంబ రెన్నుకోబడనిచో, తిరిగి ఎన్నికలు జరుప వలెను.

(2) రెండవసారి ఎన్నికలోనున్ను మెంబ రెన్నుకోబడనిచో, ఆ లోకల్‌బోర్డు వారే మెంబరు నెన్నుకొందురు.

(3) ఈ సెక్షన్‌ప్రకార మెన్నుకోబడిన మెంబరుపరతు సాధారణమెంబరు పరతాఖరున అంతమొందును.

12. ప్రతి లోకల్‌బోర్డున్ను సభ్యులలో నొకరిని ప్రెసిడెంటుగా నెన్నుకొనవలెను. ఇంకొకసభ్యుని వైస్‌ప్రెసిడెంటుగా నెన్నుకొనవలెను.

12. ఎ ఒకసారి ఎన్నికలో ప్రెసిడెంటుకాని వైస్‌ప్రెసిడెంటుకాని ఎన్నుకోబడని చో, మరల నింకొకసారి ప్రెసిడెంటు వైస్‌ప్రెసిడెంటు ఎన్నికలు జరుపవలెను.

13. (రద్దుచేసినారు.)

14. ( ,, )

15. (1) ప్రెసిడెంటు తనపదవి గోల్పోవుసందర్భము లివి:—

(i) అతని మెంబరుపరతు ఆఖరగుట, లేదా అతడు మెంబరుపదవి వేరువిధ ముగా గోల్పోవుట.

(ii) ఇంకొక లోకల్‌బోర్డు ప్రెసిడెంటుగా లేక వైస్‌ప్రెసిడెంటుగా అత డెన్నుకొనబడుట.

(2) వైస్‌ప్రెసిడెంటు తనపదవి గోల్పోవుసందర్భము లివి:—

(i) అతని మెంబరుపరతు ఆఖరగుట, లేదా అతడు మెంబరుపదవి వేరువిధ ముగా గోల్పోవుట.

(ii) ఆబోర్డు ప్రెసిడెంటుగా లేక మరియొకబోర్డు ప్రెసిడెంటుగా లేక వైస్ ప్రెసిడెంటుగా నత డెన్నుకొనబడుట.

ఒకసారి ప్రెసిడెంటు లేక వైస్ ప్రెసిడెంటు చేసినవారి యుద్యోగాంతమున తిరిగి వారినే ఆ పదవుల కెన్నుకొనవచ్చును.

16. ఏ సభ్యుడైన తన పదవికి రాజీనామా వ్రాసి ప్రెసిడెంటు కీయవచ్చును. ప్రెసిడెంటు రాజీ నీయదలచినచో బోర్డుకు నోటీసీయవలెను. వైస్ ప్రెసిడెంటు రాజీనామా యీయదలచినచో, వ్రాసి ప్రెసిడెంటు కీయవచ్చును.

ప్రెసిడెంటుకు రాజీనామాలు చేరిన తేదీనుండి అవి అమలులోనికి వచ్చును. (రాజీ లిచ్చినవారి పదవులు ఖాళీయగును.) ప్రెసిడెంటు రాజీ బోర్డుమీటింగులో బోర్డుయెదుట పెట్టిన తేదీనుండి అమలులోనికి వచ్చును.

17. పై ఖాళీలలో క్రమప్రకారము క్రొత్తవారి నెన్నుకొనవలెను.

19. అట్టి ఎన్నికలు క్రమానుగతముగా ప్రకటింపవలెను.

20. ఏ లోకల్ బోర్డుసభ్యునికి జీత మీయరాగు.

21. (1) లోకల్ బోర్డు తీర్మానములు ప్రెసిడెంటమలులో పెట్టవలెను. కార్యనిర్వహణ చేయు నధికారము ప్రెసిడెంటున కీయబడియున్నది.

(2) లోకల్ బోర్డు నిర్వహింపవలసిన విధులు ప్రెసిడెంటు స్వతంత్రముగా నిర్వహింపరాదు.

26. (1) లోకల్ బోర్డు జరుపవలసిన విధులు నెరవేర్చుటలేదని, లేక లోకల్ బోర్డు ఆస్తి చెడిపోవుచున్నదని, లేక కొన్నిచోట్ల ప్రజాసౌకర్యమునకు వలయు కార్యములు జరుపుటలేదనియు, ఏ మెంబరైనను ప్రెసిడెంటుతో చెప్పవచ్చును.

(2) ప్రతి మెంబరున్ను సభలలో తీర్మానములు ప్రవేశపెట్టవచ్చును. ప్రెసిడెంటును పరిపాలనగూర్చి ప్రశ్నింపవచ్చును.

(3) ప్రతి మెంబరున్ను లోకల్ బోర్డుకాగితములు చూడవచ్చును.......

## మద్రాసు లోకల్ బోర్డుల ఆక్టు

సెక్షన్.

47. (1) జిల్లాబోర్డు ఎన్నికలకై, ఆయా జిల్లాబోర్డుతో సంప్రతించి, గవర్నమెంటువారీ క్రింది ఏర్పాట్లు చేయవచ్చును. అట్టి ఏర్పాట్లు చేసినట్లు (గెజెటులో) ప్రచురింపవలెను.

(1) జిల్లాను సర్కిల్సుగా విభాగించుట.

(ii) ఏ ఏ సర్కిలులలో 9 (1) సెక్షను ప్రకారము సీట్లు కేటాయింప వలెనో నిర్ణయించుట.

(iii) ఏ తరగతి కే సీటు కేటాయింపవలెనో నిర్ణయించుట.

(2) రిజర్వుడ్ సీట్లు కేటాయించియున్న సర్కిల్సు, ఆయా తరగతుల సభ్యుల తోపాటు, ఒకరినో యిద్దరినో జనరల్ సీట్ల సభ్యులను కూడ ఎన్నుకొనవలెను. అట్టి జనరల్ సీట్ల సంఖ్యయు గవర్నమెంటువారే నిర్ణయింతురు.

తక్కిన సర్కిల్సన్నియు, సర్కిలు కొక మెంబరుచొప్పున ఎన్నుకొనవలెను'

(3) ఆ సర్కిలులోని ఓటర్లందరు ఆ సర్కిలుమెంబర్ల (రిజర్వుడ్, జనరల్ మెంబర్ల) ఎన్నికలలో పాల్గొనవచ్చును.

(4) గవర్నమెంటుపై (1) వ విధి ననుసరించి అమలులోనున్న ఏర్పాట్లు మార్చుచున్నచో, ఆ ఏర్పాటు జిల్లాబోర్డుపరతు ముగిసినవెనుక జరుగు ఎన్నికలనుండి అమలులోనికి రావలెనని గవర్నమెంటువారు నిర్ణయింపవలెను.

(5) ఒక సర్కిలునుండి ఎన్నుకోవలసిన మెంబర్లసంఖ్య మార్చినప్పుడున్ను, క్రొత్తసర్కిలు నిర్మించినప్పుడున్ను, అమలులోనున్న సర్కిలు రద్దుచేసినప్పుడున్ను, గవర్నమెంటు అనుమతిపొంది, ఆయా అధికారులు (అనగా లోకల్ బోర్డు ఇన్స్పెక్టరు గారు)

(i) అప్పట్లో బోర్డుమెంబర్లయియున్నవారు ఏ ఏ సర్కిలుతరఫున మెంబర్లుగా నున్నట్లు భావింపవలెనో

(ii) ఏ సర్కిలుకైన మెంబరు ఖాళీ ఏర్పడినచో, తిరిగి ఎన్నికలు కావలసిన ఆ సర్కిల్సు ఏవియో నిర్ధారణ చేయవలెను.

[సాధారణముగా నొక జిల్లాకంతకును ఒకే జిల్లాబోర్డుండును. ఆ జిల్లాబోర్డులోని సభ్యులందరున్ను వోటర్లెన్నుకొనినవారై యుండవలెను. ఆ ఎన్నికలు జరుపునిమిత్తమై జిల్లానంతయు వేరువేరు సర్కిల్సుక్రింద విభాగింతురు. సర్కిలు అనగా నొక స్థలవిభాగము. కొన్ని గ్రామములు చేరి యొకసర్కిలగుచుండును. ఒక పట్టణమును ప్రత్యేకముగా నొక సర్కిలుక్రింద ఏర్పర్చినను ఏర్పరుపవచ్చును. సర్కిలులో కొన్ని గ్రామ సముదాయము లుండును. ఏ స్థలవిభాగములోని వోటర్లకందరకున్ను ఒకే మెంబరును కాని, పలువురు మెంబర్లనుకాని ఎన్నుకొనుట కధికారమున్నదో, ఆ స్థలవిభాగము పేరు సర్కిలు. ఒక సర్కిలులోని ఓటర్లకున్ను మరియొక సర్కిలులోని ఓటర్లకున్ను ఎట్టి సంబంధమున్ను ఉండదు. ఏ సర్కిలులోనైన మెంబరు కాగోరువాడా సర్కిలు

లోని ఓటర్ల గౌరవానురాగములకు పాత్రుడై యుండవలెను. సర్కిలులో పెక్కు గ్రామసముదాయము లుండును. ఏ స్థలవిభాగములోని ఓటర్లందరి ఓట్లున్ను ఒకే ఓట్ల ఆఫీసులో పుచ్చుకొందురో, ఆ స్థలవిభాగము పేరు గ్రామసముదాయము. అట్టి స్థల విభాగములు గ్రామములలోను, పట్టణములోనున్ను కానవచ్చినను, దరహామీద వానిని గ్రామసముదాయము లని వ్యవహరించుచు వచ్చినారు. గ్రామసముదాయమున కొక కేంద్రస్థాన మేర్పరుతురు. ఆ కేంద్రస్థానములో వోట్ల ఆఫీసు పెట్టి ఆ గ్రామసము దాయపు ఓట్లన్నియు ఆ ఆఫీసులోనే పుచ్చుకొందురు. గెల్పొందిన అభ్యర్థి వోట్లు ప్రత్యేకముగా నొక గ్రామసముదాయమునుండి రావలెనను నియమములేదు. ఓట్లు లెక్క పెట్టినప్పుడు ఆ సర్కిలులోనున్న అన్ని గ్రామసముదాయములలోని ఓట్ల ఆఫీసులలో వేసిన ఓట్లున్ను లెక్కపెట్టి మొత్తపు ఓట్లలో నధికసంఖ్య వచ్చిన అభ్యర్థి విజయు డైనట్లు నిర్ణయింతురు.

పై 9 (1) సెక్షనులో ఏ ఏ తరగతి ప్రజలకు సీట్లు ప్రత్యేకముగా కేటాయించి యుంచవచ్చునో తెలిపియున్నది. మహమ్మదీయులు, ఇండియన్ క్రైస్తవులు, పంచ ములు, స్త్రీలు మొదలగు తరగతులు పైన వ్రాసియున్నాము. ఈ తరగతుల జనాభా స్వల్పముగా నున్న కారణముచే, ఆ తరగతుల అభ్యర్థులకు ఆయా తరగతి ఓటర్లంద రున్ను ఓట్లిచ్చినను, ఆ అభ్యర్థులు విజయ మందకపోవచ్చును. ఆ తరగతి తరఫు అభ్యర్థి ఎవరున్ను బోర్డులో మెంబరుగా నుండనిచో, ఆ తరగతి ప్రజల బాగోగులు కనుగొనువా రెవ్వరును వుండరు. అందుచే కొన్ని తరగతుల మెంబర్లకు సీట్లు కేటాయించియుం చుటకు గవర్నమెంటున కధికార మున్నది. అట్లు కేటాయించినసీట్లకు ఆయాతరగతికి చెందిన అభ్యర్థులే మెంబర్లుగా రావచ్చును. ఉదా. మహమ్మదీయులకు కేటాయించిన సీటుకు మహమ్మదీయునే మెంబరుగా నెన్నుకొనవచ్చును. ఏ ఏ సర్కిలులో ఏ ఏ తర గతి కెన్నిసీట్లు కేటాయించిరో నిర్ణయించునధికారము గవర్నమెంటువారు వహించి యున్నారు. రాజమండ్రిసర్కిలులో స్త్రీల కొక సీటు కేటాయించి రని భావింతము. ఆ సర్కిలులోనే జనరల్‌సీ టొకటియైనను ఏర్పాటుచేయవలెను. జనరల్‌సీ టనగా ప్రత్యేకపుతరగతికి చెందిన ప్రజలుమాత్రము, లేక స్త్రీలుమాత్రము, ఆ సీటునకు మెంబర్లుగా నెన్నికపొందుట కర్హులను నియమములేక, స్త్రీలు, పురుషులు, మహమ్మ దీయులు, క్రైస్తవులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు ఎవరైనను, ఏ తరగతికి చెందిన వ్యక్తియైనను మెంబరుగా నెన్నికపొందుట కర్హులైయున్న పదవి.

కొన్ని కొన్ని తరగతులకు సీట్లు కేటాయించియున్నను, ఆయా సభ్యుల నెన్ను కొనువా రా సర్కిలులోని యావన్మంది స్త్రీ పురుష ఓటర్లున్ను అయియున్నారు. కాకినాడసర్కిలులో మహమ్మదీయుల కొక సీటు కేటాయించి రనుకొందము.

ఆ సీటునకు మహమ్మదీయునిమాత్రమే ఎన్నుకొనవలెను. మహమ్మదీయుడు కానివాని నెన్నుకొనరాదు. కాని ఎన్నుకొను ఓటర్లున్ను మహమ్మదీయులై యుండవలెనను నియమములేదు. మహమ్మదీయులు, మహమ్మదీయులు కానివారు ఆ సర్కిలులో యావన్మంది ఓటర్లున్ను ఆ సీటుకు మహమ్మదీయ అభ్యర్థులలో నొకరి నెన్నుకొనవలెను. ఈ విషయములో రాష్ట్రశాసనసభా ఎన్నికలకును, లోకల్ లోర్డు మునిసిపల్ ఎన్నికలకును విశేషతారతమ్య మున్నది. శాసనసభల ఎన్నికలలో కేటాయించిన సీట్లకు ఎన్నిక కాదగినవారు ఆయా తరగతికి చెందినవారు; ఎన్నుకొనువారున్ను ఆయా తరగతికి చెందినవారే. ఆయా తరగతులకు చెందినవారు జనరల్ సీటుకు అభ్యర్థులై నిలువరాదు. ఆయా తరగతి సభ్యుల నెన్నుకొన నధికారమున్న వోటర్లను జనరల్ సభ్యుల నెన్నుకొనుట కధికారములేదు.

గవర్నమెంటు అమలులోనున్న సర్కిలుల్ను మార్చి వానిస్థానే క్రొత్త సర్కిలుల్ను కల్పించుచో, ఆ క్రొత్త ఏర్పాటుపర తాఖరున జరుగు ఎన్నికలలో నమలులోనికి రావలెను కాని యీలోపుగా నమలులోనికి రాకూడదు.

48. (తాలూకాబోర్డులకు సంబంధించినది. ఇప్పుడు రద్దయినది).

49. (1) పంచాయితీ ఎన్నికలకై, ఆయా పంచాయితీతో సంప్రతించి, గవర్నమెంటువారీ క్రింది ఏర్పాట్లు చేయవచ్చును:—

(i) గ్రామమును వార్డులుగా విభజించుట.

(ii) ఏ ఏ వార్డులో 9 (2) సెక్షన్ ప్రకారము సీట్లు కేటాయింపవలెనో నిర్ణయించుట.

(iii) ఏ తరగతి కే సీటు కేటాయింపవలెనో నిర్ణయించుట. పై ఏర్పాటు క్రమప్రకారము ప్రకటింపవలెను.

(2) రిజర్వుడ్ సీట్లు కేటాయించియున్న వార్డ్లు, ఆయాతరగతి సభ్యులతోపాటు, ఒకరినో యిద్దరినో జనరల్ సీట్ల సభ్యులను కూడ ఎన్నుకొనవలెను. అట్టి జనరల్ సీట్ల సంఖ్యయు గవర్నమెంటువారే నిర్ణయింతురు.

తక్కిన వార్డ్లు వార్డు కొక మెంబరుచొప్పున యెన్నుకొనవలెను.

(3) ఆయావార్డులోని ఓటర్లందరు ఆయావార్డు ఎన్నికలలో ఓటువేయవచ్చును. (అనగా ఆవార్డులో రిజర్వుడ్ సీటు సభ్యునికి, జనరల్ సీటు సభ్యునికిన్ని ఓటు వేయవచ్చును.)

(4) గవర్నమెంటుపై (1) వ విధి ననుసరించి అమలులోనున్న ఏర్పాట్లు మార్చినచో, ఆ ఏర్పాటు పంచాయితీవరతు ముగిసినవెనుక జరుగు ఎన్నికలనుండియు అమలులోనికి రావలెనని గవర్నమెంటువారు నిర్ణయింపవలెను.

(5) ఏ వార్డునుండి ఎన్నుకోవలసిన మెంబర్లసంఖ్య మార్చినప్పుడు, క్రొత్త వార్డులు నిర్మించినప్పుడు, అమలులోనున్న వార్డు రద్దుచేసినప్పుడు, గవర్నమెంటు అనుమతిపొంది ఆయా అధికారులు (అనగా లోకల్‌బోర్డు ఇన్స్పెక్టరుగారు.)

(i) అప్పట్లో పంచాయితీ మెంబర్లయి యున్నవారు ఏవార్డుతరఫున మెంబర్లుగా నున్నట్లు భావింపవలెనో.

(ii) ఏ వార్డునకైన మెంబరు ఖాళీ ఏర్పడియున్నచో, తిరిగి ఎన్నికలు కాదగిన ఆ వార్డు లేవియో నిర్ధారణ చేయవలెను.

[గ్రామమును పెక్కు వార్డులుగా విభజించి, ఏవార్డున కావార్డునకు ఓట్లుపుచ్చుకొని, ఆవార్డునకు ప్రతినిధు లెవరో నిశ్చయింతురు.

ఈ సెక్షన్ పంచాయితీ ఎన్నికలకు సంబంధించినది. దీనికిన్ని పై 47 వ సెక్షనుకున్ను విశేషసాపత్య మున్నది.]

50. (రద్దు పర్చినారు)

51. (1) ప్రతి లోకల్‌బోర్డు ఓటర్లకున్ను ప్రత్యేకపు ఓటరుజాబితా వ్రాసి, ఆయా అధికారులు క్రమప్రకారము ప్రచురింపవలెను. ఈ జాబితాలు మరతాఖరునకు ముందు జూన్ నెలాఖరులోపుగా ప్రచురింపవలెను.

[లోకల్‌బోర్డు ఓటరు జాబితాలు తయారుచేయు క్రమము వేరుభాగములో తెలిపియున్నాము.

1936 నవంబరునెల మధ్యాహ్నం 12 గంటలతో నొక లోకల్‌బోర్డు మరతు అంతమొందునని భావింపుడు. జాబితాలు 1936 జూన్ నెలాఖరులోపుగా సిద్ధపర్చియుంచవలెను. ప్రకటనయున్ను ఆలోపుగానే పూర్తి కావలెను.]

(2) ప్రతిసాలున జూన్ నెలాఖరులోపుగా ఆ జాబితాలలో వలయు మార్పులు సవరణలుచేసి, వాని నాయా అధికారులు ప్రకటింపవలెను.

[1936 లో తయారైన జాబితాలో చేరియున్న ఓటరు 1936 డిశంబరులో చనిపోయె ననుకొందము. 1937 సం. జూన్‌లోపున తయారగు జాబితాలో అతనిపేరు తీసివేయవలెను.]

(3) జిల్లాబోర్డు వోటరు జాబితా వేరు వేరు సర్కిల్సుకు వేరు వేరు భాగముల క్రింద విడదీసి వ్రాయవలెను.

పంచాయితీ ఓటరు జాబితా వేరు వేరు వార్డులకు వేరు వేరు భాగముల క్రింద విడదీసి వ్రాయవలెను.

(4) ఒక సంవత్సరములో ప్రచురణయైన జాబితా క్రొత్త జాబితా ప్రచురణ యగువరకు అమలులో నుండును.

(5) ఓటరుజాబితాలో పేరున్న ప్రతిఓటరున్ను వోటు వేయవచ్చును. జాబితాలో పేరు లేనివారు ఓటు వేయరాదు.

[3 ఏండ్లకొకసారియు 5 ఏండ్లకొకసారియు జాబితాలు తయారుచేయుచున్న యెడల, క్రొత్తజాబితా ప్రచురణయగువరకు ప్రాతజాబితాయే అమలులో నుండును. ఈలోపుగా జరుగు ఎన్నికలన్నింటికిన్ని ప్రాతజాబితాయే ఆధారమై యుండును. ప్రాతజాబితాలో చేరియున్నను, అటుపిమ్మట ఓటుహక్కు పోయినవారనేకులు ఓటరుజాబితాలో యింకను చేరియేయుందురు. కాబట్టి యిప్పుడే ప్రేటేట జాబితా సవరణ చేయవలసిన దను నియమ మేర్పర్చినారు.]

52. ఈ క్రిందివారికిమాత్రమే ఓటుహక్కున్నది:—

(1) బ్రిటిషుసబ్జక్టు, లేక స్వతంత్రప్రభువుపాలనలో చేరిన ప్రజలలోనివారు.

(బ్రిటిషుసబ్జక్టు అనగా ఆంగ్లచక్రవర్తిగారి పాలనమందున్న ఏదేశమునకైన చెందినవాడు.

స్వతంత్రప్రభువు లనగా బరోడా, మైసూరు, హైదరాబాదు మొదలగు రాజ్యము లేలువారు.)

గవర్నమెంటు విదేశీయులున్ను ఓటర్లుగా నుండ నర్హులని శాసింపవచ్చును.

(2) వెనుకటి సంవత్సరములో (అనగా జాబితా తయారుచేయు సంవత్సరమునకు వెనుకటిది) 21 సం.ల వయస్సు నిండినవారు.

(3) 3 వ అనుబంధములో తెల్పిన హక్కులున్నవారు.

(4) జిల్లాబోర్డు ఓటరుగా చేరగోరునెడల

వెనుకటి సంవత్సరములో (అనగా జాబితా తయారుచేయు సంవత్సరమునకు పూర్వపు ఏటిలో—1936 సం.లో జాబితా తయారుచేయుచున్నా రనుకొందము 1935 సం.లో యీ దిగువతెల్పినట్లు కాపుర ముండవలెను) మొత్తము 120 రోజు

జిల్లాలో లేక జిల్లా సరిహద్దుకు 3 మైళ్ల లోపుననున్న మునిసిపాలిటీ లేక కాంటన్మెంటులో నివసించినవాడు.

[కాంటన్మెంటనగా సాధారణముగా సేననిల్పు ప్రదేశము. ఉదా. బెంగుళూరు.]

మునిసిపాలిటీకి లేక కాంటన్మెంటుకు పన్ను చెల్లించుచున్న కారణముచే ఆయా ఆసాములు ఆ మునిసిపాలిటీలో లేక కాంటన్మెంటులో నివసించినట్లు భావింపరాదు.

[వారు రా 120 రోజులు ఆ ప్రదేశములో నివసించినట్లు ప్రత్యేకపు రుజువుండవలెను.]

## (5) పంచాయితీ యెన్నికలలో

వెనుకటి సంవత్సరములో ఆ గ్రామములో మొత్తము 120 రోజులైన నివసించినవారే ఓటర్లుగా నుండ నర్హులు.

53. మతిభ్రష్టులున్ను, చెవుడు, మూగ రెండు లోపములున్న కలవారున్ను, కుష్టువారున్ను ఓటర్లుగా నుండ ననర్హులు.

## 54. అభ్యర్థుల కుండవలసిన అర్హతలు.

(i) అభ్యర్థులుగా నిలువగోరువారి పేరు ఆయా సర్కిలు లేక వార్డు ఓటరు జాబితాలో చేరియుండవలెను.

(ii) గవర్నమెంటు ఆఫీసర్లు అభ్యర్థులుగా నిలువరాదు. గ్రామమునసబులు అభ్యర్థులుగా నిలువవచ్చును. గవర్నమెంటు ఆఫీసర్లనగా.

(i) గవర్నమెంటు ఉద్యోగ మొక్కటియే వృత్తిగా కలవారు.

(ii) గవర్నమెంటువల్ల వేతనము పొందుచున్నవారు.

ఒక అభ్యర్థి గవర్నమెంటు ఉద్యోగి యగునా కాదా అను సందేహము కలిగినప్పుడు ఆ సందేహము రాష్ట్రగవర్నమెంటుకు తెలిపి, గవర్నమెంటు అభిప్రాయము ననుసరించి నడుచుకొనవలెను. గవర్నమెంటు అభిప్రాయమునకు తిరుగులేదు.

[గవర్నమెంటు ఆఫీసర్లనగా నెవరో తెలియజేయు విధి 1930 సం.పు 11 వ ఆక్టు ననుసరించి చేర్చినారు. ఆ విధి 26-8-1930 తేదీని అమలులోనికి వచ్చినది. అంతకు పూర్వపు ఆక్టులో నీ విధి లేదు. గవర్నమెంటుప్లీడరుగాను పబ్లిక్ ప్రాసిక్యూ

టరుగాను పనిచేయునాతడు గవర్నమెంటుఉద్యోగి యగునా కాదా యని వెనక సందేహములు వచ్చుచుండెను. ఆ సందేహము లిప్పుడు నివారింపబడినవి. గవర్నమెంటు ప్లీడరు, పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వ్యవహరించునాతడు గవర్నమెంటు ఉద్యోగ మొక్కటియే వృత్తిగా కలవాడుకాడు. ఆ కారణముచే నతడు గవర్నమెంటు ఉద్యోగి కాడు.

తీర్పులు.

60 మద్రాసు లాజర్నలు 191—— పన్నీరుసెల్వము——ఎదిరి— వీరయ్య వండయారు. రెయిలీ, అనంతకృష్ణయ్యరు న్యాయమూర్తులు.

1930 సం.పు 11 వ ఆక్టువిధులు ఆ ఆక్టు అమలులోనికి వచ్చిన 26-8-1930 తేదీ చర్మిలాకేసులలో నవలంబింపవలసినవే కాని, తత్పూర్వమే దాఖలుకాబడి విచారణ జరుగుచున్న కేసులలో నమలుకు రావు.

వెనుకటి ఆక్టు విధులనుబట్టి పబ్లిక్ ప్రాసిక్యూటర్ గవర్నమెంటు ప్లీడరుగా వ్యవహరించునాతడు ఎన్నికకు తగడని ఎలక్షన్ పిటిషన్ విచారించు సబ్‌జడ్జిగారు తీర్పిచ్చిరి. పిటిషన్ దాఖలగునప్పటికి క్రొత్తఆక్టు అమలులోనికి రాలేదు. సబ్‌జడ్జికి పిటిషన్ విచారించు హక్కుండెను. పిటిషన్ విచారించులోపున క్రొత్త ఆక్టు అమలులోనికి వచ్చెను. ఆ ఆక్టునుబట్టి యిక పిటిషన్ విచారింప సబ్‌జడ్జి కధికారము లేదనియు, పిటిషన్ క్రొత్త ఆక్టుకు పూర్వమే దాఖలైయున్నను, క్రొత్తఆక్టు విధులనుబట్టి పబ్లిక్ ప్రాసిక్యూటరుగాను గవర్నమెంటు ప్లీడరుగాను వ్యవహరించునతడు అనర్హుడు కాడనియు, ఆకారణముచే సబ్‌జడ్జితీర్పు రద్దుచేయవలసిన దనియు న్యాయమూర్తుల వద్ద వాదించిరి. న్యాయమూర్తులా వాదము నంగీకరింపలేదు. సబ్‌జడ్జి తీర్పు ఖాయ పర్చిరి.]

## 55. ఈ క్రింద నుదాహరించినవా రభ్యర్థులై నిలువ ననర్హులు.

(1) ద్వీపాంతరవాసశిక్ష లేక 6 మాసములకు మించి ఖైదుశిక్ష పొందినవారు' శిక్ష ననుభవించేకాలమందును, శిక్షానుభవము పూర్తియైన 5 సం.ల వరకును అట్టివా రనర్హులు.

ఆశిక్ష అపీలులో కొట్టివేసినయెడల, లేక శిక్షను గవర్నమెంటువారు తీసివేసిన సందర్భములోను, వారి కనర్హత లేదు.

శిక్ష రాజకీయనేరములకు వేసియున్నచో, లేదా ఆనేరము నీతిపథమునకు దూష్యము కాకున్నచో, శిక్షపొందియున్నను అనర్హత సిద్ధింపదు.

(2) నామినేషన్ తేదీని లేక ఎలెక్షన్ తేదీని యీ క్రింది కళంకములకు లోనైయున్నవా రభ్యర్థులై నిలువరాదు:—

(i) మతిభ్రష్టులై యున్నవారు, మూగ, చెవుడు, రెండులోపములున్నవున్నవారు, కుష్టువారు.

(ii) ఇన్‌సాల్వెన్సీ (దివాలా) పిటిషన్ దాఖలు చేసియున్నవారు, ఇన్‌సాల్వెంటుగా ఖాయపడియుండి విడుదల ఆర్డరు (డిశ్చార్జి) పొందనివారు.

(iii) ఆ లోకల్‌బోర్డుతో వ్యాపారము సాగించువారు, లేక ఆ లోకల్‌బోర్డువల్ల కంట్రాక్టులు పొంది పని సాగించువారు, మరి ఏవిధమునైన పై రెండు తేదీలలో లోకల్‌బోర్డుతో వ్యవహారసంబంధ మున్నవారు.

ఒక కంపెనీ లోకల్‌బోర్డుతో వ్యవహారము సాగించుచున్నచో ఆ కంపెనీలో భాగస్వాము లనర్హులు కారు. కాని ఆ కంపెనీ డైరెక్టర్లనర్హులే.

ఈ (iii) వ రూలుకు మినహాయింపులు

(అ) లోకల్‌బోర్డుతో స్థిరాస్తి అమ్మకము, స్థిరాస్తి కొలుపుచ్చుకొనుట మొదలగు వ్యవహారసంబంధ మున్నవా రనర్హులుకారు.

(ఆ) లోకల్‌బోర్డుకు సొమ్ము బదులిచ్చుట, ఆస్తి తనఖాయిచ్చుట.

తనఖా పుచ్చుకొనుట మొదలగు వ్యవహారములు నడుపువా రనర్హులు కారు.

(ఇ) లోకల్‌బోర్డు ప్రకటనలు ముద్రించు ముద్రాలయాధికారు లనర్హులుకారు.

(ఈ) ఏసాలునకైన రు 1,500/- కిమ్మత్తు కాని వస్తువులు (సాలీనా మొత్తపు అమ్మకము రు 1500/-లకు మించరాదు) లోకల్‌బోర్డుకు విక్రయించువా రనర్హులు కారు.

[పై అనర్హత నాపాదించుటకు వ్యవహారసంబంధ మున్న ఆ అసామీకిన్ని, లేక కంపెనీకిన్ని, లోకల్‌బోర్డునకున్ను ఒడంబడిక యుండవలెను]

(iv) ఆ లోకల్‌బోర్డు తరఫున (ఫీజు పుచ్చుకొను) ప్లీడరుగా వ్యవహరించుచున్నవారు, లోకల్‌బోర్డున కెదురుపక్షమున ప్లీడరుగా వ్యవహరించుచున్నవారు.

(v) లోకల్‌బోర్డుల ఆర్డరు ననుసరించి ఉద్యోగియైయున్నవారు, లేక బోర్డు కొలువులో నున్నవాడు, లేదా లోకల్‌బోర్డు హయాములోనున్న గ్రామములో, లేక జిల్లాలో ఆనరరీమేజిస్ట్రేటుగా వ్యవహరించువాడు.

(vi) ఎన్నికలు జరుగునప్పటికి లోకల్ బోర్డు మెంబరుగా వ్యవహరించు వాడు.

ఎన్నికలకు ముందే సభ్యుడుగా నెన్నుకోబడినవాడు (అట్టివాని మర తింకను ప్రారంభముకాని సందర్భములలో)

(vii) ఆ తేదీలను మెంబరుగా నున్నవారి నౌకరు, లేక యజమాని, లేక ఉద్యోగరీత్యా ఆమెంబరుపై వాడు, లేక ఉద్యోగరీత్యా ఆమెంబరు క్రిందివాడు.

(3) ఖైదు, లేక ద్వీపాంతరవాసశిక్ష పొందినవారికి కూడ కళంకములేదని గవర్నమెంటువా రుత్తర్వు చేయవచ్చును.

[ఖైదు శిక్ష

6 మాసములకు మించి ఖైదుశిక్షయున్ను, ద్వీపాంతరవాసశిక్షయు పొందినవా రభ్యర్థులై నిల్చుట కనర్హులు. ఖైదుశిక్ష లేక ద్వీపాంతరవాసశిక్ష అనుభవించిన 5 సం.ల వరకు యీ కళంకము నిల్చియేయుండును. ఈ కళంకమునకు లోనైనవారు సయితము అభ్యర్థులై నిలువవచ్చునని రాష్ట్రగవర్నమెంటువా రుత్తరు వీయవచ్చును. అట్లు ఉత్తరు విచ్చినచో యీ కళంక మాయా అభ్యర్థులను బాధింపదు.

రాజకీయనేరములకు శిక్షపొందినవారి కీకళంక ముండదు. శాసనసభలకు సంబంధించిన విధులలో రాజకీయనేరస్థులు సయితము అనర్హులైయున్నారు. గవర్నరు గారు, లేక గవర్నరు జనరల్ గారు వారి కళంకము తొలగించిననేకాని వా రభ్యర్థులై నిల్చుటకు వీలు లేకుండెను. లోకల్ బోర్డు ఎన్నికలలో గవర్నరుగారి ఉత్తరు వుండ నక్కరలేకయే, రాజకీయనేరస్థుల నర్హులుగా భావించియున్నారు. నీతిబాహ్యము కాని నేర మేదైన చేసి 6 మాసములకుమించి ఖైదుశిక్ష పొందియున్నవారు సయితము అనర్హులు కారు.

ఉదా. ఒక ఆసామీ ఆరమ్సుఆక్టు (అనగా లైసెన్సు పొందనిదే తుపాకులు మొదలగు నాయుధము లుపయోగించుట, మొదలగుకార్యములు నేరము లని నిరూపణ చేయు చట్టము) విధుల ప్రకారము 6 మాసములకు మించి ఖైదుశిక్ష పొందెననుకొందము. అతడు చేసిన నేరములో నీతిబాహ్య మేమియు లేదు. కాబట్టి అత డభ్యర్థియై నిల్చుట కర్హుడే.

## దివాలాదార్లు

దివాలాదారు తన్ను దివాలాదారుగా ఖాయపర్చమని కోర్టువారిని ప్రార్థించుచు దాఖలుచేయు పిటిషన్ పేరు ఇన్సాల్వెన్సీపిటిషను. నామినేషన్ తేదీకి కాని

ఎలక్షన్ తేదీకి కాని ఇన్‌సాల్‌వెన్సీపిటిషన్ దాఖలైయున్నచో, ఆ పిటిషన్ దాఖలుచేసినయాత డభ్యర్థియై నిలువరాదు. అప్పటి కింకను ఇన్‌సాల్‌వెంటుగా (అనగా దివాలాదారుగా) నతని ఖాయపర్చుచు నుత్తరవు వేయకపోవచ్చును. లేదా ఆ తేదీ కట్టి ఉత్తరువు పడియుండవచ్చును. ఇన్‌సాల్‌వెన్సీ ఖాయపడిన పిమ్మట దివాలాదారు తనకు పూరా విడుదల (డిశ్చార్జి) నిమ్మని కోర్టువారియెదుట పిటిషన్ దాఖలుచేయవచ్చును. దివాలాదారు నష్టపడి నిందార్హ్హము కాదనియు, అతను దివాలాదారగుట దైవికకారణములచే సంభవించిన దనియు కోర్టువారు భావించినచో అతనికి పూరావిడుదల నిత్తురు. అట్టి పూరావిడుదల పొందియున్న దివాలాదా రభ్యర్థియై నిల్చుట కర్హుడే.

## లోకల్‌బోర్డుతో వ్యవహారము సాగించువారు

లోకల్‌బోర్డుతో సరకమ్ముటకు కాని కొన్ని కార్యములు నెరవేర్చుటకు కాని ఒడంబడిక చేసికొని వ్యవహరించువా రభ్యర్థులై నిలువరాదు. అట్టి వారిని మెంబర్లు కానిచ్చినచో వారు ఆ వ్యాపారములో లోకల్‌బోర్డు క్షేమ మాలోచింపక, తమ క్షేమము చూచుకొందురు. ఆ కారణముచే లోకల్‌బోర్డుకు నష్టము కలుగును.

అన్ని బాపతుల వ్యాపారములు సాగించువారికిన్ని అనర్హత లేదు. ఏమాదిరి వ్యాపారములు సాగించువా రనర్హులు కారో తెలుపబడినది. ఆవ్యాపారములు స్వల్ప పాటి వ్యాపారము లగుటవల్ల, లేదా ఆవ్యాపారములు సాగించువారు లోకల్‌బోర్డు మెంబర్లయినను కీడురాని సందర్భములలో, నట్టివారు మెంబర్లగుట కాక్షేపణ లేదని శాస్త్రకారులు వ్రాసియున్నారు.

లోకల్‌బోర్డు చేతిక్రింద పనిచేయుచున్నవారు, లోకల్‌బోర్డు ఉద్యోగులున్ను అనర్హులని నియమ మున్నది. యజమానియు నౌకరున్ను ఒక్కరే అగుట అసందర్భముగా నుండును కావున, అట్టి అసందర్భము వాటిల్లకుండ నీవిధి ప్రవేశపెట్టినారు.

మెంబరునౌకర్లు, యజమానులు, పైఉద్యోగి, క్రింద ఉద్యోగియున్ను అనర్హులని శాసించినారు. మెంబరు పైఉద్యోగి మెంబరుగా నెన్నుకొనబడె ననుకొందము. మెంబరు పైఉద్యోగి యిష్టాయిష్టములనుబట్టి మెలగవలసియుండును. స్వతంత్రముగా బోర్డుక్షేమ మారసి నడుచుకొనుటకు సావకాశ ముండదు. మెంబరు చేతిక్రింది ఉద్యోగి మెంబరుగా వచ్చినను, యీక్రొత్తమెంబరునకు స్వాతంత్ర్య ముండదు. తనపైఉద్యోగి కనుసన్నలలో మెలగవలసియుండును. ఆకారణముచే పైనిబంధన నేర్పర్చినారు.

1931 ఆల్ఇండియా రిపోర్టరు (మద్రాసు) 487 — న్యాయమూర్తి జాక్సన్.

అభ్యర్థి యొకనికి కుష్ఠురోగ మున్నదనియు అత డభ్యర్థిగా నిల్చుట కనర్హుడనియు ఎలక్షన్ ప్రెసిడెంటువద్ద పిటిషన్ దాఖలు కాబడెను. ఆపిటిషన్ దాఖలు చేసినవారిపై నా అభ్యర్థి మాననష్టపుకేసు తేగా వారికి జుల్మానా విధింపబడెను. ముద్దాయీలు హైకోర్టున కపీలుచేసిరి. ఇండియన్ పీనల్కోడు 499 సెక్షన్ (8)-వ మినహాయింపుప్రకార మట్టిపిటిషన్ దాఖలుచేయుటలో నేరములేదని జాక్సన్ జడ్జిగా రభిప్రాయపడిరి.

1925 ఆల్ ఇండియా రిపోర్టరు (మద్రాసు) 173—హోస్పేట తాలూకాబోర్డు ప్రసిడెంటు—ఎదిరి—జూటూరు చెంద్రప్ప. న్యాయమూర్తి జాక్సన్ గారు.

ఆనరరీమేజస్ట్రీటుగా పనిచేయు నాతడు తన పదవికి రాజీనామా యిచ్చిన వెంటనే అభ్యర్థిగా నిల్చుట కర్హుడగునా, అత డిచ్చిన రాజీనామా గవర్న మెంటువా రంగీకరించువరకు అనర్హుడైయుండి, గవర్నమెంటువా రంగీకరించిన పిదప అర్హుడగునా యను సమస్య యీ కేసులో సంభవించినది. గవర్నమెంటువా రంగీకరించువరకు అట్టి మేజిస్ట్రీటు తనపదవిలోనే యుండుననియు, గవర్నమెంటువా రంగీకరించిన వెనుకనే అతని కర్హత కలుగుననియు, రాజీ దాఖలు చేసినంతమాత్రముచే అర్హత రాదనియు జడ్జీగా రభిప్రాయ మిచ్చిరి.

56. 1 లోకల్బోర్డు మెంబరుగా పనిచేయుచున్నవా డీ క్రిందిసందర్భములలో తన పదవి గోల్పోవును:—

(1) పై 55 (1) సెక్షనులో నుదాహరించిన శిక్షపొందుట.

(2) మతివిహీనుడగుట, లేదా చెవిటివాడున్ను మూగవాడున్ను అగుట, లేదా కుష్టురోగి యగుట.

(3) ఇన్సాల్వెన్సీ పిటిషన్ దాఖలుచేయుట, లేదా ఇన్సాల్వెంటుగా ఖాయపడుట.

(4) లోకల్బోర్డుతో వ్యవహారసంబంధ మేర్పడుట.

[55 (2) (iii) సబ్ సెక్షనులో తెల్పిన విధు లన్నియున్ను, మినహాయింపులున్ను యీ సెక్షనుకున్ను అనువర్తించును.]

(5) ఆ లోకల్ బోర్డు తరఫున (ఫీజు పుచ్చుకొని) ప్లీడరుగా వ్యవహరించుట, బోర్డున కెదురుపక్షపు ప్లీడరుగా వకాల్తనామా పట్టుట.

(6) లోకల్ బోర్డు చేతిక్రింద నుద్యోగము సంపాదించుట, లేదా లోకల్ బోర్డు పాలనలోనున్న గ్రామములలో లేక పట్టణములలో ఆనరరీ మేజస్ట్రీటు ఉద్యోగము పొందుట.

(7) ఇంకొక మెంబరు చేతిక్రింద నుద్యోగము బడయుట, లేదా ఉద్యోగరీత్యా మరియొక మెంబరు క్రిందివాడగుట.

(8) జిల్లాబోర్డు మెంబరైనచో జిల్లాలో లేక (జిల్లాకు 3 మైళ్ల దూరములో నున్న మునిసిపాలిటీలో కాని కాంటన్మెంటులో కాని) కాపుర మెత్తిపెట్టుట.

పంచాయితీ మెంబరైనచో గ్రామములో కాపుర మెత్తిపెట్టుట.

(9) లోకల్ బోర్డు సభలకు 3 మాసముల వరకు రాకుండుట. ఆ మెంబరాఖరు పర్యాయము సభాసమావేశమునకు వచ్చినదిమొదలు వరుసగా 3 నెలలు సభాసమావేశములకు రానిచో నతడు పదభ్రష్టుడగును. లేదా ఆ 3 నెలలలోను 1 సభయే జరిగినచో, అతడు హాజరైనతర్వాత రెండు సభాసమావేశములకు రాకుండుట.

సభ జరుగనున్నదను నోటీసా మెంబరు కివ్వియుండనిచో, అతనిని పై కారణమున పదభ్రష్టుని చేయరాదు.

నిర్వచనము

2 వ షెడ్యూలు 3 వ రూలు (2) వ విధిప్రకారమున్ను, 4 వ రూలు ప్రకారమున్ను సమావేశమైన సభలకు మెంబరు రాకున్నను అతనిసీటుకు భంగ ముండదు.

[2 వ షెడ్యూలుప్రకారము 2 నెలల కొకసారియైన జిల్లాబోర్డు సమావేశము జరుగవలెను; మాసమున కొకసారియైన పంచాయితీసమావేశము జరుగవలెను.]

3 వ రూలు 2 వ విధి ననుసరించి ప్రెసిడెంటు జరూరుగా నేకార్యమైన కొనసాగింపవలసిన సందర్భములలో, మామూలు గడువుండగా మెంబర్లకు నోటీసీయ నక్కరలేకయే (అనగా కొద్దిగడువు మాత్రమే యిచ్చి జిల్లాబోర్డుసభకు ముందుగా 10 రోజులు నోటీసున్ను, పంచాయితీ సభకు ముందుగా 3 రోజుల నోటీసున్ను సాధారణముగా నీయవలెను) సభ సమావేశ పరుపవచ్చును.

4 వ రూలుప్రకారము సభ్యులలో 1/3 వ వంతు మంది ప్రత్యేక కార్యనిర్వహణకై సభ సమావేశపరుపమని ప్రెసిడెంటును కోరవచ్చును. అత డట్టిసమావేశ మేర్పరుపవచ్చును.

పై రెండు తరగతుల సమావేశములకు హాజరు కాకున్నను, మెంబరుపదవికి భంగమురాదు.

ii పై (1) వ విధిలో తెల్పిన శిక్షపడియున్నను, ఆ మెంబరు తనపదవి గోల్పోవ నక్కరలేదని గవర్నమెంటు శాసింపవచ్చును.

iii శిక్ష అపీలులో కాని రివిజనులో కాని కొట్టివేసినచో, లేదా గవర్నమెంటు వారి యుత్తర్వు ననుసరించి కళంకము తొలగిపోయినచో, వెంటనే ఆ మెంబరు తన పదవి నధిష్ఠించి, మిగిలినవర తంతయు మెంబరుగా నుండును.

ఈలోపుగా మరియొక మెంబ రతనిస్థానే ఎన్నుకోబడి యున్నచో, మొదటి మెంబరు తనస్థాన మాక్రమింపగనే రెండవ మెంబరు పదవిహీను డగును.

[శిక్షపడిన వెంటనే మెంబరు తనపదవి గోల్పోవును. శిక్షపడిన 3 మాసములు గడచినపిమ్మట అపీలులో శిక్ష కొట్టివేసిరని భావింతము. అపీలు తీర్పుచెప్పినవెంటనే అతడు మెంబరుపదవి నాక్రమించును. ఈలోపుగా ఆ ఖాళీలో మరియొకసభ్యు నెన్ను కొనినచో, మొదటి సభ్యుడు వచ్చినతోడనే, రెండవసభ్యు డాపదవి ఖాళీచేయవలెను.

లోకల్‌బోర్డు మెంబర్ల వరతు సాధారణముగా 3 సం.లు కదా. 1 సం. గడచిన పిదప శిక్షపడిన దనుకొందము. అపీలు తీర్పుచెప్పుసరికి 1 సం. 3 మాసములు గడిచినవి. మెంబరు వెంటనే తనపదవి నధిష్ఠించి 3 సం.ల వరతులోను మిగిలియున్న 1 సం. 9 మాసములున్ను మెంబరుగా నుండును.]

iv. బోర్డుమీటింగులకు రాని కారణముచే పదభ్రష్టుడైన మెంబరున కావర్తమానము ప్రెసిడెంటు వ్రాసిపంపవలెను. ఆ సంగతి ఆతర్వాత సమావేశమైన సభలో సభ్యుల కెరుకపర్చవలెను. ఆ సభాదినమునకాని, ఆలోపునకాని ఆ సభ్యుడు తన్ను తిరిగి సభ్యునిగా చేర్చుకొమ్మని బోర్డుసభ్యుల ప్రార్థించుచో, బోర్డువా రాతని తిరిగి తమలో చేర్చుకొనవచ్చును. లేదా ఆ సభ్యునికి వర్తమానముచేరిన 15 రోజులలోగా నతడు బోర్డుసభ్యుల పైరీతిగా ప్రార్థించినచో, వా రతనిని తమలో చేర్చుకొనవచ్చును.

కాని ఏసభ్యుని విషయములోను, యిట్టి సంఘటన (పదవి గోల్పోవుట, తిరిగి పదవి నిచ్చుట) వర తాఖరులోపుగా రెండుపర్యాయములకు మించి జరుగరాదు.

## తీర్పులు

1931 ఆల్ఇండియా రిపోర్టరు (మద్రాసు) 138—రామనాథచెట్టి యారుకేసుసందర్భములో న్యాయమూర్తి పండాలే.

ఆఖరుసభకు హాజరైనతేదీ లగాయితు 3 మాసములవరకు సభలకు రానిచో మెంబరుపదవి గోల్పోవును. తర్వాత అనగా 3 మాసములు గడచిన పిమ్మట సభకు వచ్చినను ప్రయోజనములేదు. ఆ తేదీలగాయితు వెనుకకు 3 మాసములు లెక్కపెట్ట రాదు. హాజరైన ఆఖరు సభ తేదీనుండి 3 మాసములు ముందునకే లెక్కపెట్టవలెను.

67 మద్రాసు లాజర్నలు 406— న్యాయమూర్తి మాధవనాయర్ తాళందవేలు-ఎదిరి-పట్టుముత్తు.

ఆయాబోర్డువారిని తనసీటు తనకిమ్మని కోరియున్నందున, ఆ మెంబరుకు 57 వ సెక్షన్ప్రకారము జిల్లాజడ్జి యెదుట పిటిషన్ దాఖలుచేయు నధికారము పోలేదు.

1926 ఆల్ఇండియా రిపోర్టరు (మద్రాసు) 1001— సుబ్బరాయ గౌండన్—ఎదిరి—ముత్తుకుమారస్వామి, న్యాయమూర్తి వాలేసు.

57 వ సెక్షన్ప్రకారము జిల్లాజడ్జి తీర్పు జరుగువరకు 56 వ సెక్షన్ప్రకారము మెంబరుపదవి గోల్పోయిన యాతడు, మెంబరుగానే యుండునను నియమము లేదు.

3 మాసములు సభాసమావేశములకు రానిమెంబరు, ఆ కాలనియమము దాటగానే పదభ్రష్టుడగును.

సుబ్బరాయగౌండన్ పల్లడంతాలూకాబోర్డుప్రెసిడెంటుగా నుండి 3 మాసములు సభాసమావేశములకు రాలేదు. 3 మాసములు గడచిన వెంటనే అతడు పదభ్రష్టుడైనట్లు నిరూపించినారు.

1926 ఆల్ఇండియా రిపోర్టరు 877 (మద్రాసు) వెంకటసుబ్బారావు, రెయిలీ న్యాయమూర్తులు. మరియపిళ్లే—ఎదిరి—ముత్తువేలు.

3 మాసములు సభలకు రాకున్న మెంబరుపదవి గోల్పోవును. కాని 3 సభాసమావేశములకు రాని మెంబరు పదవిహీనుడు కాడు. ఈ 3 మాసములలోను 2 సభలైన జరిగియుండవలెను. అతడా రెండు సభలకున్ను రాకయుండవలెను. అట్టి సందర్భములో నతనిపదవి ఖాళీయగును. ప్రెసిడెంటు బోర్డుసమావేశములో నీసంగతి చెప్పినను చెప్పకున్నను యీ సెక్షనుప్రకారము పదవిహీనుడగు సభ్యుడు (బోర్డు తిరిగిచేర్చుకొననిచో) తనస్థానము విడిచిపోవలెను.

57. (1) 54 వ సెక్షన్ (1) వ విధి ననుసరించి, లేక 55, 56, 59 సెక్షన్లలో దేనినిబట్టియైన, ఏ మెంబరైన అనర్హుడను వాదమువచ్చి, ఆ మెంబరట్టివాదము నంగీకరింపక తానర్హుడనే యని మారువాదము చెప్పుచున్నచో, లేదా

56 వ సెక్షన్ ప్రకారము, లేక 59 వ సెక్షన్ ప్రకారము తన కర్హత సిద్ధించిన దేమోయని ఏ మెంబరుకైన సందేహము కల్గినప్పుడున్ను

ఆ మెంబరు, లేదా మరియొక మెంబరు, లేదా లోకల్ బోర్డు తరపున ప్రెసిడెంటును చర్యపుచ్చుకోమని లోకల్ బోర్డు సభ్యులు కోరినచో, ఆ బోర్డు ప్రెసిడెంటున్ను ఆ జిల్లాజడ్జిగారి ఎదుట పైవిషయము తెల్పుచు పిటిషన్ దాఖలు చేయవచ్చును.

(2) ఆ జడ్జిగారు వలయు విచారణచేసి, పై విధుల ప్రకార మామెంబ రర్హుడో అనర్హుడో నిర్ణయింపవలెను. జడ్జిగారి తీర్పు ఖాయపు తీర్పుగా చెల్లవలెను.

(3) జడ్జిగారు తీర్పిచ్చులోపున, ఆ మెంబరు అనర్హతలేనట్లే తనపదవి నాక్రమింపవచ్చును.

58. [ఎలక్షన్ రహస్యభంగ మొనర్చుట - ఈ సెక్షన్ క్రిమినల్ నేరములతో పాటు తెల్పినాము. కావున యిచ్చట వేరుగా తెలుపలేదు.]

59. ఇండియన్ పీనల్ కోడు 9 ఏ భాగమునం దుదాహరించిన నేరములకు శిక్షు పొందినవారు (ఆ నేరములు వేరుభాగములో వ్రాసినాము) శిక్షవేసిన 5 సం. ల వరకు (లేదా శిక్షవేసిన మేజిస్ట్రేటు యీలోపుననే కళంకము పోవునని తీర్పిచ్చుచో, ఆ తీర్పులో వ్రాసిన గడువులోపున) ఓటరుగా నుండరాదు, అభ్యర్థియై నిలువరాదు, లోకల్ బోర్డు మెంబరుగా వ్యవహరింపరాదు.

# లోకల్ బోర్డుల మెంబరు ఎన్నికలవిధానము

ఈ దిగువ నిబంధనల ననుసరించి లోకల్ బోర్డు మెంబరు ఎన్నికలు జరుగ వలెను. వీనిని గవర్నరుగారున్ను వారి మంత్రులున్ను సంప్రతించి సమకూర్చినారు. వారి కట్టి అధికారము 1920 సం. పు మద్రాసు లోకల్ బోర్డులఆక్టు సెక్షన్ 199 (ఏ) (బి) లలో నిచ్చియున్నారు. వెనుకటి విధు లన్నియు రద్దుపర్చినారు.

## 1 వ భాగము

నిబంధన

1. (1) ఈ భాగములోని విధులు

(i) జిల్లాబోర్డులకు

(ii) పంచాయితీలకున్ను (25-8-1930 తేదీని గ్రామ యూనియన్లుగా నున్న వానికి)

(iii) పంచాయితీలకు (ఎలక్షన్ అధికారి ప్రచురణలో నుదాహరించినవానికి) సంబంధించినవి.

2, 3 భాగములలో నుదాహరించిన లోకల్ బోర్డులకు వేరువిధులు సమకూర్చినారు.

(2) ఎలక్షన్ అధికారి చేతిక్రింద పనిచేయునాతడు ఎలక్షన్ ఆఫీసరు.

[ఎలక్షనుపై సర్వాధికారమున్నవాడు ఎలక్షన్ అధికారి. అతనిపై పెత్తనము గవర్నమెంటుకు మాత్రమే యున్నది. (లోకల్ బోర్డు ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు కాని వ్యక్తిని) ఎలక్షన్ అధికారిపదవిలో నొకరిని గవర్నమెంటు నియమించును. ఎలక్షన్ అధికారి తనచేతిక్రింద ఎలక్షన్లకు సంబంధించినవిధు లన్నియు నిర్వహించుటకు ఎలక్షన్ ఆఫీసర్లను నియమించుకొనును.]

2. ఎలక్షన్ ఆఫీసరు యీ దిగువ హంశములు తెల్పుచు నొక నోటీసు వ్రాసి పంపవలెను. ఆ నోటీసు ఆంగ్లభాషలోను, ఆ జిల్లా వాడుక భాషలోను వ్రాయవలెను. నోటీసు ప్రకటించిన తేదీకిన్ని ఎలక్షన్ తేదీకిన్ని మధ్య 30 రోజులైన గడువుండవలెను

## ఆ నోటీసులో వ్రాయవలసిన హంశములు

(i) ఎన్నుకోవలసిన మెంబర్ల సంఖ్య

(ii) ఏ సర్కిలుకు, లేక గ్రామమునకు, లేక వార్డునకు మెంబర్ల నెన్నుకోవలెనో

(iii) మహమ్మదీయులు, క్రైస్తవులు, పంచములు, యూరపియన్లు, ఆంగ్లో యిండియన్లు, స్త్రీలు – వీరికి కేటాయించినసీట్లు ఏ సర్కిలులో లేక గ్రామములో నిచ్చిరో, ఏచోట ఏ తరగతివారికి సీటు కేటాయించి యుంచిరో

[పై తరగతులకు కొన్ని సీట్లు కేటాయించి యుంచవలెను. ఆ కేటాయించిన సీట్లకు ఆయాతరగతులకు చెందినవారిని మాత్రమే ఎన్నుకొనవలెను. కాని వారి నెన్నుకొనువారు ఆయాతరగతి వోటర్లేగాక ఆ ఖండములోని యావన్మంది వోటర్లున్ను అయి యున్నారు.]

(iv) మెంబర్ల నామినేషన్లు, ఏ తేదీని, ఎన్నిగంటలకు, ఎచ్చట దాఖలు చేయవలెనో

[నామినేషన్ల దాఖలు తేదీకిన్ని నోటీసు తేదీకిన్ని మధ్య 10 రోజులైన గడు వుండవలెను.]

[ప్రతి మెంబరు ఎన్నికకుముందుగా ఆతని పేరుపపాదించుచు నొక ఓటరు కాగితము వ్రాసి సంతకముపెట్టి యీయవలెను. మరియొక ఓటరు ఆ కాగితముపై తా నా అభ్యర్థి నామినేషన్ బలపర్చుచున్నట్లు వ్రాసి సంతకము చేయవలెను. ఓటర్లిద్దరిపేర్లున్ను జాబితాలో వ్రాసియుండవలెను. ఆ కాగితముమీద అభ్యర్థి తాను మెంబరు ఎన్నికలో నిలువ నంగీకరించినట్లు వ్రాసి సంతకము చేయవలెను. ఇట్టి నామినేషన్ కాగితము దాఖలైననే కాని ఏ అభ్యర్థియు మెంబరుగా నెన్నబడుట కర్హుడు కాడు.]

(v) నామినేషన్లు క్రమప్రకారము వ్రాయబడినదియు, లేనిదియు, ఏ తేదీని తనిఖీచూతురో.

ఈ తనిఖీచూచు తేదీకిన్ని ఎలక్షన్ తేదీకిన్ని మధ్య 15 రోజులైన గడువుండవలెను.

(vi) ఏరోజున, ఏ ఏ గంటలనడుమ, ఏ ప్రదేశములో ఓట్లుపుచ్చుకొందురో.

ఓట్లుపుచ్చుకొను గంటలు ఉదయము 7 గం॥ల నుండి సాయంత్రము 6 గంటల మధ్య నియమింపవలెను. 10 గంటలైనను ఓట్లు పుచ్చుకొనవలెను.

(vii) ఎలక్షన్ ఆఫీసరు, ఏచోట, ఏరోజున, ఎన్నిగంటలకు ఓట్లలెక్క నారంభించునో.

## అట్టి నోటీసు ప్రకటించుపద్ధతులు

(i) ఆయా లోకల్‌బోర్డు ఆఫీసులలో ఒక నోటీసునకలు అంటించవలెను.

(ii) జిల్లాబోర్డు ఎన్నికలలో తహసీల్దార్ల ఆఫీసులలోను, డిప్యూటీ తహసీల్దార్ల ఆఫీసులలోను, సబ్ మేజిస్ట్రేట్ల ఆఫీసులలోను, జిల్లాలో పెల్లడిచోట్లను నోటీసునకళ్లు అంటించవలెను.

(iii) పంచాయితీ ఎన్నికలలో గ్రామములో 3 పెల్లడిచోట్లను, ప్రతి వార్డులోను 3 పెల్లడిచోట్లను నోటీసునకళ్లు అంటించవలెను.

నామినేషన్లు.

3. (1) నామినేషన్లు 1 వ మతలబుప్రకారము వ్రాయవలెను. ఓటరుజాబితాలో పేర్లున్నవా రెవరడిగినను వారి కీ మతలబులు (ఎలక్షన్ ఆఫీసరు) ఉచితముగా నీయవలెను.

(2) నామినేషన్లపై ఉపపాదించు ఓటరున్ను బలపర్చు ఓటరున్ను సంతకములు చేయవలెను. అభ్యర్థిగా నిల్చుట కంగీకారము సూచించుచు నతడున్ను సంతకము చేయవలెను.

(3) ఆ సర్కిలులో (లేక వార్డులో) ఎన్ని ఖాళీలున్నవో, ప్రతి ఓటరున్ను అన్ని నామినేషన్లపై (ఉపపాదించుచు, లేక బలపర్చుచు) సంతకములు చేయవచ్చును. అంతకుమించి సంతకములు చేయరాదు.

ప్రతి అభ్యర్థి పేరున్ను సక్రమమైన యొక నామినేషన్ కాగితముపై వ్రాసియుండవలెను. లేనిచో నతని అభ్యర్థిత్వము సరియైనదికాదు.

(4) నామినేషన్లు అభ్యర్థి, లేక ఉపపాదించు ఓటరు, బలపర్చు ఓటరు కలిసి ఎలక్షన్ ఆఫీసరుఎదుట దాఖలు చేయవలెను. అవి నిర్ణయించినచోట నిర్ణయించిన గడువులోపుననే, దాఖలుకావలెను. ఎలక్షన్ ఆఫీసరు గా కాగితములపై వరుససంఖ్య వేసి ఏది ఏ తేదీని ఎన్నిగంటలకు దాఖలయ్యెనో వ్రాయవలెను.

(5) ఖాళీల సంఖ్యకు మించిన నామినేషన్లపై ఏ ఓటరైనను సంతకములు చేసియున్నచో, ఖాళీల సంఖ్యకు సరిపోవు నామినేషన్లు మాత్రమే దాఖలు పుచ్చుకొందురు. ముందు ఎలక్షన్ ఆఫీసరువద్ద దాఖలైన నామినేషన్లు మాత్రమే గౌరవింతురు.

(6) అభ్యర్థిపేరు సక్రమమైన యొక నామినేషను కాగితములో వ్రాసియున్న చాలును. అతనిపేరు పెక్కు నామినేషన్లలో చేర్చియున్నను కీడులేదు. వానిలో కొన్ని శాస్త్రవిరుద్ధము లైనను అతని అభ్యర్థిత్వమునకు భంగము రాదు.

(7) గడువులోపల దాఖలుకాని నామినేషన్లు మంజూరు చేయరు.

4. ఓటరుజాబితాలో అభ్యర్థిపేరున్ను, యిద్దరు ఓటర్ల పేర్లున్ను చూపుమని ఎలక్షన్ ఆఫీసరు కోరవచ్చును. జాబితాలో పేర్లున్ను నామినేషనులో పేర్లున్ను పోల్చిచూడవచ్చును. నామినేషనులోని వ్రాతపొరపాట్లు సవరింపుమనవచ్చును.

[రాజమండ్రి సర్కిలునుండి జిల్లాబోర్డుకు యిద్దరు మెంబర్ల నెన్నుకొనవలసి యున్నదని భావింపుడు. ఈ సర్కిలులోని ప్రతి ఓటరుకున్ను నామినేషన్లపై సంతకము చేయునధికార మున్నది. ఆ సంతక మతడు అభ్యర్థి నుపపాదించుచు, లేక బలపర్చుచు చేయవచ్చును. ఖాళీలు రెండే యున్నవి కాన, రెండు నామినేషన్లపైని మాత్రమే ఏ ఓటరైన సంతకములు చేయుటకు హక్కున్నది. రెండింటిని మించి సంతకములు చేయరాదు. రెండు కాగితములమీదను వేరువేరుగా అభ్యర్థుల పేర్లు వ్రాయవలసినదే కాని, యిర్వు రభ్యర్థుల పేర్లున్ను ఒకేకాగితముమీద వ్రాయకూడదు. ఒక ఓటరు 4 నామినేషన్లపై సంతకములు చేసె నని భావింతము. మొదట దాఖలైనవి రెండున్ను గౌరవించి, మిగతా రెండున్ను మంజూరు చేయరు.]

5 (1) నామినేషన్లతోపాటు యీ దిగువ ధరావత్తులు చెల్లింపవలెను. ధరావత్తు చెల్లింపని నామినేషన్లకు విలువలేదు. పంచములు ధరావత్తు చెల్లింపనక్కరలేదు.

జిల్లాబోర్డు సర్కిలుకు..............................రు 100/-

పంచాయితీ మెంబరు ఎన్నికకు..........................రు 25/-

ఒకే అభ్యర్థి పెక్కు సర్కిల్సులో ఎన్నిక నపేక్షించుచో, అన్నిమార్లు ధరావత్తుమొత్తము కట్టవలెను.

(2) అభ్యర్థిపదవికి రాజీ దాఖలుచేయవచ్చును. లేదా నామినేషన్ సక్రమమైనది కాదని ఆఫీసరభిప్రాయ మీయవచ్చును. ఈ రెండుసంధర్భములలో ధరావత్తు సొమ్ము వాపసుచేయవలెను.

(3) ఓట్లసంఖ్యను మెంబర్లసంఖ్యచే విభాగించి, ఆ సంఖ్యలో 1/8 వ వంతు పైగా ఓట్లురాని అభ్యర్థుల ధరావత్తుసొమ్ము జిల్లాబోర్డునకు సంక్రమించును.

(ఉదాహరణము :

| | |
|---|---|
| రాజమండ్రి సర్కిలులో వేసిన ఓట్లసంఖ్య | 1,600 |
| ,, ,, మెంబర్ల సంఖ్య | 2 |
| 1600 ను 2 చే భాగింపగా వచ్చిన సంఖ్య | 800 |
| 800 లో 1/8 వ వంతు | 100 |

100 ఓట్లుపైగా వచ్చినవారి ధరావత్తు సొమ్ము వాపసు చేయుదురు.

100 ఓట్లున్ను 100 ఓట్లకు తక్కువ వచ్చినవారి సొమ్ము జిల్లాబోర్డుకు సంక్రమించును)

(4) పై ఓట్లసంఖ్య నిర్ధారణచేయుటలో చెడిపోయిన ఓట్లు మినహా తక్కిన ఓట్లన్నియు గణనచేయుదురు.

(5) గెజెటులో ఎలక్షన్‌ఫలితములు ప్రచురణ మైనపిదప, మిగతా అభ్యర్థులు కట్టిన మొత్తములు వాపసుచేయవలెను. గెల్చిన అభ్యర్థిసొమ్ము అతడు జిల్లాబోర్డు మీటింగుకు ప్రథమపర్యాయము హాజరైన పిదప వాపసుచేయవలెను. అతడు మొదటి సభకు రానిచో అతనిసొమ్ము వాపసుచేయుపద్ధతి గవర్నమెంటువా రేర్పరుతురు.

(6) ఒక అభ్యర్థి రెండుమూడు సర్కిల్సులో ఎన్నిక పొందగోరి రెండుమూడింటిలో సొమ్ము కట్టియున్నచో, ఒక్క మొత్తము మాత్రమే అతనికి వాపసు చేయుదురు.

(7) సొమ్ము వాపసు పుచ్చుకొననధికార మున్నవారు మరణించినచో, ఆ మొత్త మతని వారసుల కీయవలెను.

(8) ఎలక్షన్ ఫలితములు ప్రకటించిన 6 మాసములలోగా సొమ్ము వాప సీయమని కోరుచు పిటిషన్ దాఖలుచేసిననే కాని ఎవరికిన్ని సొమ్ము వాపసుచేయరాదు.

6. నామినేషన్లు దాఖలుచేయు గడువున్ను, అభ్యర్థులు రాజీలు దాఖలుచేయు గడువున్ను దాటినపిమ్మట, ఎలక్షన్ ఆఫీసరు అభ్యర్థుల పేర్లన్నియు అకారాదిగా నొక జాబితాలో వ్రాయవలెను. ఆ జాబితా 2 వ మతలబును బట్టి వాడుకభాషలో వ్రాయవలెను. ఆ జాబితా జిల్లాబోర్డు ఆఫీసులో నంటించవలెను.

నామినేషన్లు సక్రమమైనవో కావో ఫలానిచోట ఫలాని తేదీని ఫలాని గంటల వేళ ఎలక్షన్‌ఆఫీసరు తనిఖీచూచునని నోటీసువ్రాసి పై జాబితాతోపాటు ప్రచురింపలెను.

## నామినేషన్ల తనిఖీ

7. (1) ఈ తనిఖీ ఎలక్షన్ ఆఫీసులో జరుగవలెను. ఆ ఆఫీసులోనికి అభ్యర్థి అభ్యర్థి నుపపాదించిన ఓటరు, బలపర్చిన ఓటరు, అభ్యర్థి (లిఖితముగా) నియమించిన ప్రతినిధి, ఆఫీసరు సహాయనిమిత్తమేర్పర్చుకొన్నవారున్ను వెళ్లవచ్చును. ఇతరులు పోరాదు. హాజరున్నవారు నామినేషన్లు చూచుట కవకాశ మీయవలెను.

(2) నామినేషన్లు ఎలక్షన్ ఆఫీసరు తనిఖీచూచి, క్రమవిరుద్ధములైనవి నిరాకరింపవచ్చును. హాజరున్నవారిలో నెవరైన ఆక్షేపణలు సూచింపవచ్చును. అట్టి నిరాకరణ కీ క్రిందికారణములలో నేదియో యొకటి గోచరింపవలెను:—

(i) ఆక్టు 54, 55, లేక 59 సెక్షన్ల ప్రకారము అభ్యర్థి అనర్హుడగుట.

(ii) ఆయా ఓటరు జాబితాలో అభ్యర్థిపేరు, లేక ఉపపాదించు ఓటరు పేరు, లేక బలపర్చు ఓటరుపేరు లేకుండుట.

(iii) పై 3 వ రూలు, 5 వ రూలు ప్రకారము అభ్యర్థి లేక అతనికి సహాయులగు ఓటర్లు సంచరింపకుండుట. (సహాయులగు ఓటర్లనగా ఉపపాదించిన ఓటరున్ను, బలపర్చిన ఓటరున్ను)

(iv) రిజర్వుడ్ సీటు ఎన్నికసందర్భములలో నభ్యర్థి ఆయా తరగతికి చెందకుండుట.

[మహమ్మదీయులకు రిజర్వుడ్ సీటు కేటాయించి రనుకొందము. అభ్యర్థి మహమ్మదీయుడు కానిచో అతని నామినేషన్ కాగితము నిరాకరింపవలెను]

(3) నామినేషన్ల తనిఖీ 2వ రూలులో నుదాహరించిన తేదీని పూర్తికావలెను.

ప్రతి నామినేషన్ కాగితముపై ఎలక్షన్ ఆఫీసరు (అంగీకరించినట్లు లేక నిరాకరించినట్లు) తీర్పు వ్రాయవలెను. నిరాకరించినచో, కారణములున్ను వ్రాయవలెను.

8. (1) నామినేషన్ల తనిఖీ పూర్తియైనవెనుక (అభ్యర్థులు రాజీలు దాఖలుచేయు గడువు దాటినపిమ్మట 9 వ రూలు చూ.) ఆఫీసరు నిల్చియున్న అభ్యర్థుల పేర్లు జాబితాలో వ్రాసి ఆయాబోర్డు ఆఫీసులో (ఎన్నికకు 4 రోజులు ముందైనను) ప్రచురించవలెను.

(2) నామినేషన్లలో వ్రాసినప్రకారము అభ్యర్థుల పేర్లున్ను తబిసీళ్లున్ను పై జాబితాలో వ్రాయవలెను.

(3) జిల్లాబోర్డు ఎన్నికలలో పై జాబితా ఆయా సర్కిలులోని తహసీల్దార్ల, డిప్యూటీ తహసీల్దార్ల, సబ్ మేజిస్ట్రేట్ల ఆఫీసులలోను, ప్రతిఓట్ల ఆఫీసులోను, ప్రకటింపవలెను.

9. (1) తాను ఎన్నికలలో పాల్గొన నిష్టములేదని ఏ అభ్యర్థియైన ఎలక్షన్ ఆఫీసరుకు వ్రాసి, అందుపై సంతకముచేసి పంపవచ్చును. ఆ కాగితము ఆఫీసరుకు తనిఖీ జరిగిన మరునాడు మధ్యాహ్నము 3 గంటలులోపుగా చేరవలెను.

అభ్యర్థి స్వయముగా నట్టి కాగితము దాఖలుచేసినచో, అందుపై సాక్షి సంతకమక్కరలేదు.

ఇతరులద్వారా పంపిన కాగితములపై గ్రామమునసబు సాక్షిసంతక ముండవలెను. (లేదా కోర్టు వకాల్తునామాలు ధ్రువపర్చుట కధికారమున్న మరి ఏ ఉద్యోగి సాక్షిసంతకమైన యుండవలెను.)

ఒకసారి పై కాగితము దాఖలుచేసినవారు, తిరిగి అభ్యర్థిగా నిలువరాదు.

(2) రాజీకాగితములు దాఖలైన వర్తమానము ఎలక్షన్ ఆఫీసరు ప్రకటింపవలెను.

10. అభ్యర్థుల ఎన్నికలలో యీ క్రిందివిధు లవలంబింపవలెను:—

(1) జనరల్ సీట్లకు ఎన్నికజరుగు సందర్భములో, ఏదియో ఒకతరగతి రిజర్వ్‌డ్ సీట్ల ఎన్నికజరుగుసందర్భములో,

(i) ఖాళీల సంఖ్యకు అభ్యర్థులసంఖ్య సరిపోయినచో, అభ్యర్థులందరు మెంబర్లుగా నెన్నుకొనబడిరని ఎలక్షన్ ఆఫీసరు వెల్లడిచేయవలెను.

(ii) ఖాళీల సంఖ్యకంటె అభ్యర్థుల సంఖ్యయే తక్కువగా నున్నచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లుగా పరిగణింపబడుదురు; మిగతా ఖాళీలకు క్రొత్త ఎన్నికలు జరుగును.

(iii) అభ్యర్థి ఎవరున్ను లేకున్నచో క్రొత్తఎన్నికలు జరుగును.

(iv) అభ్యర్థులసంఖ్య ఖాళీలసంఖ్యకు మించియున్నచో వోట్లుపుచ్చుకొనవలెను.

[రామచంద్రపురము సర్కిలునుండి జిల్లాబోర్డున కిర్వురుసభ్యుల నెన్నుకోవలసియున్న దనుకొందము. సీట్లు రెండున్ను జనరల్ సీట్లేయని భావింతము. అభ్యర్థు లిర్వురేయున్నచో యిర్వురున్ను మెంబర్లగుదురు; అభ్యర్థి ఒక్కరేయున్నచో అతను మెంబరగును. మిగతా ఖాళీకి క్రొత్తఎన్నిక జరుగును. అభ్యర్థి ఎవరున్ను లేకున్నచో

క్రొత్త ఎన్నిక జరుగును. అభ్యర్థులు ముగ్గురు కాని నలుగురు కాని యింకను హెచ్చు మంది యున్నచో, వోట్లు పుచ్చుకొనవలెను.]

II రెండుమూడు రిజర్వుసీట్లకు ఎన్నిక జరుగుచున్నచో ఆసీట్లు వేరువేరుతరగతుల సీట్లైనచో

(i) ఏతరగతిలో ఎన్నుకోవలసిన మెంబర్లసంఖ్యకు ఆతరగతి అభ్యర్థుల సంఖ్యయు సరిపోయినచో, అభ్యర్థు లందరును మెంబర్లయినట్లు భావింతురు.

(ii) ఏతరగతిలోనైన సీట్లసంఖ్యకు అభ్యర్థులసంఖ్య తగ్గియున్నచో, అభ్యర్థు లందరును మెంబర్లగుదురు; క్రొత్తఎన్నికలు మిగతా ఖాళీలవిషయమై జరుపబడును.

(iii) ఏతరగతిలోనైన అభ్యర్థి లేకున్నచో క్రొత్త ఎన్నికలు జరుగవలెను.

(iv) మిగతాసందర్భములలో (అనగా మెంబర్లుగా అభ్యర్థులను స్థిరపర్చని సందర్భములోను, క్రొత్తఎన్నిక జరుప నగత్యములేని సందర్భములోను) వోట్లుపుచ్చుకొనవలెను.

(III) 1, 2 రిజర్వుసీట్లకున్ను 1, 2 జనరల్‌సీట్లకున్ను ఒకేసారి ఎన్నికలుజరుగు సందర్భములలో.

(i) ఏతరగతి అభ్యర్థుల సంఖ్యయైన ఆతరగతి ఖాళీలసంఖ్యకు సరిపోయినచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లుగా పరిగణింపబడుదురు.

(ii) ఏతరగతిలోనైన ఖాళీలసంఖ్యకు తక్కువగా అభ్యర్థుల సంఖ్య యున్నచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లగుదురు. మిగతాఖాళీలకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(iii) ఏతరగతిలోనైన అభ్యర్థిగా నెవరున్ను నిలువనిచో ఆఖాళీకి, క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(iv) పైరీతిగా మెంబ ర్లెన్నుకోబడిన సీట్లున్ను, క్రొత్తఎలక్షన్ జరుగవలెనని నిర్ణయించిన సీట్లున్ను మిగతా ఎన్నికలనుండి తప్పింపవలెను.

(v) అట్లు తప్పించినవెనుక

(అ) మిగతా ఖాళీలసంఖ్యకు అభ్యర్థులసంఖ్య సరిపోయినచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లయినట్లు నిర్ధారణ చేయవలెను.

(ఆ) ఖాళీలసంఖ్యకు అభ్యర్థుల సంఖ్య తక్కువగానున్నచో అభ్యర్థులంద రున్ను క్రింది (vi) వ రూలులో తెల్పినరీతిగా మెంబర్లయినట్లు భావించి మిగిలిన సీట్లకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(ఇ) అభ్యర్థులే లేనిచో క్రొత్తఎన్నికలు జరుపవలెను.

(ఈ) ఖాళీలసంఖ్యకు మించి అభ్యర్థులసంఖ్య యున్నచో, వోట్లు పుచ్చుకొనవలెను.

(vi) (అ) పై (v) (అ) (ఆ) లలో తెల్పినసందర్భములలో అభ్యర్థులందరున్ను జనరల్ సీట్ల కన్నింటికి ఎన్నుకోబడినట్లు నిశ్చయింపవలెను. (అభ్యర్థులందరు అనగా రిజర్వ్డ్ సీట్లకు ఎన్నుకోబడిన అభ్యర్థులు తప్ప మిగతా యావన్మందియున్ను. క్రింద (ఆ) చూ.)

(ఆ) పై (v) (అ) (ఆ) లలో తెల్పినసందర్భములలో ఏతరగతిలోనైన ఖాళీల సంఖ్యకుమించి అభ్యర్థిసంఖ్యయున్నచో, లాట్లువేసి ఎవ రెన్నుకోబడిరో ఎలక్షన్ ఆఫీసరు నిర్ణయింపవలెను. అభ్యర్థు లందరున్ను తమలో కొందరిని సభ్యులుగా నిర్ణయింప వలసిన దని అందరున్ను ఏకస్థులై వ్రాసి, సంతకములుచేసి, ఆకాగితము రాజీలుదాఖలు చేయ నియమించినగడువు దాటినపిమ్మట 24 గంటలలోపుగా ఎలక్షన్ ఆఫీసరు కంద జేసినచో అత డాప్రకారము నడచుకొనవలెను.

## నిర్వచనము

### అభ్యర్థి

క్రమప్రకారము నామినేషనై రాజీ దాఖలుచేయనివాడు.

### ఎన్నుకోతగిన అభ్యర్థి

ఏ తరగతిసీటునకైన ఎన్నుకొన నర్హుడు. ఆ తరగతికి చెందినవాడు. ఉదా. మహమ్మదీయ సీటుకు మహమ్మదీయుడే ఎన్నుకోతగిన అభ్యర్థి.

### రిజర్వ్డ్ సీటు

ఫలాని తరగతివారికి, లేక స్త్రీలకు, కేటాయించిన సీటు.

### రిజర్వుకానిసీటు

ఏ తరగతికిన్ని కేటాయించని జనరల్ సీటు.

### ఒకేతరగతి రెండుసీట్లు

రెండున్ను ఒకేతరగతి మెంబర్లకు, లేక రెండున్ను స్త్రీలకు, కేటాయించినసీట్లు.

**11.** (1) ప్రతి ఓట్ల ఆఫీసులోను ఓట్లు పుచ్చుకొనుట కొకరిద్దరు ఓట్ల ఆఫీసర్లను ఎలక్షన్ ఆఫీసరు నియమింపవలెను. వారికి జీతభత్యములు కూడ నేర్పరుపవచ్చును. ఓటర్లను ఆనవాలుపట్టుటకు మరికొందరిని నియమింపవచ్చును. ఓట్ల ఆఫీసరు ఆ బోర్డు సభ్యుడై యుండరాదు, ఓటరై యుండరాదు.

(2) ఓట్లు పుచ్చుకొనులోపుగా అభ్యర్థులలో నెవరైన కాలముచేసినచో, ఎలక్షన్ ఆఫీసరు అంతటితో ఎలక్షన్ ఆపుచేయించవలెను. ఎలక్షన్ విషయమై జరుగ వలసిన కార్యక్రమ మంతయు తిరిగీ మొదటినుండి ప్రారంభింపవలెను.

అప్పటికి సక్రమముగా నామినేషన్ కాబడియున్న అభ్యర్థులు యీ క్రొత్త ఎన్నికలో (తిరిగి నామినేషన్ అక్కరలేకయే) అభ్యర్థులుగా పరిగణింపబడుదురు.

### వోట్లుపుచ్చుకొను విధానము

**12.** ఓట్ల ఆఫీసరు ఓట్ల ఆఫీసులో అల్లరి జరుగకుండ ఎలక్షన్ సక్రమముగా జరుగునట్లు ఏర్పాటుచేయవలెను. ఎందరొక్కసారి లోనికివచ్చి ఓట్లు వేయవలెనో నిర్ణయింపవలెను. తన గుమాస్తాలను, అభ్యర్థులను, అభ్యర్థులతరఫు ప్రతినిధులను, పోలీసు వారిని, ఓటరులను గుర్తుపట్టువారినిమాత్రమే లోనికిరానిచ్చి మిగతా యావన్మందిని ఆఫీసుబైట యుంచవలెను.

**13.** ఓట్ల పెట్టెలలో ఓట్లు వేయుటకు వీలుండవలెను. తీయుటకు వీలుండరాదు. ఓట్లు పుచ్చుకొనుటకు ముందు ఆఫీసరు ఖాళీపెట్టె ఆఫీసులో నున్నవారికి చూపి, తాళము వేసి, సీలువేసి తన యెదుట పెట్టుకొనవలెను. తాళపు చెవికికూడ సీలువేసి యుంచవలెను.

**14.** ప్రతి ఓట్ల ఆఫీసరుకు వలయు గుమాస్తాలను ఎలక్షన్ ఆఫీసరు నియమింపవలెను. ఓటరుజాబితా నకలున్ను, నామినేషన్ల జాబితాయు, ఓటు కాగితములు, ఓట్ల పెట్టెలు, తెల్లకాగితములు, మతిలబులున్ను ఓట్ల ఆఫీసరుకు ఎలక్షన్ఆఫీసరు పంప వలెను. ఎందరు మెంబర్ల నెన్నుకొనవలసినదో తెలుపవలెను.

**15.** ఓటుకాగితములు 4 వ మతిలబు ప్రకారము ముద్రింపవలెను. వాటిపై వరుస నంబర్లు వేయవలెను. ఆ కాగితము రెండు ముక్కలుగా నుండును. ఒకముక్క ఆఫీసరువద్దనే యుండిపోవును. రెండవది ఓటరు కివ్వబడును. ఆఫీసరు వద్దనున్న ముక్కలపై వరుసనంబరు వేయవలెను. ఓటరుకిచ్చిన ముక్క వెనుకపేటీని ఆనంబరే వేయవలెను. ఓటు కాగితముమీది పేర్లు ఇంగ్లీషుభాషలోగాని వ్యవహారభాషలో గాని లేదా రెండుభాషలలోగాని వ్రాయవలెను. పేర్లు అకారాదిగా వ్రాయవలెను. ఒక

పేరున్న అభ్యర్థు లిద్దరున్నచో, యింటిపేరు లేక వృత్తి వ్రాసి, యిద్దరికి భేదము కనబర్చవలెను.

16. ఓటరుకు ఓటుకాగితపు రెండవముక్క నిచ్చుటకు పూర్వము ఓట్ల ఆఫీసరు

(i) ఆ ముక్కపై తన పొడియక్షరములు వ్రాయవలెను.

(ii) మొదటి ముక్కపై ఓటరు పేరున్ను జాబితాలో నంబరున్ను వ్రాయవలెను.

(iii) జాబితాలో ఓటరుపేరున కెదురుగా పొడియక్షరములు వ్రాయవలెను.

అటుపైన ఓట్ల ఆఫీసరు ఓటరు ఎన్ని ఓట్లు వేయవచ్చునో తెలిపి, కాగితమాతని కీయవలెను.

17. ఓటుకాగితము పుచ్చుకోగానే ఓటరు చాటుగదిలోనికి వెళ్లి [ఓట్లు చాటుగా వేయుట కొకగది యేర్పాటు చేయవలెను.] తాను ఓటీయదలచిన అభ్యర్థి పేరున కెదురుగా నొక గుర్తుంచవలెను. పిదప గుర్తు కనబడకుండ కాగితము మడిచి, ఆ కాగితము వెనుకనున్న పొడియక్షరములు పోలింగుఆఫీసరుకు చూపి, ఓట్లపెట్టెలో పడవేయవలెను.

18. (1) చదువురాని ఓటర్లు తమ తరఫున ఓటుకాగితముపై గుర్తు పెట్టమని ఓట్ల ఆఫీసరును కోరవచ్చును. ఆ కాగితముపై వ్రాసియున్న అభ్యర్థులపేర్లు ఆఫీసరా ఓటరుకు చదివి వినిపించి, ఓటరు ఎవరిపేరున కెదురుగా గుర్తుపెట్టమని కోరునో ఆ పేరు ఎదుట గుర్తుపెట్టి ఆ కాగితము ఓటరు వేయవలెను. ఓటరు దానిని ఓట్లపెట్టెలో పడవేయవలెను. హాజరులో నున్న అభ్యర్థులు వారితరఫు ప్రతినిధులున్ను ఓటరుకు ఆఫీసరుకు జరిగిన సంభాషణ వినవచ్చును, ఆఫీసరు గుర్తుపెట్టుచుండగా చూడవచ్చును.

(2) ఇట్లు గుర్తుపెట్టిన కాగితము వెనుకముక్కపై ఓట్ల ఆఫీసరు తాను గుర్తుంచినందుకు కారణము వ్రాయవలెను.

(3) ఓటరు గుర్తుపెట్టుమనినప్రకారము ఆఫీసరు గుర్తుపెట్టలేదను వాదము చేయరాదు.

19. స్త్రీ ఓటర్లు ఓట్లువేయుటకు ఆఫీసరు ప్రత్యేకసౌకర్యములు కలిగింపవచ్చును. అందువిషయమై ఎలక్షను అధికారి సూచన లీయవచ్చును.

20. (1) ఈ క్రిందిసందర్భములలో ఓటుకాగితములు నిరాకరింపవలెను:—

(i) ఏ పేరున కెదురుగా గుర్తున్నదో తెలియకుండుట.

(ii) ఖాళీల సంఖ్యలకంటె హెచ్చుమంది అభ్యర్థులపేర్ల కెదురుగా గుర్తు లుండుట.

(iii) ఓటుకాగితముపై ఓటరు నానవాలుపట్టుటకు వీలిచ్చు సంకేత మేదైన పెట్టియుండుట.

[ఎందరు మెంబర్ల నెన్నుకోవలసి యున్నదో అందరభ్యర్థుల పేర్లకెదురుగా గుర్తుపెట్టవలెను. ఎక్కువమంది పేర్లకెదురుగా గుర్తులు పెట్టినచో, ఆ ఓటుకాగితమున కట్టి విలువయు నీయరు. ఎవరిపేరున కెదురుగా గుర్తుంచబడి యున్నదో అనుమానముగా నున్నప్పుడు ఆ ఓటునకు అనగా ఆ గుర్తునకు విలువయుండదు. మిగతా గుర్తులకు విలువయుండును. ఓట్లు రహస్యముగా వేయవలెననియు, ఏ ఓటరు ఏ అభ్యర్థికి ఓటిచ్చెనో తెలియరాదనియు గవర్నమెంటు అభిప్రాయము. ఫలాని ఓటరు మరియొక అభ్యర్థికి ఓటిచ్చెననియు తనకీయలేదనియు తెలిసికొని, ఓటుపొందని అభ్యర్థి ఓటరును బాధింపవచ్చును. ఓటు ఎవరికిచ్చినది తర్వాత వెల్లడి యగునని ఓటరునకు తెలిసినచో, అభ్యర్థులకు తెలిసినను బాధలేని పద్ధతిని ఓటువేయునుకాని, తన స్వంతత్రబుద్ధి ననుసరించి వేయడు. ఇట్టి చిక్కులకు చోటులేకుండ, ఓటుకాగితముపై ఓటరు నానవాలు పట్టుటకు వీలగు నెట్టిగుర్తు పెట్టియున్నను, ఆఓటు రద్దుకావలెనని నిర్ణయించినారు.]

(2) ఒక అభ్యర్థిపేరున కెదురుగా రెండుగుర్తు లుంచియున్నను ఒకటే ఓటుగా భావింతురు. కాని ఖాళీలకు మించిన అభ్యర్థుల పేర్లకెదురుగా గుర్తు లుండరాదు.

(3) ఏ అభ్యర్థిపేరున కెదుట గుర్తుంచబడెనో అనుమానముగా నున్నప్పుడు ఆగుర్తునకు విలువనీయరు. కాని కాగితములోని మిగతాగుర్తులకు విలువనిత్తురు.

**21.** ఓట్లఆఫీసరు ఓటుకాగిత మిచ్చుటకుముందు ఓటరు నీప్రశ్నలు వేయవచ్చును. అభ్యర్థులు, ఏజంట్లు కోరినచో, వేయవలెను.

(i) (జాబితాలో పేరు చదివి) ఈ ఓటరువు నీవేనా?

(ii) ఈ ఎన్నికలో నింకే ఆఫీసులోనైన ఓటువేసితివా?

(i) వ ప్రశ్నకు అవుననియు, రెండవప్రశ్నకు లేదనియు ఓటరు జవాబిచ్చినచో అతనికి ఓటుకాగిత మీయవచ్చును.

జాబితాలో పేరున్న ప్రతివారికిన్ని (పైవరతులకు లోపించి) ఓటుకాగిత మిచ్చి తీరవలెను.

**22.** ఒకరిపేరున ఓటుపడిన పిమ్మట, ఇంకొకఆసామీ ఆపేరు తనపేరని చెప్పి ఓటుకాగిత మిమ్మని కోరవచ్చును. అతనికి ఓట్ల ఆఫీసరు పైప్రశ్నలువేసి జవాబుపొంద

వలెను. ఆప్రశ్నలకు సరియైన జవాబిచ్చినచో అతనికి ఓటుకాగిత మీయవలెను. అతడు ఓటువేసిన పిమ్మట నాకవరుపై ఓటరుపేరున్ను, నంబరున్ను వేయవలెను. వీనిని పేచీ ఓట్లందురు. వీనికి ఓట్లఆఫీసరొక జాబితా వ్రాసియుంచవలెను. (జాబితా 5 వ మతలబుప్రకారము వ్రాయవలెను) ఆఓటరు నాజాబితాలో సంతకము చేయుమని కోరవలెను. సంతకము చేయలేని ఓటరును వేలుముద్ర వేయుమని కోరవలెను.

ఓట్లలెక్కలో పేచీఓట్లు గణనచేయరు.

22, 23 నిబంధన లమలులో పెట్టుటకు వీలగు సందర్భములలో, రెండున్ను అమలులో పెట్టవలెను.

23. పైవిధముగా ఓటుకాగిత మిమ్మని కోరేవ్యక్తి కృత్రిమనామము పెట్టుకొని ఓటువేయ యత్నించుచున్నాడనియు, ఆసంగతి తాను రుజువు పర్చెదననియు ఏఅభ్యర్థియైన, ఏజంటైన ఓట్ల ఆఫీసరుతో చెప్పవచ్చును. ఇట్టి ఓట్లు తగాయిదాఓట్లు. వీని కొకజాబితా వ్రాసియుంచవలెను. ఆజాబితా 6-వ-మతలబునకనుసరించి వ్రాయవలెను. ఆ అభ్యర్థి లేక ఏజంటుపేరా జాబితాలో వ్రాయించి అతనిని సంతకము (లేక వేలుముద్ర) వేయమని కోరవలెను. అతడు తెల్పువిషయము (ఓటరు మారుపేరుతో వచ్చినాడని రుజువు చేయుమనియు కోరవచ్చును.

పైనుదాహరించిన ప్రశ్నలు ఓటరుకు వేసి, వాని కతడు సరియైన జవాబిచ్చినచో ఆఫీసరతనికి ఓటుకాగిత మీయవలెను. అతడు కృత్రిమనామముతో వ్యవహరించుచున్నచో అది నేరమనియు శిక్షార్హమనియు ఆఫీసరు ఓటరుతో చెప్పవలెను.

తగాయిదా ఓట్ల జాబితాలో, ఆఫీసరు జరిగినవిషయ మంతయు వ్రాసి, అందుపై తన యభిప్రాయమున్ను వెలిబుచ్చవలెను.

ఆ ఓటరుకద్ద ఓటుకాగితము పుచ్చుకొని వేరే కవరులో నుంచవలెను.

24. పొరపాటున ఓటుకాగితము పాడైనచో ఆఫీసరది పుచ్చుకొని (దానిపై రద్దయినట్లు వ్రాసి) క్రొత్తకాగిత మొకటి ఓటరున కీయవలెను.

24-ఎ. (1) ఓటరు మరియొక ఓట్ల ఆఫీసులో హాజరై యుండవలసియున్నచో (ఆఫీసరుగా లేక ఏజంటుగా) అతని ఓటున్న ఆఫీసులో నతడు ఓటువేయుట కవకాశ ముండదు. వానికి ఎలక్షన్ ముందుగానే ఓట్ల ఆఫీసరు ఓటుకాగిత మీయవలెను. అతడు పనిచేయు ఆఫీసులోనుండియే ఓటు వేయుటకు సావకాశము కల్పింపవచ్చును. ఆ ఓటుకాగితము వెనుకముక్కపై యీ విధముగా వ్రాయవలెను:—

"........................పేరుగలవారికి.

............ఓట్ల ఆఫీసులో...............సర్కిల్ (లేక గ్రామం లేక వార్డు) లో ఓటున్నది; అలడు పనిచేయు ఆఫీసులోనే ఓటు వేయుటకు సావకాశ ముండేపద్ధతిని అతనికి ఓటుకాగితము ముందుగానే యిచ్చుచున్నాను.

..............................

ఎలక్షన్ ఆఫీసరు సంతకము.

(2) ఓటరా కాగితముపై గుర్తుంచి, కవరులోపెట్టి సీలువేసి, ఓట్లు లెక్కపెట్టే రోజునకు ముందుగా ఎలక్షన్ ఆఫీసరుకు పంపవలెను. ఎలక్షన్ ఆఫీసరు తక్కిన ఓట్లతోపాటు యీ ఓటున్ను లెక్కపెట్టును.

24-బి. (1) వరదవల్లకాని, భూకంపములవల్లగాని అల్లరులవల్లగాని ఓట్ల ఆఫీసు పనిచేయుటకు సావకాశము లేనప్పుడు ఆఫీసరు వెంటనే తన ఆఫీసు మూసివేసి, ఓటర్లకా వర్తమానము తెలుపవలెను.

(2) 25, 26 విధులలో తెలిపిన కార్యక్రమము ఓట్లఆఫీసరు జరుపవలెను. తాను ఆఫీసు మూసివేసినందుకు కారణము లన్నియు తెలుపుచు ఎలక్షన్ ఆఫీసరుకు రిపోర్టు వ్రాసిపంపవలెను. అందుపై ఎలక్షన్ఆఫీసరు తన అభిప్రాయములను వెలిబుచ్చుచు ఆ రిపోర్టు ఎలక్షన్అధికారికి పంపవలెను.

(3) (i) ఏర్పరిచిన గంటలలో ఎన్నిగంటలు ఆఫీసు మూయబడెనో అన్నిగంటలు తిరిగి ఆఫీసు తెరిచి ఓట్లు పుచ్చుకోవలసిన దని ఎలక్షన్ అధికారి నిర్ణయింపవచ్చును. లేదా వెనుకటివోట్లు రద్దుచేసి, క్రొత్తగా వోట్లుపుచ్చుకొనవలసిన దని ఆజ్ఞాపింపవచ్చును. ఎలక్షన్ అధికారి వేసిన ఆర్డరునకు తిరుగులేదు.

(4) ఎలక్షన్ అధికారివేసే ఆర్డరులో

(i) ఓట్లు ఏ తేదీని, ఎన్నిగంటలమధ్య పుచ్చుకొందురో అను విషయమున్ను

(ii) ఎలక్షన్ ఆఫీసరు ఓట్లు ఏ తేదీని ఎన్నిగంటలవేళ లెక్కపెట్టునో అను విషయమున్ను తెలుపవలెను.

ఓట్లు పుచ్చుకొనే తేదీకి 7 రోజులు ముందుగా ఎలక్షన్అధికారి వేసిన ఆర్డరు ప్రచురింపవలెను.

(5) మిగతాగంటలలోమాత్రమే ఓట్లు పుచ్చుకోవలసిన దని ఎలక్షన్ అధికారి ఆర్డరు వేసినచో

(i) ఆ ఎన్నికకు సంబంధించిన సంచులన్నియు ఎలక్షన్ ఆఫీసరు ఓట్ల ఆఫీసరువద్దకు పంపవలెను.

(ii) ఆవేళకు కొద్దిగా ముందుగా ఓట్ల ఆఫీసరు ఆ సంచులను విప్పి, వేళ కాగానే ఓట్లు పుచ్చుకొనుట ప్రారంభింపవలెను.

(iii) ఇదివరలో ఓట్లువేయునివారి ఓట్లే ఆఫీసరు పుచ్చుకొనవలెను.

(6) వెనుకటి ఓట్లు లెక్కలోనికి తీసికొనక క్రొత్తగా ఓట్లు పుచ్చుకోవలసినదని ఎలక్షన్ అధికారి ఆర్డరు వేసినచో, ప్రథమపర్యాయము ఓట్లు పుచ్చుకొను సందర్భములో నవలంబించు విధు లన్నియు యీసందర్భములో అవలంబింపవలెను. వెనుక నామినేషనయిన అభ్యర్థులకే రెండవపర్యాయము ఓట్లుపుచ్చుకోవలెను.

(7) ఓట్ల ఆఫీసు మూసినవెనుక అభ్యర్థి ఎవరైనను కాలముచేసినచో ఎలక్షన్ ఆఫీసరు ఆ సంగతి ఎలక్షన్ అధికారికి తెలిపి, ఆ ఎన్నికలో అప్పటివరకు జరిగిన చర్య రద్దుచేయించి, మొదటినుండియు, ఎలక్షన్ కార్యక్రమము జరుపవలెను.

ఇదివరలో నామినేషనైన అభ్యర్థులకు తిరిగి క్రొత్త నామినేషన్లు దాఖలుచేయ నక్కరలేదు.

25. ఓట్లు పుచ్చుకొనుట ముగియగానే అభ్యర్థుల, ఏజంట్ల సమక్షములో ఆఫీసరు యీ దిగువ నుదాహరించిన కాగితములు ప్రత్యేకముగా విడదీసి వేరుకవర్లలో పెట్టి వానిపై తనసీళ్లును, అక్కడ హాజరుగానున్న అభ్యర్థుల, ఏజంట్ల సీళ్లును, వేసి యుంచవలెను.

(i) ఓట్లువేసిన ప్రతి ఓట్లపెట్టెయు, తెరువబడగనే సీళ్లువేయవలెను.

(ii) ఆ పెట్టె తాళపుచెవులు.

(iii) పాడైన ఓటుకాగితములు, వాటి వెనుక ముక్కలు.

(iv) పేచీ ఓటుకాగితములు.

(v) పొడియక్షరములు వేసిన ఓటరు జాబితాలు, ఓటుకాగితముల వెనుక ముక్కలు.

(vi) పేచీఓట్ల జాబితా.

(vii) తగాయిదా ఓట్లజాబితా.

26. ఇవన్నియు ఓట్ల ఆఫీసరు వెంటనే ఎలక్షన్ ఆఫీసరువద్దకు పంపవలెను. వానితోపాటు 7 వ మతలబునసరించి ఒక స్టేట్మెంటు వ్రాసిపంపవలెను. ప్రతికవరు పైన వరుససంఖ్య వేసి, అందులో నేకాగితము లున్నవో వ్రాయవలెను.

27. ఓట్లలెక్కకు నియామక మైనరోజున, నియామక మైనవేళ, హాజరైన అభ్యర్థుల, ప్రతినిధుల సమక్షములో ఎలక్షన్ ఆఫీసరీక్రింది చర్య నవలంబింపవలెను:—.

(అ) ఓట్లపెట్టెలు ఒకదానివెనుక నొకటి తెరచి, ఒక్కొక్క పెట్టెలో నున్న ఓట్లు ప్రత్యేకముగా లెక్కపెట్టి, వానిలెక్క 8 వ మతలబు ననుసరించి ఒక స్టేట్ మెంటులో వ్రాయవలెను.

(ఆ) ఆపిమ్మట అన్ని పెట్టెలలోని ఓట్లున్ను కలిపి, ఏ ఏ అభ్యర్థి కెన్ని ఓట్లు వచ్చినవో లెక్కపెట్టవలెను. ఓటుకాగితములలో కొన్ని రద్దయినట్లు ఎలక్షన్ ఆఫీసరు భావించినచో 'నిరాకరించడమైనది' అనుమాట వానిపై వ్రాయవలెను. ఏ అభ్యర్థికాని ఏజంటుకాని ఫలానికాగితము రద్దుకాలేదని ఆఫీసరుతో చెప్పినచో, అట్టి కాగితము నిరాకరించుటకు కారణములు కూడ ఆఫీసరు వ్రాయవలెను.

(ఇ) ఎలక్షన్ ఆఫీసరు లెక్క ముగియువరకు పని సాగింపవలెను. ఈ మధ్య పని ఆపుచేయవలసినచో, ఓట్లున్ను వానికి సంబంధించిన యావత్తు కాగితములున్ను సంచులలోగాని, పెట్టెలలోగాని పెట్టించి, వానిపై తనసీలున్ను, అభ్యర్థుల, ఏజంట్ల సీళ్లున్ను వేయించి, తిరిగి పని ప్రారంభించువరకు వానిని భద్రపర్చి యుంచవలెను.

28. (1) పై కార్యక్రమము పూర్తియైన వెనుక ఆఫీసరు ఎలక్షన్ ఫలితము 9 వ మతలబుననుసరించి వ్రాయవలెను. 7, 8 మతలబుల లెక్కలనుబట్టి ఓట్ల కాగితములు సరిచూడవలెను.

ఆ ఎలక్షన్లో కొన్ని తరగతులకు లేక స్త్రీలకు సీట్లు కేటాయించియున్నచో, ఆ సీట్ల కెవ రెన్నుకోబడిరో ముందుగా ఆఫీసరు నిర్ణయింపవలెను.

(2) 9 వ ఫారము నకలు తీసికొనగోరిన అభ్యర్థిని గాని ఏజంటును కాని ఆఫీసరు నకలు తీసికొన అనుమతి నీయవలెను.

29. పై 25 వ రూలు (4) (5) విధులలో తెల్పిన సంచులు ఎలక్షన్ ఆఫీసరు విప్పరాదు.

30. లెక్క పూర్తికాగానే.

(i) సక్రమమైన ఓటుకాగితములు వేరు సంచిలోను.

(ii) నిరాకరించిన ఓటుకాగితములు వేరు సంచిలోను.

ఎలక్షన్ ఆఫీసరే పెట్టించి వానిపై సీళ్లు వేయవలెను. ఏ సంచిలో ఎన్ని కాగితము లున్నవో, ఆ సంచి ఏ ఎన్నికకు సంబంధించినదో, ఆ సంచిలోని కాగితముల స్వభావ మెట్టిదో, ఆ సంచిపై వ్రాయవలెను.

31. (1) ఎలక్షన్ ఫలితములు తెలుపు స్టేట్మెంటున కొన్ని నకలు తీయించి, ఎలక్షన్ ఆఫీసరా నకలు ఆయా లోకల్ బోర్డు ప్రెసిడెంటువద్దకు పంపవలెను.

ఓటుకాగితములు, ఓటర్ల జాబితా మొదలగు యావత్తు రికార్డు సంచులలో పెట్టి సీల్లుచేయించి తన ఆఫీసులో భద్రపరుపవలెను. ఆసంచులు ఎలక్షన్ విచారణలో విప్పవచ్చునుగాని, అన్యథా తెరువరాదు.

(2) ఆకాగితములు ఎలక్షన్ ఆఫీసరు 1 సంవత్సరము భద్రపరిపించి, యీలోపుగా ఏ విచారణలోను వానిని పంపమని తాఖీదురానిచో, ఆవెనుక కాల్చివేయవలెను.

32. (1) ఏఅభ్యర్థియైన రెండుమూడు సర్కిల్సులో, లేక వార్డులో మెంబరుగా నెన్నుకోబడినచో అతడు దేనికి మెంబరుగా నుండగోరునది ఎలక్షన్ ఆఫీసరుకు వ్రాసి పంపవలెను. ఎలక్షన్‌ఫలితములు ప్రకటించిన 24 గంటల లోపుగా ఆకాగితము ఎలక్షన్ ఆఫీసరుకు చేరవలెను.

(2) అట్టి వర్తమానము ఎలక్షన్ ఆఫీసరుకు చేరినచో, అతడా అభ్యర్థి కోరిన సీటులో నెన్నుకోబడినట్లు ప్రకటించి మిగతాసీట్లకు క్రొత్తఎన్నికలు జరుపవలెను. అట్టివర్తమానము చేరకున్నచో, ఆఫీసరుకు వచ్చిన ఏదో యొకసీటున కాతడెన్నుకోబడినట్లు నిర్ణయించి, మిగతాసీట్లకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

33. ఇరువు రభ్యర్థులకు సమానముగా ఓట్లువచ్చినచో ఆఫీసరు లాట్లపద్ధతి నవలంబించి గెలుపొందినవా రెవరో నిశ్చయింపవలెను.

34. గెలుపొందిన అభ్యర్థులపేర్లు ప్రకటననిమిత్తమై గవర్నమెంటు ముద్రాలయ సూపరింటెండెంటుగారికి ఎలక్షన్ ఆఫీసరు పంపవలెను.

జిల్లాబోర్డు ఎన్నికలలో ఆపేర్లు ఫోర్టుసెంట్‌జార్జి గెజెట్‌లో ప్రకటింపవలెను.

తక్కిన ఎన్నికలలో, జిల్లా గెజెట్‌లో ప్రచురించవలెను.

ఆపేర్లు ఆయా లోకల్‌బోర్డు ఆఫీసు నోటీసుబోర్డుపై అంటించవలెను.

35. (1) ఈ నిబంధనల అంతరార్థ మేమియని సంశయముకలిగినచో, ఆసంశయము గవర్నమెంటు అభిప్రాయమును బట్టి నివారించుకొనవలెను. ఆ అభిప్రాయమే ఖాయపు అభిప్రాయమై చెల్లవలెను.

(2) ఈ అభిప్రాయ మిచ్చుటకుపూర్వము గవర్నమెంటు ఎలక్షన్లలో జరుగు చర్య నాపుచేయించవచ్చును. ఆపుచేయమని గవర్నమెంటు ఉత్తరువిచ్చిన పిమ్మట జరిగిన చర్యలు శాస్త్రవిరుద్ధములు. వాని కెట్టివిలువయు లేదు.

(3) ఆపుకాబడిన చర్య, ఏ సందర్భములో ఆపుకాబడెనో అప్పటినుండియు కొనసాగింపవచ్చును. కాని మొదటినుండియు తిరిగి సాగింపవలసిన యగత్యము లేదు.

36. 11-ఏ-సెక్షన్ ప్రకారము మెంబరు ఎన్నిక జరుగవలసినచో, వైస్ ప్రెసిడెంటు ఎన్నికలో నవలంబించువిధానమే అవలంబింపవలెను.

37. ఎన్నికల తారీఖులున్ను, గడువులున్ను మార్చుటకు గవర్నమెంటుకున్ను, ఎలక్షన్ అధికారికిన్నీ హక్కున్నది.

38. వలసినందరు ఓట్ల ఆఫీసర్లుగా పనిచేయుటకు స్త్రీలు లభించినచో స్త్రీల ఓట్లు పుచ్చుకొనుటకు ప్రత్యేకముగా ఓట్ల ఆఫీసు నియమించి ఆ ఆఫీసులోనికి పురుషులెవరును పోరాదని ఎలక్షన్ ఆఫీసరు నిర్ణయింపవచ్చును. (యీ విషయమై హైకోర్టు తీర్పున్నది.)

## లోకలుబోర్డుల ఆక్టు

### i వ భాగములోని విధులు

### 1 వ మతలబు. (3 (1) రూలు చూ.)

### నామినేషన్ కాగితము

1. వార్డు లేక గ్రామము పేరు, సంఖ్య............
2. అభ్యర్థి పూ॥ పేరు.....................
3. అభ్యర్థి నంబరు (జాబితాలో)...............
4. అభ్యర్థి తండ్రి లేక భర్త పేరు...............
5. అభ్యర్థి వయస్సు.........................
6. అభ్యర్థి పురుషుడా స్త్రీయా...............
7. అభ్యర్థి కులము.........................
8. అభ్యర్థి వృత్తి, చిరునామా..................
9. ఉపపాదించు వోటరు పేరు...................
10. ఉపపాదించు వోటరు నంబరు (జాబితాలో).....
11. ఉపపాదించు వోటరు సంతకము...............
12. బలపర్చు వోటరు పేరు....................
13. బలపర్చు వోటరు నంబరు (జాబితాలో)........
14. బలపర్చు వోటరు సంతకము..................

నేను బ్రిటిషు సబ్జెక్టుననియు (లేక స్వతంత్ర ప్రభువు ప్రజలలోనివాడ ననియు) యీ ఎన్నికలలో నభ్యర్థిగా నిలువ నిష్టపడియున్నాననియు తెలుపుచున్నాను.

..........................

అభ్యర్థి సంతకము.

ఈ నామినేషన్ కాగితము నా యెదుట..............(ఫలానివారిచే)... .........తేదీని.........గంటలవేళ దాఖలు కాబడినది.

..........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకము.

## హెచ్చరిక

...............తేదీని.........గంటలు లోపుగా ఎలక్షన్ ఆఫీసరు ఎదుట దాఖలుకాని నామినేషన్లు మంజూరు చేయరు.

## 2 వ మతలబు (6 వ రూలు చూ.)

## .........సర్కిలు (లేక వార్డు లేక గ్రామ) ఎన్నికలలో......తేదీని దాఖలైన నామినేషన్లు

1. వరుస సంఖ్య.........................
2. అభ్యర్థి పేరు.........................
3. అభ్యర్థి తండ్రి లేక భర్తపేరు............
4. అభ్యర్థి పురుషుడా స్త్రీయా.............
5. అభ్యర్థి కులము.......................
6. అభ్యర్థి వృత్తి, చిరునామా.................
7. ఉపపాదనచేయు వోటరు పేరు..........
8. బలపర్చు వోటరు పేరు................

.........చోట............తేదీని...........గంటలవేళ నామినేషన్లు తనిఖీ చేయుదురు.

..........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకము.

3 వ మతలబు (8 (1) రూలు చూ.)

## సక్రమము లగు నామినేషన్లు

1. వరుస సంఖ్య..........................
2. అభ్యర్థి పేరు..........................
3. అభ్యర్థి పురుషుడా, స్త్రీయా..............
4. అభ్యర్థి కులము..........................
5. అభ్యర్థి చిరునామా......................

.........తేదీని.........గంటలనడుమ వోట్లు పుచ్చుకొందురు.

..........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకము.

4 వ మతలబు (15 వ విధి చూ.)

## ఓటు కాగితము

లోపలికాగితము | పైకాగితము

వరుససంఖ్య

జిల్లాబోర్డు / పంచాయితీ

సర్కిలు / గ్రామము / వార్డు

జిల్లాబోర్డు / పంచాయితీ

సర్కిలు / గ్రామము / వార్డు

ఎలక్షన్ జరుగు తేదీ

ఓట్లజాబితాలో పేరు, సంఖ్య

| వరుస సంఖ్య (1) | అభ్యర్థి పేరు (2) | ఓటరు పెట్టు గుర్తు (3) |
|---|---|---|
| 1 | | |
| 2 | | |
| 3 | | |
| 4 | | |
| 5 | | |
| 6 | | |
| | | |

వెనుక పీఠ

| సంఖ్య. |
|---|

5-వ మతలబు (22-వ విధి చూ.)

## పేచీ ఓట్ల జాబితా

పోలింగు ఆఫీసు.

| వరుస సంఖ్య | ఓటరు జాబితాలో సంఖ్య | పేరు | విలాసము | వ్రాలు లేక వేలుముద్ర |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| | | | | |

6-వ మతలబు. (23 వ విధి చూ.)

## తగాయిదా ఓట్ల జాబితా

.........పోలింగు ఆఫీసు

| వరుస సంఖ్య | ఓటరు జాబితాలో సంఖ్య. | పేరు | విలాసము | వ్రాలు లేక వేలుముద్ర |
|---|---|---|---|---|
| | | | | |

7 వ మతలబు (23 వ విధి చూ.)

పర్కిలు / గ్రామం / వార్డు కి .........తేదీని పోలింగు అయినపిమ్మట ..........

..................జిల్లా / గ్రామం లో .......................చోట పోలింగుఆఫీస

రిచ్చిన స్టేట్ మెంటు.

| తబిసీలు | పుచ్చుకొన్న వాని సంఖ్య | ఖర్చుపెట్టిన వాని సంఖ్య | పాడైనవాని సంఖ్య | మిగిలినవి | రిమార్కులు |
|---|---|---|---|---|---|
| ఓటుకాగితములు. | | | | | |
| (i) సాధారణపు ఓట్లు | | | | | |
| (ii) పేచీ ఓట్లు | | | | | |
| (iii) తగాయిదా ఓట్లు | | | | | |

ఎలక్షన్ ఆఫీసరుకు పంపిన సంచులతిబిసీళ్లు.

.............................

పోలింగు ఆఫీసరు సంతకము.

8 వ మతలబు (27 (ఎ) విధి చూ.)

| పోలింగుఆఫీసు పేరు | ఓటుపెట్టె సంఖ్య | పెట్టెలోని ఓటుకాగితముల సంఖ్య |
|---|---|---|
| | | |
| మొత్తము... | | |

.............................

ఎలక్షన్ ఆఫీసరు సంతకము.

9-వ మతలబు (28-వ విధి చూ.)

జిల్లా / సర్కిలు

................గ్రామం లోని..............గ్రామం కు చెందిన ఓట్లఫలిత ములు తెలియజేయు కాగితము.

వార్డు

| అభ్యర్థి పేరు | సక్రమమైన ఓట్లసంఖ్య |
|---|---|
| 1. | |
| 2. | |
| 3. | |
| 4. | |
| 5. | |
| 6. | |
| సక్రమమైన ఓట్ల మొత్తపుసంఖ్య...... | |
| నిరాకరించిన ఓట్ల మొత్తపుసంఖ్య...... | |

.........సర్కిలు, గ్రామం, వార్డు—కు యీ క్రిందివారు సక్రమముగా నెన్నుకొనబడిరని నేను తెల్పుచున్నాను.

.........తరగతి, స్త్రీలు—కు చెందిన రిజర్వు సీట్లకు....................1

.........తరగతి, స్త్రీలు—కు చెందిన రిజర్వు సీట్లకు....................2

.........తరగతి, స్త్రీలు—కు చెందిన రిజర్వు సీట్లకు....................3

తరగతి, స్త్రీలు—రిజర్వుకాని సీట్లకు
....................4
....................5
....................6

.........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

# లోకల్‌బోర్డుల మెంబరు ఎన్నికలవిధానము

## 2 వ భాగము

నిబంధన

I. (1) ఈభాగములోని విధులు

(i) జిల్లాబోర్డులకు (ఈవిధులే ఏబోర్డు ఎన్నికలలో నములులో పెట్టవలెనో గవర్నమెంటువారు నిర్ణయింతురు.)

(ii) పంచాయితీలకున్ను (25-8-1930 తేదీని గ్రామయూనియనుగా నున్నవానికి. అట్టియూనియ న్లేవియో గవర్నమెంటువారు నిర్ణయింతురు.)

(iii) ఎలక్షన్ అధికారి ప్రచురణలో నుదాహరించిన యితర పంచాయితీలకున్ను సంబంధించినవి.

(2) 'ఎలక్షన్ ఆఫీసరు' అనగా ఎలక్షన్ అధికారి చేతిక్రింద పనిచేయువాతడు.

[ఎలక్షన్‌పై సర్వాధికార మున్నవాడు ఎలక్షన్ అధికారి. అతనిపై పెత్తనము గవర్నమెంటుకుమాత్రమే యున్నది. (లోకల్‌బోర్డు ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు కాని వ్యక్తిని) ఎలక్షన్ అధికారిపదవిలో నొకరిని గవర్నమెంటు నియమించును. ఎలక్షన్ అధికారి తనచేతిక్రింద ఎలక్షన్‌కుసంబంధించిన విధు లన్నియు నిర్వహించుటకు ఎలక్షన్ ఆఫీసర్లను నియమించుకొనును.]

2 (1) ఎలక్షన్ ఆఫీసరు యీ దిగువహంశములు తెల్పుచు నొకనోటీసు వ్రాసి ప్రకటింపవలెను. ఆనోటీసు ఆంగ్లభాషలోను, ఆజిల్లా వాడుకభాషలోను వ్రాయవలెను. నోటీసుప్రకటించిన తేదీకిన్ని, ఎలక్షన్ తేదీకిన్ని మధ్య 30 రోజులైన గడువుండవలెను.

ఆనోటీసులో వ్రాయవలసిన హంశములు:—(i) ఎన్నుకోవలసిన మెంబర్ల సంఖ్య.

(ii) ఏ సర్కిలుకు, లేక గ్రామమునకు, లేక వార్డునకు మెంబర్ల నెన్నుకోవలెనో,

(iii) మహమ్మదీయులు, క్రైస్తవులు, పంచములు, యూరపియన్లు, ఆంగ్లో ఇండియన్లు, స్త్రీలు-వీరికి కేటాయించిన సీట్లు ఏ సర్కిలులో లేక గ్రామములో నిచ్చిరో, ఏ చోట యే తరగతివారికి సీటు కేటాయించియుంచిరో.

[పై తరగతులకు కొన్ని సీట్లు కేటాయించిన సీట్లకు, ఆయా తరగతులకు చెందినవారినిమాత్రమే ఎన్నుకోవలెను. కాని వార నెన్నుకొనువారు ఆయాతరగతి ఓటర్లే గాక ఆ ఖండములోని యావన్మంది ఓటర్లున్ను అయియున్నారు.]

(iv) మెంబర్ల నామినేషన్లు ఏ తేదీని, ఎన్ని గంటలకు, ఎచ్చట దాఖలు చేయవలెనో.

[నామినేషన్లు దాఖలుచేయు తేదీకిన్ని నోటీసు తేదీకిన్ని మధ్య 10 రోజులైన గడు వుండవలెను.]

[ప్రతి మెంబరు ఎన్నికకు ముందుగా అతని పే రుపపాదించుచు నొక ఓటరు కాగితముప్రాసి సంతకములు పెట్టియీయవలెను. మరియొక ఓటరు ఆ కాగితముపై తా నా అభ్యర్థి నామినేషను బలపర్చుచున్నట్లు వ్రాసి సంతకము చేయవలెను. ఓట ర్లిరువురి పేర్లున్ను జాబితాలో వ్రాసియుండవలెను. ఆకాగితముమీద అభ్యర్థి తాను మెంబరు ఎన్నికలో నిలువ నంగీకరించినట్లు వ్రాసి సంతకము చేయవలెను.

ఇట్టి నామినేషన్ కాగితము దాఖలైననేకాని ఏ అభ్యర్థియు మెంబరుగా నెన్న బడుట కర్హుడుకాడు]

(v) నామినేషన్ క్రమప్రకారము వ్రాయబడినదియు లేనిదియు, ఏ తేదీని తనిఖీచూతురో ఈ తనిఖీచూచు తేదీకిన్ని ఎలక్షన్ తేదీకిన్ని మధ్య 15 రోజులైన గడువుండవలెను.

(vi) ఏరోజున ఏఏగంటల నడుమ, ఏప్రదేశములో ఓట్లు పుచ్చుకొందురో.

ఓట్లుపుచ్చుకొను గంటలు ఉదయము 7 గంటలనుండి సాయంత్రము 6 గంట లకు మధ్య నియమింపవలెను. 19 గంటలకాలము ఓట్లు పుచ్చుకొనవలెను.

(vii) ఎలక్షన్ ఆఫీసరు, ఏచోట, ఏరోజున, ఎన్నిగంటలకు, ఓట్లలెక్క నారంభించునో.

(2) అట్టినోటీసు ప్రకటించుస్థలములు:— (i) ఆయా లోకల్ బోర్డు ఆఫీసులో ఒకనక లంటించవలెను.

(ii) జిల్లాబోర్డు ఎన్నికలలో:—తహసీల్దార్ల ఆఫీసులలోను, డిప్యూటీ తహసీల్దార్ల సబ్‌మేజిస్ట్రేట్ల ఆఫీసులలోను,జిల్లాలో వెల్లడిచోట్లను నోటీసు లంటించవలెను.

(iii) పంచాయితీ ఎన్నికలలో:—గ్రామములో 3 వెల్లడిచోట్లను, ప్రతి వార్డులోను 3 వెల్లడిచోట్లను నోటీసునకళ్లు అంటించవలెను.

నామినేషన్లు

3. (1) నామినేషన్లు 1 వ మతలబు ప్రకారము వ్రాయవలెను. ఓటరు జాబితాలో పేర్లున్నవా రెవ్వరడిగినను వారి కీమతలబులు (ఎలక్షన్ ఆఫీసరు లేక లోకల్‌బోర్డు ప్రెసిడెంటు) ఉచితముగా నీయవలెను.

(2) నామినేషన్లపై ఉపపాదించు ఓటర్లున్ను, బలపర్చు ఓటర్లున్ను సంతకములు చేయవలెను. అభ్యర్థిగా నిల్చుట కంగీకారము సూచించుచు అభ్యర్థియు సంతకము చేయవలెను.

(3) ఆ సర్కిలులో (లేక వార్డులో) ఎన్ని ఖాళీ లున్నవో, ప్రతి ఓటరున్ను అన్ని నామినేషన్లపై (ఉపపాదించుచు లేక బలపర్చుచు) సంతకములు చేయవచ్చును. అంతకుమించి సంతకములు చేయరాదు.

ప్రతి అభ్యర్థి పేరున్ను సక్రమమైన యొక నామినేషన్ కాగితముపై వ్రాసి యుండవలెను. లేనిచో అతని అభ్యర్థిత్వము సరియైనదికాదు.

(4) నామినేషన్లు అభ్యర్థి, లేక ఉపపాదించు ఓటరు, బలపర్చు ఓటరు కలిసి, ఎలక్షన్ ఆఫీసరు ఎదుట దాఖలుచేయవలెను. నిర్ణయించినచోట నిర్ణయించిన గడువులోపునే వానిని దాఖలుచేయవలెను. ఎలక్షన్‌ఆఫీసరా కాగితములపై వరుస సంఖ్య వేసి, ఏది, ఏ తేదీని, ఎన్నిగంటలకు దాఖలయ్యెనో వ్రాయవలెను.

(5) ఖాళీలసంఖ్యకు మించిన నామినేషన్లపై ఏ ఓటరైనను సంతకము చేసియున్నచో, ఖాళీల సంఖ్యకు సరిపోవు నామినేషన్లు మాత్రమే దాఖలు పుచ్చుకొందురు. ముందు ఎలక్షన్ ఆఫీసరువద్ద దాఖలైనవి మాత్రమే గౌరవింతురు.

(6) అభ్యర్థి పేరు సక్రమమైన ఒకనామినేషన్ కాగితములో వ్రాసియున్న చాలును. అతని పేరు పెక్కు నామినేషన్లలో చేర్చియున్నను కీడులేదు.

(7) గడువులోపల దాఖలుకాని నామినేషన్లు మంజూరు చేయరు.

4. ఓటరు జాబితాలో అభ్యర్థి పేరున్ను, యిరువురు ఓటర్ల పేర్లున్ను (ఉపపాదకుడు, బలపరచిన ఓటరు) చూపుమని ఎలక్షన్ ఆఫీసరు కోరవచ్చును. జాబితాలో

పేర్లున్న నామినేషన్లలో పేర్లున్న పోల్చి చూడవచ్చును, నామినేషన్లోని వ్రాత పొరపాట్లు సవరింపు మనవచ్చును.

(ఈవిషయములో 1 వ భాగములో నిచ్చిన ఉదాహరణ చూడుడు.)

5. (1) నామినేషన్లతోపాటు యీదిగువ ధరావత్తులు చెల్లింపవలెను. ధరావత్తు చెల్లింపని నామినేషన్లకు విలువలేదు. పంచములు ధరావత్తు చెల్లింపనక్కరలేదు.

జిల్లాబోర్డు సర్కిలు.............................................. 100/-

పంచాయితీ బోర్డు.............................................. 25/-

ఒకే అభ్యర్థి పెక్కుసర్కిల్సులో ఎన్నిక నపేక్షించుచో అన్నిమార్ల ధరావత్తుమొత్తము కట్టవలెను.

నిర్వచనము:—గవర్నమెంటు ట్రెజరీచెక్కులున్ను, ఇంపీరియల్ బ్యాంకు చెక్కులున్ను అంగీకరింపబడును.

(2) అభ్యర్థిపదవికి రాజీ దాఖలుచేయవచ్చును. లేదా నామినేషను సక్రమమైనది కాదని ఆఫీసరు అభిప్రాయ మీయవచ్చును. ఈ రెండుసందర్భములలో ధరావత్తు సొమ్ము వాపసు చేయవలెను.

(3) ఓట్లసంఖ్యను మెంబర్ల సంఖ్యచే విభాగించి, ఆసంఖ్యలో 1/8 వ వంతు పైగా ఓట్లురాని అభ్యర్థుల ధరావత్తుసొమ్ము జిల్లాబోర్డుకు సంక్రమించును.

[ఈవిషయములో 1 వభాగములో నిచ్చిన ఉదాహరణచూడుము.]

(4) పై ఓట్లసంఖ్య నిర్ధారణ చేయుటలో చెడిపోయిన ఓట్లు మినహా తక్కిన ఓట్లన్నియు గణనచేయుదురు.

(5) గజెట్‌లో ఎలక్షన్ ఫలితములు ప్రచురణ యైనపిదప, మిగతా అభ్యర్థులు కట్టిన మొత్తము వాపసుచేయవలెను. గెల్చిన అభ్యర్థిసొమ్ము అతడు జిల్లాబోర్డు మీటింగుకు ప్రథమపర్యాయము హాజరైనపిదప వాపసు చేయవలెను. అతడు మొదటి సభకు రానిచో అతనిసొమ్ము వాపసుచేయు పద్ధతి గవర్నమెంటువా రేర్పరుతురు.

(6) ఒక అభ్యర్థి రెండుమూడు సర్కిల్సులో ఎన్నికపొందగోరి రెండుమూడింటిలో సొమ్ము కట్టియున్నచో, ఒకమొత్తము మాత్రమే అతనికి వాపసుచేయబడును.

(7) సొమ్ము వాపసుపుచ్చుకొను నధికార మున్నయాతడు మరణించినచో, ఆమొత్త మతనివారసున కీయవలెను.

(8) ఎలక్షన్ ఫలితములు ప్రకటించిన 6 మాసములలోగా సొమ్ము వాపసీయుమని కోరుచు అర్జీ దాఖలు చేసిననేగాని, ఎవరికిన్ని సొమ్ము వాపసు చేయరాదు.

6. నామినేషన్లు దాఖలుచేయు గడువున్ను అభ్యర్థులు రాజీలు దాఖలుచేయు గడువున్ను దాటినపిమ్మట, ఎలక్షన్ ఆఫీసరు అభ్యర్థుల పేర్లన్నియు అకారాదిగా నొక జాబితాలో వ్రాయవలెను. ఆజాబితా రెండవ మతిలబునుబట్టి జిల్లావాడుక భాషలో వ్రాయవలెను. ఆ జాబితా జిల్లాబోర్డు ఆఫీసులో నంటించవలెను.

నామినేషను సక్రమమైనదో కాదో, ఫలానిచోట, ఫలాని తేదీని, ఫలాని గంటలవేళ ఎలక్షన్ ఆఫీసరు తనిఖీచూచునని నోటీసు వ్రాసి పై జాబితాతోపాటు ప్రచురింపవలెను.

## నామినేషన్ల తనిఖీ

7. (1) ఈ తనిఖీ ఎలక్షన్ ఆఫీసులో జరుగవలెను. ఆ ఆఫీసులోనికి అభ్యర్థి, అభ్యర్థిని ఉపపాదించిన ఓటరు, బలపర్చిన ఓటరు, అభ్యర్థి (లిఖితరూపమున) నియమించిన ప్రతినిధి, ఆఫీసరు సహాయము నిమిత్త మేర్పర్చుకున్నవారున్ను వెళ్లవచ్చును; ఇతరులు పోరాదు. హాజరున్నవారు నామినేషన్లు చూచుట కవకాశ మీయవలెను.

(2) నామినేషన్లు ఎలక్షన్ ఆఫీసరు తనిఖీచూచి, క్రమవిరుద్ధము లైనవి నిరాకరింపవచ్చును. హాజరున్నవారిలో నెవరైన ఆక్షేపణలు సూచింపవచ్చును. అట్టి నిరాకరణ కీక్రిందికారణములలో నేదియో యొకటి గోచరింపవలెను:—

(i) ఆక్టు 54, 55 లేక 59 సెక్షన్ల ప్రకారము అభ్యర్థి అనర్హుడగుట.

(ii) ఆయా ఓటరుజాబితాలో అభ్యర్థి పేరు లేక ఉపపాదించు ఓటరుపేరు, బలపరుచు ఓటరుపేరు లేకుండుట.

(iii) పై 3 వ రూలు 5 వ రూలుప్రకారము అభ్యర్థి లేక అతనికి సహాయులగు ఓటర్లు సంచరింపకుండుట. (సహాయులగు ఓటర్లనగా అతనిపే రుపపాదించిన, బలపర్చిన ఓటర్లు.)

(iv) రిజర్వుడ్ సీటు ఎన్నికలో అభ్యర్థి ఆయాతరగతికి చెందకుండుట.

(3) నామినేషన్ అంగీకరించినట్లు గాని, నిరాకరించినట్లు గాని ఎలక్షన్ ఆఫీసరు నామినేషన్ కాగితమువెనుక తీర్పు వ్రాయవలెను. నిరాకరించినచో అందుకు కారణములుకూడ వ్రాయవలెను. నామినేషన్ల తనిఖీ 2 వ రూలులో నుదాహరించిన తేదీని పూర్తికావలెను.

8. (1) నామినేషన్ల తనిఖీ పూర్తియైనవెనుక (అభ్యర్థులు రాజీలు దాఖలుచేయుగడువుదాటిన పిమ్మట) ఆఫీసరు నిల్చియున్న అభ్యర్థులపేర్లు 3 వ మతలబు ప్రకారము వ్రాసి ఆయాబోర్డు ఆఫీసులో ప్రచురింపవలెను. (అట్టిప్రచురణ ఎన్నిక తేదీకి 4 రోజులైన ముందుగా జరువవలెను)

(2) నామినేషన్లలో వ్రాసినప్రకారము అభ్యరుల పేర్లున్ను, తబిసీళ్లున్ను పై జాబితాలో వ్రాయవలెను.

(3) జిల్లాబోర్డు ఎన్నికలలో పై జాబితా ఆయా సర్కిలులోని తహసీల్దార్ల, డిప్యూటీ తహసీల్దార్ల, సబ్ మేజిస్ట్రేట్ల ఆఫీసులలోను, ప్రతి ఓట్ల ఆఫీసులోను ప్రకటింపవలెను.

9. (1) తాను అభ్యర్థిత్వము వదులుకొనుచున్నానని యే అభ్యర్థియైన ఎలక్షన్ ఆఫీసరుకు వ్రాసి, అందుపై సంతకముచేసి, పంపవచ్చును. ఆ కాగితము ఆఫీసరుకు తనిఖీ జరిగిన మరునాడు మధ్యాహ్నము 3 గంటలలోపుగా చేరవలెను.

అభ్యర్థి స్వయముగా నట్టి కాగితము దాఖలుచేసినచో నందుపై సాక్షిసంతిక మక్కరలేదు.

ఇతరులద్వారా పంపిన కాగితములపై గ్రామమునసబు సాక్షిసంతక ముండవలెను. (లేదా కోర్టు వకాల్తానామాలు ధ్రువపర్చుట కధికారమున్న మరియే యుద్యోగి సాక్షిసంతకమైన నుండవలెను.)

ఒకసారి పై కాగితము దాఖలుచేసినవాడు తిరిగి అభ్యర్థిగా నిలువరాదు.

(2) రాజీకాగితములు దాఖలైన వర్తమానము ఎలక్షన్ఆఫీసరు ప్రకటింపవలెను.

10. అభ్యర్థుల ఎన్నికలలో నీక్రిందివిధుల నవలంబింపవలెను :

I. జనరల్‌సీట్లకు ఎన్నికజరుగు సందర్భములో, ఏదియో ఒక తరగతి రిజర్వుసీట్ల ఎన్నికజరుగు సందర్భములో.

(i) ఖాళీలసంఖ్యకు అభ్యర్థుల సంఖ్య సరిపోయినచో, అభ్యర్థు లందరు మెంబర్లుగా నెన్నుకొబడిరని ఎలక్షన్ ఆఫీసరు వెల్లడిచేయవలెను.

(ii) ఖాళీలసంఖ్యకంటె అభ్యర్థులసంఖ్యయే తక్కువుగ నున్నచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లుగా పరిగణింపబడుదురు ; మిగతాఖాళీలకు క్రొత్త ఎన్నికలు జరుగును.

(iii) అభ్యర్థి ఎవరున్ను లేకున్నచో క్రొత్త ఎన్నిక జరుగును.

(iv) అభ్యర్థులసంఖ్య ఖాళీలసంఖ్యకు మించియున్నచో ఓట్లుపుచ్చుకొన వలెను.

[I-వ భాగములో యీ విషయములో నిచ్చిన ఉదాహరణలు చూ.]

II. రెండు మూడు రిజర్వుసీట్లకు ఎన్నిక జరుగుచున్నచో:— ఆసీట్లు వేరువేరు తరగతుల సీట్లయినచో,

(i) ఏ తరగతిలో ఎన్నుకోవలసిన మెంబర్లసంఖ్యకు ఆతరగతి అభ్యర్థుల సంఖ్య సరిపోయినచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లయినట్లు భావింతురు.

(ii) ఏతరగతిలోనైన సీట్లసంఖ్యకు అభ్యర్థులసంఖ్య తగ్గియున్నచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లగుదురు. మిగతా ఖాళీలకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(iii) ఏ తరగతిలో నైన అభ్యర్థి లేకున్నచో క్రొత్త ఎన్నికలు జరుగ వలెను.

(iv) మిగతా సందర్భములలో (అనగా మెంబర్లుగా అభ్యర్థులను స్థిరపర చని సందర్భములోను, క్రొత్త ఎన్నిక జరుప నగత్యములేని సందర్భములోను) ఓట్లు పుచ్చుకొనవలెను.

III. 1, 2 రిజర్వుడ్ సీట్లకున్ను, 1, 2 జనరల్ సీట్లకున్ను ఒకే సారి ఎన్నికజరుగు సందర్భములలో :—

(i) ఏతరగతి అభ్యర్థులసంఖ్యయైన ఆతరగతిఖాళీలసంఖ్యకు సరిపోయినచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లుగా పరిగణింపబడుదురు.

(ii) ఏ తరగతిలోనైన ఖాళీలసంఖ్యకు తక్కువగా అభ్యర్థులసంఖ్య యున్నచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లగుదురు. మిగతాఖాళీలకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(iii) ఏతరగతిలోనైన అభ్యర్థిగా నెవరున్ను నిలువనిచో ఆఖాళీకి క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(iv) పైరీతిగా మెంబ ర్లెన్నుకోబడినసీట్లున్ను, క్రొత్త ఎలక్షన్ జరుగవలె నని నిర్ణయించిన సీట్లున్ను, మిగతాఎన్నికలనుండి తప్పింపలెను.

(v) అట్లు తప్పించినవెనుక

(అ) మిగతా ఖాళీలసంఖ్యకు అభ్యర్థులసంఖ్య సరిపోయినచో, అభ్యర్థు లందరున్ను మెంబ ర్లయినట్లు నిర్ధారణ చేయవలెను.

(ఆ) ఖాళీలసంఖ్యకు అభ్యర్థులసంఖ్య తక్కువగా నున్నచో అభ్యర్థు లంద రున్ను క్రింది (vi) వ రూలులో తెల్పినరీతిగా మెంబర్లయినట్లు భావించి మిగతా సీట్లకు క్రొత్తఎన్నికలు జరుపవలెను.

(ఇ) అభ్యర్థులే లేనిచో, క్రొత్తఎన్నికలు జరుపవలెను.

(ఈ) ఖాళీలసంఖ్యకు మించి అభ్యర్థులసంఖ్య యున్నచో, ఓట్లుపుచ్చు కొనవలెను.

(vi) (అ) పై (v) (అ) (ఆ)లలో తెలిపిన సందర్భములలో అభ్యర్థు లందరున్ను జనరల్ సీట్లన్నింటికిని ఎన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను. (అభ్యర్థులందరు అనగా రిజర్వుడ్ సీట్లకు ఎన్నుకోబడిన అభ్యర్థులు తప్ప మిగతా యావన్మందియున్ను క్రింది (ఆ) చూ.)

(ఆ) పై (v) (అ) (ఆ) లలో తెల్పిన సందర్భములలో ఏ తరగతిలోనైన ఖాళీలసంఖ్యకు మించి అభ్యర్థులసంఖ్య యున్నచో, లాట్లువేసి ఎవ రెన్నుకోబడిరో ఎలక్షన్ ఆఫీసరు నిర్ణయింపవలెను. తమలో కొందరిని సభ్యులుగా నిర్ణయింపవలసిన దని అభ్యర్థు లందరున్ను ఏకస్థులై వ్రాసి, సంతకములుచేసి, ఆ కాగితము రాజీలు దాఖలుచేయ నియమించిన గడువుదాటిన పిమ్మట 24 గంటలలోపుగా ఎలక్షన్ ఆఫీసరు కందజేసినచో, అత డా ప్రకారము నడుచుకొనవలెను.

## నిర్వచనము

### అభ్యర్థి

క్రమప్రకారము నామినేషనై రాజీ దాఖలు చేయనివాడు.

### ఎన్నుకోతగిన అభ్యర్థి

ఏ తరగతి సీటునకైన ఎన్నుకొన నర్హుడు. ఆ తరగతికి చెందినవాడు.

### రిజర్వుసీటు

ఫలాని తరగతివారికి లేక స్త్రీలకు కేటాయించిన సీటు.

### రిజర్వుకానిసీటు

ఏ తరగతికిన్ని కేటాయించని జనరల్ సీటు.

### ఒకే తరగతి రెండుసీట్లు

రెండున్ను ఒకే తరగతి మెంబర్లకు, లేక స్త్రీలకు కేటాయించిన సీట్లు.

11. (1) ప్రతిఓట్ల ఆఫీసులోను ఓట్లుపుచ్చుకొనుట కొకరిద్దరు ఓట్లఆఫీసర్లను ఎలక్షన్ ఆఫీసరు నియమింపవలెను. వారికి జీతముభత్యము కూడ నేర్పరుపవచ్చును. ఓటర్ల నానవాలుపట్టుటకు మరికొందరిని నియమింపవచ్చును. ఓట్ల ఆఫీసరు ఆబోర్డుసభ్యుడైయుండరాదు, ఓటరైయుండరాదు.

(2) ఓట్లు పుచ్చుకొనులోపుగా అభ్యర్థులలో నెవరైన కాలము చేసినచో, ఎలక్షన్ ఆఫీస రంతటితో ఎలక్షన్ ఆపుచేయించవలెను. ఎలక్షన్ విషయమై జరుగవలసిన కార్యక్రమ మంతయు తిరిగి మొదటినుండియు ప్రారంభింపవలెను.

అప్పటికి సక్రమముగా నామినేషన్ కాబడియున్న అభ్యర్థులు యీ క్రొత్త యెన్నికలో (తిరిగి నామినేష నక్కరలేకయే) అభ్యర్థులుగా పరిగణింపబడుదురు.

## ఓట్లుపుచ్చుకొను విధానము

12. ఓట్ల ఆఫీసరు ఓట్ల ఆఫీసులో అల్లరి జరుగకుండ ఎలక్షన్ సక్రమముగా జరుగునట్లు, ఏర్పాట్లుచేయవలెను. ఎందరొక్కసారి లోనికి వచ్చి ఓట్లు వేయవలెనో నిర్ణయింపవలెను. తనగుమాస్తాలను, పోలీసువారిని, ఓటరును గుర్తుపట్టువారిని, మాత్రమే లోనికిరానిచ్చి మిగతా యావన్మందిని ఆఫీసుబైట నుంచవలెను.

13. (1) ఓట్లపెట్టెలలో ఓట్లువేయుటకు వీలుండవలెను. తీయుటకు వీలుండరాదు (తాళము తీయనిదే.) ఓట్లు పుచ్చుకొనుటకుముందు ఆఫీసరు ఖాళీపెట్టె ఆఫీసులోనున్నవారికి చూపి, తాళము వేసి, సీలువేసి తనయెదుట పెట్టుకొనవలెను. తాళపుచెవికి కూడ సీలువేసియుంచవలెను.

(2) ఓటుకాగితములో నున్నరీతిని అభ్యర్థులనంబరు, పేరు ఒక ప్రకటనలో వ్రాసి ఆ పేర్లకెదురుగా వారి వారి కేర్పరచిన (15 (2) విధి చూ.) రంగులు తెలుపుచు ఆ ప్రకటన ఓట్ల ఆఫీసువెలుపల నంటింపించవలెను.

14. ప్రతి ఓట్ల ఆఫీసరుకు వలయు గుమాస్తాలను ఎలక్షన్ ఆఫీసరు నియమింపవలెను. ఓటరుజాబితా నకలున్ను, నామినేషన్ల జాబితాయు, ఓటుకాగితములు, ఓట్లపెట్టెలు, తెల్లకాగితములు, మతలబులున్ను ఓట్ల ఆఫీసరుకు ఎలక్షన్ ఆఫీసరు పంపవలెను. ఎందరు మెంబర్ల నెన్నుకోవలసియున్నదో తెలుపవలెను.

15. (1) ఓటుకాగితములు 4 వ మతలబుప్రకారము ముద్రింపవలెను. వాటిపై వరుసనంబర్లు వేయవలెను. ఆ కాగితము రెండుముక్కలుగా నుండును. ఒకముక్క ఆఫీసరువద్దనే యుండిపోవును. రెండవది ఓటరున కీయబడును. ఆఫీసరువద్దనున్న ముక్కపై వరుసనంబరు వేయవలెను. ఓటరున కిచ్చిన ముక్క వెనుకపీఠిని ఆ నంబరే

వేయవలెను. ఓటుకాగితముమీది పేర్లు ఇంగ్లీషు భాషలోగాని, వ్యవహారభాషలో గాని వ్రాయవలెను. పేర్లు అకారాదిగా వ్రాయవలెను. ఒకపేరున్ను అభ్యర్థు లిరువు రున్నచో యింటిపేరు లేక వృత్తి వ్రాసి యిద్దరికి భేదము కనబర్చవలెను.

15. (2) అభ్యర్థులకు వేరువేరు రంగు లేర్పరుపవలెను. ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ, నీలము, కుంకుమరంగు లేర్పరుపవలెను. నలుపురంగు యే అభ్యర్థికిన్ని యివ్వరాదు. ఏఅభ్యర్థి కే రంగిచ్చునది లాట్లువేసి నిర్ణయింపవలెను. ఓట్లకాగితములో ప్రతిఅభ్యర్థి పేరున కెదురుగా అతని కేర్పరిచిన రంగు చతురముగా గుర్తువేసి యుంచ వలెను.

16. ఓటరుకు ఓటుకాగితపు రెండవముక్క నిచ్చుటకు పూర్వము ఓట్ల ఆఫీసరు

(i) ఆముక్కపై తన పొడియక్షరములు వ్రాయవలెను.

(ii) మొదటిముక్కపై ఓటరు పేరున్ను, జాబితాలో నంబరున్ను వ్రాయ వలెను.

(iii) జాబితాలో ఓటరు పేరున కెదురుగా పొడియక్షరములు వ్రాయవలెను.

అటుపైన ఓట్ల ఆఫీసరు ఓటరు ఎన్నిఓట్లు వేయవచ్చునో తెలిపి కాగిత మాతని కీయవలెను.

17. ఓటుకాగితము పుచ్చుకోగానే ఓటరు చాటుగా గదిలోనికి వెళ్లి (ఓట్లు చాటుగా వేయుట కొకగది యేర్పాటుచేయవలెను) తాను ఓటీయదలచిన అభ్యర్థి పేరున కెదురుగా నొకగుర్తుంచవలెను. పిదప గుర్తుకనబడకుండ కాగితము మడిచి, ఆకాగితము వెనుకనున్న పొడియక్షరములు పోలింగుఆఫీసరునకు చూపి, ఓట్లపెట్టెలో పడవేయ వలెను.

18. (1) అంధత్వమువలనగాని లేక యింకే యితరకారణములచేతగాని ఓటరు 17 వ విధిలో నుదాహరించినప్రకారము ఓటు వేయలేకపోయినచో, పోలింగు ఆఫీసరు అభ్యర్థుల వారి ఏజంట్లయెదుట ఓటరు ఎవరిపేరున కెదురుగా గుర్తుపెట్టమనునో ఆ పేరున కెదురుగా గుర్తుపెట్టి ఆ ఓటుకాగితము ఓటుపెట్టెలో పడవేయవలెను, లేక పడవే యించవలెను. అచ్చట హాజరులోనున్న అభ్యర్థులు, వారిఏజంట్లు ఓటరుకు, ఆఫీసరుకు జరిగిన సంభాషణ వినవచ్చును; ఆఫీసరు గుర్తుపెట్టుచుండగా చూడవచ్చును; కాగితము పెట్టెలో పడవేయుచుండగా చూడవచ్చును.

(2) ఇట్లు గుర్తుపెట్టిన కాగితము వెనుకముక్కపై ఓట్ల ఆఫీసరు తాను గుర్తించి నందులకు కారణము వ్రాయవలెను.

(3) అటుతర్వాత ఓటరు గుర్తుపెట్టి యున్నప్రకారము ఆఫీసరు గుర్తుపెట్టలేదని వాదము చేయరాదు.

19. స్త్రీ ఓటర్లు ఓట్లు వేయుటకు ఆఫీసరు ప్రత్యేకసౌకర్యములు కలిగింపవచ్చును. అందువిషయమై ఎలక్షన్ అధికారి సూచన లీయవచ్చును.

20. (1) ఈ క్రిందిసందర్భములలో ఓటుకాగితము నిరాకరింపవలెను.

(i) ఏపేరున కెదురుగా గుర్తున్నదో తెలియకుండుట.

(ii) ఖాళీలసంఖ్యకంటె హెచ్చుమంది అభ్యర్థులపేర్ల కెదురుగా గుర్తు లుండుట.

(iii) ఓటుకాగితముపై ఓటరు నావవాలుపట్టుటకు సంకేత మేదైన పెట్టియుండుట.

(2) ఒక అభ్యర్థిపేరున కెదురుగా రెండుగుర్తులుంచియున్నను ఒకటే ఓటుగా భావింతురు. కాని ఖాళీలకు మించిన అభ్యర్థులపేర్ల కెదురుగా గుర్తులుండరాదు.

(3) ఏ అభ్యర్థిపేరున కెదుట గుర్తుంచబడెనో అనుమానముగా నున్నప్పుడు ఆ గుర్తునకు విలువనీయరు. కాని కాగితములోని మిగతా గుర్తులకు విలువనిత్తురు.

21. ఓట్ల ఆఫీసరు ఓటుకాగిత మిచ్చుటకు ముందు ఓటరు నీ ప్రశ్నలువేయవచ్చును. అభ్యర్థులు, ఏజంట్లు కోరినచో వేయవలెను.

(i) (జాబితాలో పేరు చదివి) ఈ ఓటరువు నీవేనా ?

(ii) ఈ ఎన్నికలో నింకే ఆఫీసులోనైన ఓటు వేసితివా ?

(i) వ ప్రశ్నకు అవుననియు, రెండవ ప్రశ్నకు లేదనియు ఓటరు జవాబిచ్చిననే అతనికి ఓటుకాగిత మీయవలెను.

జాబితాలో పేరున్న ప్రతివారికిన్ని (పై షరతులకు లోబించి) ఓటుకాగిత మిచ్చితీరవలెను.

22. ఒకరిపేరున ఓటుపడిన పిమ్మట ఇంకొక ఆసామీ ఆ పేరు తన పేరని చెప్పి ఓటుకాగిత మిమ్మని కోరవచ్చును. అతనికి ఓట్ల ఆఫీసరు పైప్రశ్నలను వేసి జవాబు పొందవలెను. ఆ ప్రశ్నలకు సరియైన జవాబిచ్చినచో అతనికి ఓటుకాగిత మీయవలెను. అతడు ఓటు వేసినపిమ్మట నా కవరుపై ఓటరుపేరున్ను, నంబరున్ను వేయవలెను. వీనిని పేచీ ఓట్లందురు. వీనికి ఓట్ల ఆఫీస రొకజాబితా వ్రాసియుంచవలెను. (జాబితా ౯ వ మతలబుప్రకారము వ్రాయవలెను.) ఆ ఓటరు నా జాబి

తాలో సంతకము చేయమని కోరవలెను. సంతకము చేయలేని ఓటరును వేలుముద్ర వేయమనవలెను.

ఓట్ల లెక్కలో పేచీ ఓట్లు గణనచేయరు.

1. వ నిర్వచనము:— పేచీ ఓట్లుకాగితములు, మామూలు ఓట్లకాగితములు ఒకేమతలబుప్రకార ముండవలెను. రెండింటికి వ్యత్యాసము తెలుపుటకు పేచీఓట్ల కాగితముల పైముక్క, లోపలిముక్కల పైనగూడ "పేచీఓట్ల కాగిత"మని అచ్చొత్తింపవలెను.

(ii) వ నిర్వచనము:—

22, 23 నిబంధన లమలులో పెట్టుటకు వీలగుసందర్భములలో, రెండున్ను అమలులో పెట్టవలెను.

23. పైవిధముగా ఓటుకాగిత మిమ్మని కోరేవ్యక్తి, కృత్రిమనామము పెట్టుకొని ఓటువేయ యత్నించుచున్నాడనియు, ఆసంగతి తాను రుజువుపర్చెద ననియు ఏ అభ్యర్థియైన, ఏజంటైన ఓట్ల ఆఫీసరుతో చెప్పవచ్చును. ఇట్టి ఓట్లు తగాయిదాఓట్లు. వీని కొక జాబితా వ్రాసియుంచవలెను. ఆజాబితా 6 వ మతలబుననుసరించి వ్రాయవలెను. ఆ అభ్యర్థి లేక ఏజంటు పేరు జాబితాలో వ్రాయించి అతని సంతకము (లేక వేలుముద్ర) వేయమని కోరవలెను. అతడు తెల్పువిషయము (ఓటరు మారుపేరుతో వచ్చినాడని) వ్రాసి యీయమని ఆఫీసరు కోరవలెను.

పైనుదాహరించిన ప్రశ్నలు ఓటరుకు వేసి,వానికతడు సరియైన జవా బిచ్చినచో, ఆఫీస రతనికి ఓటుకాగిత మీయవలెను. అతడు కృత్రిమనామముతో వ్యవహరించుచున్నచో అది నేర మనియు శిక్షార్హమనియు ఆఫీసరు ఓటరుతో చెప్పవలెను.

తగాయిదా ఓట్ల జాబితాలో, ఆఫీసరు జరిగినవిషయ మంతయు వ్రాసి, అందుపై తనయభిప్రాయము వెలిబుచ్చవలెను.

ఆఓటరువద్ద ఓటుకాగితము పుచ్చుకొని వేరేకవరులో నుంచవలెను.

24. పొరపాటున ఓటుకాగితము పాడైనచో ఆఫీస రది పుచ్చుకొని (దానిపై రద్దయినట్లు వ్రాసి) క్రొత్త కాగిత మొకటి ఓటరున కీయవలెను.

24-ఎ. (1) ఓటరు మరియొక ఓట్ల ఆఫీసులో హాజరైయుండవలసి యున్నచో (ఆఫీసరుగా లేక ఏజంటుగా) అతని ఓటున్న ఆఫీసులో నతడు ఓటువేయుట కవకాశ ముండదు. వానికి ఎలక్షన్ ముందుగానే ఓట్లఆఫీసరు ఓటుకాగిత మీయవలెను.

అతడు పనిచేయు ఆఫీసులో నుండియే ఓటువేయుటకు సావకాశము కల్పింపవచ్చును. ఆ ఓటుకాగితము వెనుకముక్కపై యీవిధముగా వ్రాయవలెను:—

"........................పేరు గల వారికి................ఓట్ల ఆఫీసులో..................సర్కిల్ (లేక గ్రామం లేక వార్డు)లో ఓటున్నది; అతడు తాను పనిచేయు ఆఫీసులోనే ఓటువేయుటకు సావకాశ ముండేపద్ధతిని అతనికి ఓటుకాగితము ముందుగానే యిచ్చుచున్నాను.

..................................

ఎలక్షన్ ఆఫీసరు సంతకము.

(2) ఓటరు ఆ కాగితముపై గుర్తుంచి, కవరులో పెట్టి, సీలువేసి, ఓట్లు లెక్కపెట్టే రోజునకు ముందుగా ఎలక్షన్ ఆఫీసరునకు పంపవలెను. ఎలక్షన్ ఆఫీసరు తక్కిన ఓట్ల తోపాటు యీ ఓటున్ను లెక్కపెట్టును.

24-బి. (1) వరదలవలన గాని, భూకంపములవలన గాని, అల్లరులవలన గాని ఓట్ల ఆఫీసు పనిచేయుటకు సావకాశము లేనప్పుడు ఆఫీసరు వెంటనే తన ఆఫీసు మూసివేసి ఓటర్లకా వర్తమానము తెలుపవలెను.

(2) 25, 26 విధులలో తెలిపిన కార్యక్రమము ఓట్ల ఆఫీసరు జరుపవలెను. తాను ఆఫీసుమూసివేసినందుకు కారణములన్నియు తెలుపుచు ఎలక్షన్ ఆఫీసరుకు రిపోర్టు వ్రాసిపంపవలెను. అందుపై ఎలక్షన్ ఆఫీసరు తన యభిప్రాయములను వెలిబుచ్చుచు ఆరిపోర్టు ఎలక్షన్ అధికారికి పంపవలెను.

(3) (i) ఏర్పరిచిన గంటలలో ఎన్నిగంటలు ఆఫీసు మూయబడెనో అన్నిగంటలు తిరిగి ఆఫీసుతెరిచి ఓట్లు పుచ్చుకోవలసిన దని ఎలక్షన్ అధికారి నిర్ణయింపవచ్చును. ఎలక్షన్ అధికారివేసిన ఆర్డరుకు తిరుగులేదు.

(4) ఎలక్షన్ అధికారివేసే ఆర్డరులో

(i) ఓట్లు ఏతేదీని, ఎన్నిగంటలమధ్య పుచ్చుకొందురో అను విషయమున్ను

(ii) ఎలక్షన్ ఆఫీసరు ఓట్లు ఏతేదీని, ఎన్నిగంటలవేళ లెక్కపెట్టునో అను విషయమున్ను తెలుపవలెను.

ఓట్లుపుచ్చుకొనే తేదీకి 7 రోజులు ముందుగా ఎలక్షన్అధికారి వేసిన ఆర్డరు ప్రచురింపవలెను.

(5) మిగతాగంటలలో మాత్రమే ఓట్లు పుచ్చుకోవలసిన దని ఎలక్షన్ అధికారి ఆర్డరుచేసినచో

(i) ఆ ఎన్నికకు సంబంధించిన సంచులన్నియు ఎలక్షన్ ఆఫీసరు ఓట్ల ఆఫీసరువద్దకు పంపవలెను.

(ii) వేళకు కొద్దిగా ముందుగా ఓట్లఆఫీసరు ఆసంచులనువిప్పి, వేళకాగానే ఓట్లు పుచ్చుకొనుట ప్రారంభింపవలెను.

(iii) ఇదివరలో ఓట్లువేయనివారి ఓట్లే ఆఫీసరు పుచ్చుకోవలెను.

(6) వెనుకటి ఓట్లు లెక్కలోనికి తీసికొనక క్రొత్తగా ఓట్లు పుచ్చుకోవలసిన దని ఎలక్షన్ అధికారి ఆర్డరు చేసినచో, ప్రథమపర్యాయము ఓట్లు పుచ్చుకొనుసందర్భములో నవలంబించువిధు లన్నియు యీసందర్భములోను అవలంబింపవలెను. వెనుక నామినేషనయిన అభ్యర్థులకే రెండవపర్యాయము ఓట్లు పుచ్చుకోవలెను.

(7) ఓట్ల ఆఫీసు మూసినవెనుక అభ్యర్థి ఎవరైనను కాలముచేసినచో, ఎలక్షన్ ఆఫీసరాసంగతి ఎలక్షన్ అధికారికి తెలిపి, ఆ ఎన్నికలో అప్పటివరకు జరిగినచర్య రద్దు చేయించి, మొదటినుండియు, ఎలక్షన్ కార్యక్రమము జరుపవలెను.

ఇదివరలో నామినేషనైన అభ్యర్థులకు తిరిగి క్రొత్త నామినేషన్లు దాఖలు చేయనక్కరలేదు.

25. ఓట్లు పుచ్చుకొనుట ముగియగానే అభ్యర్థుల, ఏజంట్ల సమక్షములో ఆఫీసరు యీదిగువ నుదాహరించిన కాగితములు ప్రత్యేకముగా విడదీసి, వేరుకవర్లలో పెట్టి, వానిపై తనసీళ్లున్ను, అక్కడ హాజరుగానున్న అభ్యర్థుల ఏజంట్లసీళ్లున్ను వేసియుంచవలెను.

(i) ఓట్లువేసిన ప్రతి ఓట్లపెట్టెయు, తెరువకుండగనే సీళ్లువేయవలెను.

(ii) ఆపెట్టె తాళపుచెవులు.

(iii) పాడైన ఓటుకాగితములు, వాటి వెనుకముక్కలు.

(iv) పేచీ ఓటుకాగితములు.

(v) పొడియక్షరములు వేసిన ఓటరుజాబితాలు, ఓటుకాగితముల వెనుకముక్కలు.

(iv) పేచీ ఓట్లజాబితా.

(vii) తగాయిదా ఓట్లజాబితా.

26. ఇవన్నియు ఓట్లఆఫీసరు వెంటనే ఎలక్షన్ ఆఫీసరువద్దకు పంపవలెను. వానితోపాటు 7 వ మతలబుప్రకారం మొక స్టేట్‌మెంటు వ్రాసిపంపవలెను. ప్రతి కవరుపైన వరుససంఖ్య వేసి, అందులో నే కాగితము లున్నవో వ్రాయవలెను.

27. ఓట్ల లెక్కకు నియామకమైన రోజున, నియామకమైనవేళ, హాజరైన అభ్యర్థులు, ప్రతినిధుల సమక్షములో ఎలక్షన్ ఆఫీస రీక్రిందిచర్య నవలంబింపవలెను.

(అ) ఓట్లపెట్టెలు ఒకదానివెనుక నొకటి తెరచి, ఒక్కొక్క పెట్టెలో నున్న ఓట్లు ప్రత్యేకముగా లెక్కపెట్టి వాని లెక్క 8వ మతలబు ననుసరించి ఒక స్టేట్‌మెంటు వ్రాయవలెను.

(ఆ) ఆ పిమ్మట అన్ని పెట్టెలలోని ఓట్లున్ను కలిపి, ఏ ఏ అభ్యర్థి కెన్ని ఓట్లు వచ్చినవో లెక్కపెట్టవలెను. ఓటుకాగితములలో కొన్ని రద్దయినట్లు ఎలక్షన్ ఆఫీసరు భావించినచో ఆ వోటుపై 'నిరాకరించబడినది' అను మాట వ్రాయవలెను. ఏ అభ్యర్థి కాని, ఏజంటుకాని ఫలాని కాగితము రద్దు కాలేదని ఆఫీసరుతో చెప్పినచో, అట్టి కాగితము నిరాకరించుటకు కారణములు కూడ ఆఫీసరు వ్రాయవలెను.

(ఇ) ఎలక్షన్ ఆఫీసరు ఓట్లలెక్క ముగియువరకు పని సాగింపవలెను. ఈ మధ్య పని ఆపుచేయవలసినచో, ఓట్లున్ను వానికి సంబంధించిన కాగితములున్ను సంచులలోగాని, పెట్టెలలోగాని పెట్టించి, వానిపై తన సీలున్ను, అభ్యర్థుల, ఏజంట్ల సీళ్లున్ను, వేయించి తిరిగి పని ప్రారంభింపవలెను.

28. (1) పై కార్యక్రమము పూర్తియైన వెనుక ఆఫీసరు ఎలక్షన్ ఫలితములు 9 వ మతలబుననుసరించి వ్రాయవలెను. సక్రమమైన ఓట్లు ఏ అభ్యర్థి లేక అభ్యర్థుల కధికముగా వచ్చినవో, వా రెన్నుకోబడినట్లు ప్రకటింపవలెను.

ఆ ఎలక్షన్‌లో కొన్ని తరగతులకు లేక స్త్రీలకు సీట్లు కేటాయించి యున్నచో, ఆసీట్ల కెవ రెన్నుకోబడిరో ముందుగా ఆఫీసరు నిర్ణయింపవలెను.

(2) 9 వ మతలబు నకలు తీసికొనగోరిన అభ్యర్థిని గాని, ఏజంటునుగాని ఆఫీసరు నకలు తీసికొనుటకు అనుమతీయవలెను.

29. పై 25 వ రూలు (4) (5) విధులలో తెల్పినసంచులను ఎలక్షన్ ఆఫీసరు విప్పరాదు.

30. లెక్క పూర్తికాగానే

(i) సక్రమమైన ఓటుకాగితములు వేరుసంచిలోను

(ii) నిరాకరించిన ఓటుకాగితములు వేరుసంచిలోను

ఎలక్షన్ ఆఫీసరు పెట్టించి వానిపై సీళ్లువేయవలెను. ఏ సంచిలో ఎన్ని కాగితము లున్నవో, ఆ సంచి ఏ ఎన్నికకు సంబంధించినదో, ఆ సంచిలోని కాగితముల స్వభావ మెట్టిదో, ఆ సంచిపై వ్రాయవలెను.

31. ఎలక్షన్ ఫలితములు తెలుపు స్టేట్‌మెంటున కొక నకలు తీయించి, ఎలక్షన్ ఆఫీసరా నకలు ఆయా లోకల్‌బోర్డు ప్రెసిడెంటువద్దకు పంపవలెను. ఓటుకాగితములు, ఓటర్ల జాబితా మొదలగు యావత్తు రికార్డు సంచులలో పెట్టి, సీళ్లువేయించి తన ఆఫీసులో భద్రపరచవలెను. ఆ సంచులు ఎలక్షన్ విచారణలో విప్పవచ్చునుగాని అన్యథా తెరువరాదు.

(2) అకాగితములు ఎలక్షన్ ఆఫీసరు 1 సంవత్సరము భద్రపరిపించి, యీలోపుగా నే విచారణలోను వానిని పంపుమని తాఖీదురానిచో, ఆ పనుక కాల్చివేయవలెను.

32. (1) ఏ అభ్యర్థియైన రెండుమూడు సర్కిల్సులో లేక వార్డులలో మెంబరుగా నెన్నుకోబడినచో అతడు దేనికి మెంబరుగా నుండగోరునది ఎలక్షన్ ఆఫీసరుకు వ్రాసిపంపవలెను. ఫలితములు ప్రకటించిన 24 గంటలలోపుగా ఆకాగితము ఎలక్షన్ ఆఫీసరుకు చేరవలెను.

(2) అట్టి వర్తమానము ఎలక్షన్ ఆఫీసరుకు చేరినచో అతడా అభ్యర్థికోరిన సీటులో నెన్నుకోబడినట్లు ప్రకటించి, మిగతా సీట్లకు క్రొత్తఎన్నికలు జరుపవలెను. అట్టివర్తమానము చేరకున్నచో, ఆఫీసరుకు వచ్చిన ఏదో యొకసీటున కాతడెన్నుకోబడినట్లు నిర్ణయించి, మిగతాసీట్లకు క్రొత్తయెన్నికలు జరుపవలెను.

33. ఇరువు రభ్యర్థులకు సమానముగా ఓట్లు వచ్చినచో, ఆఫీసరు లాట్లపద్ధతి నవలంబించి గెలుపొందినవా రెవరో నిశ్చయింపవలెను.

34. గెలుపొందిన అభ్యర్థులపేర్లు ప్రకటననిమిత్తమై గవర్నమెంటు ముద్రాలయ సూపరింటెండెంటుగారికి ఎలక్షన్ ఆఫీసరు పంపవలెను.

జిల్లాబోర్డు ఎన్నికలలో ఆపేర్లు ఫోర్టుసెంట్ జార్జిగెజెట్‌లో ప్రకటింపవలెను.

తక్కిన ఎన్నికలలో జిల్లా గెజెట్‌లో ప్రచురింపవలెను.

ఆపేర్లు ఆయా లోకల్‌బోర్డు నోటీసు బోర్డుపై నటించవలెను.

35. (1) ఈనిబంధనల అంతరార్థ మేమియని సంశయము కలిగినచో గవర్నమెంటు అభిప్రాయము ననుసరించి ఆసందేహము నివారించుకొనవలెను. ఆ అభిప్రాయమే ఖాయపు అభిప్రాయమై చెల్లవలెను.

(2) ఈ అభిప్రాయ మిచ్చుటకుపూర్వము, గవర్నమెంటు, ఎలక్షన్‌లో జరుగు చర్య నాపుచేయించవచ్చును. ఆపుచేయుమని గవర్నమెంటు ఉత్తరు విచ్చినపిమ్మట జరిగినచర్యలు శాస్త్రవిరుద్ధములు. వాని కెట్టి విలువయు లేదు.

(3) ఆపుకాబడిన చర్య ఏసందర్భములో ఆపుకాబడెనో అప్పటినుండియు కొనసాగింపవచ్చును. కాని మొదటినుండియు తిరిగి సాగింపవలసిన యగత్యము లేదు.

36. (11) ఎ సెక్షన్ ప్రకారము మెంబరు ఎన్నికజరుగవలసినచో, వైస్ ప్రెసిడెంటు ఎన్నికలో నవలంబించువిధానమే అవలంబింపవలెను.

37. ఎన్నికల తారీఖులున్ను, గడువులున్ను మార్చుటకు గవర్నమెంటుకున్ను, ఎలక్షన్ అధికారికిన్ని హక్కున్నది.

1-వ మతలబు (3 (1) విధి చూ.)

## నామినేషన్ కాగితము

1. వార్డు లేక గ్రామము పేరు సంఖ్య..........................
2. అభ్యర్థి పూరా పేరు..........................
3. ,, నంబరు (జాబితాలో)..........................
4. ,, తండ్రి లేక భర్త పేరు..........................
5. ,, వయస్సు..........................
6. ,, పురుషుడా, స్త్రీయా..........................
7. ,, కులము..........................
8. ,, వృత్తి, చిరునామా..........................
9. ఉపపాదించు ఓటరు పేరు..........................
10. ,, ఓటరు నంబరు (జాబితాలో)..........................
11. ,, ఓటరు సంతకం..........................
12. బలపర్చు ఓటరు పేరు..........................
13. ,, ఓటరు నంబరు (జాబితాలో)..........................
14. ,, ఓటరు సంతకం..........................

నేను బ్రిటిషు సబ్జక్టు ననియు (లేక స్వతంత్ర ప్రభువు ప్రజలలో నివాడననియు) యీ ఎన్నికలో నభ్యర్థిగా నిలువ నిష్టపడి యున్నాననియు తెలుపుచున్నాను.

......................

అభ్యర్థి సంతకం.

ఈ నామినేషన్ కాగితము నాయెదుట......................(ఫలాని వారిచే)............తేదీని............గంటలవేళ దాఖలు కాబడినది.

..........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

## హెచ్చరిక

............తేదీని............గంటల లోపుగా ఎలక్షన్ ఆఫీసరుగారి యెదుట దాఖలుగాని నామినేషన్లు మంజూరు చేయరు.

2-వ మతలబు (6-వ విధి చూ.)

............సర్కిలు (లేక వార్డు లేక గ్రామ) ఎన్నికలలో.........
తేదీని దాఖలైన నామినేషన్లు.

1. వరుససంఖ్య.....................
2. అభ్యర్థి పేరు.....................
3. ,, తండ్రి లేక భర్తపేరు.....................
4. ,, పురుషుడా, స్త్రీయా.....................
5. ,, కులము.....................
6. ,, వృత్తి, చిరునామా.....................
7. ఉపపాదనచేయు ఓటరు పేరు.....................
8. బలపర్చు ఓటరు పేరు.....................

...............చోట...............తేదీని...........గంటలవేళ నామినేషన్లు తనిఖీ చేయుదురు.

..................................

ఎలక్షన్ ఆఫీసరు సంతకము.

3-వ మతలబు (8 (1) రూలు చూ.)

## సక్రమములగు నామినేషన్లు

1. వరుససంఖ్య.....................
2. అభ్యర్థి పేరు.....................
3. ,, పురుషుడా స్త్రీయా......
4. ,, కులము.....................
5. ,, చిరునామా.....................

............తేదీని.........గంటలవేళ ఓట్లు పుచ్చుకొందురు.

..................................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

4-వ మతలబు (15 (1) విధి చూ.)

## ఓ టు కా గి త ము

లోపలి కాగితము

పై కాగితము

వరుస సంఖ్య

జిల్లాబోర్డు పంచాయితీ

సర్కిలు
గ్రామము
వార్డు

జిల్లాబోర్డు
పంచాయితీ

సర్కిలు
గ్రామము
వార్డు

ఎలక్షన్ జరుగు తేదీ

ఓట్లజాబితాలో పేరు, సంఖ్య

| వరుస సంఖ్య (1) | అభ్యర్థి పేరు (2) | ఓటరు పెట్టు గుర్తు (3) |
|---|---|---|
| 1 | | |
| 2 | | |
| 3 | | |
| 4 | | |
| 5 | | |
| 6 | | |
| | | |

వెనుక పీఠీ

సంఖ్య.

5-వ మతలబు (22-వ విధి చూ.)

## పేచీ ఓట్ల జాబితా

..................పోలింగు ఆఫీసు.

| వరుస సంఖ్య | ఓటరు జాబితాలో సంఖ్య | పేరు | విలాసము | వ్రాలు లేక వేలుముద్ర |
|---|---|---|---|---|
| | | | | |

6-వ మతలబు (23 వ విధి చూ.)

## తగాయిదా ఓట్లజాబితా

............పోలింగు ఆఫీసు.

| వరుస సంఖ్య. | ఓటరు జాబితాలో సంఖ్య. | పేరు. | విలాసము. | వ్రాలు లేక వేలుముద్ర |
|---|---|---|---|---|
| | | | | |

7–వ మతలబు (28 వ విధి చూ.)

.........పర్కిలం / గ్రామం / వార్డు కి .........తేదీని ఎన్నిక అయినపిమ్మట ...............

.................జిల్లా / గ్రామం లో ...........................చోట ఓట్ల ఆఫీస రిచ్చిన స్టేట్‌మెంటు.

| తబిసీలు | పుచ్చుకొన్న వాని సంఖ్య | ఖర్చు పెట్టిన వాని సంఖ్య | పాడైనవాని సంఖ్య | మిగిలినవి | రిమార్కులు |
|---|---|---|---|---|---|
| ఓటుకాగితములు.<br>(i) సాధారణపు ఓట్లు<br>(ii) పేచీ ఓట్లు<br>(iii) తగాయిదా ఓట్లు | | | | | |

ఎలక్షన్ ఆఫీసరుకు పంపిన సంచులతబిసీళ్లు.

...............................

ఓట్ల ఆఫీసరు వ్రాలకము.

8–వ మతలబు (27 (ఎ) విధి చూ.)

| పోలింగుఆఫీసు పేరు | ఓటుపెట్టె సంఖ్య | ఓటుపెట్టెలోని కాగితముల సంఖ్య |
|---|---|---|
| | | |
| మొత్తము... | | |

...............................

ఎలక్షన్ ఆఫీసరు వ్రాలకము.

9-వ మతలబు (28-వ విధి చూ.)

| | జిల్లా | | సర్కిలు | |
|---|---|---|---|---|
|................. | గ్రామం లోని | .............. | గ్రామం | కు చెందిన ఓట్లఫలిత |
| ములం తెలియజేయు కాగితము. | | | వార్డు | |

| అభ్యర్థి పేరు | సక్రమమైన ఓట్లసంఖ్య |
|---|---|
| 1. | |
| 2. | |
| 3. | |
| 4. | |
| 5. | |
| 6. | |
| సక్రమమైన ఓట్ల మొత్తపుసంఖ్య...... | |
| నిరాకరించిన ఓట్ల మొత్తపుసంఖ్య...... | |

.........సర్కిలు, గ్రామం, వార్డు—కు యీ క్రిందివారు సక్రమముగా నెన్నుకొనబడి రని నేను తెల్పుచున్నాను.

.........తరగతి, స్త్రీలు—కు చెందిన రిజర్వు సీట్లకు.....................1

.........తరగతి, స్త్రీలు—కు చెందిన రిజర్వు సీట్లకు.....................2

.........తరగతి, స్త్రీలు—కు చెందిన రిజర్వు సీట్లకు.....................3

తరగతి, స్త్రీలు—రిజర్వుకాని సీట్లకు { ......................4<br>......................5<br>......................6 }

..............................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

## లోకల్‌బోర్డుల మెంబరు ఎన్నికలవిధానము

---

### 3 వ భాగము

1. (1) ఈ భాగములోని నిబంధనలు 1, 2 భాగములలోని విధులకు లోనుగాని పంచాయితీలకు సంబంధించినవి.

(2) ఈ విధులలో ఎలక్షన్ ఆఫీసరనగా ఎలక్షన్ అధికారి చేతిక్రింద పనిచేయు నుద్యోగి. ఎలక్షన్‌కు సంబంధించిన పనులన్నియు నితడు చేయును.

2. (1) పంచాయితీకి మెంబర్ల నెన్నుకొనునిమిత్త మేర్పరచిన ఎలక్షన్‌కు 10 రోజులు ముందుగా ఆంగ్లములోగాని, జిల్లా వాడుకభాషలోగాని ఒక నోటీసు తయారుచేసి ప్రకటింపవలెను. అందులో యీ క్రిందివిషయములను వ్రాయవలెను.

(i) ఎన్నుకోవలసిన అభ్యర్థు లెందరో, ఏ వార్డులకు వారి నెన్నుకొనవలసి యున్నదో, ఆ గ్రామములో గాని, వార్డులోగాని పంచములకు కేటాయించిన సీట్లెన్నో.

(ii) ఆ గ్రామము లేక వార్డుయొక్క ఓటరుజాబితాలోని ఓట ర్లందరిని ఎలక్షన్ జరుగు తేదీని, ఫలానిచోట, ఫలాని గంటలకు, హాజరు కమ్మనియు.

(2) ఆ ప్రకటన పంచాయితీ కచేరీలోను, గ్రామ చావడిలోను, ఎలక్షన్ ఏ గ్రామమునకు లేక వార్డునకు జరుగుచున్నదో అక్కడ 3 వెల్లడిచోట్లను ప్రకటింప వలెను. ఆ గ్రామము, లేక వార్డులో, ఆ విషయము టముకుకూడ వేయించవలెను.

(3) ఎలక్షన్ జరుగు రోజున నిర్ణీతవేళకు 3 గంటలు ముందుగానైన ఆ విష యము టముకు వేయించవలెను.

3. ఎలక్షను ఆఫీసరు (లేక అతనిస్థానే ఏర్పరుపబడిన యాతడు) ఆరోజు ఎల క్షనులో అధ్యక్షత వహించి కార్యక్రమము నడుపవలెను. (అతని నికముందు ఓట్ల ఆఫీస రను పేరుతో వ్యవహారింతుము.)

4. ఓట్ల ఆఫీసరు ఎన్నికలు జరుగుచోటికి ఓటర్లను, అభ్యర్థులను మాత్రమే రానీయవలెను. మిగతావారిని రానీయరాదు. అతనిచర్య నధిక్షేపింప వీలులేదు.

5. ప్రతి అభ్యర్థి పేరున్ను ఓట రొకడు ఉపపాదింపవలెను; మరియొకడు బలపర్చ వలెను. అట్లు ఉపపాదింపబడిన, బలపర్చబడిన పేర్లు ఓట్ల ఆఫీసరు వ్రాసికోవలెను.

ఏ వార్డులో ఎన్నికకోరు అభ్యర్థి పేరు ఆవార్డు ఓటరుజాబితాలో చేరియుండ వలెనని నియమము లేదు. ఆ గ్రామములో ఏదియో యొక జాబితాలో వానిపేరున్న చాలును.

6. గ్రామములలో పెక్కు వార్డు లుండి రెండుమూడు వార్డులకు ఎలక్షన్ జరుగ వలసి యున్నప్పుడు—

(i) అట్టి ఎలక్షన్ సందర్భములో 7 మొదలు 10 వ విధివరకు వ్రాసియున్న కార్యక్రమము ముందొక వార్డునకు జరిపి అటుపిమ్మట మరియొక వార్డునకు జరుపవలెను.

7. ఓట్ల ఆఫీసరు తనంతట తానే లేదా ఏ ఓటరైన ఆక్షేపణచేసినచో ఏ అభ్యర్థి నామినేషనైన యీ క్రిందికారణములలో నేదియున్నను నిరాకరింపవచ్చును:—

(i) అభ్యర్థి 54, 55, 59 సెక్షన్ల ప్రకారము అనర్హుడగుట.

(ii) ఉపపాదించిన ఓటరు లేక బలపరిచిన ఓటరుపేర్లు ఆగ్రామము లేక వార్డు జాబితాలో లేకుండుట.

(iii) ఎలక్షన్ పంచములకు కేటాయించిన సీట్లకే అయియుండగా అభ్యర్థి పంచముడు కాకుండుట.

సక్రమముగా నామినేషనైన అభ్యర్థులపేర్లు ఆఫీసరు చదువవలెను. పిమ్మట యీ క్రిందివిధుల ననుసరించి నడుచుకొనవలెను.

I. ఎలక్షన్ జనరల్‌సీట్లకు ప్రత్యేకముగా లేక రిజర్వుసీట్లకు ప్రత్యేకముగా జరుగుచున్నచో:

(i) అభ్యర్థుల సంఖ్య ఖాళీలసంఖ్యకు సరిపోయినచో అభ్యర్థు లందరు ఎన్నుకోబడినట్లే నిర్ణయింపవలెను.

(ii) అభ్యర్థుల సంఖ్య ఖాళీలసంఖ్యకు లోపించినచో అభ్యర్థులందరు ఎన్నుకోబడినట్లు నిర్ణయించి మిగతాసీట్లకు క్రొత్తగా ఎన్నికలు జరుపవలెను.

(iii) అభ్యర్థు లెవరున్ను లేనిచో క్రొత్త ఎన్నికలు జరుపవలెను. అభ్యర్థుల సంఖ్య ఖాళీలసంఖ్యకు మించి యున్నచో ఓట్లు పుచ్చుకొనవలెను.

II. ఎన్నిక జనరల్‌సీట్లు కొన్నింటికి, పంచములకు కేటాయించినసీట్లు కొన్నింటికి జరుగుచున్నచో:

(i) కేటాయించిన సీట్లసంఖ్యకు అభ్యర్థుల (ఆదిఆంధ్రుల) సంఖ్య సరిపోయినచో అభ్యర్థులందరు ఎన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను.

(ii) కేటాయించిన ఖాళీలసంఖ్యకంటె అభ్యర్థుల (ఆదిఆంధ్రుల) సంఖ్య తక్కువగానున్నచో అభ్యర్థులందరు ఆసీట్ల కెన్నుకోబడినట్లే నిర్ణయింపవలెను. మిగతా ఖాళీలకు క్రొత్తఎన్నికలు జరుపవలెను.

(iii) ఆదిఆంధ్రు లెవరున్ను అభ్యర్థులుగా నిలువనిచో ఎలక్షన్ క్రొత్తగా జరుపవలెను.

(iv) పైరీతిగా మెంబ ర్లెన్నుకోబడినసీట్లున్ను, క్రొత్త ఎలక్షన్ జరుపవలె నని నిర్ణయించిన సీట్లున్ను మిగతా ఎన్నికలనుండి తప్పించవలెను.

(v) ఇట్లు తప్పించిన వెనుక,

(అ) మిగతా అభ్యర్థులసంఖ్య మిగిలిన ఖాళీలసంఖ్యకు సరిపోయినచో ఓట్ల ఆఫీసరు వారి నందరను కేటాయించిన సీట్లకుగాని, కేటాయింపని సీట్లకుగాని ఎన్నుకోబడినట్లు (vi వ విధిలో నిరూపించినట్లు) నిర్ణయింపవలెను.

(ఆ) మిగతా అభ్యర్థులసంఖ్య మిగిలిన ఖాళీలసంఖ్యకు లోపించినచో వారి నందరిని (తరగతులతో నిమిత్తములేకుండా) కేటాయించిన సీట్లకుగాని కేటాయింపని సీట్లకుగాని ఎన్నుకోబడినట్లు ((vi) వ విధిలో నుదాహరించినట్లు) నిర్ణయింపవలెను. ఇంకను మిగిలియున్న ఖాళీలకు ఎలక్షన్ జరుపవలెను.

(ఇ) అభ్యర్థు లెవరున్ను మిగిలియుండనిచో మిగతాఖాళీలకు క్రొత్తయెన్నికలు జరుపవలెను.

(ఈ) మిగిలిన అభ్యర్థుల సంఖ్య ఖాళీలసంఖ్యకంటె నధికముగా నున్నచో ఓట్లు తీసికొనవలెను.

(vi) (అ) (v) (అ) (ఆ) లలో నుదాహరింపబడిన అభ్యర్థులందరు (కేటాయించిన సీట్ల కెన్నుకోబడిరని క్రిందివిధిలో నుదాహరించినవారు మినహా) కేటాయింపని సీట్ల కెన్నుకోబడినట్లు నిశ్చయింపవలెను.

(ఆ) (v) (అ) (ఆ) లలో నుదాహరించిన అభ్యర్థుల (ఆదిఆంధ్రుల) సంఖ్య కేటాయించిన సీట్లసంఖ్య నతిక్రమించినచో, లాట్లువేసి ఆ అభ్యర్థులలో నెవరా కేటాయించిన సీట్లకు ఎన్నుకోబడిరో ఆఫీసరు నిర్ణయింపవలెను.

పై నుదాహరించిన అభ్యర్థులు వారిలో నెవరు మెంబర్లుగా సీట్ల కెన్నుకోబడవలెనో వారిలోవారు సంప్రతించుకొని నిశ్చయించి ఏకస్థులై ఆ విషయ మొక కాగితముపై వ్రాసి, సంతకములు చేసి ఆఫీసరు కిచ్చినచో ఆఫీస రావిధముగానే వారెన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను.

ఆగ్రామము లేక వార్డులో ఓటు హక్కున్నవారిని అభ్యర్థి పేరు చెప్పి, అతనికి ఓట్లిచ్చువారిని చేతు లెత్తమని చెప్పవలెను. ఈ విధముగా ఏ అభ్యర్థి తరఫున ఎక్కువమంది చేతు లెత్తుదురో ఆ అభ్యర్థి సక్రమముగా నెన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను.

ఆగ్రామము (లేక వార్డులో) లో ఒకటిగాని ఒకటికి మించిగాని ఆది ఆంధ్రులకు సీట్లు కేటాయించియున్నచో వారిలో నే అభ్యర్థి కెక్కువ ఓట్లు వచ్చినవో మొట్టమొదట నిర్ణయించి ఆత డెన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను.

10. ఇద్దరు ముగ్గు రభ్యర్థులకు వచ్చిన ఓట్లసంఖ్య సమాన మైనచో, లాట్లువేసి వారిలో నెవ రెన్నుకోబడిరో అధ్యక్షుడు నిర్ణయింపవలెను.

11. సక్రమముగా నెన్నుకోబడిన అభ్యర్థుల పేర్లు ఆయా పంచాయితీ ఆఫీసు నోటీసుబోర్డులో వెంటనే ప్రకటింపవలెను. డిస్ట్రిక్టు గజెట్‌లో ప్రచురణనిమిత్తమై వెంటనే పంపవలెను.

12. 11—ఎ సెక్షన్ ప్రకారము మెంబరు ఎన్నిక జరుగవలసియున్నచో వైస్ ప్రెసిడెంటు ఎన్నికలో నవలంబించువిధానమే అవలంబింపవలెను.

## లోకల్‌బోర్డుల ఓటరు జాబితాలు సమకూర్చుటలో గమనింపవలసిన నిబంధనలు

---

నెంబరు 1176—గవర్నరుగారు వారి మంత్రులతో సంప్రతించి యీ నిబంధన లేర్పరిచినారు. (లోకల్‌బోర్డు ఓటరు జాబితాలు సమకూర్చు నిమిత్తము) ఇట్లు శాసించుటకు వారి కధికార మున్నది. (మద్రాసు లోకల్‌బోర్డుఆక్టు, (1920వ సంవత్సరము, 14 వ ఆక్టు), 199 వ సెక్షన్ (ఎ) (బి) లను చూ.) పూర్వపు నిబంధనలన్నియు రద్దుచేసినారు.

[తాలూకాబోర్డులు అమలులో లేనికారణముచే తాలూకాబోర్డులకు సంబంధించిన నిబంధనలు వ్రాయలేదు—]

1. ఎలక్షన్‌పై పెత్తన మొక అధికారికి గవర్నమెంటువా రిత్తురు. ఆతడు తన సహాయార్థ మితరోద్యోగుల నియమించుకొనును. అట్లు నియమింపబడిన ఉద్యోగులను ఎలక్షన్ ఆఫీసర్లు అనుపేరుతో పిలుతురు. ఓటరు జాబితాలు తయారుచేయుట, ప్రచురణచేయుట, ఎలక్షన్ సంబంధమైన తదితర కార్యములు నెరవేర్చుట, ఎలక్షన్ ఆఫీసర్లకు ఒప్పచెప్పవచ్చును.

(గవర్నమెంటువారు ప్రెసిడెంటు, వైస్‌ప్రెసిడెంటు కాని వ్యక్తిని ఎలక్షన్ అధికారిగా నియమింతురు.)

2. ప్రతి రివిన్యూతాలూకాలోను ఒకటైయైన డిస్ట్రిక్టుబోర్డు సర్కిల్సు (విభాగము) ఉండవలెను.

(మునిసిపాలిటీని వార్డులక్రింద విభజించినట్లు జిల్లానంతయు కొన్ని సర్కిల్సుగా విభాగింతురు. సాధారణముగా ఒకసర్కిలుకు ఒక జిల్లాబోర్డు మెంబరుండును.)

3. తాలూకా అంతకును ఒకటే ఓటరుజాబితా తయారుచేయవలెను. ఆ జాబితా యీ దిగువనిచ్చిన 1 వ మతలబుప్రకారము వ్రాయవలెను. ఆ జాబితాలో ప్రతి జిల్లాబోర్డు సర్కిలుకును వేరువేరు భాగములు విడదీసి వ్రాయవలెను. కొన్నిగ్రామముల సంపుటీకరించి ఒకసముదాయముగా చేర్చి, ఆగ్రామములన్నిటికిని ఓట్లుపుచ్చుకొనుటకు కేంద్రస్థానముగా నొకగ్రామ మేర్పరుపవలెను.

జాబితాలో ఏ సముదాయమున కాసముదాయమునకు వేరుభాగ మేర్పరుపవలెను. జిల్లాబోర్డు సర్కిల్సుకు ప్రత్యేకముగా వరుససంఖ్య యీయవలెను. గ్రామ

సముదాయములను ప్రత్యేకముగా లెక్కించి ప్రతి గ్రామసముదాయమందున్న కేంద్ర స్థానము దానియెదుట స్పష్టముగా వ్రాయవలెను. ఈ గ్రామసముదాయములోని గ్రామముల పేర్లు అకారాదిగా వ్రాసియుంచవలెను.

4. (1) గ్రామము వార్డుల క్రింద విభాగమై యున్నప్పుడు ఓటర్ల పేర్లు వారివారి వార్డుజాబితాలలో వ్రాయవలెను.

(2) గ్రామము వార్డుల క్రింద విభాగము కాని పరిస్థితులలో, గ్రామమంతకును ఒక్కటే ఓటరుజాబితా వ్రాయవలెను; లేదా

(3) రివిన్యూలెక్కలలో వ్యవహరింపబడు గ్రామములోని ఓటర్లందరి పేర్లున్న ఒకేజాబితాలో వ్రాయవలెను. ఓటర్ల పేర్లు అకారాదిగా వ్రాయవలెను.

ఈపై 1 మొదలు 3 పేరాలలో వివరించిన ప్రదేశములు ఎలక్షన్ నిమిత్తమై విభజించిన ఖండములుగా భావింపవలెను.

5. (అ) ఓటరు హక్కునకు మూలముగా ప్రతిఓటరున్ను లోకల్ బోర్డు పరిపాలనలోనున్న గ్రామములలో లేక పట్టణములలో నిర్ణీతకాలము నివసించి యుండవలెను. (సాలునకు 120 రోజులు.) ఓటరు ఏగ్రామములో నివసించియుండెనో ఆగ్రామ ఓటరుజాబితాలో వానిపేరు చేర్పవలెను.

(ఆ) కొందరు ఓటర్లు యీ 120 రోజులు రెండుమూడు గ్రామములలో నివసించి యుండవచ్చును. (120 రోజులు ఒకగ్రామములో, 120 రోజులు మరియొక గ్రామములో) అట్టివారిపేరు యీరెండుమూడు గ్రామములలో ఏదినో ఒకగ్రామజాబితాలో చేర్పవలెను. ఓటరు ఆరెండు మూడింటిలో ఏదియో ప్రత్యేక గ్రామజాబితాలో తనపేరు చేర్పవలసినదని ఎలక్షన్ ఆఫీసరుగారిని కోరినచో, ఎలక్షన్ ఆఫీసరుగారల్లే చేర్పవలెను.

(ఇ) మునిసిపాలిటీలలోగాని, కాంటన్మెంట్లలోకాని (సాధారణముగా సేననిల్పు పట్టణములు) నివసించువారికి లోకల్ బోర్డు ఎన్నికలలో ఓట్లుండవచ్చును. ఆ మునిసిపాలిటీలకు, కాంటెన్మెంట్లకు సరిహద్దు పోలింగుస్టేషన్లో (అనగా ఓట్లు పుచ్చుకొను ఆఫీసు) వారిఓట్లు ఎలక్షన్ ఆఫీసరుగారు పుచ్చుకొందురని నియమింపవలెను. ఆఓటర్ల పేర్లు ఆపోలింగు స్టేషన్లోనుంచిన జాబితాలచివర చేర్పవలెను.

6. ఆయాజిల్లాలో వాడుకభాషలో ఓటరుజాబితా వ్రాసియుంచవలెను. జాబితా అంతయుంకాని, అందులో కొంతభాగముకాని యితరభాషలోకూడ వ్రాసియుంచుమని ఎలక్షన్ అధికారి ఆజ్ఞాపింపవచ్చును.

7. (1) ఎలక్షన్ ఆఫీసరు ఓటుహక్కున్నవారి పేర్లన్నియు నొకజాబితాలో వ్రాసియుంచవలెను. ఎవరెవరికి హక్కున్నదో భోగట్టాచేసి తెలుసుకొనవలెను. ప్రతి ఖండమునకు వేరువేరుజాబితాలు తయారుచేయవలెను. ఈ జాబితాలు గవర్నమెంటు నిరూపించిన మతలబుప్రకారము వ్రాయవలెను. ఈ జాబితాలలో ఓటర్ల పేరుతో పాటు కొన్ని తబిసీళ్లుకూడా వ్రాయవలసినదని ఎలక్షన్ అధికారి శాసింపవచ్చును.

(2) ఈపై జాబితాలనుబట్టి తాలూకు కొక చిత్తుజాబితా తయారుచేసి ఆ జాబితాను ముద్రింపించి ప్రచురింపవలెను. ముద్రితమైన వెనుకటి జాబితా లున్నయెడల, ఆజాబితాలున్ను, అందులో చేసినమార్పులు ప్రత్యేకముగా వ్రాసి, యివిరెండున్ను ప్రచురింపవచ్చును. ఎలక్షన్ ఆఫీసు నోటీసుబోర్డులో యీ జాబితా ఏప్రిల్ 30వ తేదీ లోపుగా ప్రచురింపవలెను. తాలూకా చిత్తు ఓటరు జాబితాయున్ను, యీ దిగువ (3) వ సబ్ సెక్షన్‌లో నుదాహరించిన నోటీసులున్ను, ఏప్రిల్ 30 వ తేదీ లోపుగా జిల్లాబోర్డు ఆఫీసులోను, ఆయా తాలూకా ఆఫీసులలోను ప్రచురింపవలెను ప్రతి గ్రామమునకు సంబంధించిన జాబితా ఆ గ్రామపంచాయితీ ఆఫీసులోగాని, గ్రామ చావడిలోగాని, గ్రామములో బాహాటమైన వేరొక తావునగాని, ప్రచురింపవలెను.

(3) ఈ చిత్తు జాబితాలతోపాటు ఎలక్షన్ ఆఫీసరుగారు మరియొక నోటీసు ప్రచురింపవలెను. ఈ జాబితాలకు ఆక్షేపణలు దాఖలు చేయగోరువారు ఏ మతలబునను సరించి వ్రాయవలెనో, ఆక్షేపణ లే తేదీలోపుగా దాఖలుచేయవలెనో ఆ నోటీసులో తెలుపవలెను. ఈ ఆక్షేపణలు ఆఫీసరుగారు ఏరోజున, ఏ ప్రదేశమందు, విచారణ చేతురో ఆ హంశములు కూడా నోటీసులో వ్రాయవలెను. ఈ విచారణతేదీ జూన్ నెల 15 వ తేదీ దాటి ఏర్పర్చరాదు. ఈ నోటీసు దిగువ నుదాహరించిన 2 వ మతలబు ననుసరించి వ్రాయవలెను.

(ఓటరు జాబితాలకు సంబంధించిన ఆక్షేపణలు రెండు విధములు. మొదటి తరగతి ఆక్షేపణలుచేయు నధికారము ఓటుహక్కున్నదని చెప్పువారందరకు నున్నది. తమకు ఓటు హక్కున్నను తమ పేరు చేర్పలేదని కాని, చేర్పవలసిన చోట చేర్పక వేరు చోట చేర్చిరని కాని, తబిసీళ్లు తప్పుగా వ్రాసిరని కాని ఆక్షేపణ చేసినచో, నది మొదటి తరగతిలో చేరును. అది 3 వ మతలబుప్రకారము వ్రాసి పంపవలెను. రెండవ తరగతి ఆక్షేపణలు చేయుటకు జాబితాలో పేరున్నవారికి మాత్రమే అర్హతయున్నది. తమ పేరు చేర్చియుండరాదని కాని ఆ జాబితాలో వ్రాసియున్న యింకొకరి పేరు

చేర్చియుండరాదని కాని ఆక్షేపణచేసెనచో, నది రెండవ తరగతిలో చేరును. రెండవ తరగతి ఆక్షేపణలు 4 వ మతలబు ననుసరించి (వ్రాసి పంపవలెను.)

(4) ప్రతి ఖండమునకు సంబంధించిన జాబితాకున్ను నకళ్లు తీసి ఎలక్షన్ ఆఫీసరుగారు వారి ఆఫీసునందును ఆ ఖండమునకు సంబంధించిన ఆఫీసులందును, సిద్ధపర్చవలెను. అవి చూడగోరువారికిన్ని, కొనగోరువారికిన్ని అందుబాటుగా నుండవలెను.

(5) పై (3) వ పేరాలో నుదాహరించిన నోటీసు ఆ జిల్లాలో ప్రచారమున్న ఒకటి రెండు వార్తాపత్రికలలో కూడ ప్రచురింపవలెను. ఆ వార్తాపత్రికలు వాడుక భాషలో ముద్రితములై యుండవలెను.

8. (1) తమకు ఓటుహక్కున్నను తమపేరు ఓటరు జాబితాలో చేర్చియుండలేదనికాని, చేర్చవలసినచోట చేర్చలేదనికాని, తబిసీళ్లు పొరపాటుగా వ్రాసిరనికాని చెప్పచు, తమ ఓటు హక్కు స్థిరపరుచుకొనగోరు వారెల్లరు ఆక్షేపణలు వ్రాసిపంపుకొనవచ్చును. ఈ ఆక్షేపణలు మొదటి తరగతికి చెందినవి. ఇవి 3 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. జాబితాలో పేరున్నవారు తమపేరు చేర్చియుండరాదని కాని, జాబితాలో మరియొకరిపేరు చేర్చరాదనిగాని ఆక్షేపణలు వ్రాసి పంపవచ్చును. ఇవి రెండవతరగతి ఆక్షేపణలు. ఇవి 4 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. తాలూకాబోర్డు ఆఫీసులో ఓటరు జాబితా ప్రచురణ చేసిన 30 రోజుల లోపుగా ఆఫీసరుగారికి యీ రెండు తరగతుల ఆక్షేపణలున్ను చేరవలెను.

(2) ఈ ఆక్షేపణలు స్వయముగా, లేక పోస్టుద్వారా, లేక నౌకరుచేత ఆఫీసరుగారి కందజేయవచ్చును.

(3) పై నుదాహరించిన గడువు దాటినపిమ్మట దాఖలైన ఆక్షేపణలు మంజూరు చేయరు.

(4) పై రెండుతరగతుల ఆక్షేపణ మతలబునకళ్లు ఎలక్షన్ ఆఫీసరుగారున్ను, ఆయా లోకల్ బోర్డు ప్రెసిడెంట్లున్ను, కోరినవారి కుచితముగా నీయవలెను.

9. ఈ ఆక్షేపణల విచారణకు ముందుగా ఎలక్షన్ ఆఫీసరుగారు వీనికి సంబంధించిన వర్తమానమంతయు నడిగి తెలిసికొనవలెను. అట్లు గ్రహించిన వర్తమానమునుబట్టి, మరణించినవారి పేర్లేవైన జాబితాలో చేరినయెడల ఆపేర్లను కొట్టివేయవచ్చును. వ్రాత పొరపాట్లు సవరింపవచ్చును.

10. (అ) సకాలములో చేరిన రెండు తరగతుల ఆక్షేపణలకున్ను పట్టీలు వ్రాసి (5 వ మతలబుప్రకారము వానిని వ్రాయవలెను.) అవి తమ ఆఫీసులోను, తాలూకా

ఆఫీసులలోను, ప్రతి లోకల్ బోర్డు ఆఫీసులోను, ఎలక్షన్ ఆఫీసరుగారు ప్రచురింప వలెను. ఈ ప్రచురణ జూన్ నెల 5 వ తేదీకి పూర్వమే జరుగవలెను. ఆక్షేపణల పట్టీల తోపాటు ఆఫీసరుగారు చేసిన సవరణలు కూడ ప్రచురింపవలెను.

(ఆ) రెండవతరగతి ఆక్షేపణలకు సంబంధించిన ప్రతి ఓటరుకున్ను ప్రత్యేక ముగా ఆఫీసరు నోటీసు చేయించవలెను. అవిధముగానే తాముచేసిన సవరణలకు సంబం ధించిన ప్రతి ఓటరుకున్ను ప్రత్యేకముగా నోటీసు చేయించవలెను.

పై నోటీసులలో ఆక్షేపణలకు, సవరణలకు సంబంధించిన విచారణ తాము ఫలానా ప్రదేశములో, ఫలానా తేదీని ప్రారంభింతు మనికూడా తెలుపవలెను.

11. (అ) నిర్ణీతదినమున, నిర్ణీత ప్రదేశమున ఆఫీసరుగారు 1, 2 ఆక్షేపణలు విచా రణ చేయవలెను. ఆ విచారణ చేయుచోట కెవ్వరైనను వచ్చిపోవు నవకాశ ముండ వలెను. ఆరోజు విచారణ పూర్తికానిచో ఆ మరునాడున్ను, అట్లే రోజువెంబడి రోజు విచారణ పూర్తిచేయవలెను. వలయుచో మరుసటి రోజుకుగాక దూరపుతేదీని వాయిదావేయుటకు ఆఫీసరుగారి కధికారమున్నది. వారి ఆఫీసులో వాయిదావేసిన సంగతి తెల్పుచు నోటీసు కట్టించవలెను. మిగతా విచారణకు సంబంధించినవారికి ప్రత్యేకముగా వాయిదాతేదీ తెల్పును నోటీసులు చేయించవలెను. 1, 2 తరగతుల ఆక్షేపణల విషయమై వలయు విచారణసల్పి ఆఫీసరుగారు వానిపై తమతీర్పు వ్రాయ వలెను. ఎదురువాదమున్న సందర్భములలో తీర్పున కాధారమగు సబబులుకూడ ఆఫీసరు గారు వ్రాయవలెను. తా మిదివరలోచేసిన సవరణలగూర్చియు తీర్పువ్రాయవలెను. ఈ ఆర్డర్లు దిగువవిధుల ననుసరించి అపీలులో మార్పైన సందర్భములో తప్ప తక్కిన సందర్భములలో నిరాక్షేపణగా చెల్లవలెను.

12. (1) 'ఎలక్షన్ ఆఫీసరు' చేసిన తీర్పులు తమకు విరుద్ధములని భావించువారు, వానిపై ఎలక్షన్ అధికారికి అపీలు దాఖలుచేసికొనవచ్చును. అపీలువినుటకు వేరే అధి కారిని ఎలక్షన్ అధికారి నియమించినచో అపీలు ఆ అధికారికి చేయవలెను, లేదా ఎలక్షను అధికారికే చేయవలెను. అపీలు 6 వ మతలబు ననుసరించి వ్రాయవలెను. ఎలక్షన్ అధికారికిగాని, అతడు నియమించిన అధికారికిగాని ఎలక్షన్ఆఫీసరుద్వారా పంపవలెను. ఎలక్షన్ఆఫీసరు తీర్పుచెప్పిన 5 రోజులులోపుగా యీ అపీళ్లు దాఖలు చేయవలెను.

(2) అపీళ్లు విచారణచేయు నధికారివద్దకు యీ అపీళ్లు (ఎలక్షన్ ఆఫీసరు) పంపవలెను. ఈఅపీళ్లకు సంబంధించిన కాగితములన్నియు ఎలక్షన్ఆఫీసరు ఆ అధికారి వద్దకు పంపవలెను. ఈ ఆక్షేపణలకుసంబంధించిన విషయములున్ను, అపీలులోవ్రాసిన

సబబులపై తమ యభిప్రాయమున్ను, ఎలక్షన్ ఆఫీసరుగారు వ్రాసిపంపవలెను. అపీలులో చేసిన తీర్పు ఖాయపుతీర్పుగా చెల్లవలెను.

13. ఈనిబంధనలప్రకారము 'ఎలక్షన్ ఆఫీసరు' పంపవలసిన నోటీసులు, ఆయా ఓటరిచ్చిన విలాసమునకు గాని, జాపితాలోనున్న విలాసమునకుగాని, ఓటరు కడపట నివసించిన చోటునకుగాని పోస్టుద్వారా పంపిన చాలును.

14. ఆక్షేపణల ప్రథమవిచారణలోగాని అపీలులో కాని పార్టీలు తమవాదము చెప్పవచ్చును. స్వయముగా చెప్పిన చెప్పవచ్చును, లేదా ప్రతినిధిముఖముగా చెప్పిన చెప్పవచ్చును. అట్టి ప్రతినిధుల నేర్పర్చుకొన్నట్లు అధికారులకు లిఖితముగా వ్రాసి యీయవలెను. (ప్రతినిధిగా ప్లీడరును కాని యింకొకరినికాని యేర్పర్చుకొనవచ్చును.)

15. సాక్షుల వాంగ్మూలములు ప్రమాణముపై తీసికొనవచ్చును. అట్లు ప్రమాణము చేయించుమని అధికారిని పార్టీ లెవ్వరైనను కోరవచ్చును; లేదా అధికారి తానే ఏ సాక్షినైనను ప్రమాణము చేయుమనవచ్చును.

16. (1) 11 వ రూలు (1) వ భాగములో నుదాహరించిన తీర్పు ననుసరించి జాబితాలో వలయు మార్పులను ఎలక్షన్ ఆఫీసరు చేయవలెను. అట్లు మార్పులు చేసిన జాబితా సాఫుజాబితా అయియుండును. దానిపై ఆఫీసరు సంతకముచేసి దానిని ముద్రింపించవలెను. ఈ సాఫుజాబితా ఎలక్షన్ ఆఫీసులోను తాలూకా కచేరీలలోను జూన్ నెల 30 వ తేదీలోపుగా ప్రచురింపవలెను. లేదా చిత్తు జాబితాయు, అందులో చేసిన మార్పుల పట్టీయున్ను సాఫుజాబితాకు బదులుగా ప్రచురింపవచ్చును.

(2) అపీలులో చేసిన తీర్పులు సాఫుజాబితా ప్రచురణకు పూర్వమే ఆఫీసరు గారికి చేరియున్నచో ఆఫీసరు ఆ తీర్పు ననుసరించి వలయు మార్పులు చేయవలెను. అపీలు తీర్పులు సాఫుజాబితా ప్రచురణకు తర్వాత ఆఫీసరుకు చేరినచో, ఆ తీర్పు అన్నియు ఒక పట్టీగా వ్రాసి సాఫు జాబితాతోపాటు ప్రచురింపవలెను. సాఫుజాబితాలో, లేక మార్పులపట్టీలలో, ఓటరుగా నెవరిపేరు వ్రాయబడియుండునో, అట్టి వారు నిర్వివాదముగా ఓటుహక్కు కలిగియున్నవారు.

17. ప్రతి తాలూకా సాఫుజాబితాకు, మార్పు పట్టీలకున్ను నాలుగు నకళ్లు తీయించి వానిపై ఎలక్షన్ ఆఫీసరు సంతకములు చేయవలెను. ఒక నకలు తమ ఆఫీసులో నుంచుకొనవలెను; ఒక నకలు ఎలక్షన్ అధికారికి పంపవలెను. తక్కిన రెండున్ను జిల్లాబోర్డు ప్రెసిడెంటుకున్ను తాలూకాబోర్డు ప్రెసిడెంటుకున్ను పంపవలెను.

18. జాబితాలు తయారుచేయునధికారులు విధ్యుక్తములగు గడువులలో పనిపూర్తి చేయలేదనియు, యీ నిబంధనలలో వేనినైనను గమనింపలేదనియు, వారు తయారు చేసిన జాబితా నాక్షేపించుటకు వలనుకాదు. అట్టి ఆక్షేపణ ఎలక్షన్‌కు సంబంధించిన ఏ న్యాయవిచారణలో చేసినను ఏన్యాయాధికారియు గౌరవింపడు.

19. (1) 16 వ రూలు ననుసరించి తయారుచేసిన తాలూకా సాధుజాబితాలో తాలూకా ఓటర్లందరి పేర్లున్ను వ్రాసియుండును. ఆ తాలూకాలో చేరిన జిల్లాబోర్డు సర్కిల్సుకుకూడ ఆజాబితాయే ప్రమాణమై యుండును.

(2) అన్నితాలూకాల సాధుజాబితాలున్ను చేరి జిల్లామొత్తమునకు జిల్లా బోర్డు ఓటరుజాబితాయగును.

(3) తాలూకా సాధుజాబితాలో ఏఏ గ్రామమునకు చేరిన భాగము ఆయా గ్రామపంచాయితీ ఓటరు జాబితా యగును.

20. తాలూకా సాధుజాబితా తయారైనపిమ్మట ప్రతిగ్రామమునకు సంబంధించిన తాలూకా జాబితాలోని భాగమునకు రెండు నకళ్లు వ్రాయించి, అవి సరిగా వ్రాయబడినట్లు తాను ధృవపర్చి, ఎలక్షన్ ఆఫీసరు ఆయాగ్రామపంచాయితీ ప్రెసిడెంటుకు పంపవలెను. పంచాయతీప్రెసిడెంటు ఒక నకలు తనకచేరీ నోటీసుబోర్డులో అంటించి, రెండవది ఆఫీసులో భద్రపర్చవలెను.

21. తాలూకా సాధుజాబితా ప్రచురణ జరిగినవెనుక

(1) క్రొత్తగా నొకగ్రామము ప్రత్యేకఖండముగా నేర్పర్చినపుడుగాని, లేదా

(2) ఇదివరకు వార్డులక్రింద విభజనకాని గ్రామము క్రొత్తగా వార్డులక్రింద విభాగమైనప్పుడుగాని

ఎలక్షన్ ఆఫీసరుగారు అప్పటికి అమలులోనున్న జాబితానుబట్టి ఆ గ్రామమునకు ప్రత్యేక జాబితా వ్రాయవలెను. వార్డుక్రింద గ్రామము విభాగమైనచో జాబితాకూడ వార్డు జాబితాలక్రింద విడదీసి వ్రాయవలెను. ఎలక్షన్ అధికారి ఎలక్షన్ ఆఫీసరుకు యీ చర్య తీసుకొమ్మనియు, అందు గమనింపవలసిన విధానమున్ను శాసింపవచ్చును. ఆ జాబితా ఎప్పుడు ప్రచురణ చేయవలెనో, ఎట్లు [illegible] ఎలక్షన్ అధికారి నిరూపింపవలెను. అట్లు ప్రచురణజరిగిన తేదీనుండి ఆ జాబితా పంచాయితీ ఓటరుల ఖాయపుజాబితా యైయుండును. 240 సెక్షన్ప్రకారము నియామకుడైన స్పెషల్ ఆఫీసరుగారికి (క్రొత్త లోకల్‌బోర్డు లేర్పడచిన సందర్భములలో వ్యవహరించు నుద్యోగి.) కాని లేదా ఆ పంచాయితీ ప్రెసిడెంటు కాని, ఎలక్షన్ ఆఫీసరు

ఆ జాబితాకు రెండు నకళ్లు తీయించి పంపవలెను. వారీనకళ్లు 20 వ రూలునందుదాహరించిన పద్ధతిప్రకారము భద్రపరుపవలెను. ఈ జాబితాలకు మూలమైన తాలూకా జాబితా లమలులో నున్నంతకాలము, యీ పంచాయితీ ఓటరు జాబితా ననుసరించియే పంచాయితీకి సంబంధించిన ఎలక్షన్లన్నియు జరుగవలెను.

22. 1930 లోకల్‌బోర్డుల ఆక్టు అమలులోనికి వచ్చినపిమ్మట కొన్ని లోకల్‌బోర్డులకు ప్రథమపర్యాయము ఓటరుజాబితా తయారుచేసి యుండవచ్చును. అట్టి జాబితాల విషయమై (లేదా బలవత్కారణ మున్నచో తక్కిన ఓటరు జాబితాల విషయమై) మార్పులు చేయునధికారము గవర్నమెంటుకున్ను ఎలక్షన్ అధికారికిన్ని యున్నది. ఈ జాబితాలు తయారుచేయువిధానము, ఏ తారీఖులలో నే చర్య గైకొనవలెనో, ఏ తారీఖులోపుగా ప్రచురణ కావలయునో, మొదలగు విషయములలో వారు విధులేర్పరుపవచ్చును. గవర్నమెంటు కాని ఎలక్షన్ అధికారికాని నిరూపించిన పద్ధతులబట్టి జాబితాలు తయారుకాబడును. ఆ జాబితాలు ప్రచురణతేదీనుండి అమలులోనికివచ్చును.

23. జాబితాలు సమగ్రముగా వ్రాయలేదనికాని, పొరబాటుగా వ్రాసిరని గాని, జాబితా వ్రాసిన అధికారులపై దావాచేసి నష్టము వసూలుచేయుటకు వీలులేదు. పై నిబంధనలలో నేర్పర్చిన తారీఖుల ననుసరించి వారు నడచుకున్నను వారిపై కోర్టుచర్య జరుపరాదు.

24. చూడగోరువారికి చూపుటకును, కొనగోరువారి కమ్ముటకును, ఎలక్షన్ అధికారుల ఉపయోగార్థమున్ను, జాబితాలకు నకళ్లు వ్రాయించి (ఎలక్షన్ ఆఫీసరు గారును, ఆయా లోకల్‌బోర్డు ప్రెసిడెంటును) యుంచవలెను. ఆవిధముగనే మార్పుల పట్టీలకు కూడ నకళ్లు వ్రాయించి యుంచవలెను.

1-వ మతలబు (3-వ రూలు చూ.)

............జిల్లాలో...............తాలూకాలో లోకల్ బోర్డు

జా బి తా

జిల్లాబోర్డు సర్కిలు..............................

గ్రామసముదాయము..............................

ఓట్లు పుచ్చుకొను కేంద్రస్థానము....................

| గ్రామము లేక వార్డు | వరుస సంఖ్య | పేరు | తండ్రి లేక భర్త పేరు | ఓటు హక్కు |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| | | | | |

2-వ మతలబు (7-వ రూలు చూ.)

............జిల్లాలో.................తాలూకాలో లోకల్ బోర్డు ఓటర్ల చిత్తుజాబితా యిందుతో ప్రచురణ చేయడమైనది.

ఓటుహక్కు తమకున్నను జాబితాలో తమ పేరు చేర్పలేదనికాని, తప్పుచోట చేర్చిరనికాని, తబిసీళ్లు తప్పుగా వ్రాసిరనికాని భావించువారెల్లరు ఆక్షేపణలు వ్రాసి దాఖలు చేసికొనవచ్చును.

జాబితాలో పేరున్నవారు తమ పేరు చేర్పరాదని, మరియొకరి పేరు చేర్పరాదనియు ఆక్షేపణలు వ్రాసి దాఖలు చేసికొనవచ్చును.

మొదటితరగతి ఆక్షేపణలు 3-వ మతలబు ప్రకారము వ్రాయవలెను. రెండవ తరగతి ఆక్షేపణలు 4-వ మతలబు ప్రకారము వ్రాయవలెను. ఆయామతలబులు ఎలక్షన్ ఆఫీసరున్ను, జిల్లాబోర్డు ప్రెసిడెంట్లున్ను, పంచాయితీ ప్రెసిడెంట్లున్ను అడిగినవారి కుచితముగా నిత్తురు.

ఆక్షేపణలు స్వయముగా లేక నౌకరుద్వారా లేక పోస్టుద్వారా దాఖలుచేయవచ్చును. అవి............చోట పనిచేయు ఎలక్షన్ ఆఫీసరుగారికి.........తేదీని

ఆఫీసు గంటలు ముగియు పూర్వమే దాఖలుకావలెను. స్వయముగా లేక నౌకరు ద్వారా దాఖలుచేయు ఆక్షేపణలు ఆఫీసుగంటలలోనే దాఖలు చేయవలెను.

మతలబుల ననుసరించి వ్రాయబడని ఆక్షేపణలు దఖలు పుచ్చుకోరు. సకాలములో దాఖలు కానివియు దఖలు పుచ్చుకోరు.

సక్రమముగా దాఖలైన ఆక్షేపణలన్నియు ఎలక్షన్ఆఫీసరుగారు............ చోట............తేదీని విచారింతురు.

.........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకము.

3 వ మతలబు (8 వ రూలు చూ.)

...............జిల్లాలో పనిచేయు ఎలక్షన్ ఆఫీసరుగారికి.

అయ్యా,

.............తాలూకా ఓటరు జాబితాలో యీ క్రిందివిధముగా నా పేరు వ్రాయమని (లేక సవరింపుమని) కోరుచున్నాను.

| ఆక్షేపణదారు పూర్తి పేరు. తండ్రి లేక భర్తపేరు (1) | అడ్రసు గ్రామం లేక వీధి, యింటి నెంబరు (2) | ఓటుహక్కు స్వభావము (3) | ఆస్తివల్ల రాబడి లేక చెల్లించే పన్ను (4) |
|---|---|---|---|
| | | | |

నేను బ్రిటిషు సబ్జక్టుననియు (లేదా.............స్వతంత్రప్రభువు ప్రజలలోని వాడననియు, లేదా విదేశీయుడనైనను ఓటరుగా నుండుట కనుమతి పొందితిననియు) నాకు 21 సంవత్సరముల వయస్సు నిండెననియు, నేను విధ్యుక్తకాలము లోకల్ బోర్డు పరిపాలనలోనున్న..................చోట నివసించితిననియు, నాకు ఓటరుగా చేరుట కీదిగువ హక్కులున్నవనియు, తెలుపుచున్నాను.

ఓటు హక్కు.........................

.........................

తారీఖు.............. ఆక్షేపణదారు సంతకం.

## 4 వ మతలబు (8 వ రూలు చూ.)

..............................జిల్లాలో పనిచేయు ఎలక్షన్ ఆఫీసరుగారికి

అయ్యా,

............లోకల్ బోర్డు సర్కిలులోని ఓటరు జాబితాలో యీ దిగువ నుదాహరించినవారి పేరు చేర్చినందులకు నే నాక్షేపించుచున్నాను.

| ఎవరి పేరున కాక్షేపణయో వారి పేరు (1) | జాబితాలో సంఖ్య (2) | ఆక్షేపణ స్వభావము (3) |
|---|---|---|
| | | |

............తారీఖు ............................

............విలాసము ఆక్షేపణదారు సంతకము.

ఆక్షేపణదారు పేరున్న ఓటరు జాబితా తబిశీలు..............................

జాబితాలో అతని సంఖ్య..............................

## 5-వ మతలబు (10-వ రూలు చూ.)

### ఆక్షేపణల జాబితా

(1) ఈక్రిందివారు తమపేర్లు జాబితాలో చేర్చమని (లేక సవరింపమని) కోరినారు.

| గ్రామము లేక వార్డు లేక జిల్లాబోర్డు సర్కిలు (1) | గ్రామ సముదాయము (2) | ఆక్షేపణదారు పేరు, సంఖ్య (3) | విలాసము (4) | ఓటు హక్కు (5) |
|---|---|---|---|---|
| | | | | |

(2) ఈక్రిందివారి పేర్లు చేర్చినందులకు ఆక్షేపణలు దాఖలైనవి.

| గ్రామము లేక వార్డు లేక జిల్లాబోర్డు సర్కిలు (1) | గ్రామ సముదాయము (2) | ఆక్షేపణదారు పేరు, సంఖ్య (3) | ఎవరిపేరున కాక్షేపణయో వారిసంఖ్య (4) |
|---|---|---|---|
| | | | |

(3)..................తాలూకా ఓటరు యీజాబితాలో క్రిందిసవరణలు ఎలక్షన్ ఆఫీసరు తనంతటతానే చేసెను.

| గ్రామము లేక వార్డు లేక జిల్లాబోర్డుసర్కిలు (1) | గ్రామ సముదాయము (2) | పేరు, సంఖ్య (3) | సవరణ (4) |
|---|---|---|---|
| | | | |

............తేదీని........................చోట పై ఆక్షేపణలు, సవరణలు గూర్చి ఎలక్షన్ ఆఫీసరు విచారించును.

..........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

## 6–వ మతలబు

## ఆక్షేపణలపై ఎలక్షన్ ఆఫీసరు చేసిన తీర్పుపై అపీలు

మహారాజశ్రీ,

........................................ఆఫీసరుగారికి.

................జిల్లా ఎలక్షన్ ఆఫీసరుగారి ద్వారా

అయ్యా,

1. నేను ఎలక్షన్ ఆఫీసరుగా రిచ్చిన..........తేదీ గల తీర్పుపై అపీలుచేయుచున్నాను. ఆ తీర్పు పర్యవసాన మిది..............................

(2) అపీలు సబబులు యీ క్రింద తెలుపుచున్నాను.

..................................................

..................................................

(3) నేను కోరిన పరిహార మేమనగా..........................

..................................................

..................................................

..............................

అప్పెలెంటు సంతకం.

..............................

..............................

విలాసము.

# లోకల్ బోర్డు ప్రెసిడెంట్లను, వైస్ ప్రెసిడెంట్లను ఎన్నుకొను విధానము

(ఫోర్టుసెంట్ జార్జిగెజెట్ 13-2-1932 చూ)

1. ఈనిబంధనలు జిల్లాబోర్డులకును,(గవర్నమెంటు ప్రకటనలో నుదాహరించిన) పంచాయితీ బోర్డులకున్ను (గవర్నమెంటు ఫోర్టుసెంట్‌జార్జిగెజెట్‌లో ప్రకటింతురు.) సంబంధించినవి.

2. (1) ప్రెసిడెంటు లేక వైస్‌ప్రెసిడెంటు ఎన్నిక జరుగవలసియున్నచో, అందు నిమిత్తమై ఆ లోకల్ బోర్డు సమావేశము కావలెను.

(2) ఖాళీ వచ్చినవెంటనే పైసభ సమావేశపరుపవలెను.

(i) జిల్లాబోర్డు ప్రెసిడెంటు ఎన్నికకు సభ సమావేశ మేర్పరుచు నధికారి, జిల్లాకలెక్టరు.

(ii) (తాలూకా బోర్డులకు సంబంధించినది.)

(iii) పంచాయితీ ప్రెసిడెంటుఎన్నికకు సమావేశ మేర్పరుచు నధికారి ఆ పంచాయితీ వైస్‌ప్రెసిడెంటు; (అత డనారోగ్యస్థితిలో నున్నయెడల లేదా 15 రోజులు గ్రామములో లేనిచో) తాలూకాబోర్డు మెంబర్లు నియమించినసభ్యులలో నొకడు.

(iv) జిల్లాబోర్డు లేక పంచాయితీ వైస్‌ప్రెసిడెంటు ఎన్నికకు సమావేశ మేర్పరచునధికారి, ఆయాబోర్డు ప్రెసిడెంటు.

జిల్లాబోర్డు ప్రెసిడెంటు, వైస్‌ప్రెసిడెంటు, ఎన్నికలకు నియమించిన సభా దినమునకు 15 రోజులుముందుగా మెంబర్లకు నోటీసు చేయవలెను. పంచాయితీ ప్రెసిడెంటు వైస్‌ప్రెసిడెంటు ఎన్నికలకు సభాదినమునకు 5 రోజులు ముందుగా నోటీసుండిన చాలును. ఆనోటీసులో ఏ సభ రోజున ఎన్నిగంటలకు జరుగునో తెలుపవలెను.

(3) అట్టి సభలలో నధ్యక్షులుగా వ్యవహరింపవలసినవారు.—

జిల్లాబోర్డు ప్రెసిడెంటు ఎన్నిక జరుగునప్పుడు

(i) సెక్షన్ 22 ఎ (2) (ఎ లో) నుదాహరించిన సందర్భములో, (ఆ సందర్భము లియ్యవి :-

వైస్ ప్రెసిడెంటుపదవి ఖాళీగా నుండుట.

వైస్ ప్రెసిడెంటు 15 రోజులనుండి గ్రామములో లేకుండుట.

వైస్ ప్రెసిడెంటు రోగస్థితియందుండుట.) జిల్లా కలెక్టరు.

(ii) తక్కిన సందర్భములలో, వైస్ ప్రెసిడెంటు; వైస్ ప్రెసిడెంటు హాజరులో లేనప్పుడు కాని వైస్ ప్రెసిడెంటుపదవి కభ్యర్థుడుగా నిలువగోరినప్పుడు కాని, అభ్యర్థిగా నిలువ సంకల్పములేని ఒక మెంబరు అధ్యక్షుడుగా వ్యవహరింపవలెను. అట్టి మెంబరును ఆరోజు కూడిన సభవారెన్నుకొందురు.

## పంచాయితీ ప్రెసిడెంటు ఎన్నిక జరిగినప్పుడు

సెక్షన్ 22 ఎ (2) (బి) లో నుదాహరించిన సందర్భములో, అప్పట్లో పంచాయితీబోర్డు ప్రసిడెంటుగా వ్యవహరించునాతడు.

తక్కిన సందర్భములలో, వైస్ ప్రెసిడెంటు.

వైస్ ప్రెసిడెంటు కాని, ప్రెసిడెంటుగా వ్యవహరించునాతడు కాని, ప్రెసిడెంటు ఎన్నికకు అభ్యర్థిగా నిలువగోరినచో, లేదా అతడు హాజరులేనిచో ఆ సభవారెన్నుకొనిన మెంబరు (ఆరోజు ఎన్నికలో అభ్యర్థుడుగా నిలువగోరని మెంబరు.)

## జిల్లాబోర్డు లేక పంచాయితీ వైస్ ప్రెసిడెంటు ఎన్నికలకు

ఆయాబోర్డు ప్రెసిడెంటు.

అతడు హాజరు లేనిచో

ఆరోజున సమావేశమైన సభవారెన్నుకొను మెంబరు (అభ్యర్థిగా నిలువగోరని మెంబరు.)

3. అభ్యర్థుల పేర్లు మెంబర్లలో నొక రుపపాదించవలెను, మరియొక మెంబరు బలపరచవలెను. అట్టి అభ్యర్థుల పేర్లన్నియు సభాధ్యక్షుడు చదువవలెను.

4. (1) అభ్యర్థి ఒక్కడే యున్నచో అతడే యెన్నబడినట్లు నిర్ధారణచేయవలెను.

(2) అభ్యర్థులు పలువు రున్నచో ఆసభకు హాజరైన మెంబర్ల ఓట్లు పుచ్చుకొనవలెను.

5. ఓటువేయగోరిన ప్రతిమెంబరుకున్ను ఒకకాగిత మీయవలెను. ఆకాగితముపై యీ క్రిందివిధముగా అచ్చునకాని, టైపునకాని, స్ఫుటమైన వ్రాతనుకాని, వ్రాసియుండవలెను. ఆ వ్రాత అంగ్లమందు, ఆజిల్లాలోని వ్యవహారభాషలోను, కూడ వ్రాసియుండవలెను.

అభ్యర్థిపేరు. ఓటు

1.

2.

3.

ప్రతిమెంబరున్ను యీ ఓటుకాగితము పుచ్చుకొని చాటుగా యేర్పర్చిన గది లోనికి వెళ్లి తానెవరికి ఓటీయగోరినాడో వానిపేరున కెదురుగా నొకగుర్తుంచ వలెను. అటుపిమ్మట గుర్తు పైకి కనబడకుండ కాగితము మడిచి, ప్రెసిడెంటుగారి యెదుటనున్న పెట్టెలో పడవేయవలెను. ఆ ఓట్లపెట్టెలో ఓట్లు పడవేయుటకు సందుండవలెను. తీయుటకు వీలుండరాదు.

చదువురాని మెంబరు తాను గురుతుపెట్టలేనని అధ్యక్షునికి తెలిపి అతని సాయ మపేక్షించినచో, అధ్యక్షుడు ఓటుకాగిత మాతనికి చదివి వినిపించి సభ్యులందరి సమక్ష మందు ఆ మెంబరుకోరిన అభ్యర్థి పేరున కెదురుగా గుర్తుపెట్టి, ఆ కాగితము పెట్టెలో పడవేయుటకై అభ్యర్థి చేతి కీయవలెను. పై క్రమమంతయు యావన్మంది సభ్యుల యెదు టనే జరుగవలెను.

అటుపైన అధ్యక్షుడు పెట్టెతీసి అందులోని ఓట్లు (మెంబర్ల సమక్షమందు) లెక్కపెట్టి ఎవరు జయముపొందిరో నిర్ధారణ చేయవలెను.

(i) ఇద్దరభ్యర్థులున్నచో ఎక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థి జయముపొందినట్లు నిశ్చయింపవలెను. ఇద్దరకున్ను సమానముగా ఓట్లు వచ్చినప్పుడు, మెంబర్ల సమక్షములో నధ్యక్షుడు లాట్లువేసి (అనగా ఒకేమాదిరి రెండు కాగితపు ముక్కలపై వేరువేరుగా నభ్యర్థులపేర్లు వ్రాసి అవి కలిపివేసి, అందులో నొకటి అధ్యక్షుడుగాని ఎవరైన బాలుడుగాని పైకితీయుట) ఎవరిపేరున్న కాగితము ముందు పైకివచ్చెనో, వారెన్నుకో బడినట్లు స్థిరపరుపవలెను.

(ii) ఇద్దరికంటె హెచ్చుమంది అభ్యర్థు లున్నచో తక్కువ ఓట్లు వచ్చిన వారిని తప్పించి, తక్కినవారికి తిరుగ ఓట్లు పుచ్చుకొనవలెను. అభ్యర్థు లిరువురికి సమానముగా ఓట్లువచ్చిన గాని లేదా కడపటి యిద్దరకు ఓట్లు సమాన మైనప్పుడు గాని పై నుదాహరించిన లాట్లపద్ధతి నవలంబించి ఏ అభ్యర్థి పేరు ముందుగా తొలగింపవలెనో నిర్ణయింపవలెను. చివరకు యిద్దరే అభ్య ర్థులు మిగులువరకు ఓట్లుపుచ్చుకొని, తక్కువవచ్చినవారి పేర్లు తొలగించుచు రావ లెను. చివరకు మిగిలిన యిద్దరిలో ఓట్లుపుచ్చుకొని అధికసంఖ్య వచ్చినవారు గెలు

పొందినట్లు నిర్ణయింపవలెను. వారిరువురికి సమానముగా ఓట్లువచ్చినప్పుడు పైనుదాహరించిన లాట్లపద్ధతి నవలంబించి, ఎవరెన్నుకోబడినది నిర్ధారణ చేయవలెను.

6. అభ్యర్థులకు ఓటిచ్చు నధికారములేదు. కాని అభ్యర్థిత్వమునకు విడుదలయిచ్చిన పిమ్మట ఓటువేయవచ్చును. పైనిబంధన ననుసరించి తొలగింపబడిన అభ్యర్థి (తొలగింపబడిన వెనుక) ఓటు వేయవచ్చును.

7. ఓటుకాగితముపై (ఓటువేయువారి) సంతకమున్నను, లేదా పలువురభ్యర్థుల పేరులకెదుగా గుర్తులున్నను, ఆకాగితమున కెట్టి విలువయు లేదు.

8. సభ ముగిసినవెంటనే అధ్యక్షు డీ క్రిందివిధులు నిర్వహింపవలెను :—

(i) ఫలానివారు ప్రెసిడెంటుగా, లేదా వైస్‌ప్రెసిడెంటుగా నెన్నుకోబడి రని నోటీసు వ్రాసి, అందుపై తాను సంతకముచేసి, ఆలోకల్ బోర్డు ఆఫీసులో నోటీసుబోర్డునకు అంటింపించవలెను.

(ii) అందుకు నకలొకటి తీయించి మద్రాసు ముద్రాశాలనూపరింటెండెంటుగారికి పంపవలెను.

(ఎ) అట్టి ప్రకటన జిల్లాబోర్డు ప్రెసిడెంటు, వైస్‌ప్రెసిడెంటు ఎన్నికలలో ఇంగ్లీషుభాషలో ఫోర్టుసెంట్‌జార్జి గెజెట్‌లోను జిల్లా గెజెట్‌లో ఇంగ్లీషులోను ఆ జిల్లా వ్యవహారభాషలోను కూడ ముద్రింపింపవలెను.

(బి) పంచాయితీ ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంట్లకు సంబంధించినచో జిల్లా గెజెట్‌లో ఇంగ్లీషులోను, ఆ జిల్లా వ్యవహారభాషలోను ప్రచురణ కావలెను.

9. (1) ఆ వెనుక అధ్యక్షుడు ఓటుకాగితము లన్నియు నొక కవరులో పెట్టి ఆ కవరుకు సీళ్లు వేయించవలెను. ఆ కవరుపైన అందులో ఉన్న ఓటు కాగితముల సంఖ్య, ఏ ఎలక్షన్‌కు సంబంధించినవో వ్రాయవలెను.

(2) ఎలక్షన్‌కోర్టు కాని మరి యేకోర్టువారి ఉత్తరువు ననుసరించి మాత్రమే ఆ కవర్లు విప్పవచ్చును; ఇక నెప్పుడు విప్పరాదు.

(3) ఆ లోకలుబోర్డు ఆఫీసులో నీ కవర్లు భద్రపెట్టియుంచవలెను. 1 సంవత్సరములోపున అవి యే కోర్టువారును పంపమని కోరనిచో సంవత్సరము గడువు దాటిన పిమ్మట అవి కాల్చివేయవలెను.

## II

1. గవర్నమెంటు ప్రకటనలో నుదాహరింపని పంచాయతీలకు సంబంధించిన ఎన్నికలలో యీ క్రిందినిబంధన లమలులో పెట్టవలెను. (పై 1 వ నిబంధన చూ.)

2. (1) పంచాయితీల ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు ఎన్నిక ఆయా పంచాయితీ ఆఫీసులో అందునిమిత్తమై సమావేశపర్చిన సభలో జరుగును.

(2) ఖాళీవచ్చినపిదప వీలైనంత త్వరలో అట్టిసభ సమావేశము చేయవలెను.

(ఎ) ప్రెసిడెంటు ఎన్నిక జరుగవలసినచో సమావేశము జరుపువాడు వైస్ ప్రెసిడెంటు.

వైస్ ప్రెసిడెంటుపదవికూడ ఖాళీగా నున్నప్పుడు లేదా

వైస్ ప్రెసిడెంటు అనారోగ్యస్థితిలో నున్నప్పుడు లేదా వైస్ ప్రెసిడెంటు 15 రోజులనుండి గ్రామములో లేనప్పుడు తాలూకాబోర్డు ప్రెసిడెంటువల్ల నియుక్తుడైన పంచాయితీమెంబ రొక డట్టిసభను సమకూర్చవలెను. (ఇప్పు డీఅధికారము జిల్లాబోర్డు ప్రెసిడెంటు నిర్వహించును.)

(బి) వైస్ ప్రెసిడెంటు ఎన్నిక జరుగవలసినచో

ప్రెసిడెంటు, ఆసభను సమావేశపర్చవలెను. నిర్దిష్టదినమునకు 5 రోజులు ముందుగా మెంబర్లందరకు సభజరుగనున్న తేదీ, వేళయు తెలుపవలెను.

(3) ఆసభలో అధ్యక్షుడు,

ప్రెసిడెంటు ఎన్నిక జరుగవలసినచో

సెక్షన్ 22 ఎ (2) (బి) ననుసరించి జరుగు ఎన్నికలలో అప్పట్లో ప్రెసిడెంటుగా వ్యవహరించునాతడా సభాధ్యక్షుడై యుండును, తక్కిన సందర్భములలో వైస్ ప్రెసిడెంటు;

వారిరువురును గ్రామములో లేనప్పుడు కాని, వారిలో నధ్యక్షుడుగా నుండ వలసినవా రభ్యర్థిగా నుండగోరినప్పుడు కాని,

ఆ రోజున సమావేశమైన సభవా రధ్యక్షునిగా తమలో నొకరిని (అభ్యర్థిగా నుండగోరని వారిని) నియమింతురు.

వైస్ ప్రెసిడెంటు ఎన్నిక జరుగుసభకు

పంచాయితీ ప్రెసిడెంటును, అతడు హాజరులో లేనప్పుడు సభవారు నియమించిన సభ్యుడును (ఆ సభ్యుడు అభ్యర్థిగా నుండగోరనివాడు.) సభాధ్యక్షత వహింపవలెను.

3. ప్రతి అభ్యర్థి పేరును ఒక మెంబరుపపాదింపవలెను; మరియొక మెంబరు బలపర్చవలెను. ఈ క్రమము జరిగిన అభ్యర్థు లందరిపేర్లును వ్రాసి అధ్యక్షుడు చదువవలెను.

4. అభ్యర్థి ఒక్కడే యున్నచో అతడే యెన్నుకోబడినట్లు అధ్యక్షుడు నిరూపించును.

5. అభ్యర్థులు పెక్కుమంది యున్నచో ఏ అభ్యర్థి ఎన్నికకు పెక్కుమంది అనుకూలురై యున్నారో అధ్యక్షుడు మెంబర్లను చేతులెత్తమని కాని, మరియొక విధముగా కాని నిశ్చయింపవలెను.

6. ప్రతి మెంబరుకు ఒక అభ్యర్థికే ఓటిచ్చునధికార మున్నది.

7. ఎక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థి జయము పొందినట్లు అధ్యక్షుడు నిర్ణయింపవలెను. ఇద్దరభ్యర్థులకు సమానముగా ఓట్లు వచ్చినచో, లాట్లపద్ధతి నవలంబించి ఎవరు విజయులైనది అధ్యక్షుడు నిర్ణయింపవలెను.

8. అభ్యర్థులకు ఓట్లిచ్చు నధికారములేదు. కాని అభ్యర్థిత్వమునకు విడుదల నిచ్చిన మెంబరు ఆ పిమ్మట ఓటు వేయవచ్చును.

9. సభ ముగిసినవెంటనే అధ్యక్షుడు

(ఎ) ఆ పంచాయితీ ఆఫీసు నోటీసు బోర్డులో ప్రెసిడెంటుగాగాని, వైస్ ప్రెసిడెంటుగాగాని ఎన్నుకోబడిన సభ్యునిపేరు ప్రకటింపవలెను.

(బి) ఆ ప్రచురణ కొక నకలు తీయించి జిల్లాగెజెట్‌లో ప్రచురణనిమిత్తము (ఆంగ్లములోను, వాడుకభాషలోను) గవర్నమెంటుముద్రాలయ సూపరింటెండెంటుగారికి పంపవలెను.

## ఎలక్షన్‌వివాదములు పరిష్కరించు విధానము - లోకల్ బోర్డులు.

నిబంధన.

1. (1) లోకల్‌బోర్డుల ఆక్టు ననుసరించి జరుపబడిన ఎలక్షన్లలో మెంబర్లుగాను, ప్రెసిడెంటుగాను, లేక వైస్ ప్రెసిడెంటుగాను ఎన్నుకోబడినవారి ఎలక్షన్‌కు సంబంధించి ఎట్టి ఆక్షేపణ లున్నను, ఆ ఆక్షేపణలన్నియు ఒకపిటిషన్లో వ్రాసి దాఖలు చేయవలెను. ఎన్నుకోబడినవారిని "గెలుపొందిన అభ్యర్థి" అనుపేరుతో వ్యవహరింతుము. ఆక్షేపణలువ్రాసిన పిటిషను "ఎలక్షన్ పిటిషన్" అనుపేరుతో వ్యవహరింతుము. ఆపిటిషన్ అభ్యర్థు లెవరైన దాఖలు చేయవచ్చును. లేదా ఓటర్లెవరైనను దాఖలుచేయవచ్చును. అట్లు దాఖలు చేయువారిని "ఆక్షేపణదారు" అనుపేరుతో వ్యవహరింతుము. పిటిషన్‌లో ఎదురుపార్టీగా, గెలుపొందిన అభ్యర్థిని చేర్చవలెను. ఆపిటీషన్ ఎలక్షన్ కమీషనరుగారి యెదుట దాఖలు చేయవలెను. (ఎలక్షన్ కమీషనరుగా రెవరో (2)వ నిబంధనలో తెలుపబడినది.) ఆపిటిషన్ క్రిందినిబంధనల ననుసరించి దాఖలుచేయవలెను.

(2) ఎలక్షన్ కమీషనరు.

జిల్లాబోర్డు ఎలక్షన్‌తగాయిదాల సందర్భములో

(1) జిల్లాబోర్డు ఆఫీసు ఏపట్టణములో నెలకొనియున్నదో, ఆపట్టణ వ్యాజ్యముల విచారింప నధికారమున్న సబ్‌జడ్జి; అట్టి సబ్‌జడ్జీలు పలువు రున్నచో, వారిలో ప్రప్రథముడు.

(ii) ఆపట్టణములో సబ్‌జడ్జిగారు లేకున్నచో జిల్లాజడ్జిగారు.

పంచాయితీ ఎలక్షన్‌వివాదలలో.

(i) పంచాయితీ ఆఫీసు ఏగ్రామమందున్న, ఆగ్రామవ్యాజ్యముల విచారింప నధికారమున్న డిస్ట్రిక్టుమునసబుగారు; అట్టి డిస్ట్రిక్టుమునసబులు పలువు రున్నచో, వారిలో ప్రప్రథముడు.

(ii) లేదా గవర్నమెంటు పంచాయితీ లన్నింటికి, లేదా ఫలానా తాలూకాలోని (లేక జిల్లాలోని) పంచాయతీలకుకాని, ఫలాని ఉద్యోగి ఎలక్షన్ కమీషనరుగా నుండవలెనని ఏర్పరుపవచ్చును.

(iii) ఈ నిబంధనలప్రకారము ఎలక్షన్ కమీషనరుగా వ్యవహరించువారీతగవుల పరిష్కరించుసందర్భములో కోర్టుజడ్జీగా వ్యవహరింపరు. వారి జడ్జీ అధికారమునకున్ను యీ కమీషనరు అధికారమునకున్ను సంబంధములేదు. వారినిగూర్చి ప్రసంగించునప్పుడు'(మ-రా-శ్రీ).......................(పేరు)ఎలక్షన్‌కమీషనరుగారు') అని మాత్రమే వచింపవలెను.

2. (1) ఎలక్షన్ ఫలితములు ప్రకటించిన 15 రోజులలోపుగా ఎలక్షన్‌పిటిషన్ దాఖలు చేయవలెను.

(2) ఏ కారణములవల్ల ఎలక్షన్ చట్టవిరుద్ధమో ఆక్షేపణదారు తన పిటిషన్‌లో సంక్షేపముగా తెలుపవలెను. ఏదైన అక్రమచర్య జరిగినదని అతడు వాదించుచో, అందుల తబిసీళ్లు వ్రాయవలెను. పిటిషన్‌లోని హంశములు వేరు పేరాలక్రింద విడదీసి వ్రాయవలెను.

3. గెలుపొందిన అభ్యర్థి ఎన్నిక శాస్త్రవిరుద్ధముగా జరిగిన దనియు, తానే గెలుపొందిన అభ్యర్థి యని కమీషనరుగారు తీర్పు చేయవలెననియు ఆక్షేపణదారు వాదించుచో, ఆ ఎన్నికలో అభ్యర్థులుగా నిల్చినవారి నందరిని పిటీషన్‌లో పార్టీలుగా చేర్చవలెను.

4. (1) పిటిషన్‌తోపాటు ఎదురుపార్టీ ఖర్చులకు హామీగా యీ క్రింది మొత్తములు చెల్లించవలెను:

(i) జిల్లాబోర్డు ఎలక్షన్‌సందర్భములో రు 200/-

(ii) (తాలూకాబోర్డులకు సంబంధించినది.)

(iii) పంచాయితీ ఎలక్షన్లసందర్భములో రు 25/-

(2) పై మొత్తము చెల్లింపనిచో కమీషనరు పిటిషన్ కొట్టివేయవలెను.

(3) సొమ్ము చెల్లించినచో కమీషనరు పిటిషన్ విచారణ ప్రారంభింపవలెను.

5. వీలైనంతత్వరలో పిటీషన్ నకళ్లు ఎదురు పార్టీలకున్ను ఆయాబోర్డు ప్రెసిడెంటుకున్ను, ఎలక్షన్ అధికారికిన్ని, అందజేయవలెనని కమీషనరు ఉత్తరువు వేయవలెను. బోర్డుఆఫీసులోనున్ను, కోర్టు నోటీసుబోర్డులోనున్ను పిటిషన్ నకళ్లు అంటింపించవలెను. ఎదురుపార్టీల ఖర్చులకై, పైమొత్తముగాక అదనపు మొత్తమునకు ఆక్షేపణదారును (మరికొందరు జామీనుదారులతోసహా) జామీనుబాండు వ్రాసి య్యవలసినదని కమీషనరుగారు కోరవచ్చును. నోటీసుప్రకటించిన 14 రోజులలోగా మరియొక అభ్యర్థి ఎవరైన తన్ను పార్టీగా చేర్చుకొమ్మని కమీషనరుగారికి పిటిషన్ పెట్ట

వచ్చును. (కోర్టు నోటీసుబోర్డులోను, జిల్లాబోర్డు, పంచాయితీబోర్డు ఆఫీసులలోను నోటీసు అంటించినవెంటనే, నోటీసు ప్రకటనజరిగినట్లు భావింతురు.) అట్లు చేరగోరు వానిని ఖర్చులకు జామీ నివ్వవలసినదని కమీషనరు కోరవచ్చును.

6. దావాలవిచారణలో నవలంబించు క్రమమును బట్టియే ఎలక్షన్ పిటిషన్లున్ను విచారణ చేయవలెను. కాని ప్రతిసాక్షి వాంగ్మూలములోని ముఖ్యవిషయములు టూకీగా కమీషనరు వ్రాసికొనిన చాలును. ఆవాంగ్మూలములపై సాక్షుల సంతకము చేయింప నక్కరలేదు.

7. (1) ఎలక్షన్ కమీషనరు ఉత్తరువులేనిదే ఎలక్షన్ పిటిషన్ వదులుకొనుటకు వీలులేదు.

(2) ఆక్షేపణదార్లు పలువు రున్నచో, వా రందరున్ను అంగీకరించిననేకాని, ఏ ఆక్షేపణదారున్ను పిటిషన్ వదులుకొనుటకు వీలులేదు.

(3) ఎలక్షన్ పిటిషన్ వదులుకొను నిమిత్తమై పిటిషన్ దాఖలైనచో, విడుదలపిటిషన్ విచారణకు వాయిదావేసి, ఆ వాయిదాతేదీ పార్టీ లందరకున్ను పై 5 వ రూలుపద్ధతుల ననుసరించి తెలుపవలెను.

(4) ఆక్షేపణదారు ఎదురుపార్టీవల్ల ఏవిధమైన లాభమును పొంది, లేక ఆశించి, ఎలక్షన్ పిటిషన్ వదులుకొనుచున్నట్లు కమీషనరు అనుమానించినచో, నతడు విడుదల పిటిషన్ కొట్టివేయవలెను.

5. రాజీపిటిషన్ కమీషన రంగీకరించినచో

(i) అప్పటివరకు ఎదురుపార్టీ పెట్టిన ఖర్చులు (లేక అందులో కమీషనరుకు న్యాయమని తోచినభాగము) ఆక్షేపణదా రీయవలసినదని కమీషనరు ఉత్తరువు చేయవలెను.

(ii) ఆ విడుదలవర్తమానము బోర్డు ప్రెసిడెంటుకున్ను, ఎలక్షన్ అధికారికిన్ని కమీషనరు పంపవలెను.

8. ఆక్షేపణదారు మృతిచెందినచో ఎలక్షన్ పిటిషన్ అంతమొందును. అట్టి వర్తమానము బోర్డు ప్రెసిడెంటుకున్ను, ఎలక్షన్ అధికారికిన్ని ఎలక్షన్ కమీషనరు పంపవలెను.

9. ఆక్షేపణదారుగాక మరియొక అభ్యర్థి, తానే ఎలక్షన్‌లో గెలుపొందినట్లు తీర్పీయుమని కమీషనరును కోరవచ్చును. అందుపై విజయుడైన అభ్యర్థి (లేక మరియొక అభ్యర్థి) అట్లు కోరువాడు ఎన్నికలో జయముపొందుట కనర్హుడని రూఢిపర్చవచ్చును.

ఒకవేళ అతడే (అనగా కోరే అభ్యర్థి) ఎన్నికలో విజయుడైయున్నచో, కవిూషనరు యెదుట పిటిషన్ పెట్టి, అతనిఎన్నిక రద్దుచేయుటకు తగిన బలవత్కారణములున్నవని రుజువు చేయవచ్చును.

10. ఈక్రిందిసందర్భములో కవిూషనరు గెలుపొందిన అభ్యర్థిని పదభ్రష్టుని చేయవలెను. వీనిలో నేదియో యొకకారణ మున్న చాలును.

## (1) గెల్పొందిన అభ్యర్థి లేక అతని ఏజంటు ఎలక్షన్ నేరములు చేయుట.

అభ్యర్థి, అతనిఏజంటు, స్వయముగా నేరములు చేయకున్నను, వారిరువురిలో నెవరైన పైవారిచే అట్టినేరములు చేయించినచో ఎలక్షన్ రద్దుపరుతురు. ఆ నేరములు ఇండియన్ పీనల్‌కోడ్ 9 ఎ భాగములో తెలుపబడినవి. (ఆ నేరములు వేరుభాగమందు తెలిపినాము.) లేక లోకల్‌బోర్డుల ఆక్టు 58 వ సెక్షన్‌లో నుదాహరించిన నేరము చేసినను ఎన్నికకు భంగము వాటిల్లును.

## (2) గెల్పునకు కారణ మిూదిగువ నుదాహరించిన అక్రమచర్యలలో నేదైన యగుట

లేదా అట్టి అక్రమచర్య జరుగకున్నచో యీ అభ్యర్థి విజయుడగుటకు మాగు మరియొక అభ్యర్థి విజయుడై యుండునని కవిూషనరుకు నమ్మకము కలిగియుండుట.

### అక్రమచర్యలు

(i) లోకల్‌బోర్డుల ఆక్టు 58 వ సెక్షన్, ఇండియన్‌పీనల్‌కోడ్ 9 ఎ భాగములో తెల్పిన నేరములు అభ్యర్థి, అతని ఏజంటు (వారి ప్రోత్సాహముచే జేసిన మరియొకరు) గాక యింకొక ఆసామి చేసియుండుట, అట్టి నేరము జరుగుటవల్ల అభ్యర్థికి లాభము కల్గియుండుట.

(ii) ఓట్ల ఆఫీసుకు ఓటరును తీసుకొనివచ్చినందుకు, లేదా అక్కడనుండి ఓటరు నింటికి దిగబెట్టినందుకు, బండి, లేక మోటారుఛార్జీక్రింద ఏ ఆసామికైన పైకమిచ్చుట, పైకమిచ్చెదనని వాగ్దానము చేయుట.

(iii) ఓటర్ల ఉపయోగార్థమై ఏబండియైన, కారైన, మరి యేవాహనమైన అద్దెకుగాని (ఉచితముగాగాని) పుచ్చుకొనుట.

అభ్యర్థి స్వోపయోగమునకై బండి, లేక కారు, లేక వాహనము అద్దెకు పుచ్చుకొన్నచో అందు తప్పేమియు లేదు.

(iv) ఒక యిల్లుకొని, గది కాని అద్దెకు పుచ్చుకొని, అందులో ఓటర్లకు సమావేశము లేర్పర్చి, పరిసరముగా కల్లు లేక సారాయి అమ్మకము సాగించుట.

[గెల్పొందిన అభ్యర్థి విజయుం డగుటకుమారు మరియొక అభ్యర్థి .........యీ అక్రమచర్య జరుగకున్నచో......విజయుడై యుండునని కమీషనరు భావించుటకు యిరువురకు వచ్చిన ఓట్లసంఖ్యకు విశేషతారతమ్య ముండరాదు. ఒకనికి 100 ఓట్లు రెండవవానికి 98 వచ్చె ననుకొందము. మొదటివానికి వచ్చిన ఓట్లలో 4 ఓట్లు అక్రమచర్య జరిపి వేయించిన వనుకొందము. అక్రమచర్య జరుగనే జరుగకున్నచో మొదటివానికి 96 మాత్రము వచ్చియుండును, రెండవవా డుత్తీర్ణుడై యుండును. కాని మొదటివానికి 100 రెండవవానికి 60 వచ్చిన వనుకొందము. 4 తప్పు ఓట్లు తీసివేసినను మొదటివానికి 96, రెండవవానికి 60 ఉండును. రెండుసందర్భములలోను ఫలిత మొక్కటియే అయియుండును.

క్షమార్హముకాని ఎలక్షన్ నేరముకాని అక్రమచర్య కాని జరిగినపుడు ఆ నేరమువల్ల అభ్యర్థి విజయమునకు కొంతయైన సహాయము కలిగియున్నది కావున ఎన్నిక పూర్తిగా రద్దుచేయుటకు కమీషనరుకు అధికార మున్నది. అట్టి నేరము కొద్ది ఓట్ల విషయములో జరిగినను, ఆఓట్లు తీసివేసినను అభ్యర్థి విజయుడగుటకు సావకాశమున్నను, ఎలక్షన్ రద్దుచేయవచ్చును. (ఎట్టి నేరములు కమీషనరు క్షమింపవచ్చునో, ఎట్టివి క్షమింపరాదో యీక్రింద నుదాహరించినాము.)

(8) నామినేషన్లు దాఖలు చేయుటలో తప్పు జరుగుట, లేదా ఎలక్షన్ ఆఫీసరు నిరాకరింపవలసిన నామినేషన్లు పుచ్చుకొనుట, పుచ్చుకోవలసినవి నిరాకరించుట, ఆక్టు లేక విధులకు వ్యతిరేకముగా ఎలక్షను జరుపబడుట, పైకారణములవల్ల మరియొక అభ్యర్థి గెలుపొందవలసియుండగా నితడు విజయుడగుట.

[పై నుదాహరించిన రీతిగా పై కారణములవల్ల గెలుపొందిన అభ్యర్థి విజయము సంప్రాప్తమై యుండవలెను. అట్టి అక్రమము జరుగకున్నచో యీ అభ్యర్థి విజయుడగుటకుమారు మరియొక అభ్యర్థి విజయుడై యుండునని రుజువుకావలెను.]

పై 2 వ రూలులో తెల్పిన నేరములు జరిగినప్పుడు వానిని కమీషనరు క్షమింపవచ్చును. ఏ ఓటరుకున్ను లంచమిచ్చియుండరాదు. (ఫలహారములు మొదలైనవి యిచ్చినను నీయవచ్చును. స్వల్పపాటి భ్రమకు ఓటరును లోబరచినను ఎలక్షన్ కమీషనరు క్షమింపవచ్చును. ఓటరునకు కాఫీ, టీ, కల్లు, సారాయి,

మొదలగు పదార్థము లిప్పించినను, సినీమాకు, నాటకమునకు తీసుకొని వెళ్లినను, బియ్యము, పప్పు, ఉప్పు మొదలైన విచ్చినను అది పెద్ద నేరము కాదు.) అదిన్నిగాక కమీషనరు అభ్యర్థి నడవడి నిర్దోషముగా నున్నదని భావించినచే నేరము క్షమింప వచ్చును. అందులకు అభ్యర్థి రుజువుచేయవలసినవిషయము లివి:—

(i) అభ్యర్థి యే నేరము చేసియుండలేదనియు, ఎట్టి నేరము జరుగరాదని అభ్యర్థి తన సహాయులకు చెప్పియున్నను, నేరము జరిగినదనియు;

(ii) అట్టి నేరములు జరుగకుండ అభ్యర్థి సాధ్యమైనంత జాగ్రత్తపడె ననియు;

(iii) ఆనేరములు స్వల్పపాటినేరము లనియు, కొద్దినేరములు మాత్రమే జరిగె ననియు;

(iv) ఇతరత్రా అభ్యర్థి - అభ్యర్థి ఏజంట్ల నడవడిలో లోప మేమియు లేదనియు...

**11.** (1) విచారణ ముగిసినపిమ్మట ఎలక్షన్ రద్దుకాబడినది లేనిది కమీషనరు నిర్ధారణ చేయువలెను.

(2) ఎలక్షన్ రద్దుకాబడినచో—

(i) పిటీషన్‌కు పార్టీగా చేరి తాను గెలుపొందినట్లు తీర్పియమని కోరే యింకొక అభ్యర్థి ఎవరైనను విజయుడైనట్లు తీర్పుచెప్పవలెను; లేదా

(ii) తిరిగి ఎలక్షన్ జరుగవలసినదని శాసింపవలెను.

(3) పై (1) (2) నిబంధనలప్రకారము ఎలక్షన్‌కమీషనరు చెప్పిన తీర్పునకు తిరుగులేదు. (ఈతీర్పు లెంతవరకు ఆక్షేపణీయములో వేరుభాగములో తెలిపినాము.)

(4) ఆతీర్పునకల్లు తీయించి బోర్డుప్రెసిడెంటున కొకటియు, ఎలక్షన్ అధికారి కొకటియు కమీషనరు పంపవలెను.

**12.** ఎలక్షన్ కమీషనరు తిరిగి ఎలక్షన్ జరుగవలసినదని తీర్పుచెప్పిన సందర్భములో, ఆతీర్పుతేదీనుండి మెంబరుసీటు ఖాళీఅయినట్లు భావించి, ఆసీటుకు మెంబరు ఎలక్షన్ జరుపు ఏర్పాట్లు వెంటనే జరుపవలెను.

# మునిసిపాలిటీలలో ఓటుహక్కున్నవారు

## మునిసిపాలిటీల ఆక్టు 45 వ సెక్షను

సెక్షను 45

(1) దిగువ నుదాహరించినవారి పేర్లుమాత్రమే మునిసిపాలిటీ ఓటరు జాబితాలలో చేర్పవలెను:—

(i) బ్రిటిషుసబ్జక్టు లేక స్వతంత్రప్రభువుప్రజలలోనివారున్ను

[రాష్ట్రగవర్నమెంటు కొన్నితరగతుల విదేశీయులున్ను ఓటర్లుగా నుండ వచ్చునని శాసింపవచ్చును. బ్రిటిషు సబ్జక్టు అనగా ఆంగ్లపరిపాలనకు లోబడియున్న ఏ దేశమునకైన చెందినవాడు]

(ii) ఓటరుజాబితా తయారుచేయు సంవత్సరమునకు క్రితసంవత్సరమందే 21 సం॥ ల వయస్సు నిండినవారున్ను

(iii) భారతగవర్నమెంటుకు, లేక రాష్ట్రగవర్నమెంటుకు, లేక ఏదైన లోకల్ బోర్డుకు, లేక మునిసిపాలిటీకి (ఆ లోకల్ బోర్డు లేక మునిసిపాలిటీ మద్రాసు రాష్ట్రములో నుండవలెను) క్రితసంవత్సరములో పన్ను చెల్లించినవాడున్ను, లేదా

[పన్ను మొత్త మింత యుండవలెననియు, పన్ను స్వభావ మిట్టిదైయుండ వలె ననియు నియమము లేదు]

గవర్నమెంటు సేనలో సిపాయిగా లేక ఉద్యోగియై పనిచేసి పింఛను పుచ్చుకొన్న వాడున్ను

(iv) క్రితసంవత్సరములో ఆ మునిసిపాలిటీలో 120 రోజులైన వసించి యున్నవాడున్ను

ఓటర్లుగా చేర నర్హులు.

[ఈ పై నాలుగర్హత్వములున్ను ప్రతి ఓటరున కుండవలెను. ఏది లోపించినను వానిపేరు జాబితాలో చేర్పరు]

(2) ఒకకంపెనీ లేక కుటుంబము పై పన్ను చెల్లించిన కారణముచే ఆ కంపెనీకి లేక కుటుంబమునకు ఓటు హక్కుండవచ్చును. ఆకంపెనీ లేక కుటుంబముతరఫున నెవరు ఓటరుగా చేరవలెనో అందులోని సభ్యులే నిర్ణయించుకొనవలెను. కుటుంబ

లేక కసభ్యులు, ంపెనీసభ్యులు తమలో నొకరిని నియమించనిచో, జాయింటు కుటుంబము తరపున కుటుంబయజమాని పేరున్ను, కంపెనీ తరపున కార్యదర్శి పేరున్ను చేర్చవలెను.

(3) ఒక ఆసామికి కంపెనీతరపున లేక కుటుంబముతరపున ఓటుండి, అత నికి వేరే ఓటున్నచో, ఏదియో హక్కునుబట్టి అతనికి ఓటిత్తురు. రెండు హక్కు లున్నవని రెండు ఓట్లీయరు.

(4) ఎవరిపేరుతో పన్ను చెల్లింపబడుచున్నదో వారిపేరుమాత్రమే ఓటరు జాబితాలో చేర్తురు.

**47.** మతివిహీనుడున్ను, చెవిటి మూగ రెండు లోపములవల్ల బాధపడు వాడున్ను, కుష్టురోగిన్ని (వారిపేరు జాబితాలో వ్రాసియున్నను) ఏ ఎన్నికలోను ఓటు వేయ రాదు.

# 1920 సం॥ పు మద్రాసు మునిసిపాలిటీల ఆక్టు

## మునిసిపాలిటీల సమకూర్పు పద్ధతులు

6. (1) మునిసిపాలిటీ పరిపాలనచేయువారు మునిసిపల్ చైర్మను, మునిసిపల్ కౌన్సిల్.

(2) ... ... ... ... ...

7. (1) మునిసిపల్ కౌన్సిలు మెంబర్ల సంఖ్య.

| మునిసిపాలిటీల జనాభా (ఆఖరు జనాభా లెక్కలో) | మెంబర్ల సంఖ్య |
|---|---|
| 20,000 కు లోపు | 16 |
| 20,000 కు మించి, 30,000 కు లోపు | 20 |
| 30,000 కు మించి, 40,000 కు లోపు | 24 |
| 40,000 కు మించి, 50,000 కు లోపు | 28 |
| 50,000 కు మించి, 100,000 కు లోపు | 32 |
| 100,000 కు మించి | 36 |

(2) మునిసిపాలిటీలోని కౌన్సిలర్లందరున్ను ఆయా వార్డులలో ఎన్నుకోబడిన వారై యుండవలెను.

(3) ఏమునిసిపాలిటీలోనైన గవర్నుమెంటువారీ క్రిందితరగతులకు కౌన్సిలరు (మెంబరు) పదవులు కేటాయించి యుంచవచ్చును:—

(i) మహమ్మదీయులు.

(ii) ఇండియన్ క్రైస్తవులు.

(iii) ఆదిద్రావిడ్లు (పంచములు)

(iv) యూరపియన్లు.

(v) ఆంగ్లోయిండియన్లు

(vi) స్త్రీలు

ఏతరగతి కెన్ని సీట్లు కేటాయించిరో గవర్నమెంటే నిర్ణయింపవలెను.

మునిసిపాలిటీ మొత్తపు మెంబర్లసంఖ్యలో అన్ని తరగతులకు కేటాయించిన మొత్తపుసీట్ల సంఖ్య 1/4 వ వంతు మించియుండరాదు.

మునిసిపాలిటీ మొత్తపు జనాభాల్లో, ఏతరగతి ప్రజల జనాభాయైన సగమునకు మించియున్నచో, ఆతరగతి మెంబర్లకు సీట్లుకేటాయించి యుంచరాదు.

(4) ఆయాతరగతి ప్రజాబాహుళ్యము, ప్రాముఖ్యమునుబట్టి సీట్లు కేటాయించి యుంచవలెను.

(5) అట్లు కేటాయించిన తరగతులకు చెందినవారున్ను స్త్రీలున్ను సామాన్య జనరల్ సీట్ల ఎన్నికలలో నభ్యర్థులై నిలువవచ్చును.

8. (1) సాధారణముగా మునిసిపాలిటీమెంబర్ల వరకు 3 సం॥ లు. ఆవరకు నవంబరు 1 వ తేదీ మధ్యాహ్నము 12గంటలకు ప్రారంభమై 3సం॥ లు గడచిన పిమ్మట అంతమొందును.

(2) సాధారణపు ఎన్నిక లాయా అధికారులు ఆగష్టు, సెప్టెంబరు నెలలో (ఖాళీలు రాకముందు ఆగష్టు, సెప్టెంబరునెలలు) జరుపవలెను. గవర్నమెంటువారు సెప్టెంబరునెల దాటిన పిదప ఎన్నికలు జరుపుట కధికార మీయవచ్చును.

(3) ఖాళీరాకపూర్వము ఎన్నికకాబడినమెంబరున్ను, ఖాళీవచ్చిన పిదప ఎన్నిక కాబడిన మెంబరున్ను, వరతాఖరున పదవులు విడువవలెను.

(4) ఆకస్మికపు ఖాళీలు వచ్చినవెంటనే ఎన్నికలు జరుపవలెను. వరతాఖరునకు 3 మాసములుమాత్రమే వ్యవధి యుండగా ఆకస్మికపుఖాళీ వచ్చినచో, ఆఖాళీలో నింకొక మెంబరు నెన్నుకొన నగత్యములేదు.

(5) ఆకస్మికపు ఖాళీలో మెంబరుగా నెన్నుకోబడినవాడు, ఏమెంబరు స్థానే తా నెన్నుకొనబడెనో, అతనివరతాఖరున తన మెంబరుపదవి విడువవలెను.

[కౌన్సిల్ వరకు 3సం॥ లు పూర్తియైన పిదప ప్రాతకౌన్సిలర్లందరు తమపదవులు విడుతురు. అన్ని ఖాళీలకు క్రొత్తఎన్నికలు జరిగి క్రొత్తకౌన్సిలర్లు వత్తురు. ఆఖాళీలు సాధారణపుఖాళీలు. కౌన్సిల్ 3సం॥ గడువు మధ్య నేసభ్యుడైనను రాజీనిచ్చినచో, లేక మరణించినచో, ఖాళీ వచ్చును. ఖాళీవచ్చినవెంటనే ఎన్నికలు జరిపి మరియొక సభ్యు నెన్నుకొనవలెను. 2 ఏండ్లు కౌన్సిల్ నడిచినపిమ్మట నొకమెంబరుపదవి ఖాళీ అయినదనుకొందము. ఇంక నొక్క సంవత్సరమే వరకు మిగిలియున్నది. కాబట్టి ఆఖాళీలో ఎన్నుకోబడినవాడున్ను 1 సం॥ మాత్రమే కౌన్సిలరుపనిచేసి, ఆసంవత్సర మాఖరున పదవి విడువవలెను.

2 సం|| ల 9 మాసములు గడచినపిదప నొకసభ్యుడు రాజీయిచ్చెననుకొందము. ఇంక కౌన్సిలుపదవి 3 మాసములు మాత్రమేయున్నది. ఈ 3మాసములపనికిన్ని మరి యొకసభ్యు నెన్నుకొన నవసరములేదు.

9. (1) ఒకసారి ఎన్నికలలో మెంబ రెన్నుకోబడనిచో, తిరిగి ఎన్నికలు జరుప వలెను.

(2) రెండవసారి ఎన్నికలలోను మెంబ రెన్నుకోబడనిచో కౌన్సిలువారే మెంబరు నెన్నుకొందురు.

(3) ఈ సెక్షన్ ప్రకార మెన్నుకోబడిన మెంబరుపదవి సాధారణపు కౌన్సిలరుపదతాఖరున అంతమొందును.

11. ఏ మునిసిపల్ కౌన్సిలరుకున్ను జీత మీయరాదు.

12. (1) ప్రతి మునిసిపల్ కౌన్సిలున్ను, కౌన్సిలర్లలో నొకరిని ఛైర్మన్‌గా ఎన్ను కొనవలెను.

(2) రాష్ట్ర గవర్నమెంటు అనుమతిపొంది కౌన్సిలు ఛైర్మనుకు జీతమేర్పరుప వచ్చును.

అట్టి జీత మేర్పాటుచేయని సందర్భములలో ఛైర్మనుకు జీత మీయరాదు.

(3) కౌన్సిలుసభ్యులు తమలో నొకరిని వైస్ ఛైర్మన్‌గా నెన్నుకొనవలెను.

(4) కౌన్సిలరు పదతాఖరున లేదా ఏకారణముచేనైన కౌన్సిలరు పదవి గోల్పోవుసందర్భములో, ఛైర్మన్ ఆ పదవి విడువవలెను.

(5) కౌన్సిలర్ పదతాఖరున, లేదా ఏకారణముచేనైన కౌన్సిలరు పదవి గోల్పోవు సందర్భములో, వైస్‌ఛైర్మన్ ఆ పదవి విడువవలెను.

వైస్‌ఛైర్మన్ ఛైర్మన్‌గా నెన్నుకోబడినప్పుడు, వైస్‌ఛైర్మన్ పదవి విడువ వలెను.

(6) ఛైర్మన్ పదవి ఖాళీగా నున్నప్పుడు, ఛైర్మన్ నెరవేర్చవలసిన విధులు వైస్ ఛైర్మన్ నెరవేర్పవలెను.

(7) ఛైర్మన్‌పదవి ఖాళీగా నుండి, వైస్‌ఛైర్మన్ గ్రామములో 15 రోజుల నుండి లేనప్పుడు, లేదా రోగస్థితిలో నున్నప్పుడు, లేదా వైస్ ఛైర్మన్ పదవి కూడా ఖాళీగా నున్నప్పుడు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు (అనగా సబ్ కలెక్టరు లేక డిప్యూటీకలెక్టరు) ఛైర్మన్ ఎన్నికల నిమిత్తమై సభ నేర్పర్చి ఆ సభకు 7 రోజులకు ముం

దుగా కౌన్సిలర్లకు నోటీసు చేయవలెను. ఈ లోపున డివిజనల్ ఆఫీసరే మునిసిపల్ ఛైర్మన్ నెరవేర్పవలసిన విధులన్నియు నెరవేర్పవలెను.

12. ఏ. ఒకసారి ఎన్నికలో ఛైర్మన్ లేక వైస్ ఛైర్మన్ ఎన్నుకోబడనిచో అందునిమిత్తమై తిరిగి ఎన్నికలు జరుపవలెను.

## 13. ఛైర్మన్ విధులు

ఛైర్మన్ క్రిందివిధులు నిర్వహింపవలెను:—

(i) వైస్ ఛైర్మన్ ఎన్నికకు వలయు ఏర్పాట్లు జరుపవలెను.

(ii) కౌన్సిల్ సమావేశములు (మీటింగులు) సమకూర్పవలెను.

(iii) కౌన్సిల్ తీర్మానము నాచరణలో పెట్టవలెను.

(iv) కౌన్సిల్ తీర్మానము లెంతవరకు అమలులో పెట్టబడినవో, పన్నుల వసూలు సరిగా జరుగుచున్నదో లేదో, జమదఖాలను కౌన్సిలుకు నివేదికలు వ్రాసి యీయవలెను. (ఎన్నిరోజుల కొకసారి మాసమురోజులో, 2 మాసములో, కౌన్సిల్ నిర్ణయించును.)

(v) మునిసిపాలిటీల ఆక్టులో విధించిన చర్యలు జరుపవలెను. కౌన్సిల్ అధిపతియై కౌన్సిల్ అభిప్రాయము ననుసరించి నడుచుకొనవలెను. ఆక్టులోని పద్ధతులకు వ్యతిరేకముగా నడువరాదు.

## 30. కౌన్సిలర్లు నెరవేర్పవలసిన విధులు, వారికున్న అధికారములు

(1) ఏ కౌన్సిలరైన మునిసిపాలిటీ నెరవేర్పవలసిన విధులు సరిగా నెరవేరుట లేదనీ, లేదా మునిసిపాలిటీసొత్తు నష్టపోవుచున్నదని, లేదా కొన్నిచోట్ల ప్రజాసౌకర్యములకు వలయు కార్యములు జరుపుట లేదనియు, క్రొత్తగార్లు త్రొక్కినచో ప్రజాసౌకర్యము వృద్ధియగుననియు, ఛైర్మన్‌తో చెప్పవచ్చును.

(2) ప్రతి కౌన్సిలరున్ను కౌన్సిలులో తీర్మానములు ప్రవేశపెట్టవచ్చును. పురపాలననుగూర్చి ఛైర్మన్‌తో చెప్పవచ్చును.

(3) ప్రతి కౌన్సిలరున్ను మునిసిపల్ ఆఫీసులోని కాగితములు చూడవచ్చును. బలవత్కారణము లున్నచో, ఛైర్మన్ ఏ కౌన్సిలరునైన కొన్నికాగితములు చూడనీయకపోవచ్చును. ఆ కారణములు ఛైర్మన్ వ్రాసి యీయవలెను.

31. కౌన్సిలర్లున్ను, వైస్ ఛైర్మనున్ను ఛైర్మన్‌నువ్రాసియిచ్చి తమపదవులకు రాజీ నీయవచ్చును. ఛైర్మన్ రాజీ కౌన్సిలుకు వ్రాసి యీయవలెను.

ఛైర్మన్‌కు మొదటి రాజీలందినతోడనే ఆయా పదవులు ఖాళీయగును.

ఛైర్మన్ రాజీ కౌన్సిలుయెదుట పెట్టిన తోడనే, అతని పదవి ఖాళీయగును.

## కౌన్సిలర్ల ఎన్నికలు

43. (1) మునిసిపాలిటీ ఎన్నికలకై, ఆయా మునిసిపల్ కౌన్సిలుతో సంప్రతించి, గవర్నమెంటువారీ క్రింది ఏర్పాట్లు చేయవచ్చును. అట్టి యేర్పాట్లు (గజెటులో) ప్రచురింపవలెను:—

(i) మునిసిపాలిటీ వార్డులక్రింద విభాగించుట.

(ii) ఏ ఏ వార్డులో 7 (3) వ సెక్షన్ ప్రకారము సీట్లు కేటాయింపవలెనో నిర్ణయించుట.

(iii) ఏ తరగతి కేవార్డులో సీటు కేటాయింపవలెనో నిశ్చయించుట.

(2) రిజర్వు సీట్లు కేటాయించియున్న వార్డు, ఆయా తరగతుల సభ్యులతో పాటు, ఒకరినో యిద్దరినో జనరల్ సీట్ల సభ్యులనుకూడ ఎన్నుకొనవలెను. అట్టి జనరల్ సీట్లసంఖ్య గవర్నమెంటువారు నిర్ణయింతురు.

తక్కిన వార్డు వార్డుకొక మెంబరు చొప్పున నెన్నుకొనవలెను.

(3) ఆయా వార్డులోని ఓటర్లందరున్నూ ఆయా వార్డుకు సంబంధించిన ఎన్నికలన్నిటిలోను పాల్గొనవచ్చును. (ఆ ఎన్నిక జనరల్ సీటుకైనను వారు వెళ్లి ఓటు వేయవచ్చును.)

(4) అమలులోనున్న వార్డుల విభజన గవర్నమెంటు మార్చుచున్నచో, ఆమార్పుమునిసిపాలిటీపరతు ముగిసిన వెనుక జరుగు ఎన్నికలనుండి అమలులోనికి రావలెనని గవర్నమెంటువారు నిర్ణయింపవచ్చును.

(5) ఒక వార్డునుండి ఎన్నుకోవలసిన మెంబర్లసంఖ్య మార్చినప్పుడున్నూ, క్రొత్త వార్డు నిర్మించునప్పుడున్నూ, అమలులోనున్న వార్డు రద్దుచేసినప్పుడున్నూ గవర్నమెంటు అనుమతి పొంది ఎలక్షన్ అధికారి (అనగా యీ సందర్భములో మునిసిపాలిటీల లోకల్ బోర్డుల ఇన్‌స్పెక్టరుగారు)

(i) అప్పట్లో మునిసిపల్ కౌన్సిలరుగా నున్నవారే ఏ వార్డు తరఫున మెంబర్లుగా నున్నట్లు భావింపవలెనో.

(ii) ఏ వార్డునకైన మెంబరు ఖాళీలు తటస్థపడినచో, తిరిగి ఎన్నికలు జరుగవలసిన వార్డేదియో నిర్ణయింపవలెను.

**44.** (1) మునిసిపాలిటీ వరతాఖరునకు ముందు జూన్ నెలాఖరు లోపుగా ఎలక్షన్ అధికారి మునిసిపాలిటీ ఓటరుజాబితా తయారుచేసి ప్రకటింపవలెను. ఆ జాబితాలో ఓటు హక్కున్నవారందరి పేర్లున్ను వ్రాయవలెను.

(2) ప్రతిసాలున జూన్ నెలాఖరు లోపుగా ఆ జాబితాలో చేయవలసిన మార్పులున్ను, సవరణలున్ను చేసి, అట్టి మార్పులు సవరణలు కూడా ప్రకటింపవలెను.

(3) మునిసిపాలిటీలో ఏ వార్డు జాబితా ఆవార్డునకు ప్రత్యేకముగా నుంచవలెను.

(4) ఒకసారి ప్రచురణయైన ఓటరుజాబితా క్రొత్తజాబితా ప్రచురణ యగు పర్యంతము అమలులో నుండును.

(5) ఓటరు జాబితాలో పేరున్నవాడు ఎన్నికలో ఓటువేయవచ్చును. పేరులేని వాడు ఓటువేయరాదు.

**45.** (వేరుభాగములో వ్రాసినాము)

**46.** (రద్దయినది)

**47.** (వేరుభాగములో వ్రాసినాము)

**48.** (1) ఓటరుజాబితాలో పేరున్నవారుమాత్రమే మునిసిపల్ ఎన్నికలలో అభ్యర్థులుగా నిలువవచ్చును.

(2) గవర్నమెంటు ఆఫీసర్లు అభ్యర్థులుగా నిలువరాదు. గవర్నమెంటు ఆఫీసర్లనగా,

(i) గవర్నమెంటు ఉద్యోగ మొక్కటియే వృత్తిగాకలవారు.

(ii) గవర్నమెంటువల్ల వేతనము పొందుచున్న వారు.

ఒక అభ్యర్థి గవర్నమెంటు ఉద్యోగియగునా కాదాయను సందేహము కలిగినప్పుడు, ఆసందేహము రాష్ట్ర గవర్నమెంటుకు తెలిపి, గవర్నమెంటు అభిప్రాయము ప్రకారము నడుచుకొనవలెను. గవర్నమెంటువారి అభిప్రాయము ఖాయపు అభిప్రాయముగా చెల్లవలెను.

(లోకల్ బోర్డుల ఆక్టు 54 వ సెక్షన్ క్రింద వ్రాసిన నిర్వచనము చూ.)

**49. ఈ క్రింద నుదాహరించినవా రభ్యర్థులై నిలువ ననర్హులు.**

(1) ద్వీపాంతరవాసశిక్ష లేక 6 మాసములకు మించి ఖైదుశిక్షపొందినవారు. శిక్ష ననుభవించే కాలమందును, శిక్షానుభవము పూర్తియైన 5 సంవత్సరముల వరకును అట్టివా రనర్హులు.

అశిక్షను అపీలులో కొట్టివేసినయెడల, లేక శిక్షను గవర్నమెంటువారు తీసి వేసిన సందర్భములోను, వారి కనర్హతలేదు.

శిక్ష రాజకీయనేరములకు వేసియున్నచో, లేదా ఆనేరము నీతిపథమునకు దూష్యము కాకున్నచో, శిక్షపొందియున్నను అనర్హతి సిద్ధింపదు.

(2) నామినేషన్ తేదీని లేక ఎలక్షన్ తేదీని యీక్రింది కళంకములకు లోనై యున్నవా రభ్యర్థులై నిలువరాదు.

(i) మతిభ్రష్టులై యున్నవారు, మూగ, చెవుడు, రెండులోపములున్ను ఉన్నవారు, కుష్టువారు.

(ii) ఇన్‌సాల్వెన్సీ (దివాలా) పిటిషన్ దాఖలుచేసి యున్నవారు. ఇన్‌సాల్వెంటుగా ఖాయపడియుండి విడుదల ఆర్డరు (డిశ్చార్జి) పొందనివారు.

(iii) ఆ మునిసిపాలిటీతో వ్యాపారము సాగించువారు లేక ఆమునిసిపాలిటీవల్ల కంట్రాక్టులు పొంది పని సాగించువారు, మరి ఏ విధమైన (పైరెండు తేదీలలో) మునిసిపాలిటీతో వ్యవహారసంబంధ మున్నవారు.

ఒక కంపెనీ మునిసిపాలిటీతో వ్యవహారము సాగించుచున్నచో ఆ కంపెనీలో భాగస్వాము లనర్హులు కారు. కాని కంపెనీడైరెక్టర్లనర్హులే.

ఈ (iii) వ రూలుకు మినహాయింపులు.

(అ) మునిసిపాలిటీతో స్థిరాస్తి అమ్మకము, స్థిరాస్తి కౌలు పుచ్చుకొనుట మొదలగు వ్యవహారసంబంధ మున్నవా రనర్హులు కారు.

(ఆ) మునిసిపాలిటీకి సొమ్ము బదు లిచ్చుట, పుచ్చుకొనుట, ఆస్తి తనఖా యిచ్చుట, తనఖా పుచ్చుకొనుట, మొదలగు వ్యవహారములు నడుపువా రనర్హులుకారు.

(ఇ) మునిసిపాలిటీప్రకటనలు ముద్రించు ముద్రాలయాధికారు లనర్హులు కారు.

(ఈ) ఏ సాలునైన రు 1,500/-కిమ్మత్తు కాని వస్తువులు, (సాలీనా మొత్తపు అమ్మకము రు 1,500/-కు మించరాదు.) మునిసిపాలిటీకి విక్రయించువా రనర్హులుకారు.

[పై అనర్హత నాపాదించుటకు వ్యవహారసంబంధమున్న ఆ ఆసామీకిన్ని లేక కంపెనీకిన్ని మునిసిపాలిటీకిన్ని ఒడంబడిక యుండవలెను.]

(iv) ఆ మునిపాలిటీ తరఫున, (ఫీజు పుచ్చుకొను) ప్లీడరుగా వ్యవహరించు చున్నవారు, మునిసిపాలిటీ కెదురుపక్షమున ప్లీడరుగా వ్యవహరించుచున్నవారు.

(v) మునిసిపల్ ఆక్టు ననుసరించి ఉద్యోగియై యున్నవాడు, లేక మునిసిపాలిటీ కొలువులో నున్నవాడు, లేదా మునిసిపాలిటీయున్న పట్టణములో ఆనరరీ మేజస్ట్రీటుగా వ్యవహరించువాడు.

(vi) ఎన్నికలు జరుగునప్పటికి మునిసిపల్ కౌన్సిలరుగా వ్యవహరించువాడు.

ఎన్నికలకు ముందే కౌన్సిలరుగా నెన్నుకోబడినవాడు (అట్టివానిమర తింకను ప్రారంభముకాని సందర్భములో)

(vii) ఆ తేదీలను కౌన్సిలరుగా నున్నవారి నౌకరు, లేక యజమాని, లేక ఉద్యోగరీత్యా ఆ కౌన్సిలరు పైవాడు, లేక ఉద్యోగరీత్యా ఆ కౌన్సిలరు క్రిందివాడు.

(3) ఖైదు, లేక ద్వీపాంతరవాసశిక్ష పొందినవారికికూడా కళంకములేదని గవర్నమెంటు ఉత్తరువు చేయవచ్చును.

(ఈ విషయములో లోకల్‌బోర్డు ఆక్టులో నిచ్చిన నిర్వచనము చూ.)

50. i మునిసిపల్ కౌన్సిలరుగా పనిచేయుచున్నవాడు క్రింది సందర్భములలో తన పదవిని గోల్పోవును:—

(1) 49 (1) సెక్షనులో నుదాహరించిన శిక్షపొందుట.

(2) మతివిహీనుడగుట, లేదా చెవిటివాడున్ను, మూగవాడున్ను అగుట, లేదా కుష్ఠురోగి యగుట.

(3) ఇన్‌సాల్వెన్సీ (దివాలా) పిటీషన్ దాఖలుచేయుట, లేదా ఇన్‌సాల్వెంటుగా ఖాయపడుట.

(4) మునిసిపాలిటీతో వ్యవహారసంబంధ మేర్పడుట.

[55 (2) (iii) సబ్ సెక్షనులో తెల్పిన విధు లన్నియున్ను, మినహాయింపు లున్ను యీ సెక్షనుకున్ను అనువర్తించును.]

(5) ఆమునిసిపాలిటీ తరపున (ఫీజుపుచ్చుకొను) ప్లీడరుగా వ్యవహరించుట, మునిసిపాలిటీ కెదురుపక్షపు ప్లీడరుగా వకాల్తానామా పట్టుట.

(6) మునిసిపాలిటీక్రింద నుద్యోగము సంపాదించుట, లేదా మునిసిపాలిటీ యున్న పట్టణములో ఆనరరీ మేజస్ట్రేటు ఉద్యోగము పొందుట.

(7) ఇంకొక కౌన్సిలరు చేతిక్రింద నుద్యోగము బడయుట లేదా ఉద్యోగరీత్యా మరియొక కౌన్సిలరు చేతిక్రిందివాడగుట.

(8) మునిసిపాలిటీలోగాని (మునిసిపాలిటీకి రెండుమైళ్లలోపుగాకాని) కాపురముండకపోవుట.

(9) కౌన్సిలు సమావేశములకు 3 మాసములవరకు రాకుండుట.

ఆ కౌన్సిలరు ఆఖరిపర్యాయము సభా సమావేశమునకు వచ్చినదిమొదలు వరుసగా 3నెలలు సభాసమావేశములకు రానిచో నతడు పదభ్రష్టుడగును. లేదా ఆ 3 నెలలలోను 1 సభయే జరిగినచో అతడు హాజరైన తర్వాత రెండు సభాసమావేశములకు రాకపోవుట.

సభ జరుగనున్నదని నోటీసు కౌన్సిలరు కివ్వియుండనిచో అతనిని పైకారణముకు పదభ్రష్టుని చేయరాదు.

నిర్వచనము.

3వ షెడ్యూలు 2వ రూలు (2)వ విధిప్రకారమున్ను, 8వ రూలు ప్రకారమున్ను సమావేశమైన సభలకు మెంబరు రాకున్నను అతని సీటుకు భంగమురాదు. (ఈవిషయములో లోకల్ బోర్డు ఆక్టులోనిచ్చిన నిర్వచనము చూ.)

II పై 1 వ విధిలో తెలిపిన శిక్షపడియున్నను, ఆమెంబరు తన పదవి గోల్పోనక్కరలేదని గవర్నమెంటు శాసింపవచ్చును.

III శిక్ష అపీలులోగాని రివిజన్‌లోగాని కొట్టివేసినచో, లేదా గవర్నమెంటువారి యుత్తరువు ననుసరించి కళంకము తొలగిపోయినచో, వెంటనే ఆ మెంబరు తన పదవి నధిష్ఠించి మిగిలిన వరకుంతయు మెంబరుగా నుండును.

ఈ లోపుగా మరియొక మెంబరతనిస్థానే యెన్నుకోబడియున్నచో, మొదటి మెంబరు తనస్థాన మాక్రమింపగనే రెండవ మెంబరు పదవిహీనుడగును.

(ఈ విషయములో లోకల్ బోర్డు ఆక్టులో నిచ్చిన నిర్వచనము చూ.)

(iv) కౌన్సిలు మీటింగులకు రాని కారణముచే పదభ్రష్టుడైన కౌన్సిలరునకావర్తమానము చైర్మను వ్రాసిపంపవలెను. ఆ సంగతి ఆ తర్వాత సమావేశమైన సభలో కౌన్సిలర్లకు తెలియింపవలెను. ఆ సభాదినమునగాని, ఆ లోపునగాని ఆ కౌన్సిలరు తన్ను తిరిగి కౌన్సిలరుగా చేర్చుకొమ్మని కౌన్సిలర్ల ప్రార్థించుచో, కౌన్సిలర్లు అతని తిరిగి తమలో చేర్చుకొనవచ్చును. లేదా ఆ కౌన్సిలరుకు వర్తమానముచేరిన 15 రోజులులోగా నతడు కౌన్సిలర్ల పై రీతిగా ప్రార్థించినచో, వారతనిని తమలో చేర్చుకొనవచ్చును.

కాని ఏ కౌన్సిలరువిషయములోను, యిట్టి సంఘటన (పదవి గోల్పోవుట, తిరిగి పదవినిచ్చుట) వరకాఖరిలోపుగా రెండుపర్యాయములకు మించి జరుగరాదు.

51. (1) 48 వ సెక్షన్ 1 వ విధి ననుసరించి, లేక 49, 50, 60, సెక్షన్లలో దేనినిబట్టియైన ఏ కౌన్సిలరైన అనర్హుడను వాదమువచ్చి, ఆకౌన్సిల రట్టివాదము నంగీకరింపక తా నర్హుడనే యని మరువాదము చెప్పచున్నచో, లేదా

50 వ సెక్షన్ ప్రకారము లేదా 60 వ సెక్షన్ ప్రకారము తన కనర్హత సిద్ధించినదేమోయని ఏ కౌన్సిలరుకైన సందేహము కలిగినప్పుడు ఆ కౌన్సిలరు, లేదా మరియొక కౌన్సిలరు, లేదా మునిసిపాలిటీ తరఫున ఛైర్మనును చర్యపుచ్చుకోమని కౌన్సిలర్లు కోరినచో, ఆ మునిసిపాలిటీ చైర్మనున్ను ఆజిల్లా జడ్జీగారి యెదుట పైవిషయము తెలుపుచు పిటిషన్ దాఖలు చేయవచ్చును.

(2) ఆజడ్జీగారు వలయు విచారణచేసి, పైవిధుల ప్రకారము ఆ కౌన్సిలరర్హుడో అనర్హుడో నిర్ణయింపవలెను. జడ్జిగారి తీర్పు ఖాయపుతీర్పుగా చెల్లవలెను.

(3) జడ్జీగారు తీర్పిచ్చులోపున, ఆకౌన్సిలరు అనర్హత లేనట్లే తన పదవి నాక్రమింపవచ్చును.

[52 మొదలు 55 వరకున్న నిబంధనలు రద్దుచేయబడినవి.]

56. [ఎలక్షన్ రహస్య భంగమొనర్చుట. ఈ సెక్షను క్రిమినల్ నేరములతోపాటు తెల్పినాము. కావున నిచ్చట వేరుగా తెలుపలేదు.]

[57 మొదలు 59 వరకున్న నిబంధనలు రద్దుచేయబడినవి.]

60. ఇండియన్ పీనల్ కోడ్ 9-ఎ భాగమునందు ఉదాహరించిన నేరములకు శిక్ష పొందినవాడు (ఆనేరములు వేరుభాగములో వ్రాసినాము) శిక్షవేసిన 5 సంవత్సరముల వరకు (లేదా శిక్షవేసిన మేజస్ట్రేటు యీ లోపుననే కళంకము పోవునని తీర్పిచ్చుచో ఆతీర్పులో వ్రాసిన గడువులోపున) ఓటరుగా నుండరాదు, అభ్యర్థియై నిలువరాదు, మునిసిపల్ కౌన్సిలరుగా వ్యవహరింపరాదు.

# డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు

## మునిసిపల్ కౌన్సిలర్ల నెన్నుకొను విధానము

### నిబంధనలు

1\. 1 ఈ విధులలో ఎలక్షన్ ఆఫీసరనగా ఎలక్షన్ అధికారి చేతిక్రింద పనిచేయు వాడు.

[ఎలక్షన్‌పై సర్వాధికార మున్నవాడు ఎలక్షన్ అధికారి. అతనిపై పెత్తనము గవర్నమెంటుకు మాత్రమే యున్నది. (మునిసిపల్ ఛైర్మను, వైస్‌ఛైర్మను కాని వ్యక్తిని) ఎలక్షన్ అధికారిపదవిలో గవర్నమెంటువారు నియమింతురు. ఎలక్షన్ అధికారి తనచేతిక్రింద ఎలక్షన్‌కు సంబంధించిన విధులన్నియు నిర్వహించుటకు ఆఫీసర్లను నియమించుకొనును.]

2\. (1) ఎలక్షన్ ఆఫీసరు యీదిగువ హంశములు తెల్పుచు నొక నోటీసు వ్రాసి ప్రకటింపవలెను. ఆ నోటీసు ఆంగ్లభాషలోను, ఆజిల్లా వాడుకభాషలోను వ్రాయవలెను. నోటీసు ప్రకటించిన తేదీకిన్ని ఎలక్షన్ తేదీకిన్ని 20 రోజులైన మధ్య గడు వుండవలెను.

### ఆనోటీసులో వ్రాయవలసిన యంశము లివి

(i) ఎన్నుకోవలసిన మెంబర్ల సంఖ్య.

(ii) ఏ వార్డుకు మెంబర్ల నెన్నుకోవలెను?

(iii) మహమ్మదీయులు, క్రైస్తవులు, పంచములు, యూరపియన్లు, ఆంగ్లో ఇండియన్లు, స్త్రీలు వీరికి కేటాయించిన సీట్లను ఏ వార్డులో నిచ్చిరో ఏచోట, ఏతర గతివారికి సీటు కేటాయించి యుంచిరో,

(iv) మెంబర్ల నామినేషన్లు ఏ తేదీని, ఎన్నిగంటలకు ఎచ్చట దాఖలు చేయవలెనో (నామినేషన్లు దాఖలుచేయు తేదీకిన్ని నోటీసు తేదీకిన్ని మధ్య 7 రోజులైన గడు వుండవలెను.)

(v) నామినేషన్ క్రమప్రకారము వ్రాయబడినదియు లేనిదియు, ఏ తేదీని తనిఖీచూతురో

ఈ తనిఖీచూచు తేదీకిన్ని ఎలక్షన్ తేదీకిన్ని మధ్య 7 రోజులైన గడువుండవలెను.

(vi) ఏరోజున ఏ ఏ గంటలనడుమ, ఏ ప్రదేశమున ఓట్లు పుచ్చుకొందురో ఓట్లు పుచ్చుకొను గంటలు- ఉదయము 7 గంటలనుండి సాయంత్రము 6 గంటలకు మధ్య 10 గంటలకాలము ఓట్లు పుచ్చుకోవలెను.

(vii) ఎలక్షన్ ఆఫీసరు ఏచోట, ఏ రోజున ఎన్నిగంటలకు ఓట్లు లెక్కనారంభించునో.

(2) అట్టి నోటీసులు మునిసిపల్ ఆఫీసు నోటీసు బోర్డులోను ఏవార్డు ఎలక్షన్ జరుగుచున్నదో ఆవార్డులో 3 వెల్లడిచోట్లను ప్రకటింపవలెను.

## నామినేషన్లు

3. (1) నామినేషన్లు 1 వ మతలబు ప్రకారము వ్రాయవలెను. ఓటరు జాబితాలో పేరున్నవా రెవ్వరడిగినను వారికి మతలబులు (ఎలక్షను ఆఫీసరు లేక మునిసిపల్ ఛైర్మన్) ఉచితముగా నీయవలెను.

(2) నామినేషన్లపై ఉపపాదించు ఓటరున్ను, బలపర్చు ఓటరున్ను సంతకము చేయవలెను. అభ్యర్థిగా నిల్చుట కంగీకారము సూచించుచు నభ్యర్థియు సంతకము చేయవలెను.

(3) ప్రతి ఓటరున్ను ఎన్నిఖాళీలున్నవో అన్ని నామినేషన్లపై (ఉపపాదించుచు, లేక బలపర్చుచు) సంతకములు చేయవచ్చును. అంతకుమించి సంతకములు చేయరాదు.

ప్రతి అభ్యర్థిపేరున్ను సక్రమమైన యొక నామినేషన్ కాగితముపై వ్రాసియుండవలెను.

(4) నామినేషన్లు ఉపపాదించు ఓటరు, బలపర్చు ఓటరు కలిసి, లేదా అభ్యర్థి స్వయముగాను ఎలక్షన్ ఆఫీసరు ఎదుట దాఖలుచేయవలెను. వానిని నిర్ణయించిన గడువులోపుననే దాఖలుచేయవలెను. ఎలక్షన్ ఆఫీసరు ఆకాగితములపై వరుససంఖ్య వేసి ఏది ఏతేదీని ఎన్నిగంటలకు దాఖలయ్యెనో వ్రాయవలెను.

(5) ఖాళీల సంఖ్యకు మించిన నామినేషన్లపై ఏఓటరైనను సంతకముచేసియున్నచో, ఖాళీల సంఖ్యకు సరిపోవునామినేషన్లు మాత్రమే దాఖలు పుచ్చుకొందురు. ముందుగా ఎలక్షన్ ఆఫీసరుకద్ద దాఖలైనవి మాత్రమే గౌరవింతురు.

(6) అభ్యర్థిపేరు సక్రమమైన ఒకనామినేషన్ కాగితములో వ్రాసియున్న చాలును. అతనిపేరు పెక్కునామినేషన్లలో చేర్చియున్నను కీడులేదు.

(7) గడువులోపల దాఖలుకాని నామినేషన్లు మంజూరుచేయరు.

4. ఓటరుజాబితాలో అభ్యర్థి పేరున్ను (ఉపపాదించిన ఓటరు, బలపర్చిన ఓటరు) చూపుమని ఎలక్షన్ ఆఫీసరు కోరవచ్చును. జాబితాలో పేర్లున్ను నామినేషన్‌లో పేర్లున్ను పోల్చి చూడవచ్చును. నామినేషన్లలోని వ్రాతపొరపాట్లు సవరింపు మన వచ్చును.

5. (1) నామినేషన్లతోపాటు రు 50/-లు ధరావత్తుకూడా చెల్లింపవలెను. ఆ మొత్తమునకు సరిపోవు గవర్నమెంటు ప్రామిసరీ నోట్లయినను పనికివచ్చును. ధరావత్తు చెల్లింపని నామినేషన్‌కు విలువలేదు. పంచములు ధరావత్తు చెల్లింప నక్కరలేదు. ఒకే అభ్యర్థి పెక్కువార్డులలో ఎన్నిక నపేక్షించినచో, అన్నిమార్లు ధరావత్తుమొత్తం కట్టవలెను.

(2) అభ్యర్థి పదవికి రాజీ దాఖలుచేయవచ్చును. నామినేషను సక్రమమైనది కాదని ఆఫీస రభిప్రాయమీయవచ్చును. ఈ రెండు సందర్భములలోను ధరావత్తుసొమ్ము వాపసు చేయవలెను. సొమ్ము వాపసు పుచ్చుకొనువాడు మరణించినచో, ఆ మొత్త మతని వారసున కీయవలెను; ఆ సొమ్ము చెల్లించినవారికే వాపసు చేయవలెను.

(3) ఓట్ల సంఖ్యను మెంబర్ల సంఖ్యచే విభాగించి ఆ సంఖ్యలో 1/8 వ వంతు పైగా ఓట్లురాని అభ్యర్థుల ధరావత్తుసొమ్ము లోకల్ గవర్నమెంటుకు సంక్రమించును.

(4) పై ఓట్లసంఖ్య నిర్ధారణ చేయుటలో చెడిపోయిన ఓట్లు మినహా తక్కిన ఓట్లన్నియు గణన చేయుదురు.

(5) ఫోర్టుసెంట్ జార్జిగజెట్‌లో ఫలితములు ప్రచురణ అయినతర్వాత మిగతా అభ్యర్థులు కట్టినమొత్తములు వాపసు చేయవలెను. గెల్చిన అభ్యర్థి సొమ్ము అతడు కౌన్సిలుమీటింగుకు ప్రథమపర్యాయము హాజరైనపిమ్మట వాపసు చేయవలెను. అతడు మొదటిసభకు రానిచో అతని సొమ్ము వాపసుచేయుపద్ధతి గవర్నమెంటువా రేర్పరుతురు.

ఒక అభ్యర్థి రెండు మూడు వార్డులలో ఎన్నికపొందగోరి రెండు మూడింటిలో సొమ్ముకట్టియున్నచో, ఏ సందర్భములోను ఒక మొత్తముమాత్రమే అతనికి వాపసు చేయబడును. మిగతాసొమ్ము లోకల్ గవర్నమెంటుకు సంక్రమించును.

6. నామినేషన్లు దాఖలుచేయు గడువున్ను, రాజీలు దాఖలుచేగడువునుయు దాటినపిమ్మట, ఎలక్షన్ ఆఫీస రభ్యర్థుల పేర్లన్నియు అకా. దిగా నొక జాబితాలో

వ్రాయవలెను. ఆ జాబితా 2 వ మతిలబునుబట్టి జిల్లావాడుకభాషలో వ్రాయవలెను. ఆ జాబితా మునిసిపల్ ఆఫీసులో ప్రకటింపవలెను.

నామినేషన్లు సక్రమమైనవో కావో ఫలానిచోట, ఫలాని తేదీని ఫలాని గంటల వేళ ఎలక్షన్ ఆఫీసరు తనిఖీచూచునని వ్రాసి పై జాబితాతోపాటు ప్రచురింపవలెను.

## నామినేషన్ల తనిఖీ

7. (1) ఈ తనిఖీ ఎలక్షన్ ఆఫీసులో జరుగవలెను. ఆ ఆఫీసులోనికి అభ్యర్థి, అభ్యర్థిని ఉపపాదించిన ఓటరు, బలపర్చిన ఓటరు, అభ్యర్థి (లిఖితరూపముగా) నియమించిన ప్రతినిధి, ఆఫీసరు సహాయమునిమిత్తమేర్పర్చుకొన్నవారును వెళ్లవచ్చును; ఇతరులు పోరాదు. హాజరున్నవారు నామినేషన్లు చూచుట కవకాశ మీయవలెను.

(2) నామినేషన్లు ఎలక్షన్ ఆఫీసరు తనిఖీచూచి క్రమవిరుద్ధము లైనవి నిరాకరింపవచ్చును. హాజరున్నవారిలో నెవరైన ఆక్షేపణలు సూచింపవచ్చును. అట్టి నిరాకరణ కీక్రింది కారణములలో నేదియోయొకటి గోచరింపవలెను:—

(i) ఆక్టు 48, 49 సెక్షన్ల ప్రకారము అభ్యర్థి అనర్హుడగుట.

(ii) ఆ ఓటరు జాబితాలో అభ్యర్థిపేరు, లేక ఉపపాదించు ఓటరుపేరు, లేక బలపర్చు ఓటరుపేరు లేకుండుట.

(iii) పై 3 వ రూలు 5 వ రూలు ప్రకారము అభ్యర్థి లేక అతనికి సహాయులగు ఓటర్లు సంచరింపకుండుట (సహాయు లగు ఓటర్లు అనగా అతనిపే రుపపాదించిన, బలపర్చిన ఓటర్లు.)

(iv) రిజర్వుసీటు ఎన్నికలో అభ్యర్థి ఆయాతరగతులకు చెందకుండుట.

(3) నామినేష నంగీకరించినట్లు కాని, నిరాకరించినట్లుగాని ఎలక్షన్ ఆఫీసరు నామినేషన్ కాగితముపైనుక తీర్పు వ్రాయవలెను. నిరాకరించినచో అందుకు కారణములుకూడ వ్రాయవలెను. నామినేషన్ల తనిఖీ 2 వ రూలులో నుదాహరించిన తేదీని పూర్తికావలెను.

8. (1) నామినేషన్లు తనిఖీ పూర్తియైన వెనుక ఎలక్షన్కు 4 రోజులైన ముందుగా ఆఫీసరు నిల్చియున్న అభ్యర్థులపేర్లు 3 వ మతిలబుప్రకారము వ్రాసి మునిసిపల్ ఆఫీసులో ప్రచురింపవలెను.

(2) నామినేషన్ల ప్రకారము అభ్యర్థుల పేర్లును తబిసీళ్లును పై జాబితాలో వ్రాయవలెను.

9 (1) ఏ అభ్యర్థియైన తన అభ్యర్థిత్వము వదులుకొనుచు ఎలక్షన్ ఆఫీసరుకు వ్రాసి, అందుపై సంతకముచేసి పంపవచ్చును. ఆ కాగితము ఆఫీసరుకు తనిఖీ జరిగిన మరు నాడు మధ్యాహ్నము 3 గంటలలోపుగా చేరవలెను.

అభ్యర్థి స్వయముగా నట్టికాగితము దాఖలుచేసినచో నందుపై సాక్షిసంతక మక్కరలేదు.

ఒకసారి పై కాగితము దాఖలుచేసినవాడు అభ్యర్థిగా నిలువరాదు.

(2) రాజీకాగితములు దాఖలైన వర్తమానము మునిసిపల్ ఆఫీసు నోటీసు బోర్డులో ప్రకటింపవలెను.

10. అభ్యర్థుల ఎన్నికలలో నీ క్రిందివిధుల నవలంబింపవలెను.

I జనరల్ సీట్లకు ఎన్నికజరుగు సందర్భములో, లేదా ఏకో ఒకే తరగతి రిజర్వుసీట్ల ఎన్నికజరుగు సందర్భములో

(i) ఖాళీల సంఖ్యకు అభ్యర్థుల సంఖ్య సరిపోయినచో అభ్యర్థులందరు మెంబర్లుగా నెన్నుకోబడిరని ఎలక్షన్ ఆఫీసరు వెల్లడి చేయవలెను.

(ii) ఖాళీలసంఖ్యకంటె అభ్యర్థులసంఖ్యయే తక్కువగ నున్నచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లుగా పరిగణింపబడుదురు; మిగతా ఖాళీలకు క్రొత్త ఎన్నికలు జరుగును.

(iii) అభ్యర్థి ఎవరున్ను లేకున్నచో క్రొత్త ఎన్నికలు జరుగును.

(iv) అభ్యర్థుల సంఖ్య ఖాళీల సంఖ్యను మించియున్నచో ఓట్లు పుచ్చు కోవలెను.

II. రెండుమూడు రిజర్వుడ్ సీట్లకు ఎన్నికజరుగుచున్నచో, ఆసీట్లు వేరు వేరు తరగతుల సీట్లైనచో

(i) ఏ తరగతిలో ఎన్నుకోవలసిన మెంబర్ల సంఖ్యకు ఆతరగతి అభ్యర్థుల సంఖ్య సరిపోయినచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లయినట్లు భావింతురు.

(ii) ఏ తరగతిలోనైన సీట్ల సంఖ్యకు ఆ తరగతి అభ్యర్థుల సంఖ్య తగ్గి యున్నచో, అభ్యర్థు లందరున్ను మెంబర్లగుదురు. మిగతాఖాళీలకు క్రొత్త ఎన్ని కలు జరుపవలెను.

(iii) ఏ తరగతిలోనైన అభ్యర్థిగా ఎవరున్ను నిలువనిచో ఆ ఖాళీకి క్రొత్త ఎన్నికలు జరుగవలెను.

(iv) మిగతా సందర్భములలో (అనగా మెంబర్లుగా అభ్యర్థులను స్థిరపర్చని సందర్భములోను, క్రొత్త ఎన్నిక జరుప నగత్యములేని సందర్భములలోను) ఓట్లు పుచ్చుకోవలెను.

## III. 1, 2 రిజర్వు సీట్లకున్ను, 1, 2 జనరల్ సీట్లకున్ను, ఒకేసారి ఎన్నికజరుగు సందర్భములలో

(i) ఏ తరగతి అభ్యర్థుల సంఖ్యయైన ఆ తరగతి ఖాళీలసంఖ్యకు సరిపోయినచో అభ్యర్థు లందరున్ను మెంబర్లుగా పరిగణింపబడుదురు.

(ii) ఏ తరగతికైనను ఖాళీలసంఖ్యకు తక్కువగా అభ్యర్థుల సంఖ్య యున్నచో, అభ్యర్థులందరున్ను మెంబర్లగుదురు. మిగతా ఖాళీలకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(iii) ఏ తరగతిలోనైన అభ్యర్థిగా ఎవరున్ను నిలువనిచో ఆ ఖాళీకి క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(iv) పైరీతిగా మెంబర్లెన్నుకోబడిన సీట్లున్ను, క్రొత్త ఎలక్షన్ జరుగవలెనని నిర్ణయించిన సీట్లున్ను, మిగతా ఎన్నికలనుండి తప్పింపవలెను.

(v) అట్లు తప్పించినవెనుక

(అ) మిగతా ఖాళీలసంఖ్యకు అభ్యర్థులసంఖ్య సరిపోయినచో అభ్యర్థు లందరున్ను మెంబర్లయినట్లు నిర్ధారణ చేయవలెను.

(ఆ) ఖాళీల సంఖ్యకు అభ్యర్థులసంఖ్య తక్కువగా నున్నచో అభ్యర్థు లందరున్ను క్రింది (vi) వ రూలులో తెల్పిన రీతిగా మెంబర్లయినట్లు భావించి మిగతా సీట్లకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(ఇ) అభ్యర్థులే లేనిచో క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

(ఈ) ఖాళీల సంఖ్యకు మించి అభ్యర్థులసంఖ్య యున్నచో ఓట్లు పుచ్చుకోవలెను.

(vi) (అ) పై (v) (అ) (ఆ) లలో తెలిపిన సందర్భములలో అభ్యర్థు లందరున్ను జనరల్ సీట్లన్నింటికి ఎన్నుకోబడినట్లు నిర్ణయింపవలెను. (అభ్యర్థులందరు అనగా రిజర్వుడ్ సీట్ల కెన్నుకోబడినవారు తప్ప మిగతా యావన్మందియున్ను క్రింది (ఆ) చూ.)

(ఆ) పై v (అ) (ఆ) లలో తెలిపిన సందర్భములలో ఏ తరగతిలోనైన ఖాళీలసంఖ్యకు మించి అభ్యర్థులసంఖ్య యున్నచో లాట్లువేసి ఎవరెన్నుకోబడిరో

ఎలక్షన్ ఆఫీసరు నిర్ణయింపవలెను. అభ్యర్థులందరున్ను తమలో కొందరిని సభ్యులుగా నిర్ణయింపవలసిన దని ఏకగ్రీవముగా వ్రాసి సంతకములుచేసి ఆ కాగితము రాజీలు దాఖలు చేయ నియమించిన గడువు దాటినపిమ్మట 24 గంటలలోపుగా ఎలక్షన్ ఆఫీసరున కంద జేసినచో అత డాప్రకారము నడుచుకొనవలెను.

నిర్వచనము

అభ్యర్థి: క్రమప్రకారము నామినేషనైన రాజీ దాఖలుచేయనివాడు.

ఎన్నుకోతగిన అభ్యర్థి

ఏ తరగతి సీటునకైన నెన్నుకొన నర్హుడు. ఆ తరగతికి చెందినవాడు.

రిజర్వుడు సీటు

ఫలాని తరగతివారికి లేక స్త్రీలకు కేటాయించిన సీటు.

రిజర్వుకాని సీటు

ఏ తరగతికిన్ని కేటాయించని జనరల్ సీటు.

ఒకేతరగతి రెండుసీట్లు

రెండున్ను ఒకేతరగతి మెంబర్లకు, లేక స్త్రీలకు కేటాయించిన సీట్లు.

11. (1) ప్రతి ఓట్ల ఆఫీసులోను ఓట్లు పుచ్చుకొనుటకు ఓట్ల ఆఫీసర్లను ఎలక్షన్ ఆఫీసరు నియమింపవలెను. వారికి భత్యముకూడ నేర్పరుపవచ్చును. ఓటర్ల నానవాలు పట్టుటకు మరికొందరిని నియమింపవచ్చును. ఓట్ల ఆఫీసరు ఆకౌన్సిలుసభ్యుడై యుండ రాదు; ఆ జాబితాలో ఓటరై యుండరాదు.

(2) ఓట్లు పుచ్చుకొనులోపుగా అభ్యర్థులలో నెవరైన కాలముచేసినచో, ఎలక్షన్ ఆఫీస రంతటితో ఎలక్షన్ ఆపుచేయించవలెను. ఎలక్షన్ విషయమై జరుగ వలసిన కార్యక్రమంతయు తిరిగి మొదటినుండియు ప్రారంభింపవలెను.

అప్పటికి సక్రమముగా నామినేషనైన అభ్యర్థులు యీ క్రొత్తఎన్నికలో (తిరిగి నామినేషన నక్కరలేకయే) అభ్యర్థులుగా పరిగణింపబడుదురు.

ఓట్లుపుచ్చుకొను విధానము.

12. ఓట్ల ఆఫీసరు ఓట్ల ఆఫీసులో అల్లరి జరుగకుండ ఎలక్షన్ సక్రమముగా జరుగునట్లు ఏర్పాటుచేయవలెను. ఎంత రొక్కసారి లోనికివచ్చి ఓట్లువేయవలెనో నిర్ణయింపవలెను. తనగుమాస్తాలను అభ్యర్థులను, అభ్యర్థులతరపు ప్రతినిధులను, పోలీసు

వారిని, ఓటరును గుర్తుపట్టువారిని మాత్రమే లోనికి రానిచ్చి మిగతా యావన్మందిని ఆఫీసరు బైటనుంచవలెను.

13. ఓట్లపెట్టెలో ఓట్లువేయుటకు వీలుండవలెను; తీయుటకు వీ లుండరాదు. ఓట్లుపుచ్చుకొనుటకుముందు ఆఫీసరు ఖాళీపెట్టె ఆఫీసులో నున్నవారికి చూపి, తాళము వేసి, సీలు వేసి తనయెదుట పెట్టుకొనవలెను. తాళపుచెవికికూడ సీలు వేసి యుంచవలెను.

14. ప్రతి ఓట్ల ఆఫీసరును వలయు గుమాస్తాలను, ఎలక్షన్ ఆఫీసరు నియమింపవలెను. ఓటరుజాబితా నకలున్ను, నామినేషన్ల జాబితాయు, ఓటుకాగితములు ఓట్ల పెట్టెలు, తెల్లకాగితములు, మతలబులున్ను, ఓట్ల ఆఫీసరుకు ఎలక్షన్ ఆఫీసరు పంపవలెను. ఎందరు మెంబర్ల నెన్నుకోవలెనో తెలుపవలెను.

15. ఓటుకాగితములు 4 వ మతలబుప్రకారము ముద్రింపవలెను. వాటిపై వరుస నంబర్లు వేయవలెను. ఆకాగితము రెండుముక్కలుగా నుండును. ఒకముక్క ఆఫీసరు వద్దనే యుండిపోవును. రెండవది ఓటరున కివ్వబడును. ఆఫీసరు వద్దనున్న ముక్కలపై వరుసనంబరు వేయవలెను. ఓటరు కిచ్చుముక్క వెనుకవైపున ఆనంబరే వేయవలెను. ఓటు కాగితముమీది పేర్లు ఇంగ్లీషుభాషలో గాని, వ్యవహారభాషలో గాని లేదా రెండు భాషలలోగాని వ్రాయవలెను. పేర్లు అకారాదిగా వ్రాయవలెను. ఒకపేరున్న అభ్యర్థులిరువు రున్నచో యింటిపేరు లేక వృత్తి వ్రాసి యిద్దరికి భేదము కనబర్చవలెను.

16. ఓటరుకు ఓటుకాగితపు రెండవముక్క నిచ్చుటకుపూర్వము ఓట్ల ఆఫీసరు.-

(i) ఆ ముక్కపై తన పొడియక్షరములు వ్రాయవలెను.

(ii) మొదటి ముక్కపై ఓటరుపేరున్ను జాబితాలో నంబరున్ను వ్రాయవలెను.

(iii) జాబితాలో ఓటరు పేరున కెదురుగా పొడియక్షరములు వ్రాయవలెను.

అటుపైన ఓట్ల ఆఫీసరు ఓటరు ఎన్ని ఓట్లు వేయవచ్చునో తెలిపి కాగితమాతని చేతి కీయవలెను.

17. ఓటుకాగితము పుచ్చుకోగానే ఓటరు చాటుగదిలోనికి వెళ్లి [ఓట్లు చాటుగావేయుట కొకగది యేర్పాటుచేయవలెను.] తాను ఓటువేయదలచిన అభ్యర్థి పేరున కెదురుగా నొక గుర్తుంచవలెను. పిదప గుర్తు కనబడకుండ కాగితము మడిచి, ఆ కాగితము వెనుకనున్న పొడి యక్షరములు పోలింగు ఆఫీసరుకు చూపి, ఓట్లపెట్టెలో పడ వేయవలెను.

18. (1) చదువురాని ఓటర్లు తమ తరపున గుర్తుపెట్టుమని ఓట్ల ఆఫీసరును కోరవచ్చును. ఆ కాగితముపై వ్రాసియున్న అభ్యర్థుల పేర్లు ఆఫీసరు ఆ ఓటరుకు చదివి వినిపించి ఓటరు ఎవరి పేరున కెదురుగా గుర్తుపెట్టుమని కోరునో ఆ పేరు ఎదుట గుర్తుపెట్టి ఆ కాగితము ఓటరుకీయవలెను. ఓటరు దానిని ఓట్లపెట్టెలో పడవేయవలెను. హాజరులోనున్న అభ్యర్థులు, వారి తరపు ప్రతినిధులున్ను ఓటరుకు ఆఫీసరుకు జరిగిన సంభాషణ వినవచ్చును, ఆఫీసరు గుర్తుపెట్టుచుండగా చూడవచ్చును.

(2) ఇట్లు గుర్తుపెట్టిన కాగితము వెనుకముక్కపై ఓట్ల ఆఫీసరు తాను గుర్తుంచినందుకు కారణము వ్రాయవలెను.

(3) ఓటరు గుర్తుపెట్టుమన్న ప్రకారము ఆఫీసరు గుర్తుపెట్టలేదను వాదము చేయరాదు.

19. స్త్రీ ఓటర్లు ఓట్లువేయుటకు ఆఫీసరు ప్రత్యేక సౌకర్యములు కలిగించవచ్చును. అందువిషయమై ఎలక్షన్ అధికారి సూచనలీయవచ్చును.

20. (1) ఈ క్రింది సందర్భములలో ఓటు కాగితములు నిరాకరింపవలెను :—

(i) ఏ పేరున కెదురుగా గుర్తున్నదో తెలియకుండుట.

(ii) ఖాళీసంఖ్యలకంటె హెచ్చుమంది అభ్యర్థుల పేర్ల కెదురుగా గుర్తులుంచుట.

(iii) ఓటుకాగితముపై ఓటరు నానవాలు పట్టుటకు వీలిచ్చు సంకేతమేదైన పెట్టియుండుట.

(2) ఒక అభ్యర్థి పేరున కెదురుగా రెండు గుర్తులుంచినను ఒకటే ఓటుగా భావింతురు. కాని ఖాళీలకు మించిన అభ్యర్థుల పేర్ల కెదురుగా గుర్తులుంచరాదు.

(3) ఏ అభ్యర్థి పేరున కెదురుగా గుర్తుంచబడెనో అనుమానముగా నున్నపుడు ఆగుర్తునకు విలువ నీయరు. కాని కాగితములోని మిగతాగుర్తులకు విలువనిత్తురు.

21. ఓట్ల ఆఫీసరు ఓటుకాగిత మిచ్చుటకు ముందు ఓటరు నీ ప్రశ్నలు వేయవచ్చును. అభ్యర్థులు, ఏజంట్లు కోరినచో వేయవలెను.

(i) (జాబితాలో పేరు చదివి) ఈ ఓటరువు నీవేనా?

(ii) ఈ ఎన్నికలో నింకే ఆఫీసులోనైన ఓటు వేసితివా?

(i) వ ప్రశ్న కవుననియు, రెండవప్రశ్నకు లేదనియు, ఓటరు జవాబిచ్చినచో అతనికి ఓటుకాగిత మీయవచ్చును.

జాబితాలో పేరున్న ప్రతివారికిన్ని (పైమరతులకులోపించి) ఓటుకాగిత మిచ్చి తీరవలెను.

22. ఒకరిపేరున ఓటుపడినపిమ్మట, ఇంకొక అసామీ ఆపేరు తనపేరని చెప్పి ఓటుకాగిత మిమ్మని కోరవచ్చును. అతనికి ఓట్ల ఆఫీసరు పైప్రశ్నలువేసి జవాబుపొందవలెను. ఆప్రశ్నలకు సరియైన జవా బిచ్చినచో అతనికి ఓటుకాగిత మీయవలెను. అతడు ఓటువేసినపిమ్మట నాకవరుపై ఓటరుపేరును నంబరున్ను వేయవలెను; పోలింగు ఆఫీసుపేరు లేక నంబరుకూడ వేయవలెను. వీనిని పేచీ ఓట్లందురు. (ఈ జాబితా 5వ మతలబుప్రకారము వ్రాయవలెను) ఆఓటరు నాజాబితాలో సంతకము చేయుమని కోరవలెను. సంతకము చేయలేని ఓటరును వేలుముద్ర వేయమని కోరవలెను.

ఓట్లలెక్కింపులో పేచీఓట్లు గణనచేయరు. 22, 23 నిబంధన లమలులోపెట్టుటకు వీలగు సందర్భములలో, రెండున్ను అమలులో పెట్టబడవలెను.

23. పైవిధముగా ఓటుకాగిత మిమ్మని కోరే వ్యక్తి కృత్రిమనామము పెట్టుకొని ఓటువేయ యత్నించుచున్నాడనియు, ఆసంగతి తాను రుజువుపర్చెద ననియు ఏ అభ్యర్థియైన, ఏజంటైన ఓట్ల ఆఫీసరుతో చెప్పవచ్చును. ఇట్టి ఓట్లు తగాయిదా ఓట్లు. వీనికొకజాబితా వ్రాసియుంచవలెను. ఆజాబితా 6వ మతలబు ననుసరించి వ్రాయవలెను. ఆ అభ్యర్థి లేక ఏజంటుపే రాజాబితాలో వ్రాయించి అతనిని సంతకము లేక వేలిముద్ర వేయుమని కోరవలెను. అతడు తెల్పువిషయము (ఓటరు మారుపేరుతో వచ్చినాడని) రుజువుచేయు మని కోరవచ్చును.

పై నుదాహరించిన ప్రశ్నలు ఓటరుకు వేసి, వానికతడు సరియైనజవాబిచ్చినచో, ఆఫీస రతనికి ఓటుకాగిత మీయవలెను. అతడు కృత్రిమనామముతో వ్యవహరించుచున్నచో అది నేరమనియు, శిక్షార్హమనియు ఆఫీసరు ఓటరుతో చెప్పవలెను.

తగాయిదా ఓట్లజాబితాలో, ఆఫీసరు జరిగినవిషయ మంతయు వ్రాసి, అందుపై తన యభిప్రాయమున్ను వెలిబుచ్చవలెను.

ఆ ఓటరువద్ద ఓటుకాగితము పుచ్చుకొని వేరే కవరులో నుంచవలెను.

24. పొరపాటున ఓటుకాగితము పాడైనచో ఆఫీసరది పుచ్చుకొని (దానిపై రద్దయినట్లు వ్రాసి) క్రొత్త కాగిత మొకటి ఓటరున కీయవలెను.

25. ఓట్లు పుచ్చుకొనుట ముగియగానే అభ్యర్థుల, ఏజంట్ల సమక్షములో ఆఫీసరు యీదిగువ నుదాహరించిన కాగితములు ప్రత్యేకముగా విడదీసి, వేరుకవర్లలో పెట్టి,

వానిపై తన సీళ్లున్ను అక్కడ హాజరుగానున్న అభ్యర్థుల, ఏజంట్ల సీళ్లున్ను వేసి యుంచవలెను.

(i) ఓట్లువేసిన ప్రతి ఓట్లపెట్టెయు, తెరవకుండగనే సీళ్లు వేయవలెను.

(ii) ఆ పెట్టె తాళపుచెవులు

(iii) పాడైన ఓటుకాగితములు, వాటి వెనుకముక్కలు

(iv) పేచీ ఓటుకాగితములు

(v) పొడియక్షరములు వేసిన ఓటరు జాబితాలు ఓటుకాగితముల వెనుక ముక్కలు.

(vi) పేచీ ఓట్లజాబితా.

(vii) తగాయిదావోట్లజాబితా.

26. ఇవన్నియు ఓట్ల ఆఫీసరు 7 వ మతలబు ననుసరించి ఒక స్టేట్మెంటు వ్రాసి పంపవలెను. ప్రతికవరుపైన వరుససంఖ్య వేసి, అందులో నేకాగితము లున్నవో వ్రాయవలెను.

27. ఓట్ల లెక్కకు నియామకమైనరోజున, నియామకమైనవేళ, హాజరైన అభ్యర్థుల, ప్రతినిధుల సమక్షములో ఎలక్షన్ ఆఫీసరీ క్రింది చర్య నవలంబింపవలెను.

(అ) ఓట్ల పెట్టెలు ఒకదానివెనుక నొకటి తెరచి, ఒక్కొక్క పెట్టెలో నున్న ఓట్లు ప్రత్యేకముగా లెక్కపెట్టి వాని లెక్క 8 వ మతలబు ననుసరించి ఒకస్టేట్మెంటు వ్రాసి దానిలో వ్రాయవలెను.

(ఆ) ఆ పిమ్మట అన్ని పెట్టెలలోని ఓట్లును కలిపి, ఏ ఏ అభ్యర్థి కెన్ని ఓట్లు వచ్చినవో లెక్కపెట్టవలెను. ఓటుకాగితములలో కొన్ని రద్దయినట్లు ఎలక్షన్ ఆఫీసరు భావించినచో 'నిరాకరించడమైనది' అనుమాట వానిపై వ్రాయవలెను. ఏ అభ్యర్థికాని, ఏజంటుకాని ఫలానికాగితము రద్దు కాలేదని ఆఫీసరుతో చెప్పినచో, అట్టికాగితము నిరాకరించుటకు కారణములుకూడ ఆఫీసరు వ్రాయవలెను.

(ఇ) ఎలక్షన్ ఆఫీసరు ఓట్లలెక్క ముగియువరకు పని సాగింపవలెను. ఈమధ్య పని ఆపుచేయవలసినచో, ఓట్లును వానికి సంబంధించిన యావత్తు కాగితములున్న సంచులలోగాని, పెట్టెలలోగాని పెట్టించి, వానిపై తన సీలున్ను, అభ్యర్థుల, ఏజంట్ల సీళ్లున్ను వేయించి, తిరిగి పని ప్రారంభించువరకు వానిని భద్రపరిచి యుంచవలెను.

28. పై కార్యక్రమము పూర్తియైన వెనుక ఆఫీసరు ఎలక్షన్ ఫలితములు 9వ మతలబు ననుసరించి వ్రాయవలెను. 7, 8 మతలబుల లెక్కలనుబట్టి సరిచూడవలెను.

ఆ ఎలక్షన్‌లో కొన్ని తరగతులకు లేక స్త్రీలకు సీట్లు కేటాయించియున్నచో ఆసీట్ల కెవ రెన్నుకోబడిరో ముందుగా ఆఫీసరు నిర్ణయింపవలెను.

(2) 9వ మతలబు నకలు తీసికొనగోరు అభ్యర్థినిగాని ఏజంటునుగాని ఆఫీసరు నకలు తీసికొన అనుమతి నీయవలెను.

29. పై 25వ రూలు (4) (5) విధులలో తెలిపిన సంచులు ఎలక్షన్ ఆఫీసరు విప్పరాదు.

30. లెక్కపూర్తికాగానే

(i) సక్రమమైన ఓటుకాగితములు వేరుసంచిలోను

(ii) నిరాకరించిన ఓటుకాగితములు వేరుసంచిలోను

ఎలక్షన్ ఆఫీసరు పెట్టించి వానిపై సీళ్లు వేయవలెను. ఏసంచిలో ఎన్నికాగితములున్నవో, ఆసంచి ఏ ఎన్నికకు సంబంధినదో, ఆసంచిలోని కాగితముల స్వభావ మెట్టిదో ఆసంచిపై వ్రాయవలెను

31. (1) ఎలక్షన్ ఫలితములు తెల్పుస్టేట్‌మెంటు కొక నకలు తీయించి ఎలక్షన్ ఆఫీసరా నకలు మునిసిపల్ ఛైర్మన్ వద్దకు పంపవలెను. ఓటు కాగితములు, ఓటర్ల జాబితా మొదలగు యావత్తు రికార్డు సంచులలో పెట్టి సీళ్లు వేయించి తన ఆఫీసులో భద్రపరుపవలెను ఆసంచుల ఎలక్షన్ విచారణలో విప్పవచ్చునుగాని అన్యథా తెరవరాదు.

(2) ఆ కాగితములు ఎలక్షన్ ఆఫీసరు 1 సంవత్సరము భద్రపరిపించి యీ లోపుగా ఏ విచారణలోను వానిని పంపమని తాఖీదు రానిచో, ఆవెనుక కాల్చివేయవలెను.

32. (1) ఏ అభ్యర్థియైన రెండు మూడు వార్డులలో మెంబరుగా నెన్నుకోబడినచో అతడు దేనికి మెంబరుగా నుండగోరునది ఎలక్షన్ ఆఫీసరునకు వ్రాసి పంపవలెను. ఎలక్షన్ ఫలితములు ప్రకటించిన 24 గంటల లోపుగా ఆ కాగితము ఎలక్షన్ ఆఫీసరుకు చేరవలెను.

(2) అట్టి వర్తమానము ఎలక్షన్ ఆఫీసరుకు చేరినచో అతడా అభ్యర్థి కోరిన సీటులో నెన్నుకోబడినట్లు ప్రకటించి మిగతా సీట్లకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను. అట్టి వర్తమానము లేకున్నచో, ఆఫీసరుకు నచ్చిన ఏదో యొక సీటున కాత డెన్నుకోబడినట్లు నిర్ణయించి, మిగతా సీట్లకు క్రొత్త ఎన్నికలు జరుపవలెను.

33. ఇరువు రభ్యర్థులకు సమానముగా ఓట్లు వచ్చినచో, ఆఫీసరు లాట్లపద్ధతి నవలంబించి గెలుపొందినవా రెవరో నిర్ణయించవలెను.

34. గెలుపొందిన అభ్యర్థులపేర్లు ఫోర్టుసెంట్‌జార్జి గెజెట్‌లో ప్రకటననిమిత్తము గవర్నమెంటు ముద్రాలయ సూపరిండెంటుగారికి ఎలక్షన్ ఆఫీసరు పంపవలెను; ఆ మునిసిపల్ ఆఫీసు నోటీసుబోర్డులోగూడ ప్రకటింపవలెను.

35. ఈ నిబంధనల అంతరార్థ మేమి యని సంశయము కలిగినచో, ఆ సంశయము గవర్నమెంటు అభిప్రాయమునుబట్టి నివారించుకోవలెను. ఆ అభిప్రాయమే ఖాయపు అభిప్రాయమై చెల్లవలెను.

(2) ఈ అభిప్రాయ మిచ్చుటకు పూర్వము గవర్నమెంటు ఎలక్షనులో జరుగు చర్య నాపుచేయించవచ్చును. ఆపుచేయమని గవర్నమెంటు ఉత్తరు విచ్చినపిమ్మట జరిగిన చర్యలు శాస్త్రవిరుద్ధములు. వాని కెట్టి విలువయు లేదు.

(3) ఆపుకాబడిన చర్య ఏ సందర్భములో ఆపుకాబడెనో అప్పటినుండియు కొనసాగింపవచ్చును. కాని మొదటినుండియు తిరిగి సాగింపవలసిన యగత్యము లేదు.

36. ఈ ఆక్టులోని 9 (2) సెక్షన్ ప్రకారము కౌన్సిలరు ఎన్నిక జరుగవలసినచో, వైస్‌ఛైర్మను ఎన్నికకు అవలంబించు విధానమే అవలంబింపవలెను.

## మునిసిపల్ కౌన్సిలర్ల నెన్నుకొను విధానము

### 1–వ మతలబు (3 (1) విధి చూ.)

### నామినేషను కాగితము

1. వార్డు పేరు లేక నెంబరు.
2. అభ్యర్థి పూర్తిపేరు.
3. జాబితాలో అభ్యర్థి నంబరు.
4. తండ్రి లేక భర్తపేరు.
5. వయస్సు.
6. స్త్రీయా, పురుషుడా.
7. కులము.

8. వృత్తి, చిరునామా.

9. ఉపపాదకుని పూర్తి పేరు.

10. జాబితాలో ఉపపాదకుని నంబరు.

11. ఉపపాదకుని సంతకము.

12. బలపర్చినవాని పూర్తి పేరు.

13. జాబితాలో బలపర్చినవాని నంబరు.

14. బలపర్చినవాని సంతకం.

నేను బ్రిటిషు (లేక ఇండియాలోని స్వతంత్రరాష్ట్రమునకు చెందిన) సబ్జక్టు ననియు, ఎలక్షనుకు నిలువ యిష్టపడితి ననియు తెలుపుచున్నాను.

......................

అభ్యర్థి సంతకం.

వరుస సఖ్య.

............తేదీని......గంటలకు...............చోట.............

......(ఇచ్చినవాని పేరు) యీ నామినేషన్ కాగితము నా దగ్గర దాఖలుకాబడినది.

............................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

## హెచ్చరిక

............తేదీని............గంటలకు దాఖలుకాని నామినేషన్ కాగితములు అంగీకరింపబడవు.

## 2-వ మతలబు (6-వ విధి చూ.)

..............తేదీని.........................వార్డుకు చెందిన నామినేషన్ల (అంగీకరింపబడిన) పట్టీ.

1. వరుస సంఖ్య............

2. అభ్యర్థి పేరు.............................

3. తండ్రి లేక భర్త పేరు.............................................

4. పురుషుడా, స్త్రీయా.............................................

5. కులము...................

6. వృత్తి, చిరునామా.............................................

7. ఉపపాదకుని పేరు.............................................

8. బలపర్చినవాని పేరు.............................................

............గంటలకు............ తేదీని .................... ప్రదేశమందు నామినేషన్ కాగితములు తనిఖీ చేయబడును.

..........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

3-వ మతలబు (8 (1) విధి చూ.)

## సక్రమమైన నామినేషన్ల పట్టీ

1. వరుస సంఖ్య............

2. అభ్యర్థి పేరు.............................................

3. పురుషుడా, స్త్రీయా.............................................

4. కులము.................

5. చిరునామా .............................................

............గంటల మధ్య పోలింగుస్టేషన్లవద్ద ఓట్లు తీసుకొనబడును.

..........................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

4-వ మతలబు (15-వ రూలు చూ.)

## ఓటు కాగితము

లోపలికాగితము | పైకాగితము

వరుససంఖ్య | మునిసిపాలిటీ | వార్డు

మునిసిపాలిటీ

వార్డు

ఎలక్షన్ తేదీ

జాబితాలోని పేరు

నంబరు

| వరుస సంఖ్య (1) | అభ్యర్థి పేరు | గుర్తు |
|---|---|---|
| 1 | | |
| 2 | | |
| 3 | | |
| 4 | | |
| 5 | | |
| 6 | | |
| | | |

వెనుక పేజీ

| సంఖ్య. |
|---|

## 5–వ మతలబు (22 వ రూలు చూ.)

## పేచీ ఓట్ల జాబితా

| జాబితాలో సంఖ్య | పేరు | చిరునామా | చేవ్రాలు లేక వేలు ముద్ర |
|---|---|---|---|
| | | | |

## 6–వ మతలబు (23–వ విధి చూ.)

## తగాయిదా ఓట్ల జాబితా

| జాబితాలో సంఖ్య | పేరు | చిరునామా | చేవ్రాలు లేక వేలు ముద్ర |
|---|---|---|---|
| | | | |

## 7 వ మతలబు

............మునిసిపాలిటీలోని..............స్థలమునుండి............
తేదీని............వార్డులో ఓట్లు పుచ్చుకొనిన పిమ్మట పోలింగు ఆఫీసరు పంపిన స్టేట్ మెంటు.

| తబిసీలు (1) | పుచ్చుకొన్న వాని సంఖ్య (2) | ఖర్చుపెట్టిన వాని సంఖ్య (3) | పాడైనవాని సంఖ్య (4) | మిగిలినవి (5) | రిమార్కులు (6) |
|---|---|---|---|---|---|
| ఓటు కాగితములు<br>(1) సాధారణపు ఓట్లు<br>(2) పేచీ ఓట్లు<br>(3) తగాయిదా ఓట్లు | | | | | |

ఎలక్షన్ ఆఫీసరుకు పంపిన కట్టల తబిసీళ్లు.

..............................

పోలింగు ఆఫీసరు సంతకం.

## 8-వ మతలబు (27 (ఎ) విధి చూ.)

| పోలింగు ఆఫీసు పేరు | ఓటుపెట్టె సంఖ్య | ఓటుపెట్టెలోని కాగితముల సంఖ్య |
|---|---|---|
| | | |
| మొత్తము... | | |

..............................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

9-వ మతలబు (28-వ విధి చూ.)

..................మునిసిపాలిటీయొక్క..................వార్డులోని సీట్లయొక్క ఎలక్షన్ ఫలితములు తెలియజేయు పత్రము.

| అభ్యర్థి పేరు | సక్రమమైన ఓట్లసంఖ్య |
|---|---|
| 1. | |
| 2. | |
| 3. | |
| 4. | |
| 5. | |
| 6. | |
| సక్రమమైన ఓట్ల మొత్తపుసంఖ్య...... | |
| నిరాకరించిన ఓట్ల మొత్తపుసంఖ్య...... | |

.............. వార్డుకు యీ క్రింది అభ్యర్థు లెన్నుకోబడి రని తెల్పుచున్నాను.

.........తరగతి / స్త్రీలు కు రిజర్వు కాబడిన సీట్లకు..................

.........తరగతి / స్త్రీలు కు రిజర్వు కాబడిన సీట్లకు..................

.........తరగతి / స్త్రీలు కు రిజర్వు కాబడిన సీట్లకు..................

రిజర్వుకాని సీట్లకు { ....................
....................
....................

....................

ఎలక్షన్ ఆఫీసరు సంతకం.

# డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు

---

## ఓటరుజాబితాలు సమకూర్చుటలో గమనింపవలసిననిబంధనలు.

(ఫోర్టుసెంట్ జార్జిగెజెట్ 23-4-1929 జి. ఓ. 1606, యల్. అండ్. యం. 582.)

ఓటరు జాబితాలు సమకూర్చుటలో ఆయా అధికారులు గమనింపవలసిన నిబంధనల నీదిగువ పొందుపర్చినాము. ఈనిబంధనలు గవర్నరుగారున్ను వారిమంత్రులున్ను సంప్రతించి యేర్పరిచినవి. ఇంతకు పూర్వపు నిబంధనలన్నియు రద్దుకాబడినవి. ఈ నిబంధనలు నిర్ధారణ చేయు నధికారము గవర్నమెంటువారికి డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు (1920వ సంవత్సరపు 5 వ ఆక్టు) 303 (2) (బి) సబ్ సెక్షన్ నం దివ్వబడి యున్నది.

నిబంధనలు.

1. (అ) 1వ మతలబుప్రకారము ఓటరుజాబితా వ్రాసి యుంచవలెను. మునిసిపాలిటీ వార్డులక్రింద విభజించియున్నచో వార్డున కొకభాగముచొప్పున వేరువేరు భాగములుగా జాబితా విభజింపవలెను. ప్రతివార్డునకున్ను ప్రత్యేకసంఖ్య నీయవలెను. ఓటర్ల సంఖ్య వరుసగా వేయవలెను. ప్రతివార్డులోను వీధులపేర్లున్ను, వీధులలో ఓటర్ల పేర్లున్ను, ఆయాపేరు మొదటియక్షరమును బట్టి అకారాదిగా వ్రాయవలెను. అది సాధ్యముగానిచో ఓటర్ల పేర్లయినను అకారాదిగా వ్రాయవలెను.

(ఆ) ఓటర్ల జాబితా ఆయా పట్టణపు వాడుక భాషలో వ్రాయవలెను. యావత్తు ఓటరు జాబితాకాని, అందులో కొంత భాగముకాని, మరి యేయితర భాషలోనైన వ్రాసియుంచవలెనని మునిసిపల్ కౌన్సిలు నిరూపించుట కధికారమున్నది.

2. (అ) ఓటరుగా చేర నర్హులెవరో మునిసిపల్ ఛైర్మన్ గారు తాము స్వయముగా (లేక తమచేతిక్రింది అధికారులద్వారా) తెలిసికొని వారి పేర్లన్నియు నొక జాబితాలో వ్రాసియుంచవలెను. ఈ జాబితా గవర్నమెంటువా రేర్పరచిన మతలబుప్రకారము వ్రాయవలెను. ఈ జాబితాలో ఓటర్లకు సంబంధించిన యితర తబిసీళ్లుకూడ వ్రాసి యుంచుమని మునిసిపల్ కౌన్సిల్ శాసింపవచ్చును.

(ఆ) పై జాబితా ననుసరించి, ఓటరు జాబితాను వ్రాసి మేనెల 15 వ తేదీకి పూర్వము మునిసిపల్ ఆఫీసునందు ప్రకటింపవలెను. ఈ జాబితా చిత్తు జాబితా

మాత్రమే అయియున్నది. ముద్రితమైన వెనుకటి ఓటరు జాబితా ఉన్నయెడల, ఆ జాబితాలున్ను, ఆ జాబితాకు సవరణలు జాబితాగా వ్రాసి వానిని వేరే ముద్రించి, సవరణ జాబితాయు, యివిరెండున్ను ప్రచురణ చేయవచ్చును.

(ఇ) ఛైర్మనుగారు ఓట్ల జాబితాలో చేర్పవలసినవారిని చేర్చలేదనికాని, చేర్పరానివారిని చేర్చిరనిగాని ఆక్షేపణలు చెప్పువారు ఏ తేదీని ఆక్షేపణలు దాఖలు చేయవలెనో, ఆ ఆక్షేపణలు దాఖలుచేయు విధానమేదియో, ఆ ఆక్షేపణలు విను ఆధికారి ఏరోజులలో, ఎన్నిగంటలకు విచారణ సాగించునో మొదలైన విషయములు తెలుపుచు నోటీసు వ్రాసి ప్రచురణ చేయవలెను.

ఈ ప్రచురణయున్ను ఓటరు జాబితా ప్రచురణయున్ను నొకేసారి జరుపవలెను. ఈ సరికి తయారైన ఓటరు జాబితా (1 వ జూన్ వరకు ప్రతిరోజున) మధ్యాహ్నము 11 గంటలుమొదలు సాయంత్రము 4 గంటలవరకు మునిసిపల్ ఆఫీసునందు చూడదలచిన వారు చూడవచ్చుననికూడ ఆ నోటీసునందు ప్రచారించవలెను. ఈనోటీసునకల్లు మునిసిపల్ ఆఫీసులోనున్ను, ప్రతివార్డులోనున్ను, మునిసిపాలిటీలో అధమపక్షము మూడు తావులందైనను, బాహాటముగా ప్రకటింపవలెను.

(ఈ) చిత్తుజాబితా ప్రచురణచేసినది మొదలు 15 రోజులైనను ఆ జాబితా చూడదలచినవారికి చూపు నేర్పాట్లు ఛైర్మన్‌గారు చేసియుండనిచో, ఆ పిమ్మట జరిగిన యావత్తు చర్యయు శాసనవిరుద్ధమనియు, నిష్ప్రయోజనమనియు భావించబడును.

## 3. (అ) ఆక్షేపణలు

ఆక్షేపణ రెండు విధములు. ఓటుహక్కున్నవారి పేర్లు చేర్పవలసినను చేర్పలేదని, చేర్పవలసిన వార్డులో చేర్చలేదని, తబిసీళ్లు తప్పుగా వ్రాసిరని, ఓటుహక్కున్న వా రెవరైన ఆక్షేపణలు దాఖలుచేయవచ్చును. ఇది మొదటిరకపు ఆక్షేపణ. జాబితాలో పేరు చేర్చియున్నవారు తమపేరు చేర్చియుండరాదని, లేదా మరియొకరి పేరు చేర్చియుండరాదని, ఆక్షేపణచేయవచ్చును. ఇది రెండవరకపుది. 1 వ రకపు ఆక్షేపణ 3 వ మతలబు ననుసరించియు, 2 వ రకపు ఆక్షేపణ 4 వ మతలబు ప్రకారమున్ను, వ్రాసి దాఖలుచేయవలెను. ఈ ఆక్షేపణలు ఛైర్మనుగారికి జూన్ 1 వ తేదీ లోపుననే చేరవలెను.

**4.** (ఆ) ఆతారీఖు దాటినపిదప చేరిన ఆక్షేపణలకు విలువలేదు. ఈ ఆక్షేపణలు వ్రాయవలసిన మతలబులు ఛైర్మన్‌గారు అడిగినవారికి ఉచితముగా నీయవలెను.

5. (ఎ) (1) తమకు చేరిన ఆక్షేపణలన్నియు ఛైర్మన్ గారు మునిసిపల్ ఆఫీసునందు ప్రకటింపవలెను. ఈప్రకటన 5 వ మతలబుప్రకారము వ్రాయవలెను.

(2) జాబితాలో చేర్చియుండరాదని ఎవరెవరిని గూర్చి ఆక్షేపణలు చేసిరో ఆయావ్యక్తులకు ఆక్షేపణనకలు వ్రాసిపంపవలెను. ఓటరు జాబితాలో ఛైర్మన్ గారు చేసిన మార్పు లున్నచో, ఆమార్పులకు సంబంధించిన వారికిన్ని నోటీసు చేయవలెను.

ఛైర్మనుగారు (1) (2) పేరాలలో వివరించిన కార్యములు జూన్ 5వ తేదీ లోపుగా ముగింపవలెను.

(బి) పై (1) వ పేరాలో వివరించిన జాబితాలోను (2)వ పేరాలో వివరించిన నకలులలోను, ఫలానాచోట, ఫలానాతేదీని యీ ఆక్షేపణలు పునర్విచారణసంఘము విని, జాబితా పరిచూతురని ఛైర్మనుగారు వ్రాయవలెను. ఆవిచారణచేయు తేదీ జూన్ 10వ తేదీ దాటియుండరాదు.

## పునర్విచారణ సంఘము.

6. (ఎ) పునర్విచారణ సంఘసభ్యులు ముగ్గురు. వారిలో అధ్యక్షుడు మునిసిపల్ ఛైర్మన్. తక్కిన యిర్వురను జిల్లాకలెక్టరు నియమించును. వారిరువురు గవర్నమెంటు ఉద్యోగస్థులుకాని మునిసిపల్ కౌన్సిలర్లుకాని అయియుండరాదు. ఈ ముగ్గురుకాక మరినలుగురు తనుమనుష్యులను జిల్లాకలెక్టరు నియమింపవలెను. అందులో నిర్వురు గవర్నమెంటు ఉద్యోగస్థులును, యిద్దరు పైవారున్ను ఉండవలెను. వీరిలో 1, 2, 3, 4 స్థానములు జిల్లాకలెక్టరు నిర్ధారణ చేయవలెను. ఉద్యోగస్థులు కానివారికి ముందుస్థానములున్ను ఉద్యోగస్థులకు కడపటి స్థానములున్ను యీయవలెను. మొదటి ముప్పురిలో నెవరికైన జబ్బుచేసినందువల్లకాని, యితర కారణములచేగాని వారీపునర్విచారణలో పాల్గొన వీలులేనప్పుడున్ను, వారు విచారణలో సాక్ష్య మీయవలసినప్పుడున్ను, లేక వారి కొక ఆక్షేపణ విషయమై ఎట్టి సాక్షికత్వమున్న సందర్భములోను, యీ కడపటి నల్వురున్ను వరుసవారీని మొదటి ముప్పురస్థానే వ్యవహరింతురు.

(బి) నిర్దిష్ట దినమున యీ పునర్విచారణ సంఘము సమకూడి ఓటరు జాబితా పరిచూతురు. విచారణచేయు ప్రదేశమున కెవ్వరైనను వచ్చిపోవచ్చును. ఆక్షేపణలన్నియు పూర్తిగా విచారించువరకు వారు రోజు వెంబడి రోజు పని సాగించుచునే యుందురు. లేదా విచారణ మధ్యస్థమందాపి, వేరు తేదీకి వాయిదా వేయుటకున్ను యీ సంఘమువారి కధికార మున్నది. (అట్లు వాయిదా వేసినచో) వాయిదాతేదీ

మునిసిపల్ ఆఫీసులో ప్రచురణ చేయవలెను. విచారణకాని ఆక్షేపణలకు సంబంధించిన పార్టీలందరకున్ను ప్రత్యేకముగా వాయిదా తేదీ తెలుపవలెను. ప్రతి ఆక్షేపణ గూర్చియు పైసంఘమువారు లిఖితరూపమైన తీర్పు వ్రాయవలెను. ఈ ఆక్షేపణలకు ఎదురువాదమున్న సందర్భములో, తీర్పును బలపర్చు కారణములున్ను వ్రాసియుంచవలెను. ఛైర్మను చేసిన మార్పులగూర్చియు పై సంఘమువారు తీర్పు వ్రాయవలెను. ఈ సంఘ సభ్యులలో నభిప్రాయభేదము కలిగినచో, అధిక సంఖ్యాకుల యభిప్రాయము ననుసరించి తీర్పు జరుగవలెను. వీరి తీర్పు లేకోర్టులోను, ఏ న్యాయ విచారణలోను ఖండింపబడరాదు.

7. (ఎ) పై సంఘమువారి తీర్పుల ననుసరించి ఛైర్మను ఓటరు జాబితాలో సవరణ చేయవలెను. ఇట్లు సంస్కరించిన జాబితా ముద్రింపించి నకళ్లు జూలై 1 వ తేదీలోపుగా సిద్ధము చేయవలెను.

(బి) డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు 44 వ సెక్షన్‌లో నుదాహరించిన పద్ధతిననుసరించి యీ జాబితా ప్రచురణ చేయవలెను. ప్రచురణచేసిన తేదీనుండి మరొక జాబితా ప్రచురించువరకు యీ జాబితాయే అమలులో నుండును. (44 వ సెక్షన్ చూ.)

(సి) రెండు జాబితా నకళ్లపై ఛైర్మను సంతకముచేసి, ఒకటి తన ఆఫీసులో నుంచి, రెండవది జిల్లాకలెక్టరు ఆఫీసునకు పంపవలెను.

(డి) వ్రాతపొరపాట్లు సవరింపవచ్చునుగాని, యీ జాబితా అమలులో నున్నంతకాలము మరెట్టి సవరణలు చేయుటకు ఛైర్మన్ కధికారములేదు.

(ఇ) వార్డు హద్దులు మార్చినప్పుడును, క్రొత్త వార్డ్లు ఏర్పరిచినప్పుడున్ను, ఆయావార్డుకు సంబంధించిన ఓటరు జాబితా నెవరు తయారుచేయవలెనో, ఎవరు సరి చూడవలెనో, ఏ తేదీలోపుగా ప్రచురణ కావలెనో, అను విషయములు మునిసిపల్ కౌన్సిలు నిర్ధారణ చేయవలెను. మునిసిపల్ కౌన్సిలు చేసిన ఏర్పాటులప్రకారము జాబితా ప్రచురింపబడును. ప్రచురణ తేదీనుండి అమలులోనికి వచ్చును.

(ఎఫ్) జాబితా సమగ్రముగా వ్రాయలేదనియు, పొరపాటుగా వ్రాసిరనియు, జాబితా వ్రాసిన అధికారు లెవ్వరిపైన దావాచేసి డిక్రీపొందుటకు వీలులేదు. పై నిబంధనలలో వివరించిన తారీఖులప్రకారము వారు నడుచుకున్నను వారి పై కోర్టుచర్య జరుపుటకు వీలులేదు.

8. చూడగోరువారికి చూపుటకున్ను, కొనగోరువారికి విక్రయించుటకున్ను, ఎలక్షన్ అధికారుల ఉపయోగార్థమున్ను, వలసినన్ని ఓటరు జాబితానకళ్లు ఛైర్మను ముద్రింపించవలెను.

9. ఈనిబంధనలప్రకారము ఛైర్మను పంపవలసిన నోటీసులు ఓటరులిచ్చిన విలాసములకుకాని, ఓటరుజాబితాలోనున్న విలాసములకు కాని ఆఓటరు కడపట నివసించిన యింటికిగాని, పోస్టుద్వారా పంపిన చాలును.

10. పునర్విచారణసంఘమువారే ఆక్షేపణను గూర్చియైన విచారించునప్పుడు ఆక్షేపణదారున్ను, ఎదురుపార్టీయున్ను వారివారి వాదములు తెలుపవచ్చును; లేదా వారివాదము ప్రతినిధి ముఖముగా చెప్పించవచ్చును. అట్టిప్రతినిధి నేర్పరుచుచు కాగితము వ్రాసి యీయవలెను.

11. పైసంఘమువారు సాక్షుల వాఙ్మూలములు ప్రమాణముపై పుచ్చుకొనవచ్చును. అట్లు ప్రమాణముపై సాక్ష్యము పుచ్చుకొమ్మని వారిని పార్టీలెవ్వరైనను కోరవచ్చును. లేదా వారంతట వారే ఏసాక్షినైనను ప్రమాణము చేయుమనవచ్చును.

12. క్రొత్తగా స్థాపించిన మునిసిపాలిటీలకు ప్రథమపర్యాయము జాబితాలు కూర్చునప్పుడున్ను, గవర్నమెంటుకు యుక్తమని తోచిన యితర సందర్భములలోను, పైనిబంధనలలో తేదీలకు భిన్నమగు తేదీలలో జాబితాలు మార్చవలసినదని గవర్నమెంటు శాసించవచ్చును. ఆజాబితాలు ప్రచురణ తేదీలనుండి అమలులోనికి వచ్చును.

## ఓటరుజాబితా తయారుచేయువిధానము

1-వ మాతలబు (1 (ఎ) విధి చూ.)

......................మునిసిపాలిటీయొక్క ఓటరు జాబితా.

భాగము. వార్డునంబరు.

| వరుస నంబరు | పేరు | తండ్రి లేక భర్తపేరు | విలాసము (వార్డు లేక వీధిపేరున్ను, ఇంటినెంబరున్ను) | హక్కు స్వభావము |
|---|---|---|---|---|
| | | | | |

జాబితాలో వ్రాసిన లెక్కలు నేను తనిఖీ చేసినాను. జాబితాలో పేరున్న ప్రతి ఓటరున్ను క్రీ.శ 193 – 193 సంవత్సరపు పన్ను లన్నియు పూర్తిగా చెల్లించినాడని నే నిందుమూలముగా తెలియజేయుచున్నాను.

(సంతకం)......................................

కార్యదర్శి, మేనేజరు, లేక రివిన్యూ ఆఫీసరు.

2-వ మతలబు (2 (సి) విధి చూ.)

......................మునిసిపాలిటీకి చెందిన చిత్తు ఓటరుజాబితా జూన్ 1-వ తేదీవరకు మునిసిపల్ ఆఫీసువద్ద ప్రతిరోజు 11 - 4 గంటల మధ్య చూడగోరువారి కందుబాటులో నుండును.

ఓటు హక్కున్న ప్రతిఓటరును తనపేరు జాబితాలో చేర్పలేదనిగాని, తప్పు చోట చేర్చిరనిగాని, తబిసీళ్లు తప్పుగా నిచ్చిరనిగాని తెల్పుచు, తనపేరు చేర్చు మని (లేక యిదివరలో చేర్చియున్నచో సవరణ చేయుమనియు) కోరుచు, చైర్మనుకు దరఖాస్తు దాఖలు చేసుకొనవచ్చును.

ఓటరుజాబితాలో పేరున్న ప్రతిఓటరున్ను తనపేరు చేర్చరాదని లేక జాబితాలో పేరున్న యింకొకని పేరు చేర్చరాదని చైర్మనుకు ఆక్షేపణలు దాఖలుచేయ వచ్చును.

2 వ పేరా ఆక్షేపణలు 3 వ మతలబు ప్రకారము వ్రాయవలెను. 3 వ పేరా ఆక్షేపణలన్నియు 4 వ మతలబు ప్రకారము వ్రాయవలెను. ఈ మతలబుల నకళ్లు చైర్మనుగా రడిగినవారి కుచితముగా నిత్తురు.

ఆక్షేపణలు స్వయముగాగాని, పోస్టుద్వారాగాని, నౌఖరుచేగాని పంపవచ్చును. అవన్నియు జూన్ 1వ తేదీ ఆఫీసుగంటలలో నందవలెను. నౌఖరుద్వారా గాని, స్వయముగా గాని యిచ్చు ఆక్షేపణ ఆఫీసుగంటలలో నీయవలెను.

మతలబుప్రకారము వ్రాయని ఆక్షేణలున్ను నిర్ణీతగడువులో చేరని ఆక్షేపణలున్ను నిరాకరింపబడును.

నిర్ణీతకాలములో చేరిన ఆక్షేపణలు, సక్రమముగా వ్రాసిన ఆక్షేపణలున్ను ...............చోట.........తేదీని విచారింపబడును.

.........................

చైర్మను సంతకం.

3 వ మతలబు (3 (ఎ) విధి చూ.)

## 1–వ తరగతి ఆక్షేపణలు

........................మునిసపాలిటీ ఛైర్మనుగారికి.

అయ్యా,

...............మునిసిపాలిటీ ఓటరు జాబితాలో నా పేరు యీ క్రింది విధముగా సవరణచేయుటకు (లేక చేర్చుటకు) నాకు హక్కున్నదని తెలుపుచున్నాను.

| ఆక్షేపణదారు పేరు తండ్రి లేక భర్త పేరు | చిరునామా. (వార్డు లేక వీధి పేరు యింటి నంబరు) | హక్కు స్వభావము | ఏ పన్ను ఎంత మొత్తము చెల్లించుచున్నది |
|---|---|---|---|
| | | | |

నేను బ్రిటిషుసబ్జక్టు ననియు (లేక ఇండియాలో.........................
......స్వతంత్రరాష్ట్రప్రజలకు చెందియున్నా ననియు, లేదా ఓటుహక్కు పొందిన విదేశీయుడ ననియు) నాకు............తేదీతో 21 వ ఏడు నిండిన దనియు, క్రిత సంవత్సరము చెల్లింపవలసిన పన్నులన్నియు చెల్లించితి ననియు, నిర్ణీతకాల మీ మునిసిపాలిటీలో నివసించితి ననియు తెలుపుచున్నాను.

........................

ఆక్షేపణదారు సంతకం.

4-వ మతలబు (3 (ఎ) విధి చూ.)

## 2 - వ తరగతి ఆక్షేపణలు

......................మునిసిపాలిటీ ఛైర్మనుగారికి.

అయ్యా,

..................మునిసిపాలిటీ ఓటరుజాబితాలో నాపేరు (లేక యీ క్రింద నుదాహరించినవాని పేరు) చేర్పరాదని నే నాక్షేపించుచున్నాను.

| ఎవరిపేరు చేర్చినందులకు ఆక్షేపణ | చిత్తుజాబితాలోని నంబరు | ఆక్షేపణయొక్క స్వభావము |
|---|---|---|
| | | |

......................

ఆక్షేపణదారు సంతకం.

............తేదీ. చిరునామా...........................

...........................

చిత్తుజాబితాలో నంబరు............

5-వ మతలబు (5 (ఎ) (1) వ విధి చూ.)

(అ) ......................మునిసిపాలిటీ ఓటరుజాబితాలో తమపేరు చేర్చుమని (లేక సవరణ చేయుమని) యీ క్రిందివారు 1-వ తరగతి ఆక్షేపణలు వ్రాసి పంపిరి.

| వార్డు | ఆక్షేపణదారు పేరు | చిరునామా | ఓటుహక్కు స్వభావము |
|---|---|---|---|
| | | | |

(ఆ)............మునిసిపాలిటీ ఓటరుజాబితాలో నీక్రింది పేర్లు చేర్చినందు లకు 2 వ తరగతి ఆక్షేపణలు దాఖలైనవి.

| వార్డు | ఆక్షేపించువాని పేరు జాబితాలో నంబరు | ఎవరిపేరు చేర్చినందుల కాక్షేపణయో వారిపేరు, జాబితాలో నంబరు |
|---|---|---|
| | | |

(ఇ)..............మునిసిపాలిటీ ఓటరుజాబితాలో చైర్మను యీ క్రింది సవరణలు తనంతట తానే చేసెను.

| వార్డు | జాబితాలో నంబరు | సవరణ స్వభావము |
|---|---|---|
| | | |

....................చోట............తేదీని పునర్విచారణసంఘము పై నుదాహరించిన ఆక్షేపణలును్న, సవరణలును్న విచారించును.

........................

చైర్మను సంతకం.

# మునిసిపాలిటీల ఛైర్మన్ వైస్‌ఛైర్మనుల ఎన్నుకొను విధానము.

నిబంధన:

గవర్నరుగారు వారి మంత్రులతో సంప్రతించి యీ నిబంధనల నేర్పర్చినారు. ఇంతకు పూర్వ మమలులోనున్న నిబంధన లన్నియు రద్దుపర్చినారు. నిబంధనల నేర్పర్చు నధికారము వారికి డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు 303 (2) సెక్షనులో నిచ్చినారు.

1. (1) ఛైర్మన్, వైస్ ఛైర్మన్ ఎన్నికలు మునిసిపల్ ఆఫీసులో జరుగవలెను. అందునిమిత్తమై ప్రత్యేకముగా సభ సమావేశపరుపవలెను.

(2) ఖాళీ వచ్చినవెంటనే ఆ సభ సమావేశపరుపవలెను. సమావేశ మేర్పర్చువారు: ఛైర్మన్ ఎన్నికకు డివిజనల్ ఆఫీసరు (అనగా సబ్‌కలెక్టరు లేక డిప్యూటీ కలెక్టరు); వైస్ ఛైర్మన్ ఎన్నికకు, ఛైర్మను; ఆ సభ ఏరోజున జరుగునో, ఎన్నిగంటలకు జరుగునో, మునిసిపాలిటీ మెంబర్లకు నోటీసు చేయించవలెను. సభకు వారము రోజులైన ముందుగా నోటీసు చేయించవలెను.

(3) ఆసభకు అధ్యక్షత వహించవలసినవాడు—

ఛైర్మను ఎన్నికకు

(i) సెక్షన్ 12 (7) లో నుదాహరించినసందర్భములో డివిజనల్ ఆఫీసరుగారు - (వైస్ ఛైర్మన్ పదవి ఖాళీగా నున్న సందర్భములో లేదా వైస్ ఛైర్మన్ రోగస్థితిలో నున్నచో, లేదా అతడు 15 రోజులకంటె గ్రామములో లేనిచో—యివి 12 (7) సెక్షనులో నుదాహరించిన సందర్భములు).

(ii) తక్కిన సందర్భములలో వైస్‌ఛైర్మన్ లేదా వైస్‌ఛైర్మన్ హాజరు లేనప్పుడు, ఛైర్మన్ పదవికి అభ్యర్థిగా నిలువగోరినప్పుడు, సభవారిచే ఆరోజు అధ్యక్షత వహింపవలసినదని కోరబడిన మరియొక సభ్యుడు (ఆ సభ్యుడు ఛైర్మన్ ఎన్నికలో నభ్యర్థిగా నిలువరాదు.)

## వైస్‌ఛైర్మను ఎన్నికకు—

ఛైర్మన్, లేదా అతడు హాజరులో లేనప్పుడు సభవారిచే నధ్యక్షత వహింప వలసినదని కోరబడిన మరియొక సభ్యుడు (అతడు వైస్‌ఛైర్మను ఎన్నికలో నభ్యర్థిగా నిలువరాదు.)

2. ఛైర్మన్ లేక వైస్‌ఛైర్మన్ ఎన్నికలో నభ్యర్థిగా నుండగోరువారిపే రొక సభ్యుడు ఉపపాదించవలెను. ఇంకొక సభ్యుడు బలపర్చవలెను. అభ్యర్థుల పేర్లన్నియు సభాధ్యక్షుడు చదువవలెను.

3. (1) అభ్యర్థి ఒక్కడే యున్నచో నతడే యెన్నుకోబడినట్లు నిరూపించవలెను.

(2) పలువు రభ్యర్థు లున్నచో కౌన్సిలర్ల ఓట్లు పుచ్చుకొనవలెను.

4. ఓటు చేయగోరిన ప్రతిమెంబరుకున్ను ఒక కాగిత మీయవలెను. ఆ కాగితముపై యీ క్రిందివిధముగా అచ్చునకాని, టైపునకాని, స్ఫుటమైన వ్రాతనుకాని, వ్రాసియుండవలెను. ఆ వ్రాత యింగ్లీషులోను వ్యవహార భాషలోను కూడ వ్రాసియుండవలెను.

| అభ్యర్థి పేరు | ఓటు |
|---|---|
| 1. | |
| 2. | |
| 3. | |
| 4. | |

ప్రతిమెంబరున్ను యీ ఓటుకాగితము పుచ్చుకొని చాటునకు వెళ్లి (చాటుగా ఓట్లు వేయుటకు అనువగు ప్రదేశ మేర్పరుపవలెను. తా నెవరికి ఓటీయదలచెనో, వారి పేరున కెదురుగా నొక గుర్తుంచవలెను. ఆ గుర్తు పైకి కనబడకుండ ఓటు కాగితము మడిచి, ఆ కాగితము గొనిపోయి అధ్యక్షుని యెదుటనున్న ఓట్ల పెట్టెలో వేయవలెను. ఆ ఓట్లపెట్టెలో కాగితములు వేయుటకు వీలుండవలెను, కాని పెట్టె తెరవనిదే ఓట్లు తీయుటకు వీలుండరాదు.

ఏ మెంబరైనను తనకు చదువు రాదనియు, ఓటు కాగితముపై గుర్తు పెట్టలే ననియు, తనతరపున గుర్తు పెట్టమనియు, అధ్యక్షుని కోరవచ్చును. ఆ సందర్భములో అధ్యక్షుడు వానికి ఓటు కాగితములో వ్రాసియున్న పేర్లన్నియు చదివి, ఏ అభ్యర్థి

పేరున కెనుట గుర్తుపెట్టమని మెంబరు కోరునో, ఆ పేరున కెదుట గుర్తుంచవలెను ఈ క్రమమంతయు యావన్మంది సభ్యుల సమక్షములో జరుగవలెను.

ఆ పైన మెంబర్ల సమక్షములో అధ్యక్షుడు పెట్టెతీసి, ఓటుకాగితములు బైటకు తీసి, ఏ అభ్యర్థి కెన్ని ఓట్లు వచ్చినవో లెక్కపెట్టి, ఎలక్షను ఫలితము నిర్ధారణ చేయవలెను. అతడు గమనింపవలసిన పద్ధతు లివి:—

(i) అభ్యర్థు లిరువురే యున్నచో హెచ్చు ఓట్లువచ్చిన అభ్యర్థి విజయుడైనట్లు నిరూపింపవలెను. ఇరువురకు వచ్చిన ఓట్ల సంఖ్య సమమైనచో, అధ్యక్షుడు మెంబర్లయెదుట లాట్లు వేసి, ఎవరిపేరు నుందు తీయబడునో వారు విజయులైనట్లు నిరూపింపవలెను.

[లాట్లువేయు క్రమము సాధారణముగా నియ్యది: ఒకేమాదిరి రెండుకాగితపు ముక్కలపై వేరువేరుగా అభ్యర్థులపేర్లు వ్రాయుదురు. లోపలిపేరు పైకి కనబడకుండ రెండున్ను ఒకేమడతగా మడిచి, అవి బాగుగా కలిపివేసి, అందులోనొకటి అధ్యక్షుడు. లేక ఎవరైన బాలుడు పైకి తీయును. ఆకాగితముపై ఎవరిపేరు వ్రాసియున్నదో వారు విజయులైనట్లు నిర్ణయింతురు.]

(ii) అభ్యర్థు లిరువురికంటె హెచ్చుమంది యున్నచో, మొదట తక్కువ ఓట్లు వచ్చినవారిపేరు తీసివేయుదురు. అట్లు తీసివేయుగా మిగిలినవారిలో నెవరికెక్కువమంది సభ్యు లనుకూలురైయున్నారో నిశ్చయించుటకు మరల ఓట్లు పుచ్చుకొందురు. ఈ రెండవమారు పుచ్చుకున్న ఓట్లలో తక్కువ ఓట్లు వచ్చినవారిపేరు తిరిగి తొలగించి, మిగతా అభ్యర్థులకు ఓట్లు పుచ్చుకొందురు. ఈవిధముగా చివరకు యిద్దరభ్యర్థులు మాత్రమే నిలిచియుందురు. ఆ యిరువురిలో హెచ్చుఓట్లు వచ్చిన యతడు జయమందినట్లు నిశ్చయింపవలెను. ఈ పేర్లు తప్పించుటలోగాని, లేదా కడపటి ఓటింగులో కాని, ఏయిరువు రభ్యర్థులకైన సమానఓట్లు వచ్చినచో, తప్పించువారిపేరు పై నుదాహరించిన వోట్లపద్ధతి ననుసరించి నిర్ణయింపవలెను.

5 అభ్యర్థులకు ఓటిచ్చునధికారములేదు. కాని యభ్యర్థిత్వమునకు రాజీనిచ్చినవారు ఆ పిమ్మట ఓటువేయవచ్చును. పేరు తప్పించిన అభ్యర్థి తప్పించినవెనుక ఓటువేయ వచ్చును.

6. ఓటుకాగితముపై మెంబరుసంతక మున్నయెడల, ఒకరిపేరు కెదురుగా కాక పలువురభ్యర్థులపేరుల కెదురుగా గుర్తు లుంచినయెడల, ఆ కాగితమున కెట్టివిలువయు లేదు.

7. సభ ముగిసిన వెంటనే సంఘాధ్యక్షుడు గెల్చొందిన అభ్యర్థిపేరు ప్రచురింప వలసిన దని గవర్నమెంటు ముద్రాశాఖాధికారి కోరుకపర్చవలెను. ఆ వర్తమానము జిల్లాకలెక్టరుద్వారా పంపవలెను.

8. (1) అధ్యక్షుడు ఓటుకాగితము లన్నియు నొక కవరులో పెట్టి, సీళ్లువేసి, ఆ కవరుపై ఓట్లసంఖ్య, ఎలక్షన్ స్వభావము వ్రాయవలెను.

(2) ఎలక్షన్ కోర్టు లేదా మరి ఏకోర్టయిన ఉత్తరు విచ్చిననే యీ కవర్లు విప్పవలెను. ఇతర సందర్భములలో విప్పరాదు.

(3) ఈ కవర్లు మునిసిపల్ ఆఫీసులో 1 సంవత్సరము భద్రపరిచి యీలోపుగా నవి యే కోర్టునకు తీసికొని వెళ్లనిచో, ఆ గడువు దాటినపిమ్మట కాల్చివేయవలెను.

# ఎలక్షన్ వివాదములు పరిష్కరించు విధానములు

## మునిసిపాలిటీలు.

నిబంధన

1. 1920 సం॥ పు మునిసిపాలిటీల ఆక్టు ప్రకారము జరిగిన ఎన్నికలలో (కౌన్సిలర్, లేక ఛైర్మన్, లేక వైస్‌ఛైర్మన్ ఎన్నికకు సంబంధించి) ఎట్టి ఆక్షేపణలున్నను వాని నొకపిటిషనులో వ్రాసి దాఖలుచేయవలెను. ఎన్నుకోబడిన అభ్యర్థిని 'గెలుపొందిన అభ్యర్థి' అను పేరుతో పిల్తుము. దాఖలుచేసే పిటిషన్ పేరు 'ఎలక్షన్ పిటిషన్'. పిటిషన్ దాఖలుచేయునతడు ఆక్షేపణదారు.

ఆ పిటిషన్ అభ్యర్థులెవరైన, లేదా వోటర్లెవరైన దాఖలుచేయవచ్చును. ఆపిటిషనులో గెల్పొందిన అభ్యర్థిని యెదురుపార్టీగా చేర్చవలెను. ఆపిటిషన్ మునిసిపాలిటీ ఆఫీసున్నచోట పనిచేయు సబ్‌జడ్జియెదుట, లేక జిల్లాజడ్జియెదుట దాఖలు చేయవలెను. ఆ యాపట్టణపు దావాలు విచారణచేయుట కేజడ్జికి అధికారమున్నదో, అతని ఎలక్షన్ పిటిషన్లు విచారించుటకున్ను అధికారమున్నది.

2. ఎలక్షన్ ఫలితము ప్రకటించిన 7 రోజులలోగా పిటిషను దాఖలు చేయవలెను. ఆక్షేపణకారణము పిటిషనులో సంక్షేపముగా తెలుపవలెను. అక్రమచర్య జరిగినకారణముచే ఎన్నిక రద్దుకావలెనని వాదించుచో, అందుల తవిసీళ్లున్ను వ్రాయవలెను. పిటిషన్‌లోని యంశములు వేరువేరు పేరాలక్రింద విడదీసి వ్రాయవలెను. విషయము వ్రాసినపిదప ఆక్రింద నాక్షేపణదారు సంతకముచేయవలెను. ఆసంతకముక్రింద 'పై వ్రాసిన విషయ మంతయు యథార్థమని ప్రమాణముపై తెలుపుచున్నాను' అని వ్రాసి ఆక్షేపణదారు రెండవమారు సంతకము చేయవలెను.

3. గెల్పొందిన అభ్యర్థి ఎన్నిక శాస్త్రవిరుద్ధముగా జరిగినదనియు, ఆక్షేపణదారే గెల్పొందినట్లు తీర్పీయమనియు నతడు కోరుచో ఎన్నికలో అభ్యర్థులుగా నిల్చినవారి నందరిని పిటిషనులో పార్టీలుగా చేర్చవలెను.

4. (1) పిటిషన్‌తోపాటు (ఎదురు పార్టీ ఖర్చులకు హామీగా) రు. 200/- చెల్లింపవలెను.

(2) పై మొత్తము చెల్లింపనిచో జడ్జి పిటిషన్ కొట్టివేయవలెను.

(3) సొమ్ము చెల్లించినచో జడ్జి విచారణ ప్రారంభింపవలెను.

5. వీలైనంతత్వరలో పిటిషన్ నకళ్లు ఎదురు పార్టీలకున్ను, మునిసిపాలిటీ ఛైర్మన్‌కున్ను, అందజేయవలసిన దని జడ్జి ఉత్తరువు వేయవలెను. మునిసిపాలిటీ ఆఫీసులోను, కోర్టు నోటీసుబోర్డులోను, పిటిషన్ నకళ్లు అంటించవలెను. ఎదురు పార్టీ ఖర్చులకై పై మొత్తముగాక అదనపు మొత్తమునకు ఆక్షేపణదారు (మరికొందరు జామీనుదారులతో సహా) జామీనుబాండు వ్రాసి యీయవలసినదని జడ్జి కోరవచ్చును. నోటీసు ప్రకటించిన 14 రోజులలోపుగా మరియొక అభ్యర్థి ఎవరైనను తన్ను పార్టీగా చేర్చుకొమ్మని జడ్జిగారివద్ద పిటిషన్ పెట్టవచ్చును. (కోర్టు నోటీసుబోర్డులోను, మునిసిపాలిటీ ఆఫీసులోను పిటిషన్ నకళ్లంటించిన వెంటనే నోటీసు ప్రకటన జరిగినట్లు భావింతురు.) అట్లు చేరగోరువానిని ఖర్చులకు హామీ యివ్వవలసినదని జడ్జి కోర వచ్చును.

6. దావాల విచారణలో నవలంబించు క్రమమును బట్టియే ఎలక్షను పిటిషన్లున్ను విచారణ చేయవలెను. కాని ప్రతిసాక్షి వాఙ్మూలములోని ముఖ్య విషయములున్ను టూకీగా జడ్జి వ్రాసికొనిన చాలును. ఆ వాఙ్మూలములపై సాక్షుల సంతకములు చేయించ నక్కరలేదు.

7. (1) జడ్జి ఉత్తరువు లేనిదే ఎలక్షన్ పిటిషన్ వదులుకొనుటకు వీలులేదు.

(2) ఆక్షేపణదార్లు పలువురున్నచో వారందరు అంగీకరించిననేకాని, ఏ ఆక్షేపణ దారున్ను పిటిషన్ వదులుకొనుటకు వీలులేదు.

(3) ఎలక్షన్ పిటిషన్ వదులుకొను నిమిత్తమై పిటిషన్ దాఖలైనచో, విడుదల పిటిషన్ విచారణకు వాయిదావేసి, ఆ వాయిదా తేదీ పార్టీ లందరకున్ను పై 5 వ రూలు పద్ధతుల ననుసరించి తెలుపవలెను.

(4) ఆక్షేపణదారు ఎదురుపార్టీవల్ల ఏ విధమైన లాభముపొంది, లేక ఆశించి, ఎలక్షన్‌పిటిషన్ వదులుకొనుచున్నట్లు జడ్జి అనుమానించినచో, అతడు విడుదలపిటిషన్ కొట్టివేయవలెను.

(5) విడుదలపిటిషన్ జడ్జిగా రంగీకరించినచో

(i) అప్పటివరకు ఎదురుపార్టీ పెట్టిన ఖర్చులు (లేక అందులో జడ్జికి న్యాయమని తోచినభాగము) ఆక్షేపణదారు వాని కివ్వవలసినదని జడ్జి ఉత్తరువుచేయవలెను.

(ii) ఆ విచారణ వర్తమానము మునిసిపల్ ఛైర్మన్‌కు జడ్జి పంపవలెను.

8. ఆక్షేపణదారు మృతిచెందినచో, ఎలక్షన్ పిటిషన్ అంతమొందును. అట్టి వర్త మానము మునిసిపల్ ఛైర్మనుకు జడ్జి పంపవలెను.

9. ఆక్షేపణదారుగాక మరియొక అభ్యర్థి తానే ఎలక్షన్‌లో గెలుపొందినట్లు తీర్పు యమని జడ్జిని కోరవచ్చును. అందుపై విజయుడైన అభ్యర్థి (లేక మరియొక అభ్యర్థి) అట్లు కోరువాడు ఎన్నికలో జయముపొందుట కనర్హుడని రూఢిపర్చవచ్చును. ఒక వేళ అతడే (అనగా కోరే అభ్యర్థి) ఎన్నికలో విజయుడైయున్నచో, జడ్జి యెదుట పిటిషన్ పెట్టి అతని యెన్నిక రద్దుచేయుటకు తగిన బలవత్కారణము లున్నవని రుజువు చేయవచ్చును.

10. మునిసిపల్ కౌన్సిల్ తరపున ఎలక్షన్ పిటిషన్ విచారణలో పాల్గొనుటకు ఏ ప్లీడరునైన కౌన్సిలు నియమింపవచ్చును.

11. ఈ క్రిందిసందర్భములలో జడ్జి గెలుపొందిన అభ్యర్థిని పదభ్రష్టుని చేయ వలెను. వీనిలో నేదియో నొక కారణమున్న చాలును:—

(1) గెలుపొందిన అభ్యర్థి లేక అతనిఏజంటు ఎలక్షన్ నేరములు చేయుట.

అభ్యర్థి, అతనిఏజంటు, స్వయముగా నేరముచేయకున్నను, వారిరువురిలో నెవ రైన పైవారిచే అట్టినేరము చేయించినచో, ఎలక్షన్ రద్దుపర్తురు. ఆనేరములు ఇండి యన్ పినల్‌కోడ్ 9 వ భాగములో (ఆనేరము వేరుభాగమందు తెలిపినాము) లేక మునిసిపాలిటీల ఆక్టు 56 వ సెక్షన్‌లో తెలుపబడినవి.

(2) గెలుపునకు కారణ మీాదిగువ నుదాహరించిన అక్రమచర్యలలో నేదైన యగుట.

లేదా అట్టి అక్రమచర్య జరుగకున్నచో యీా అభ్యర్థి, విజయుడగుటకు మారు మరియొక అభ్యర్థి విజయుడైయుండునని జడ్జికి నమ్మకము కలిగియుండుట.

అక్రమ చర్యలు.

(i) మునిసిపాలిటీల ఆక్టు 56 వ సెక్షను, ఇండియన్ పీనల్‌కోడ్ 9 వ భాగములో తెలిపిననేరములు (అభ్యర్థి, అతని ఏజంటు, వారి ప్రోత్సాహముచే చేసిన మరియొకరుగాక,) పై ఆసామీ చేసియుండుట, అట్టినేరము జరుగుటవల్ల అభ్యర్థికి లాభము కల్గియుండుట.

(ii) ఓట్ల ఆఫీసుకు ఓటరును తీసికొనివచ్చినందుకు, లేదా అక్కడనుంచి ఓటరు నింటికి దిగబెట్టినందుకు బండికిరాయి లేక మోటారుఛార్జీక్రింద ఏ ఆసామీకైనా పైకమిచ్చుట, పైకమిచ్చెదనని వాగ్దానము చేయుట.

(iii) ఓటర్ల ఉపయోగార్థమై, ఏ బండియైన, కారైన, మరి యేవాహనమైన అద్దెకుగాని (ఉచితముగా గాని) పుచ్చుకొనుట.

అభ్యర్థి స్వోపయోగమునకై బండిలేక కారు, లేక వాహనము అద్దెకుపుచ్చుకొన్నచో అందు తప్పేమియు లేదు.

(iv) ఒక యిల్లుకాని, గదికాని అద్దెకు పుచ్చుకొని అందులో ఓటర్లకు సమావేశము లేర్పర్చి, పరిసరముగా కల్లు, లేక సారాయి అమ్మకము సాగించుట.

[గెలుపొందిన అభ్యర్థి విజయుడగుటకు మారు మరియొక అభ్యర్థి...యీ అక్రమచర్య జరుగకున్నచో......విజయుడైయుండునని జడ్జి భావించుటకు యిరువురకు వచ్చిన ఓట్లసంఖ్యకు విశేష తారతమ్య ముండరాదు. ఒకనికి 100 ఓట్లు, రెండవవారికి 98 వచ్చిన వనుకొందము. మొదటివారికి వచ్చిన ఓట్లలో 4 ఓట్లు అక్రమచర్య జరిపి వేయించిన వనుకొందము. అక్రమచర్య జరుగనేజరుగకున్నచో మొదటివానికి 96 మాత్రము వచ్చియుండును, రెండవవా డుత్తీర్ణుడై యుండును. కాని మొదటివానికి 100- రెండవవానికి 60- వచ్చిన వనుకొందము. 4 తప్పు ఓట్లు తీసివేసినను మొదటివానికి 96 రెండవవానికి 60 ఉండును. రెండు సందర్భములలోను ఫలిత మొక్కటియే అయియుండును.]

[క్షుమార్హముగాని ఎలక్షన్ నేరముకాని, అక్రమచర్యకాని జరిగినప్పుడు, ఆ నేరమువలన అభ్యర్థి విజయమునకు కొంతయైన సహాయము కలిగియున్నది. కావున ఎన్నిక పూర్తిగా రద్దుచేయుటకు జడ్జీకి అధికార మున్నది. అట్టి నేరము కొద్ది ఓట్ల విషయములో జరిగినను, ఆ ఓట్లు తీసివేసినను అభ్యర్థి విజయుడగుటకు సావకాశమున్నను, ఎలక్షన్ రద్దుచేయవచ్చును. ఎట్టి నేరములు జడ్జి క్షమింపవచ్చునో, ఎట్టివి క్షమింపరాదో యీ క్రిందనుదాహరించినాము.]

(3) నామినేషన్లు దాఖలుచేయుటలో తప్పు జరుగుట, లేదా ఎలక్షన్ ఆఫీసరు నిరాకరింపవలసిన ఓట్లుపుచ్చుకొనుట, పుచ్చుకోవలసినవి నిరాకరించుట, ఆక్టు లేక విధులకు వ్యతిరేకముగా ఎలక్షన్ జరుపబడుట, పై ఏకారణములవల్ల నైనను మరియొక అభ్యర్థి న్యాయముగా గెలుపొందవలసి యుండగా నితడు విజయుడగుట.

[పై నుదహరించిన రీతిగా పై కారణములవల్ల గెల్పొందిన అభ్యర్థి విజయము సంప్రాప్తమై యుండవలెను. అట్టి అక్రమము జరుగకున్నచో యీ అభ్యర్థి విజయుడగుటకు మారుగా మరియొక అభ్యర్థి విజయుడై యుండునని రుజువుకావలెను.]

12. (1) విచారణ ముగిసిన పిమ్మట ఎలక్షన్ రద్దుకాబడినది లేనిది జడ్జి నిర్ధారణ చేయవలెను.

(2) ఎలక్షన్ రద్దుకాబడినచో

(i) పిటిషనుకు పార్టీగాచేరి తాను గెలుపొందినట్లు తీర్పీయమని కోరే యింకొక అభ్యర్థి ఎవరైన విజయుడైనట్లు తీర్పు చెప్పవలెను, లేదా

(ii) తిరిగి ఎలక్షన్ జరుగవలెనని శాసింపవచ్చును. (ఈ తీర్పు లెంతవరకు ఆక్షేపణీయములో వేరుభాగములో తెల్పినాము.)

(3) పై (1) (2) నిబంధనలప్రకారము జడ్జిచెప్పిన తీర్పునకు తిరుగులేదు.

13. జడ్జి తిరిగి ఎలక్షన్ జరుగవలసినదని తీర్పుచెప్పిన సందర్భములో, ఆ తీర్పు తేదీ నుండి మెంబరుసీటు ఖాళీఅయినట్లు భావించి, ఆసీటుకు మెంబరు ఎలక్షన్ జరుపుటకు ఏర్పాట్లు వెంటనే జరుపవలెను.

# 9-ఎ ఇండియన్ పీనల్ కోడ్.

## ఎలక్షన్లకు సంబంధించిన నేరములు.

నిబంధన

171-ఎ ఈ క్రింది మాటల కర్థములు తెలుపుచున్నాము.

(1) అభ్యర్థి

ఏ ఎన్నికలోనైన అభ్యర్థిగా నామినేషన్ కాబడినవాడున్ను, తానభ్యర్థిగా నిల్చెదనని ఎలక్షన్ కు ముందుగా తెల్పుచు దర్మిలా ఎన్నికలో నామినేషన్ అయిన వాడు.

(2) ఓటుహక్కు

ఏ ఎన్నికలోనైన అభ్యర్థియై నిల్చుటకు లేక నిల్చినపిదప రాజీయిచ్చుటకు, లేక ఓటువేయుటకు, లేక ఓటువేయ కుండుటకున్ను, ఒకవ్యక్తికి కలుగు హక్కు.

171-బి. లంచమిచ్చుట, పుచ్చుకొనుట.

(1) ఫలాని అభ్యర్థికి ఓటిచ్చుటకుగాను, లేక ఓటిచ్చియున్నందుకు, లేక యిప్పించినందుకు, ఓటరుకుగాని (అన్యులకు గాని) లంచమిచ్చినవారు శిక్షార్హులగుదురు.

(2) ఫలాని అభ్యర్థికి ఓటిచ్చుటకుగాను, లేక ఓటిచ్చియున్నందుకు, లంచము పుచ్చుకొన్నవారు (ఓటరైనను, ఓటు యిప్పించిన పైవాడైనను) శిక్షార్హు లగుదురు.

అభ్యర్థి మెంబరుగా నెన్నుకొనబడినచో అతడీపద్ధతు లవలంబించునని, లేక ప్రజాక్షేమమునకై ఫలాని కార్యములు కొనసాగించునని, అభ్యర్థి (లేక అభ్యర్థి తరపు ఏజంట్లు) ప్రకటించినందున వారు శిక్షార్హులు కారు.

(3) లంచ మివ్వబోయినవారున్ను, యిచ్చెదమని వాగ్దాన మిచ్చినవారున్ను, లంచము పుచ్చుకొనుటకు ప్రయత్నించినవారున్ను, శిక్షార్హులే.

(4) లంచము తెప్పించుటకు ప్రయత్నించిన వారున్ను, లంచము పుచ్చుకొనుట కంగీకరించిన వారున్ను, లంచము పుచ్చుకొని తామివరలో నడువదలచిన దానికి మార్పుగా నడుచువారున్ను, శిక్షార్హులే.

**171**—ఇ పైనేరములు చేసినవారికి 1 సంవత్సరమువరకు ఖైదుశిక్ష వేయవచ్చును. జుల్మానా వేయవచ్చును; రెండుశిక్షలున్ను వేయవచ్చును.

అందులో స్వల్పపాటి నేరముచేసినవారికి జుల్మానామాత్రము వేసి విడువవలెను.

స్వల్పపాటి నేరమనగా, లంచమిచ్చుటకు మారు కాఫీ, టీ, కల్లు, సారా మొదలగు పదార్థము లిచ్చుట; లేదా భోజనము లేక ఫలహారము పెట్టించుట; లేదా నాటకమునకు, లేక సినిమాకు తీసుకొనివెళ్లుట; లేదా పప్పు బియ్యము మొదలగు భోజన పదార్థములిచ్చుట. ఇవి యిచ్చినవారున్ను పుచ్చుకొన్నవారున్ను దోషులే.

(పై సెక్షనులో లంచమిచ్చినవారున్ను, పుచ్చుకొన్నవారున్ను శిక్షార్హులేయని శాసించినారు. ఓటరు స్వతంత్రముగా తనకిష్టుడైన అభ్యర్థికి ఓటిచ్చుట కధికారమున్నది. అందుకు భిన్నముగా ఓటు కింత ధరయని యేర్పర్చి, అభ్యర్థులు ఓట్లుకొనుట ప్రారంభించినచో ఎన్నికలకు గౌరవమేమియు నుండదు. యోగ్యుడుకాకున్నను అభ్యర్థి ధనికుడై యున్నచో అతను గెల్పొందుట నిశ్చయమగును; అంతధనము వెచ్చింపలేని మరియొక అభ్యర్థి, ధనికునికంటె నన్నివిధములలో స్తుతిపాత్రుడైనను, అతినికి జయము లభింపనేరదు. ప్రజాబాహుళ్యమునకు విశ్వాసమే అభ్యర్థులలోనుండునో వారే విజయులగుట ఎన్నికల ధర్మము; కావున లంచమిచ్చుటయు పుచ్చుకొనుటయు నేరమని శాసించినారు. ఈ లంచము ఓటువేసినందు కిచ్చిననీయవచ్చును. లేదా అభ్యర్థిత్వము వదలినందుల కిచ్చిన నీయవచ్చును. లంచమిచ్చుట, పుచ్చుకొనుట పూర్తిగాకున్నను, ఇచ్చుటకు యత్నించుట, పుచ్చుకొనుటకు యత్నించుట కూడ శిక్షార్హములని శాసించినారు. ఫలహారములు మొదలగునవిచ్చి ఓటర్లను త్రిప్పి వేయుట కూడ నేరమే అయినను, అది స్వల్పపాటి నేరమని భావించి, ఆ నేరమునకు జుల్మానా శిక్షమాత్రమే విధింపవలెనని శాసించినారు.

ఈ శిక్ష చేసినవారిని పోలీసువారు వారంటులేనిదే అరెస్టు చేయరాదు. కేసు దాఖలైన పిదప ముద్దాయికి పంపవలసినది సమనుగాని వారంటుకాదు. ముద్దాయిని జామీనుపై విడుదల చేయవచ్చును. ఫిర్యాదీ ముద్దాయి లిరువురు ఏకమై కేసు వదలుకొనుటకు వీలులేదు. ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుమాత్రమే యీ కేసు విచారణ చేయవలెను. కేసు ప్రారంభమునకు ముందుగా ఆయా గవర్నమెంటు ఆఫీసర్ల అనుమతిపొందిననే గాని కేసు విచారణపట్టరు. మద్రాసులో నేరము జరిగినచో, పోలీసు కమీషనరుగారి అనుమతి పొందవలెను. ఇతరచోట్ల నేరము జరిగినచో, జిల్లాకలెక్టరు అనుమతి పొందవలెను. ఈ కేసులో ఛార్జి వ్రాసి ముద్దాయికి చదివి వినిపించవలెను.

171-సి. (1) ప్రతి ఓటరుకున్ను అతని కిచ్చవచ్చిన అభ్యర్థికి ఓటిచ్చుట కధికార మున్నది. అందుకు భిన్నముగా ఓటరును మభ్యపెట్టి అతని మనస్సు మార్చరాదు. అట్లు మార్చినవారున్ను మార్చ యత్నించినవారును శిక్షార్హులే.

(2) మోసముచేసి ఓటరుమనస్సు మార్చువిధానము లనేకము లుండును. మచ్చు నకు కొన్ని తెల్పుచున్నాము:—

(i) ఓటరుకు దేహబాధ, లేక ద్రవ్యనష్టము కల్గించెదమని, లేక అభ్యర్థికి దేహబాధ, లేక ద్రవ్యనష్టము కలిగించెదమని, లేక ఓటరు బంధుమిత్రులకు (లేక అభ్యర్థి బంధుమిత్రులకు) దేహబాధ, లేక ద్రవ్యనష్టము కలిగించెదమని బెదిరించు వారు దోషులు.

(ii) ఓటరుకాని, అభ్యర్థికాని ఫలానివిధముగా నడువకున్నచో వారు, లేక వారి బంధుమిత్రులు యీశ్వరానుగ్రహమునకు పాత్రులగుదు రని విశ్వసింపజేయువారు దోషులు.

అభ్యర్థి మెంబరుగా నెన్నుకొనబడినచో అత డీపద్ధతుల నవలంబించునని, లేక ప్రజాక్షేమమునకై ఫలాని కార్యములు కొనసాగించునని కాని, అభ్యర్థి (లేక అతని తరఫు ఏజంట్లు) ప్రకటించినందున వారు శిక్షార్హులు కారు.

171—యఫ్. పైనేరము చేసినవారికి 1 సంవత్సరము ఖైదుశిక్ష వేయవచ్చును; జుల్మానా వేయవచ్చును, లేదా రెండుశిక్షలున్ను వేయవచ్చును.

(ఓటరును మోసపుచ్చి వాని యిష్టమువచ్చినట్లు సంచరింపనీయక వేరువిధముగా త్రిప్పుకొనుట యీ నేరపు స్వభావము. లంచమిచ్చువాడు ద్రవ్యాకర్షణచే ఓటరు కను గప్పి తన కార్యసాధన చేసికొనజూచును. గ్రహబాధలేక పైశాచికబాధకు ఓటరును లేక ఓటరు బంధుమిత్రులను లోబర్చెదమని భీతిల్లజేసినచో, ఓటరు స్వబుద్ధిమార్చుకొని, యీమోసకాడు చెప్పినట్లెల్ల నడుచుకొనుట కుద్యుక్తుడగును, అట్లని ఓటర్ల తెలివితేట లుపయోగించి వారిక్షేమ మెవ రెక్కువ కోరుదురో వారికి ఓటిమ్మని కోరుట నేరము కానేరదు.

(ఈ కేసు విచారణకున్ను లంచపుకేసు విచారణకున్ను భేదమేమియు లేదు.)

కృత్రిమనామముతో వ్యవహరించు వారికిన్ని 1 సంవత్సరము ఖైదుశిక్ష వేయ వచ్చును, లేక జుల్మానా వేయవచ్చును, లేక రెండు శిక్షలున్ను వేయవచ్చును, (ఈనేర మునకు పెట్టిన కేసు విచారణయు, లంచపుకేసు విచారణయు నొకేమాదిరివి.)

(ఆనేరము స్వభావము దిగువ తెలిపినాము.)

## 171—డి కృత్రిమనామముతో వ్యవహరించుట

ఇంకొకరి పేరుపెట్టుకొని ఎన్నికలో ఓటుకాగిత మడుగువాడున్ను,

ఇంకొకరిపేరున ఓటువేయువాడున్ను, తనపేరు చెప్పుటకుమారొక కల్పన పేరు చెప్పి ఓటుకాగిత మడుగువాడున్ను, ఓటువేయువాడున్ను తనపేరున ఓటువేసి, తిరిగి రెండవ పర్యాయము ఆ ఆఫీసులోనే తనపేరున ఓటువేయ యత్నించువారున్ను, ఇతరులను పైరీతిగా సంచరింపుమని ప్రోత్సహించినవారున్ను పై నేరమునకు శిక్షార్హులగుదురు.

[ఇది మోసములలో నొకటి. ఓట్లఆఫీసులో తన్నానవాలు పట్టువా రెవరున్ను ఉండరను నమ్మకతో తాను మఱియొక వ్యక్తినని చెప్పి, తనకు ఓటులేకున్నను ఆవ్యక్తి కున్న ఓటు తానే వేయవచ్చుట, ఆఓటున్న వ్యక్తి రోగస్థితిలో నుండవచ్చును. లేదా మరణించియుండవచ్చును. పైవిధముగా ననేకవోట్లు వేయించినచో న్యక్రమముగా గెలు పొందని అభ్యర్థికి జయము కలుగవచ్చును. ఓటరు ఓటువేసినవెనుక రెండవసారి ఓటు కాగితము పుచ్చుకొని ఓటువేసినచో, ఓటరే అభ్యర్థిపక్షము వహించియున్నాడో, ఆ అభ్యర్థికి యథార్థముగా పడినఓట్లకు రెట్టింపుఓట్లువచ్చును. ఎదురు అభ్యర్థికి కూడి రాని నష్టముకలుగును. అందుచే నిట్టి అక్రమచర్యను శిక్షార్హముగా చేసినారు.

పై చర్యలు చేసినవారేగాక, వెనుక నుండి వారిచే నీచర్యలు చేయించినవారు కూడ శిక్షార్హులని శాసించినారు! అభ్యర్థులు లేక వారి ఏజంట్లు, ఓటర్లచేగాని పైవారిచే గాని పై నుదహరించిన అక్రమచర్యలు జరిపించినచో, ఆ చర్యలు జరిపిన వారితోపాటు తామున్ను దోషులుగా పరిగణింప బడుదురు.]

171-జి. ఎన్నికఫలితము తారుమారు చేయుటకై ఏ అభ్యర్థి ప్రవర్తగూర్చియైన అబద్ధపు వాదు వేసినవారున్ను, ఆ వాదు వెల్లడిచేసినవారున్ను, జుర్మానా శిక్షకు పాత్రులగుదురు. ఆ వాదు కల్లయని, లేక యథార్థము కాదనియు నెరిగియుండి, అట్టి వాదు వారు పుట్టించునట్లు, లేక వెల్లడిచేసినట్లు రుజువుచేయవలెను.

[ఎన్నికలకు ముందు ఎదుటి అభ్యర్థినిగూర్చి కల్లవాదు సృష్టించి, ఓటర్ల కాతనిలో నమ్మకము చెడునట్లు చేయుటకు ప్రయత్నించువారీ నేరమునకు పాత్రులయ్యెదరు. అట్టివాదు వెల్లడిచేసినవారున్ను శిక్షార్హులే.

[ఈ నేరము విచారణచేయు క్రమము లంచపునేరము విచారించునదే.]

171- హెచ్. అభ్యర్థివల్ల వ్రాతమూలమైన అనుజ్ఞలేనిదే ఆతని జయముకాంక్షించి,

ఏదైనను సభ సమావేశపర్చుటకు సొమ్ము ఖర్చు పెట్టువాడును,

ఏదైన ప్రకటనకు, పత్రికా ప్రచురణకు సొమ్ము వెచ్చించువాడున్ను, లేదా యితరులచే ఖర్చు పెట్టించు వాడున్ను,

రు 500/- వరకు జుర్మానాకు పాత్రుడగును.

ఎవరైన రు 10/-లు ఖర్చు పెట్టి అట్లు ఖర్చు పెట్టిన 10 రోజులు లోగా అభ్యర్థి వల్ల లిఖితరూపకమగు అనుమతి పొందినయెడల, ఆ సొమ్మతడు అనుజ్ఞపొంది వెచ్చించినట్లే భావింపవలెను.

[ఈ నేరము విచారణచేయు క్రమము లంచపు నేరము విచారించునదే.]

171. ఐ. ఏ నిబంధన ప్రకారమైన లేదా ఏ చట్టము ననుసరించియైన ఎలక్షన్ ఖర్చులకు లెక్కలు వ్రాసియుంచుటకు బాధ్యులై లెక్కలు వ్రాసియుంచనివాడు రు. 100/- వరకు జుర్మానాకు పాత్రులయ్యెదరు.

[ఈ నేరమును విచారణచేయు క్రమమున్ను లంచపునేరములు విచారించు క్రమము నొక్కటియే.]

# సెక్షన్ 56. జిల్లా మునిసిపాలిటీల ఆక్టు

## ఎలక్షన్లో రహస్యభంగ మొనర్చుట.

పోలింగుస్టేషన్లో హాజరైయున్న ఏ గుమస్తాకాని, ఏ ఆఫీసరుకాని, లేదా మరి యే యితర వ్యక్తిగాని, ఏ ఓటరు ఏ అభ్యర్థికి ఓటిచ్చినది పైవారికెవరి కట్టిభోగట్టా యిచ్చినను, అతడీ సెక్షన్ ప్రకారము నేరస్థుడగును. అదిన్నీగాక లంచమిచ్చి మరి ఏవిధముగానైన అట్టి భోగట్టా సంపాదించినవాడున్ను నేరస్థుడే. వీరుభయులున్ను 6 మాసముల వరకు ఖైదుశిక్షకు, లేదా జుర్మానాకు, లేదా ఉభయశిక్షలకు పాత్రులయ్యెదరు.

చట్టము ననుసరించి ఆ భోగట్టా తెలుపవలసిన పరిస్థితులలో తెలిపినవాడు శిక్షార్హుడుకాడు.

(ఎలక్షన్లకు సంబంధించిన విధులన్నియు రహస్యముగా జరగవలెను. అభ్యర్థులకుగాని, ఏజంట్లకుగాని ఓటర్లకుగాని, ఓట్ల ఆఫీసులలోను, ఎన్నికలకు సంబంధించిన యితర ఆఫీసులలోను ఎప్పుడేమి జరుగుచున్నదో వెల్లడికారాదు. అట్లు వెల్లడిచేసిన వారు శిక్షార్హులు. పై వర్తమాన మిచ్చినవారున్ను, గ్రహించినవారున్ను ఉభయులు శిక్షార్హులే.)

## రహస్య భంగము

## మద్రాసు లోకల్‌బోర్డుల ఆక్టు

సెక్షన్ 58

పోలింగుస్టేషన్లో హాజరైయున్న ఏ గుమాస్తాకాని, ఏ ఆఫీసరుకాని, లేదా మరి యే యితరవ్యక్తిగాని, ఏ ఓటరు ఏ అభ్యర్థికి ఓటిచ్చినది పైవారెవరికట్టి భోగట్టా యిచ్చినను, అతడీ సెక్షన్ ప్రకారము నేరస్థుడగును. అదిన్నీగాక లంచమిచ్చి (మరి ఏవిధముగానైన) అట్టి భోగట్టా సంపాదించినవాడున్ను నేరస్థుడే. వీరుభయులున్ను 6 మాసములవరకు ఖైదు శిక్షకులేదా జుర్మానాకు, లేదా ఉభయశిక్షలకు పాత్రులయ్యెదరు.

చట్టము ననుసరించి ఆ భోగట్టా తెలుపవలసిన పరిస్థితులలో తెలిపినవాడు శిక్షార్హుడు కాడు.

369

# లోకల్ బోర్డుల మునిసిపాలిటీల అధ్యక్ష ఉపాధ్యక్షులలో విశ్వాసరాహిత్య తీర్మానముల స్వభావము

---

మునిసిపాలిటీ అధిపతి ఛైర్మన్. సభాసమావేశముల కధ్యక్షత వహించువాడున్ను, తీర్మానముల నమలులో పెట్టువాడున్ను, పురపరిపాలనా సంస్థకు యజమానియు నతడే. వైస్‌ఛైర్మన్ అతని తర్వాతవాడు. జిల్లాబోర్డులలో ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంట్లకున్ను ఇట్టి ఆధిపత్యమే యున్నది. ఆయా సంస్థలలో సభ్యు నొకనిని, మిగతా సభ్యులీపదవుల కెన్నుకొందురు. వీరిని ఎన్నుకొను నిమిత్తమై ప్రత్యేక సభాసమావేశ మేర్పరుతురు. ఆ సభలో హెచ్చు ఓట్లు వచ్చినవారు, ఆయా పదవులాక్రమింతురు. ఏ పార్టీకి సభలో హెచ్చుబల మున్నదో, ఆ పార్టీతరపు అభ్యర్థియే అధ్యక్షుడుగా, లేక ఉపాధ్యక్షుడుగా నెన్నుకొనబడును.

ఈ పదవి వహించినవారు తమపై పెట్టిన గౌరవము ప్రజానుగుణ్యముగా నిర్వహింపక, నిరంకుశులు కావచ్చును. పరిపాలన శాస్త్రవిహితముగా నడుపకపోవచ్చును. సంస్థసభ్యు లంగీకరించిన తీర్మానము లమలులో పెట్టకపోవచ్చును. తమ్మెన్నుకొనిన పార్టీసభ్యులనే ధిక్కరింపవచ్చును. ప్రజాభిప్రాయములకు విరుద్ధముగా నడుచువారు సంస్థ ముగియువరకు నాధిపత్యము వహించుట అసందర్భ మగును. సంస్థ జరుపవలసిన విధులు నిర్వహించువా రెవరున్ను ఉండరు. సభ్యులకు, అధ్యక్షునికి కలతలు వృద్ధి యగును. ప్రతి సమావేశమున్ను అంతఃకలహములతోనే ముగిసిపోవును.

అట్టి యిక్కట్లు రాకుండ అధ్యక్షునిలో (లేక ఉపాధ్యక్షు లో) విశ్వాసరాహిత్యతీర్మానము ప్రవేశ పెట్టవచ్చునని విధి యేర్పరచినారు. అట్టితీర్మానము జయప్రదముగా కొనసాగినచో అధ్యక్షుడు (లేక ఉపాధ్యక్షుడు) పదభ్రష్టు డగును. అధ్యక్షునికి అధికార మిచ్చినవారు సభ్యులేకదా; అధికారము తీసివేయువారున్ను సభ్యులే. సభలో అధికసంఖ్యాకులకు ఆయా అధ్యక్షునిలో (లేక ఉపాధ్యక్షునిలో) నమ్మకము చెడినప్పు డీ తీర్మానము ప్రవేశపెట్టుదురు.

1884 వ సంవత్సరము మునిసిపాలిటీల ఆక్టు 19 వ సెక్షన్ ప్రకారము మునిసిపల్ కౌన్సిలర్లనుకూడ పదవిహీనుల చేయునధికారము గవర్నమెంటున కుండెను. ఏకౌన్సిలరు ప్రవర్తనయైన బాగుండనిచో, గవర్నమెంటువా రాతని తీసివేయుట కధికార

ముండెను. ఒకసభ్యుడు ఆక్టువిధులకు వ్యతిరేకముగా నడుచుకొనుచున్నాడని భావింపుడు. అతని కింక సభ్యత్వపదవి నలంకరించుట కేమి అర్హతయున్నది? పనిలోనుండి అతనిని తొలగించుటకుపూర్వము గవర్నమెంటువా రాతనికి నోటీసుచేయించి, అతడపరాధములకు క్షమార్పణ చెప్పుకొన్నచో మెంబరుపదవినుండి తొలగింప నక్కరలేదని శాసన ముండెను. కాని ఆ ఆక్టు ఇప్పుడమలులో లేదు. సభ్యునెన్నుకొనిన ఓటర్లకుగాని గవర్నమెంటుకుగాని ఒకమా రెన్నుకొనిన సభ్యుని మెంబరుపదవినుండి తొలగించుట కధికారములేదు.

1930 వ సంవత్సరపు 10 వ ఆక్టు ననుసరించి సెక్షన్ 40-ఎ డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టులో చేర్చబడినది. 1930 వ సంవత్సరముదర్మిలాను విశ్వాసరాహిత్య తీర్మానములు యీ విధినిబట్టియే ప్రవేశపెట్టుచుండిరి. ఆవిధిలో 1933 వ సంవత్సరపు 4 వ ఆక్టు అనేకమార్పులు చేసినది. ఆ ఆక్టు 26-3-1933 వ తేదీని అమలులోనికి వచ్చినది.

1930 వ ఆక్టు నిబంధనలకున్ను 1933 వ సంవత్సరపు ఆక్టు నిబంధనలకున్ను విశేషతారతమ్య మున్నది. వెనుకటి ఆక్టులో తీర్మానము జయప్రదముగా కొనసాగవలెనన్నచో సభ్యులలో 2/3 వ వంతుమంది ఆ తీర్మానమును బలపర్చవలెను. సభ్యులలో 2/3 వ వంతు అనగా కౌన్సిల్ మొత్తపు మెంబర్లసంఖ్యలో 2/3 వ వంతు. కౌన్సిల్ మొత్తపుసంఖ్య 20 అని భావింపుడు. 20 లో 2/3 వ వంతు 13 1/3 అగును. 13 పైగా కొంత అంశమైన మిగిలియున్నది గావున 14 గురు సభ్యులు బలపర్చవలెనన్నమాట. అంశములు వచ్చినప్పుడెల్ల ఆపై పూరాసంఖ్యయే నిర్ధారణయని భావింపవలెను. క్రొత్త ఆక్టుప్రకారము మొత్తపు సభ్యులలో 3/5 వ వంతుమంది తీర్మానమును బలపర్చిన చాలును. 3/5 వ వంతు అంశము 2/3 వ వంతు అంశముకంటె కొద్దిగా తక్కువ. మొత్తపు మెంబర్లు 20 మంది అయినచో 3/5 వ వంతు 12 గురు. 2/3 వ వంతు 14.

వెనుకటి ఆక్టులో ఏరోజు సభాసమావేశమున లోనైనను కార్యక్రమమునకు ముందుగా విశ్వాసరాహిత్య తీర్మానమునకు అనుమతి కోరవలసియుండెను. సభమొత్తపు మెంబర్లలో 1/3 వ వంతు-ఆరోజున హాజరైనవారిలో 1/3 వ వంతుకాదు...తీర్మానమునకు బలమిచ్చినచో, ప్రవేశమునకు అనుమతి యిచ్చినట్లు నిశ్చయించి, తీర్మానచర్చకు వేరుసమావేశ మేర్పరుపవలసియుండెను. క్రొత్త ఆక్టుప్రకారము అనుమతి సభలో నడుగనక్కరలేదు. తీర్మానము ప్రవేశపెట్టుచున్నామని ముందుగా డివిజనల్ ఆఫీసరుకు నోటీసు యీయవలెను. అందుపై సభమొత్తపు మెంబర్లలో సగముమందియైన సంతకము చేయవలెను. ఆ వెనుక తీర్మానచర్చకు డివిజనల్ ఆఫీసరే సభాసమావేశ మేర్పర్చును.

వెనుకటి ఆక్టులో తీర్మానము జయప్రదముగా కొనసాగవలె నన్నచో రెండు పద్ధతు లవలంబించుటకు వీలుండెను. ఒకటి, తీర్మానచర్చ కేర్పరచిన రోజుననే సభ మొత్తపు మెంబర్లలో 2/3 వ వంతు సభ్యులు తీర్మానము నామోదించుట. ఆ రోజున సభలో హాజరైన అధికసంఖ్యాకులు తీర్మాన మామోదించి రనుకొనుడు. 20 మంది హాజరైయుండగా, 11 గురు మాత్రమే తీర్మాన మామోదించి రనుకొనుడు. 14 గురు ఆమోదించిననే కాని 2/3 వ వంతు లెక్కకుచాలదు. కాని యిట్లే ఒకమాసమురోజులు గడచినపిదప మరియొక తీర్మానము ప్రవేశపెట్టి శాస్త్రవిహితముగా ననుమతిబడసి, ఆ తీర్మానపుచర్చ జరిగినరోజున మరల హాజరైనసభ్యులలో నధికసంఖ్యాకులు తీర్మాన మున కామోద మిచ్చినచో, యీరెండుసభల ఏకాభిప్రాయమునుబట్టి అధ్యక్షుడు పద విహీను డగుచుండెను. రెండవసభలో హాజరైన 20 మందిలో 11 గురు ఆమోదమిచ్చిన చాలును. ఒక్కమారు 2/3 వ వంతు ఆమోదమీయమన్నను, రెండుసభలలో నధిక సంఖ్యాకుల ఏకాభిప్రాయమునుబట్టి ఛైర్మన్‌నుపదవి ఖాళీచేయు మనుట కవకాశ ముండెను. కాని యీ పద్ధతి క్రొత్త ఆక్టులో రద్దుపరచి, సభాసమావేశపురోజున 3/5 వ వంతు మెంబర్లు ఆమోదమిచ్చిన తీర్మానమునెగ్గును, లేనిచో 6 మాసములవరకు అధ్యక్షునిపై మరియొక తీర్మానము ప్రవేశపెట్టరాదు అను శాసన మేర్పరచినారు. తీర్మానప్రవేశ మొక్కసారి జరిగిననే కావలసినంత కలవర ముండును; రెండుసార్లు జరుగుచువచ్చినచో, అధ్యక్షునికి, సభ్యులకు, ప్రజలకు కలుగునలజడి యింతింత యని చెప్పవశమా ?

ఒకసారి తీర్మానము ప్రవేశపెట్టి ఓడిపోయినచో తిరిగి యింతగడువులోపల తీర్మానము ప్రవేశపెట్టరాదను నియమము వెనుకటి ఆక్టులో లేదు. విశ్వాసరాహిత్య తీర్మానములు పుంఖానుపుంఖములుగా ప్రవేశపెట్టుటకు వెనుకటి ఆక్టులో నవకాశ ముండెను. అందువలన కౌన్సిల్ నిర్వహించవలసిన పురపాలనా కార్యక్రమమునకు భంగము వచ్చుచుండెను. విశ్వాసరాహిత్య తీర్మానములతోనే కౌన్సిలర్లకు కాల క్షేపము జరుగుచుండగా పురపాలనాక్రమము చూచుటకు వారికి సావకాశమేది ? అట్టి సందర్భములకు వీలులేకుండ క్రొత్త ఆక్టులో విశ్వాసరాహిత్యతీర్మాన మోడిన 6 మాస ములవరకు క్రొత్తతీర్మానము ప్రవేశపెట్టరాదని శాసించిరి. అదిన్నిగాక అధ్యక్షపదవికి (లేక ఉపాధ్యక్షపదవికి) ఎన్నిక లైనవెంటనే, సభ్యు లెన్నుకొనిన ఛైర్మన్ (లేక వైస్ ఛైర్మన్ ల)లో వారికి నమ్మకము చెడినదనుట హాస్యాస్పదముగానుండును. ఎన్నికలైన పిదప 6 మాసములు దాటిననేగాని విశ్వాసరాహిత్యతీర్మానమును ప్రవేశపెట్టరా దని క్రొత్తఆక్టు విధించినది.

వెనుకటి ఆక్టునుబట్టి విశ్వాసరాహిత్య తీర్మానము ప్రవేశపెట్టురోజున సభాధ్యక్షత వహించువాడు ఛైర్మన్ లేక వైస్‌ఛైర్మన్. ఛైర్మన్‌లో నమ్మకము చెడినట్లు తీర్మానము ప్రవేశపెట్టుచుండగా, ఆరోజుసభకు ఛైర్మనే అధ్యక్షు డగుట అసందర్భము కాదా? ఆరోజున జరిగిన సభాకార్యక్రమ మాతడు జరిగినదిజరిగినట్లు వ్రాయవచ్చును, మార్చి వ్రాయవచ్చును. 16 గురు తీర్మానము నామోదించినచో 14 గురే ఆమోదించి రని వ్రాయవచ్చును. కొందరు సభ్యులు స్వతంత్రముగా ఓటువేయ లేదనవచ్చును. వారిని మరికొందరు బలవంతముగా ఓటువేయించి రనవచ్చును. ఓట్లు వేయుటలో నవకతవక లున్నవనవచ్చును. అధ్యక్షుడు తా నాపదవి విడువనని పట్టుపట్టవచ్చును. ఈ గల్లంతంతయు చూచి గవర్నమెంటు కౌన్సిలు నెత్తిపెట్టి, గవర్నమెంటు ఉద్యోగులచే పురపాలన సాగించెద మనవచ్చును. ఇట్టి చిక్కులేవియు సంభవింపకుండ క్రొత్త ఆక్టులో ఆ రోజున సభాధ్యక్షత వహించువాడు గవర్నమెంటు ఉద్యోగి యగు డివిజనల్ ఆఫీసరు (డిప్యూటీ కలెక్టరు లేక సబు కలెక్టరు) అని నియమించినారు.

వెనుకటి ఆక్టులో చర్చకు 3 గంటల నిడు వేర్పరిచినారు. ఇప్పుడు 2 గంటలు మాత్రమే యిచ్చినారు. 2 గంటలైనవెంటనే చర్చ ఆపివేయవలెను. ఈ 2 గంట లున్ను మొదటి ఉపన్యాసకుడే పుచ్చుకొన్నచో, చర్చ అంతటితో నాపుకావలసినదే గాని, తక్కినవా రుపన్యసించుటకు వీలు లేదు.

క్రొత్త ఆక్టులో ఆరోజు సభానివేదిక డివిజనల్ ఆఫీసరు వ్రాసి గవర్నమెంటుకు పంపవలసిన దని విధి ఏర్పరిచినారు. వెనుకటి ఆక్టులో అట్టి విధి లేదు.

తగిన కారణము లున్నచో పంచాయితీ ప్రెసిడెంట్లను పదవిహీనులను చేయు నధికారము జిల్లాబోర్డు ప్రెసిడెంటుకు లోకల్‌బోర్డుల ఆక్టు 42 వ సెక్షనులో నీయబడినది. పంచాయితీబోర్డు ప్రెసిడెంట్లను తీసివేయుటకు విశ్వాసరాహిత్య తీర్మానక్రమ మేదియు నమలులో లేదు.

---

# మదరాసు రాష్ట్రములో 1933 వ సంవత్సరపు 4 వ ఆక్టు.

(గవర్నర్ జనరల్ గారి అనుమతి 26-3-1933వ తేదీని పొందినది. ఆ తేదీనుండి అమలులోనికి వచ్చును.)

వెనుకటి డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు 40 వ సెక్షన్‌కు మారుగా యీ సెక్షన్ అమలులో నుండవలెను.

40-ఎ. (1) ఈ క్రిందివిధానము ననుసరించి, క్రింది షరతులకు భిన్నముగాని పద్ధతిని మునిసిపాలిటీ ఛైర్మన్‌లో లేక వైస్ ఛైర్మన్‌లో విశ్వాసరాహిత్య తీర్మానము ప్రవేశపెట్టవచ్చును.

(2) తీర్మానమునకు ముందుగా నోటీసు వ్రాసియీయవలెను. ఆనోటీసు గవర్నమెంటు నిర్ణయించిన మతలబుప్రకారము వ్రాయవలెను. తీర్మానమున కప్పట్లో అంగీకారమున్న యావన్మంది సభ్యులున్ను, నోటీసుపై సంతకము చేయవలెను ఆ సభ్యుల సంఖ్య కౌన్సిలర్ల మొత్తపుసంఖ్యలో సగమైన నుండిననేగాని నోటీసు సక్రమమైనది కానేరదు. అట్లు సంతకము చేసినవారిలో నెవరో యిద్దరు మెంబర్లు కలిసి స్వయముగా రివిన్యూ డివిజనల్ ఆఫీసరు (అనగా సబ్ కలెక్టరు లేక డిప్యూటీ కలెక్టరు) వద్దకు వెళ్లి ఆ నోటీసున్ను, తీర్మానపునకలొకటియు ఆయన కీయవలెను.

(3) రివిన్యూ డివిజనల్ ఆఫీసరు పై తీర్మానచర్చకై మునిసిపల్ ఆఫీసులో నొకసభ సమావేశపరుపవలెను. ఆ సభాదినము పై నోటీసిచ్చిన రోజునకు 30 రోజులు దాటియుండరాదు. సభ ఏర్పాటుచేసిన రోజు, వేళ సభ్యులందరకు నతడే నోటీసు చేయించవలెను. నోటీసు యిచ్చిన రోజునకున్ను సభజరుగనున్న రోజునకున్ను మధ్య 15 రోజులైన గడు వుండవలెను.

(4) ఆ సభాధ్యక్షత వహింపవలసినవాడు రివిన్యూ డివిజనల్ ఆఫీసరు. నిర్దిష్ట సమయము దాటినపిమ్మట అరగంటవరకు అతడు సభకురానిచో, సభ ఆరోజున ముగిసి మరియొకరోజున జరుగవలెను. (5) వ సబ్ సెక్షనులో నుదాహరించిన రీతిగా వాయిదా రోజు సభ్యు లందరకున్ను తెలుపవలసిన పూచీ డివిజనల్ ఆఫీసరుదే.

(5) సభాధ్యక్షత వహించుటకు రివిన్యూ డివిజనల్ ఆఫీసరుకు సావకాశము లేకున్నచో, నతడు వాయిదాకారణము వ్రాసి సభ మరియొకరోజునకు వాయిదా వేయవచ్చును. మొదటి సభాదినమునకును రెండవ సభాదినమునకున్ను మధ్య 30 రోజులకంటె నెక్కువ గడు వుండరాదు. సభ ఏర్పాటుచేసినరోజు, వేళ సభ్యులందర

కున్ను అతడు నోటీసు చేయించవలెను. నోటీసు అందినరోజునకున్ను జరుగనున్న సభ రోజునకున్ను మధ్య 7 రోజులకు తక్కువగాకుండ గడు వుండవలెను.

(6) పై 4) (5) నిబంధనల ననుసరించిమాత్రమే యిట్టిసభ వాయిదావేయ వచ్చును. మరి యేయితరసందర్భములలోను అట్టిసభ వాయిదా వేయరాదు.

(7) సభాసమావేశ మైనవెంటనే ఆఫీసరు (అనగా రివిన్యూ డివిజనల్ ఆఫీసరు) తీర్మానము చదివి, తీర్మానముపై చర్చ జరుగవచ్చు నని తెలుపవలెను.

(8) ఈ తీర్మానముపై చర్చ ప్రారంభ మైనపిమ్మట చర్చకు వాయిదా వేయ రాదు.

(9) సభ ప్రారంభమైనవేళలగాయితు 2 గంటలు గడవగానే చర్చ పరిసమాప్తి నొందును. ఈలోపుగానే చర్చ సమాప్తిపొందినను పొందవచ్చును. చర్చ అంత మొంద గానే తీర్మానముపై ఓట్లు పుచ్చుకొనవలెను.

(10) ఆఫీసరు తీర్మానముపై ఎట్టి యుపన్యాసము నీయరాదు. అతనికి ఓటున్ను లేదు.

(11) సభానివేదిక (సభలో జరిగిన యావద్విషయము సంక్షేపముగా తెల్పు నది—మినిట్సు)యున్ను తీర్మానపు నకలున్ను, ఓటింగుఫలితమున్ను సభ ముగియ గానే ఆఫీసరు గవర్నమెంటుకు పంపవలెను.

(12) కౌన్సిల్ మొత్తపుమెంబర్లలో 3/5 వ వంతు సభ్యులు (5 భాగములలో 3 భాగములు. కౌన్సిల్ మెంబర్లసంఖ్య 25 అని భావింపుడు. అందులో 1/5 వ వంతు 5. అట్టి 3 వంతులు అనగా 3 × 5=15) తీర్మానమున కంగీకరించి ఓటిచ్చినచో గవర్న మెంటు ఆ $\frac{\text{చైర్మన్}}{\text{వైసుచైర్మన్}}$ను పదవినుండి తొలగించి (ఆవిధముగా తొలగించినట్లు) ప్రక టింపవలెను

(13) తీర్మానమున కంగీకరించువారిసంఖ్య అంతకు చాలనియెడల, లేదా సభలో నుండవలసిన కనీససభ్యులసంఖ్య (అనగా ఫలానిమంది మెంబర్లయినను హాజ రుకానిదే సభ జరుగరాదని నిబంధనయుండును. ఆ సంఖ్యను కోరం అందురు. ఉదా. రాజమండ్రి మునిసిపాలిటీకి కనీససంఖ్య సభ్యులలో 1/3 వ వంతు.) లేక సభ జరుగ నప్పుడున్ను, ఆరోజు లగాయితు 6 మాసములు దాటిననేగాని మరియొక విశ్వాస రాహిత్యతీర్మానపు నోటీసు ఆఫీసరు పుచ్చుకోరాదు.

(14) $\frac{\text{చైర్మన్}}{\text{వైస్‌చైర్మన్}}$ పదవిలో ఛార్జిపుచ్చుకొన్న తేదీలగాయితు 6 మాసముల లోగా యిట్టి తీర్మానపునోటీసు పుచ్చుకోరాదు.

375

# మద్రాసు లోకల్ బోర్డుల ఆక్టు

## ప్రెసిడెంటు వైస్ ప్రెసిడెంట్లలో విశ్వాసరాహిత్య తీర్మానము

### 1933 వ సంవత్సరపు మద్రాసు ఆక్టు

(గవర్నరు జనరల్ గారి అనుమతి 26-8-1933 వ తేదీని బడసినది. ఆ తేదీనుండి అమలులోనికి వచ్చును.)

1920 వ సంవత్సరపు మద్రాసు లోకల్ బోర్డుల ఆక్టు 44 వ సెక్షనుకు మారుగా యీ సెక్షన్ అమలులో నుండవలెను.

44. (1) ఈక్రిందివిధానము ననుసరించి, క్రిందిషరతులకు భిన్నముగాని పద్ధతిని జిల్లాబోర్డు ప్రెసిడెంటు లేక వైస్ ప్రెసిడెంట్లలో విశ్వాసరాహిత్య తీర్మానము ప్రవేశపెట్టవచ్చును.

(2) తీర్మానమునకు ముందుగా నోటీసు యీయవలెను. ఆనోటీసు గవర్నమెంటు నిర్ణయించు మతిలబుప్రకారము వ్రాయవలెను. తీర్మానమున కప్పట్లో అంగీకారమున్న యావన్మంది సభ్యులున్ను నోటీసుపై సంతకము చేయవలెను. ఆ సభ్యుల సంఖ్య మెంబర్ల మొత్తపుసంఖ్యలో సగమైన నుండిననేగాని నోటీసు సక్రమ మైనది కానేరదు. అట్లు సంతకములు చేసినవారిలో నెవరో యిద్దరు మెంబర్లు కలిసి, స్వయముగా జిల్లాకలెక్టరు వద్దకు వెళ్లి, ఆ నోటీసున్ను, తీర్మానపు నకలొకటియు ఆయన కీయవలెను.

(3) జిల్లాకలెక్టరు పై తీర్మానచర్చకై జిల్లాబోర్డు ఆఫీసులో నొక సభ సమావేశపరుపవలెను. ఆ సభాదినము పై నోటీసిచ్చిన దినమునకు, 30 రోజులు దాటి యుండరాదు. సభ ఏర్పాటుచేసినరోజు, వేళ సభ్యులందరకు జిల్లాకలెక్టరే నోటీసు చేయించవలెను. నోటీసిచ్చిన రోజుకున్ను, సభ జరుగనున్న రోజుకున్ను మధ్య 15 రోజులైన గడు వుండవలెను.

(4) ఆ సభాధ్యక్షత వహింపవలసినవాడు జిల్లాకలెక్టరు. నిర్దిష్టసమయము దాటినపిమ్మట అరగంటవరకు అతడు సభకు రానిచో, సభ ఆరోజునకు ముగిసి మరియొకరోజున జరుగవలెను. (5) వ సబ్ సెక్షనులో నుదాహరించినరీతిగా వాయిదా రోజు సభ్య లందరకున్ను తెలుపవలసినపూచీ అతనిదే.

(5) సభాధ్యక్షత వహించుటకు జిల్లా కలెక్టరుకు సావకాశము లేనిచో, వాయిదాకారణము వ్రాసి, సభ మరియొకరోజునకు వాయిదా వేయవచ్చును. మొదటి సభాదినమునకున్ను రెండవ సభాదినమునకున్ను మధ్య 30 రోజులకంటె

తక్కువ గడు వుండరాదు. సభ ఏర్పాటుచేసిన రోజు, వేళ సభ్యులందరకున్ను అతడు నోటీసు చేయించవలెను. నోటీసు అందిన రోజునకున్ను సభజరుగనున్న రోజునకున్ను మధ్య 10 రోజులకు తక్కువగాకుండ గడు వుండవలెను.

(6) పై (4) (5) నిబంధనల ననుసరించి మాత్రమే యిట్టిసభ వాయిదా వేయవచ్చును. మరి యేయితరసందర్భములలోను అట్టిసభ వాయిదా వేయరాదు.

(7) సభాసమావేశము కాగానే ఆఫీసరు (అనగా జిల్లా కలెక్టరు) తీర్మానము చదివి తీర్మానముపై చర్చ జరుగవచ్చునని తెలుపవలెను.

(8) ఈ తీర్మానముపై చర్చ ప్రారంభ మైనపిమ్మట చర్చకు వాయిదా వేయరాదు.

(9) సభ ప్రారంభము లగాయితు 2 గంటలు గడవగానే చర్చ సమాప్తి నొందును. ఈలోపుగానే చర్చ సమాప్తి పొందినను పొందవచ్చును. చర్చ అంత మొందగానే తీర్మానముపై ఓట్లు పుచ్చుకొనవలెను.

(10) జిల్లాకలెక్టరు తీర్మానముపై ఎట్టి యుపన్యాసము నీయరాదు. అతనికి ఓటున్ను లేదు.

(11) సభానివేదికలో (సభలో జరిగిన యావద్విషయము సంక్షేపముగా తెల్పునది.. మినిట్సు) యున్ను తీర్మానపు నకలున్ను, ఓటింగు ఫలితమున్ను సభ ముగియగానే, జిల్లా కలెక్టరు గవర్నమెంటుకు పంపవలెను.

(12) బోర్డు మొత్తపు మెంబర్లలో 3/5 వ వంతు సభ్యులు (5 భాగములలో 3 భాగములు. బోర్డు మెంబర్లసంఖ్య 25 అని భావింపుడు. అందులో 1/5 వ వంతు 5. అట్టి 3 వంతులు అనగా 3 × 5=15) తీర్మానమున కంగీకరించి ఓటిచ్చినచో, గవర్నమెంటు ప్రెసిడెంటు, / వైస్ ప్రెసిడెంటును పదవినుండి తొలగించి, (ఆవిధముగా తొలగించినట్లు) ప్రకటింపవలెను.

(13) తీర్మానమున కంగీకరించువారి సంఖ్య అంతకు చాలనియెడల, లేదా సభలో నుండవలసిన కనీస సభ్యుల సంఖ్య (అనగా ఫలానిమంది మెంబర్లయిన హాజరు కానిదే సభజరుగరాదని నిబంధన యుండును. ఆ సంఖ్యను కోరం అందురు. ఉదా. కాకినాడ జిల్లాబోర్డుకి కనీససంఖ్య సభ్యులలో 1/3 వ వంతు.) లేక సభ జరుగునప్పుడున్ను, ఆరోజు లగాయితు 6 మాసములు దాటిననే గాని మరియొక విశ్వాస రాహిత్యపు తీర్మానపు నోటీసు జిల్లా కలెక్టరు పుచ్చుకోరాదు.

(14) ప్రెసిడెంటు / వైస్ ప్రెసిడెంటు పదవిలో ఛార్జీ పుచ్చుకొన్న తేదీలగాయితు 6 మాసములలోగా నిట్టి తీర్మానపునోటీసు పుచ్చుకోరాదు.

---

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA131B116 |
| --- | --- |
| పుస్తకం పేరు | ఎదురుగాలి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 383 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 268,270,306,308,358,360,368 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Sakshi |
| పరీక్ష చేసినది | haseema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |